సత్యనారాయణమూర్తి, వేపా

హిందూదేశ అర్థశాస్త్రము

మద్రాసు, 1918

Record no. 21

Satyanārāyaṇamūrti, Vēpā

Hindūdēśa Arthaśāstramu

Madrāsu, 1918

Record no. 21

## Bibliographic Record Target

సత్యనారాయణమూర్తి, వేపా.
హిందూదేశ అర్థశాస్త్రము / గ్రంథకర్త వేపా సత్యనారాయణమూర్తి. - మద్రాసు : శారదా పబ్లిషింగు కంపెనీ, 1918.
xvi, 432 p. ;18 cm.
Record no. 21

Satyanārāyaṇamūrti, Vēpā.
Hindūdēśa Arthaśāstramu / grandhakarta Vēpā Satyanārāyaṇamūrti. - Madrāsu : Śāradā Pabliṣiṅgu kampenī, 1918.
xvi, 432 p. ;18 cm.
Record no. 21

# హిందూదేశ అర్థశాస్త్రము

గ్రంథకర్త

వేపా సత్యనారాయణమూర్తిగారు, బి. ఏ.



ప్రకాశకులు

శారదా పబ్లిషింగు కంపెనీ,

185 మవుంటురోడ్డు, మద్రాసు.

1918.

కాపీరైటు]

[వెల రు. 2-8.




# భూమిక.

'హిందూదేశార్థశాస్త్ర'మనగా హిందూదేశము యొక్క సాంపత్తిక విషయములనన్నిటిని తెలుపుశాస్త్రము. ఆంధ్రభాషలో ఇదివరకు ప్రకటింపబడిన అర్థశాస్త్రము ఆర్థికవిషయములనుగురించిన న్యాయములనుమాత్రము బోధించునదై యున్నది. హిందూదేశ సాంపత్తిక విషయమునుగూర్చి ఇదివరకు ఆంధ్రమున గ్రంథములేవియు ప్రకటింపబడలేదు. హిందూదేశ ప్రస్తుతరాజకీయ వాతావరణము అల్లకల్లోలముగా నున్నది. ప్రజాస్వాతంత్రవాదులును, దేశాభిమానులును దేశముయొక్క ఆర్థికస్థితిని బాగుపరచి వ్యక్తిజీవనమును సౌఖ్యవంతముగ జేయవలయునని పాటుబడుచున్నారు. స్వలాభాపేక్షచే కొందరు అట్టివారిప్రయత్నముల కాటంకములు కలిగించ యత్నించుచున్నారు. ఇట్టిసమయమున ఇంగ్లీషురాని ఆంధ్రులకు దేశముయొక్క ఆర్థికస్థితిగతులను దెలుపుగ్రంథము నందజేయవలెననెడి తలంపుతో ఈప్రయత్నమునకుగడంగితిమి. విషయమును ప్రతివారును శ్రద్ధతో పఠించిన దేశముయొక్క నిజస్థితిని గ్రహించనగును. ఆభారము చదువరులయందే కలదు.

ఈగ్రంథమును విశేషశ్రమకోర్చి వ్రాసి గ్రంథకర్తగారు ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులైరి.

కాగితముయొక్కయు, ముద్రణాపరికరముల యొక్కయు, క్యాలికో బైండునకును వెలలు ఇప్పుడు మునపటికంటె ఎన్నియోరెట్లధికమాయెను. ఆకారణమువలన ఈగ్రంథమునకు వెల కొంచెము హెచ్చించవలసివచ్చినందులకు చింతిలుచున్నాము.

అద్వితీయ భాషాభిమానులును ఉదారమనస్కులు నగు శ్రీయుత వేమవరపు రామదాసుపంతులుగారు మాకు చాలతోడ్పడిరి. పగలంతయు

శ్రమపడి అలసియుండియు రాత్రులయందు ఈగ్రంథముయొక్క వ్రాత ప్రతులను ఓర్పుతో తిలకించి వారి సలహాలనొసంగి యుండిరి. ఇంకను ఎన్నియోవిధముల మాకు తోడ్పడియుండిరి. శ్రీరామదాసు పంతులుగారికి మాకృతజ్ఞతా పూర్వక వందనముల నర్పించుకొనుచున్నాము.

హిందూదేశముయొక్క పూర్వపు ఔన్నత్యమును తెలుపుగ్రంథములలో అగ్రస్థానము నలంకరించు గ్రంథమగు శ్రీయుత రాధాకుముద ముఖర్జీగారివలన రచియింపబడిన 'హిందూదేశ నౌకాచరిత్రము' యొక్క భాషాంతరీకరణమును మాతరువాతిగ్రంథముగా ప్రకటింపబడును. ఈగ్రంథమునందు రెండువేల సంవత్సరములు, నౌకాకళయందును నౌకావ్యాపారమందును హిందూదేశము అనుభవించిన ఔన్నత్యమును జూపుటయేగాక ఆనాటి ఆంధ్రదేశముయొక్క ఔన్నత్యముకూడ తెలుపబడినది. ఇందు సుమారు ఏబది చిత్రపటములుగలవు.

ఇంకనుకొన్ని అమూల్య గ్రంథములను ప్రకటించ యత్నించుచున్నాము. మాయత్నములు ఆంధ్రుల ఆదరణముపై ఆధారపడియుండుటచేత భాషాభిమానులందరును మాయుద్యమమునకు తోడ్పడెదరని నమ్ముచున్నాము.

శారదా పబ్లిషింగు కంపెనీ.

---

# హిందూదేశ అర్థశాస్త్రము.

## విషయసూచిక.

### I. హిందూదేశ అర్థశాస్త్ర ప్రత్యేక పఠనావశ్యకత.



### II. ఉత్పత్తి (Production).

#### హిందూదేశ నైసర్గిక ద్రవ్యసాధనములు.

## V. ఇండియారాజస్వము (Indian Finance)

పుట

## VI. సర్కారువారు పరిశ్రమలు.



## VII. స్వేచ్ఛావ్యాపారము; రక్షణ.





పుట



## VIII. ఇండియాదేశము; సామ్రాజ్య సపక్షభాగ సమస్య.



## IX. పరిశ్రమాభివృద్ధికి మార్గములు.

---

# హిందూదేశ అర్థశాస్త్రము.

## హిందూదేశ అర్థశాస్త్ర ప్రత్యేకపఠనావశ్యకత.

---

### అర్థశాస్త్రము భావనశాస్త్రమును.

శాస్త్రములు రెండు విధములు : దృష్టాంతశాస్త్రములు, భావనశాస్త్రములు. పదార్థవిజ్ఞాన, రసాయన, శారీర, ఖగోళ శాస్త్రములు, దృష్టాంతశాస్త్రములు. అర్థిక, తర్క శాస్త్రములు, భావనశాస్త్రములు. దృష్టాంతశాస్త్రములయందలి విశేషమేమనిన, వీనిసూత్రములు ప్రత్యక్షప్రమాణములు. నిజానిజములను పరిశీలింపవలెనన్న, శోధించిన తెల్లమగును. ప్రాణవాయువును, నీటివాయువును చేరి మనము త్రాగు ఉదకమగుచున్నది. ఈ నీతిని మనము రసాయన శాస్త్రమునుండి గ్రహించుచున్నాము. ఇందలి యాథార్థ్యమును కనుగొననెంచిన, నీటిని శోధించిన యెడల మనము ప్రత్యేకించి రెండువాయువులను విడదీయగలుగుదుము. తిరుగా వానిని రెంటిని చేర్చితిమేని ఉదకమగును. ఇక భావనశాస్త్రములన్ననో, వీటిసిద్ధాంతములు ఊహింపబడినవి గాని ఇదమిత్థములుకావు. ఒక్కొక్క స్థితియందును, అవస్థయందును మాత్రమే ఊహింపబడిన గుణములన్నియు సమకూరినప్పుడు మాత్రము, ఈసూత్రముల యొక్క ఉపయుక్తత వ్యక్తీకరింపబడును. ఆస్థితిగతులన్నియు ఏక కాల

మున సమకూరునంత వరకు భావనశాస్త్రములయందలి నీతులు ప్రచ్ఛన్నములు.

## డాక్టరు బోసు, పి. సి. రాయిగార్ల నూతనశోధనలు.

ఎడతెగని పరిశోధనలవలన ప్రత్యక్ష ప్రమాణములనియు, మార్పులంజెందక నికరములు (Exact) గా నుండుననియు పేర్కొనబడిన, పదార్థవిజ్ఞాన, రసాయన, ఖగోళశాస్త్రములే పెక్కుమార్పులంజెంది, దినమునకొకరీతి వింతవాదములు బయలువెడలుచున్నవి. గతశతాబ్దమునందు ప్రఖ్యాతిగాంచిన శాస్త్రజ్ఞులిపుడు తిరుగా జన్మించితిరేని తమ వాదములయందును, సిద్ధాంతములయందును, ప్రస్తుతము కలిగిన మార్పులను జూచి ఆశ్చర్యపడుదురు. శాస్త్రము దినదినప్రవర్ధమానమై ఇక్కాలపు ప్రజలబుద్ధికుశలతను వేనోళ్ల చాటుచున్నయది. ఏకవస్తుపదార్థములని నిర్ణయించబడిన, ఎన్నియోపదార్థములిప్పుడు, బహుపదార్థపుంజములుగా నంగీకరింపబడినవి. ఎన్నియో క్రొత్త నైట్రేట్లను (Nitrates) మన సుప్రసిద్ధ రసాయనశాస్త్రవేత్తయగు ప్రఫుల్లచంద్రరాయిగారును వారిశిష్యులును కనిపెట్టిరి.

ఈ శతాబ్దారంభమునకు పూర్వము ప్రజలు వస్తువులయందు చేతనములు, అచేతనములనియెడి రెండు తెగలు కలవని నమ్ముచుండెడివారు. ప్రపంచమునందంతటను సుప్రసిద్ధశాస్త్రవేత్తయని పేరుగాంచి, మన భారతమాతకు విఖ్యాతియశము గడించిన శ్రీయుత జగదీశ చంద్రబోసుగారు అచేతనములనియెడి పదార్థములు లేవనియును, సర్వమును చేతనములేయనియును



సిద్ధాంతీకరించినారు. ఐరోపా, అమెరికా ఖండములయందలి శాస్త్రవేత్తలెల్లరు వీరి సిద్ధాంతమునుగాంచి ఆశ్చర్యముజెందిరి.

పాఠకులలో కొందరికి ఈ విషయమును దెలిసికొనవలయుననెడి కుతూహలము గలుగవచ్చును. ఒక ఇనుప ఖడ్డీని గొనివచ్చి అందు విద్యుచ్ఛక్తిని ప్రయోగించిరి. ఆఖడ్డీయందు విద్యుచ్ఛక్తి యథేచ్ఛగా ప్రవేశించెను. తరువాత ఒకకొనను విషమునందు ముంచి, తిరుగా విద్యుచ్ఛక్తిని ప్రయోగింపబూనిరి. అదియేమి చిత్రమో కాని విద్యుచ్ఛక్తియందు ప్రవేశింపదయ్యె! విషము నొకకొనయందుంచుటచే, ఆ ఇనుపఖడ్డీయందలి ప్రాణము నశించెననియు, ఆహేతువువలన విద్యుచ్ఛక్తియందు చొరలేదనియును బోసుగారు నుడివిరి. విషమును కడిగివేసి, తిరుగా విద్యుచ్ఛక్తిని ప్రయోగించగా, ఎప్పటియట్ల అది ఆఖడ్డీయందు జొచ్చెను. ఇంతియేకాక శ్రీ బోసుగారు పరిశ్రమవలనను విశేషశోధనల వలనను వృక్షశాస్త్రమునందెన్నియో క్రొత్తవిషయములను మనమెన్నడును కని, విని, యెరుగని వానిని కనిపెట్టిరి. మొన్నమొన్నటివరకు వృక్షములకు మనుష్యులవలెనే భావమును, చింతయుకలదనిన పరిహసించెడివారు. ఇపుడిది యథార్థమని అంగీకరించబడినది. బోసుగారు తమబుద్ధివైశద్యమును జగత్తునంతయు వెదజల్లు నిమిత్తమోయన నొక యంత్రము నిటీవల నిర్మించిరి. ఆయంత్ర సాహాయ్యముచే, వృక్షములయొక్క భావములను సూక్ష్మముగా కనుగొననగును. మొక్కముదరక పూర్వమే, దానిని మరొకతావున నాటిన బ్రతుకునేగాని, ముదిరి చెట్లయినతరువాత స్థలము మార్చనెంచినచో నది మృతిజెందునని మనమనుకొనుచుండెడివారము. ఇది

కేవలభ్రమయని బోసుగారు దృఢపరచిరి. కలకత్తా పట్టణమునందలి వారిశాస్త్రాలయమున (Laboratory) నిటీవల ఊడలు దన్నిన ఒక మహావటవృక్షమును పెకలించి ఎంతయో దూరము బండ్లమీదరప్పించి నాటిరి. ఆవృక్షము వెంటనే నాటికొని కలకలలాడునట్లు చిగిరించినది. ఎటుల నీవిపరీతమును మీరొనర్చగలిగిరని బోసుగారిని గవర్నరు జెనరలుగారగు శ్రీ చెల్మ్స్‌ఫర్డు ప్రభువు ప్రశ్నింపగా, ఆశ్చర్యపడుట కిదియంత ఘనవిషయము కాదనియును, ఆవృక్షరాజమును నిద్రించునట్లు తాము కొన్ని మందులను ప్రయోగించితిమనియును, ఆహేతువువలన విశేషదూరము నుండి గొనివచ్చినను, వృక్షమాయాసమును జెందక సుఖముగా నాటుకొనెననియును నుడివిరి.

### అర్థశాస్త్రమునందలి సూత్రములు మార్పులు జెందుచుండును.

నికరములని వాడబడుచుండెడి దృష్టాంతశాస్త్రములయందు అనేక క్రొత్తవాదములు బయలువెడలుచున్నవియని ఇంతవరకును చర్చించబడినది. ఇక కల్పిత (Hypothetical) శాస్త్రమగు ఆర్థికశాస్త్రమునందలి ముఖ్యసూత్రములు మార్పు జెందుచుండు ననుసంగతి జెప్పనక్కరలేదు. కొంతకాలము క్రిందవరకును రికార్డో మొదలగు, ఆంగ్లేయఅర్థశాస్త్రజ్ఞులీశాస్త్రమును భావనశాస్త్రము కాదనియు రసాయన, ఖగోళశాస్త్రములవలె నికరమైనదనియు సిద్ధాంతీకరించిరి. కాని ఇటీవల ప్రొఫెసరు కెయిరన్సు, మార్షలు (Cairns Marshall) గార్లు స్పష్టముగా అర్థశాస్త్రము భావనశాస్త్రమేయని నిర్దేశించిరి. ఇందలి మూలసూత్రములు ఇదమిద్ధములుకావు. ప్రయోజ



సమునందు హ్రస్వములు. శీతోష్ణస్థితిని, భూసారమును, ఖనిజసంపదను, అపక్వ పదార్థపుంజమును, జనసంఖ్యను, కర్మకరుల శక్తియుక్తులను, మూలధన ప్రాబల్యమునుబట్టి ఒకానొక దేశమునకు ఒక్కొక్క అవస్థయందుమాత్రము, ఈశాస్త్రమునందలి ముఖ్యసూత్రముల నుపయోగింపనగును. దీనిన్యాయములు సర్వకాల సర్వావస్థలయందును ఉపయోగించుటకు అర్హములుకావు. కావున నే ప్రయోజనమునందు, బాహాటముగా ఉపయోగించుటకు వీలుకలుగదు. ఆప్రత్యేక స్థితిగతు లలవడువరకును, ఈశాస్త్రమునందలి నీతులు ప్రచ్ఛన్నములు.

### అర్థశాస్త్రము శాస్త్రమా ?

ఇట్టిది శాస్త్రమాయని కొందరు సందియ పడవచ్చును. కాని అట్టిసందియమున అవసరములేదు. ఇప్పటి అర్థశాస్త్రజ్ఞులు తాము ఉపపాదించునీతులను చక్కగాబోధపర్చుచు ఆవెంటనే, ఎట్టి స్థితులయందవి యుపయోగార్హములో సూచించుచున్నారు. యానసౌకర్యములు విశేషముగా నలవడుటచే, సకల రాష్ట్రములును ఒక్కవర్ణ్యాచక్రముగా పరిగణింపబడుచుండినట్టియు, వాణిజ్యనైపుణియు కళాకౌశలమును దినదిన ప్రవర్ధమానము లగుచుండినట్టియు, వివిధములగు నూతన విషయము లన్వేషించి చక్కగా స్థాపింపబడియున్న సంఘములును పలుతెరంగులగు దొరతనములునుగల, ఇక్కాలమున అర్థశాస్త్రముఖ్య సూత్రావశ్యకత అనేక విషయములందు గన్పట్టుచున్నది. పలువిధములగు సాంఘిక దేశీయవ్యవస్థలయందు అనుదినమును దేనిముఖ్యసూత్రముల సాహాయ్య మవసరమగు

చున్నదో, అట్టిది శాస్త్రమనుటకు సందేహము లేదు. గనుక దీనిని శాస్త్రముగనే పరిగణించవలెను.

## వివిధమతములు.

అన్ని దేశములలోను సర్కారువారు వాణిజ్యవ్యాపారములయం దెవ్విధమైన జోక్యమును కలిగించుకొనగూడదనీ ఖండనగావాదించు పూర్వాచార పరాయణులగు (Orthdox school) ఆంగ్లేయ అర్థశాస్త్రజ్ఞుల ననుసరించువారు కొందరు గలరు. క్షేత్రమును, ద్రవ్యోత్పత్తికివలయు సర్వోపకరణములను దొరతనమువారే స్వీకరింపవలయునని వాదించెడి సమష్టివాద (Socialistic) ప్రధానులు కొందరు గలరు. ఎవరిమతమును వారు శ్లాఘనీయముగానున్నదని వాదించుటయే కాక ఇతరులను సైతము తన్మార్గావలంబకుల జేయజూచుచున్నారు. ప్రజలయందు నాగరికత హెచ్చగుచున్నకొలదిని ఆర్థికశాస్త్రమునందు మార్పులు ప్రబలుచున్నవి. దినమునకొక రీతి క్రొత్తవాదము బయలు వెడలుచున్నది. ఆయాస్థితిగతుల నాలోచించితిమేని, అట్టివాదము సమంజసముగనే యుండును. ప్రత్యేక మతములుగల శాస్త్రజ్ఞులు బయలు వెడలుటవలన జనించిన వాదానువాదములు వృథాకాలేదు. "ఒక నియమిత స్థలమునందును, కాలమునందును సంభవించెడి కొద్ది పరిస్థితులకుమాత్రమే, ఆర్థికన్యాయము (Economic Law) ఉపయోగార్హమని నుడివిన బాగుండుననియును, ఆపరిస్థితులు అతి త్వరితముగా మారిపోవుచుండుననియును" ప్రొఫెసరు మార్షలుగారు వ్రాసిరి. "ఆపరిస్థితులు మార్పుజెందిన వెంటనే



ఆ న్యాయము ప్రయోజనశూన్యంబయ్యును, శాస్త్రత్వేనా రూఢిగనే యుండును. అట్టిది శాస్త్రప్రకారము ముఖ్యసూత్రమయినను, ఉపయోగార్హ మెన్నటికిని కాజాలదు. ఏలనన, ఎయ్యే ప్రత్యేకకారణములుండుటంబట్టి ఆనీతి మొదటబోధింపబడెనో, ఆపరిస్థితులన్నియు ఇతరవిషయ సమ్మేళనమునవలన మార్పు జెందుచుండును. ఆర్థికశాస్త్రప్రయోగమును, సకలవిషయ విమర్శనమును అత్యంత ప్రయోజనములయ్యును, ప్రతికాలమును ప్రతిదేశమును సహజముగ వింతయైన క్రొత్త విషయములను కలిగియే యుండుననియును, సాంఘిక పరిస్థితులయందలి ప్రతిమార్పును క్రొత్తలగు ఆర్థిక నియమములయొక్క ఆవశ్యకతను విశదీకరించుచుండుననియును ఒప్పుకొనక తప్పదు."*

చారిత్రాత్మక జాతీయసంప్రదాయ మతములు§ (Historical and National school) తలయెత్తక పూర్వము ఆంగ్లేయ అర్థశాస్త్రజ్ఞులుపపాదించిన న్యాయములు సర్వజనాదరణీయంబులై యొప్పుచుండెడివి. కాని కాలక్రమేణ వీరిప్రభ సన్నగిలి వారి ఇంగ్లండు దేశమునందు సైతము నిరాదరణీయము

---

* Principles of Economics by Marshal.

§ ఆర్థికశాస్త్రముయొక్క ముఖ్యసూత్రములయందలి ప్రయోజనత్వమును నిర్ణయించుటలో ఏ దేశమున ఏ సందర్భములయందు ఎటుల పరిణమించెనో కనుగొనుట చారిత్రాత్మక సంప్రదాయమతముయొక్క విశేషము. ఇతర దేశములయొక్క ఆర్థికపరిణామ చారిత్రమును విశదపర్చుటవలన ఆర్థిక న్యాయములయొక్క ప్రయోజనత్వమును చక్కగ నిర్ణయించుటకు వీలలపడును.

లగుచున్నవి. ఈ మహాసంగ్రామ సమయమున నెంతయో శ్రమపడి వీరు నెలకొల్పిన ఆర్థికన్యాయము లెల్ల చెల్లాచెదరై నామమాత్రావశిష్టములైనవి. ఆ సిద్ధాంతములు ప్రకృతానుభవమునకు దోషోపేత చారిత్రాత్మకమైనవి. ఈన్యాయములయందలి హేత్వాభాసములను ముందుగా ప్రకటించినవారు జర్మను అర్థశాస్త్రజ్ఞులు. చాలకాలమువరకు జర్మను శాస్త్రజ్ఞులు సైతము ఆంగ్లేయ శాస్త్రజ్ఞుల సిద్ధాంతములకు దాసులైయుండిరి. కాని ఈ న్యాయములను జర్మను దేశమునకు ప్రయోగించినప్పుడు, వీని హ్రస్వ ప్రయోజనత్వమును గమనించుటకు వీలలవడినది. ఆంగ్లేయ శాస్త్రజ్ఞులు ఇంగ్లాండు దేశముయొక్క పరిస్థితుల నాలోచించి ప్రకటించిన స్వేచ్ఛావర్తక ఆవశ్యకత మొదలగు ప్రత్యేకన్యాయముల ఉపయుక్తతను వీరు ఖండించిరి.

ఆంగ్లేయ అర్థశాస్త్రజ్ఞుల మతమునందలి దోషములను నిర్భయముగా ప్రకటించి జర్మను దేశమును క్షీణించకుండ కళానైపుణియందును వాణిజ్యకౌశలమునందును జగద్విఖ్యాతయశము వడయునట్లొనగూర్చిన మహానుభావుడు ఫ్రెడరిక

---

దేశీయసంప్రదాయ మతము జాతీయ గౌరవమునకును, దేశాభిమానమునకును ప్రాముఖ్యత నొసంగును. ప్రతిదేశ ప్రజలును తమ ఆత్మగౌరవమును కాపాడుకొనుటకై ప్రయత్నము చేయుట విధియని ఈ మతముయొక్క ఉద్దేశము. ఆర్థిక న్యాయములను నెలకొల్పునపుడు జాతీయ గౌరవమునకు ప్రాముఖ్యత నొసంగుట అవసరమని ఈ మతము నిరూపించును.

ఈ మతములు జర్మను అర్థశాస్త్రజ్ఞులవలన బయలు వెడలినవి.



లిస్టు అను సుప్రసిద్ధ శాస్త్రవేత్త. ఈమహానుభావుని యాశయము లొక్క జర్మనుదేశమునకేగాక వృద్ధికిరావలయు సర్వదేశములకును సమానాదరణీయంబులు. ఆర్థికనియమములను న్యాయములను పరిశీలించునపుడు, జాతీయతను, దేశాభిమానమును పూర్తిగ గమనించవలసి యున్నదని తెలియజెప్పిన పూరుషుండీతడే !

## పూర్వోక్త ఆంగ్లేయ అర్థశాస్త్రజ్ఞులలోపములు.

పైని ఉదహరించిన ఆంగ్లేయ ఆర్థిక పూర్వోక్త శాస్త్రమునందలి లోపములుమూడు:—

అందు మొదటిది లోకమునంతయు తనదేశముగ భావించుట. ఈలోకాయతమతము (Cosmopolitanism) వలననే లోపము లెన్నియునిన, నెవ్వేరు దేశములున్నవని పరిగణించక పోవుటయేగాక, ఆదేశముల యాశయములు సఫలీకృతములగుటకు తగిన సదుపాయములను గలిగించకుండ లోకమునందందరు ప్రజలకును ఏవిధమైన ఆర్థికనియమములను నెలకొల్పిన ప్రయోజనకారిగానుండునో వానినే అన్ని దేశముల వారును ఆచరణము లోనికి గొనిరావలయునని ఈమతముయొక్క ముఖ్యోద్దేశము. ప్రపంచముయొక్క క్షేమార్థమై పాటుపడవలయును కాని ఏదేశమున కాదేశము ప్రత్యేకవ్యక్తిత్వమును గాంచ నెంచుట ఈమతప్రకారము దోషము. ద్రవ్యోత్పత్తికివలయు ఏయే ద్రవ్య సాధనములు ఇతర రాష్ట్రముల కంటె స్వదేశమున పెక్కులు స్వయంభువులో, ఆదేశములు అపక్వపదార్థసంచయమును ఉత్పత్తి చేయుటయందే వారిశక్తి యుక్తులను ఉప

యోగపడుచుండవలయును. ఈ మతముయొక్క సారము ఏమనగా అపక్వపదార్థములను అమితముగ గలిగియుండియు, శ్రమావిభాగము బాగుగా వికసించని దేశములు శాశ్వతముగా అపక్వపదార్థములనే యుత్పత్తిచేయుచు కళాకౌశలమును విశేషముగ గడించియున్న దేశములనుండి చౌకధరలకు సరకులను గ్రహించుచుండవలయునేగాని, ఎన్నటికిని చిత్రకళలను శిల్పకళలను వృద్ధిచేయ తలపెట్టరాదు. ఏలనన శ్రమావిభాగము బాగుగా వికసించనందువలన స్వదేశమునందు విదేశములకంటె చౌకగా సరకులను తయారుచేయుటకు వీలుండదని వీరి ఉద్దేశము. వర్ధిల్లుచున్న దేశము లమిత తేజోవంతములగుచుండవలసిన దనియును, అనాగరికతచే క్రుంగుచున్న దేశములెన్నటికిని ఆ దరిద్రదశనుండి విముక్తిగాంచగూడదని ఈ మతముయొక్క ఫలితము. ఇది ఎంత విశ్వాసార్హమైన నీతియో, చదువరు లూహించెదరు గాక !

కేవల ధనసంపాదనయే ఉత్తమోత్తమమని యెన్నుట ఈమతమునందలి రెండవ లోపము. ప్రస్తుతలాభమును దక్క భావిపరిస్థితుల నీ మతమెన్నటికిని గుర్తించజాలదు. వస్తువుల యొక్క మారకపు విలువను గమనించుట దక్క, ఇతర సాంఘిక, మానసిక, రాజకీయ విషయములను గాని, దేశముయొక్క భావిపరిస్థితులనుగాని, ఉత్పాదక శక్తులనుగాని పరిగణించుట, ఈమతము ఎరుగదు.

మూడవ లోపమేమనిన, వ్యక్తిత్వమునే (Individualism) ప్రధానముగా గైకొనుట. ప్రపంచమంతయు భిన్నభిన్న రాష్ట్రములుగ విభజింపబడి ప్రత్యేకజాతులచే నివసింపబడు



చున్నదన్న సంగతిని మరచి, మానవకోటినెల్ల నొక్కకుటుంబముగనే భావించుచుండిరి. జాతీయభావములును దేశీయ గౌరవమును ప్రాబల్యముగలవన్న సంగతిని తెలిసికొనజాలరైరి. ప్రపంచమంతయును ఒక్కదేశముగ నున్నపుడు ఎట్లు కళాభివృద్ధి చేకూరునో ఆవిషయమును గమనించుటయే వీరిమతము.

ఆడము స్మిత్తుగారును వారిశిష్యవర్గమును ప్రపంచమున కంతకును ఒకే ప్రజాస్వామికరాష్ట్రముండి, యుద్ధమను మాట కలలోని వార్తయై, శాంతియు దాంతియు దిగంతవిశ్రాంతమైయుండిన నెంతయో శ్రేయస్కరముగ నుండుననియెంచి, అట్టిపరిస్థితు లక్కాలమున నుండినట్లుగనే భావించినవారలై ఒక నిరుపయుక్త (Abstract) వాదమును ప్రకటించిరి. ఆవాదమునందలి విశేషమేమనిన, బాహాటమైన పోటీయును, అనిర్బంధమైన మారకమును వాణిజ్యప్రపంచమున నెలకొనినప్పుడు, దేశమునందు శాంతిని ప్రతిష్ఠించుచు నరాజకము లేకుండ క్రమమైన కట్టుబాట్లు నేర్పరచుటయే ప్రభుత్వము వారికివిధి. వాణిజ్య పరిశ్రమలయందు ప్రభుత్వము వారెవ్విధమైన జోక్యమును దీసికొనక ప్రజాపరిపాలనమునందే వారి అధికారమును వినియోగించుచుండవలెనని వీరి యూహయగును.

అక్కాలపు స్థితిగతులను ప్రజాభిప్రాయమును అనుసరించి యంత్రకళలకన్న వ్యవసాయమే ముఖ్యమైన దనియును విశేషలాభకారి యనియును, విదేశవర్తకముకంటె స్వదేశవర్తకమే ఐశ్వర్యజనకమనియును ఆడముస్మిత్తు అభిప్రాయపడెను.

ఇంగ్లాండు దేశమునందలి కళలెల్ల బాల్యావస్థయందుండుట చేతను యానసౌకర్యములయందు సైతము విశేషకష్టనష్టము లుండుట చేతను ప్రభుత్వమువారి సహాయము లేనిదే ఇంగ్లాండు దేశముయొక్క అర్థిక సంపద వృద్ధిజెందదను సంగతి అతనికి గోచరించదయ్యె. అక్కాలపు ప్రజాభిప్రాయమునుబట్టి స్మిత్తు గారియూహ సమంజసముగనే యున్నది. పూర్వోక్తశాఖకు చేరినవాడయ్యును, ఆలివరుక్రాము వెల్ (Oliver Cromwell) చే నియమింపబడిన యానసౌకర్య నియమములను (Navigation Laws) దేశీయ సాంప్రదాయమునకు జెందిన అర్థశాస్త్రజ్ఞులవలెనే, అవసరములని నిరూపించెను. ఈనియమముల నామోదించుటలో శత్రువులదాడినుండి ఎవ్విధమైన యీతి బాధలులేకుండ దేశమును రక్షించుకొనుటయే ప్రాధాన్యము కాని, దేశమును ఐశ్వర్యవంతముగ జేయుట అంతప్రయోజన కారి కాదని తేలుచున్నది. ఎల్లప్పుడును పరరాష్ట్రముల నుండియే ఆహారపదార్థములను గైకొననాశించి స్వదేశమునందలి కృషికళను పూర్తిగక్షీణింపజేసినయెడల, మూలధనమును కర్మకరులశక్తి యుక్తులను పరిశ్రమా కౌశలమునందు వినియోగించి, ధనము నమితముగ నార్జించగలిగినను శత్రుదేశములు దాడివచ్చి ఆహారపదార్థములను దిగుమతి కానీయకుండ అడ్డినపుడు, దేశమునందలిప్రజ తిండికి లేక మలమలమాడవలసినదే కదా! ఎంతధనమున్న నేమి? ఆకలిగొన్న వానికి పట్టెడన్నము సాటియగునా! ధనమునుభుజించి తృప్తిచెందినవారు లేరు. కృషి కళక్షీణించినపుడు, యంత్రములు ఆహారమును ఉత్పత్తిచేయ జాలవు. ఆహారములేనిచో సర్వమును శూన్యము. ఐరోపామహా



సంగ్రామమున ఇంగ్లండు దేశమునకు ఆహారపదార్థములను పోనీయకుండజేసి జయమునొందుటకై జర్మను లొనర్చుచున్న ప్రయత్నముల నెల్లరెరింగియే యున్నారు.

ఇంగ్లాండునకు అమెరికా, రుషియా, హిందూదేశములు తినుబడి పదార్థముల నెగుమతి చేయ నగత్యములేకుండ, ఆ దేశములోనే వలయుపదార్థములెల్ల ఫలించుచుండినచో నెంతయో సాహాయ్యముగా నుండును. జలాంతర్గాముల యల జడినుండి, ఇంగ్లాండును కాపాడవలెనని సర్ యడ్వర్డు కార్సను గారెన్నియో మహాప్రయత్నము లొకవంక సల్పుచున్నను, ముఖ్యమంత్రియగు లాయిడుజార్జి ప్రతియకరము ఖాళీస్థలమునందును ఆహారపదార్థములను పైరు చేయవలసినదని యుద్ఘోషించు చున్నారు. నందలకొలది వత్సరములనుండి మృగయా విహారార్థమై బీడు వడియున్న వేలకొలది యకరముల భూమి నిప్పుడు సస్యాఢ్యగా జేయుటకు ఆంగ్ల ప్రజలపరిమిత ప్రయత్నములు సల్పుచున్నారు. శత్రువులదాడి నుండి దేశమును రక్షించుకొనుట ముఖ్యమైన పనియైయున్న దనియెడి చారిత్రాత్మక జాతీయ సంప్రదాయ యర్థశాస్త్రజ్ఞుల సిద్ధాంతమును, ఈమహాసంగ్రామము నిరాఘాటముగాబలపర్చినది. వీలున్నపుడు ఎల్లకళలను వృద్ధిచేయ యత్నించవలయునే గాని, ఎన్నటికిని ఇతరదేశములపై పూర్తిగ ఆశపెట్టుకొని యుండి మోసపోరాదని ముమ్మాటికిని ఈయుద్ధము నొక్కి వక్కాణించుచున్నది.

ఎప్పటికైన సర్వత్ర శాంతి నెలకొనగలదను, కాబ్డెను మహాశయుని యూహ సఫలీకృతమగు కాలము రానురాను

కడుదవ్వగు చున్నయది. ఐరోపాఖండమునందు ప్రజ్వరిల్లుచున్న దావానల మెంతలో చల్లవడునో ఎవరును నిశ్చయించజాలకున్నారు. ఒకవేళ కొలదికాలములో రాజీపడినప్పటికిని మాత్సర్యమడుగంటునని మనమనుకొనుటకు వీలులేదు. సర్వత్రశాంతి నెలకొను ననుమాట కలలోనివార్త. ఈసంగ్రామానంతరమున జపాను, అమెరికాదేశములకు యుద్ధము రావచ్చును. పెనామా జలసంధి తెరచినప్పటినుండియు అమెరికాయుద్ధనౌకలకు జపాను చాలదగ్గర యయినది. పసిఫిక్ మహాసముద్రము నందలి ద్వీపములకై ఈరెండు దేశములును పెనగులాడవచ్చును. అసహాయస్థితి యందుండెడి అనాగరికములగు రాష్ట్రములను, బలీయములైన దేశములు ఆకర్షించనెంచునంతకాలము యుద్ధములు వచ్చుచునే యుండును. మనకున్న దేశముతో మనము తృప్తిచెందవలయునన్న యాశయము, సకలదేశీయుల మనముల నొక్కసారిగా నావరించినగాని, శాంతివర్ధిల్లు ననుటకు వీలులేదు. కాన నేమనక, సకలరాష్ట్రములవారును ఇతరరాష్ట్రములపై పూర్తిగ ఆధారపడియుండక తమదేశములయందు కృషి వాణిజ్యాదులను వృద్ధిచేసికొనవలయును.

దేశాభిమానమును, జాతీయ గౌరవమును, బలీయములైన విషయములని రాజ్యతంత్రజ్ఞులు పూర్తిగ గమనించవలసియున్నది. కేవల ధనార్జనా సాధనములనే పరిగణించ వీలుపడదు. సర్వదేశములను ఒకే పణ్యాచక్రముగ భావించి, బాహాటమగు పోటీల వలనను, మారకమునం దెవ్విధములైన నిర్బంధములను గల్పింపమి వలనను సర్వప్రపంచమునందలి



ఆర్థికసంపదయును వృద్ధిగాంచుననుమతము శాస్త్రసమ్మతమేయైనను, ప్రస్తుత స్థితిగతులనుబట్టి ఉపయోగానర్హమైనది.

## అర్థశాస్త్ర నియమములు ఆయాదేశ స్థితిగతుల ననుసరించి యుండవలెను.

హిందూదేశమువలె ఒక పెద్దఖండముగా నున్నను బ్రిటీషు సామ్రాజ్యమువలె పృథివియందంతటను వ్యాపించియున్నను, జర్మనీ అమెరికా దేశములవలె రాష్ట్రసమావేశనము (Federation), లయ్యును లేదా జపాను సామ్రాజ్యమువలె కొద్దిదేశమును కలిగియున్నను ప్రతిరాష్ట్రమునకు ప్రత్యేకవ్యక్తిత్వముండి తీరునని అర్థశాస్త్రవేత్తలెల్లరు నిశ్చయముగ గమనించవలసి యున్నది. ప్రతిదేశమునకును దానికి సంబంధించిన చరిత్రయందును, సంప్రదాయములయందును, సాంఘికాచారములయందును, భూగోళ విశేషములయందును కొన్ని క్రొత్తవిశేషములుండి తీరును. వీనినన్నిటిని ఒకేతీరుగ నుండునట్లు చేయుటకు వీలలవడదుగాన, ఏరాష్ట్రమున కారాష్ట్రము ప్రత్యేక ఆర్థిక న్యాయములను నియమములను గలిగి యుండుట సమంజసము. కేవలము ఆర్థికన్యాయముల ఆధారములవలన మాత్రమే, దేశములను పరిపాలించ వీలులేదు. జాతీయగౌరవమును, దేశాభిమానమును, స్థిరత్వమును గాంచవలెననెడి కుతూహలమును, భోగభాగ్యములయం దౌన్నత్యమును గాంచనెంచుటయును, సర్వదేశములను సకలప్రజలను ఆవరించియుండు నన్న సంగతి జగద్విదితమే! ఎల్లకాలమును దేశమున దరిద్రదేవత తాండవమాడుచుండ నేదేశము ఆర్థిక విషయముల పట్ల

సంపూర్ణ స్వాతంత్ర్యమును గననెంచదు! ఏప్రజలు తమదేశము సైతము ఘనతకెక్కిన ఇతరరాష్ట్రములతో పాటు తమయాత్మ గౌరవము వెలిపుచ్చ, సామ్యము గననెంచరు? జాతీయాభిమానమును, దేశీయగౌరవమును, ప్రజలయొక్కయు దేశములయొక్కయు చర్చలయందును నడవడులయందును బలవత్తరముగ నెప్పుడును గన్పట్టుచుండును. కావుననే ఆర్థిక నియమము లోకానొక దేశమునకు తత్పరిస్థితులనుబట్టి వేరుగ నిర్ణయింపవలసియున్నదని లిష్టు మహాశయుడు సిద్ధాంతీకరించినాడు. దీని ననుసరించి లోకాయతమతమును విడనాడి అర్థశాస్త్రమునందు దేశీయసాంప్రదాయ మతమునకు ప్రాముఖ్యత నీయవలసిన యావశ్యకత.

## దేశీయ సంప్రదాయమతము.

దేశీయ సంప్రదాయ మతమనునది వేరొండు శాస్త్రము కాదు. ఆర్థిక శాస్త్రమునందు నిదియొక సంప్రదాయము. ఇందలి విశేషమేమనిన వాణిజ్య, వ్యాపారములయందు నిర్బంధనలుంచుటయును, దేశీయకళలను వృద్ధి నొందించుటకునై రక్షణను దాల్చుటయును, ప్రత్యేకవ్యక్తిత్వమునకు భంగకరములగు కొన్నివిషయములయందు కట్టుబాట్లను చేయుటయునై యున్నది. ప్రజయొక్కయు వ్యాపారములయొక్కయు నడవడులయందు నిర్బంధములు కలుగజేసిసమర్థించుటకు తగు సదుపాయములను గలది ప్రభుత్వమేగాన, దేశీయాన్నత్యమును మనసునందిడుకొని తత్సాఫల్యమునకునై, జోక్యమును కలిగించుకొనుట సర్కారుకు విధి. ప్రభుత్వమువారుదక్క



ఇతరులెవ్వరును ఈకార్యమును నిర్వహించజాలరు. ప్రజాశాంతి, దేశీయాన్నత్యమును, పెంపుచేయుటకంటె ప్రభుత్వమువారికి ముఖ్యవిధులెవ్విగలవు? దొరతనమువారికంటె పౌరులే వారి ఆశయములను ఏసరణి నవలంబించినయెడల సఫలీకృతముగాంచ గలుగుదురో విచారించ నర్హులుగాన, ఆవిషయములయందు పాలకులు జోక్యమును కలిగించుకొనవలెనని ఈమతముయొక్క భావము. వర్తమానపరిస్థితులకు ప్రాచీన ఆంగ్లేయ అర్థశాస్త్రజ్ఞునిమతము అనుగుణమైనదికాదని నిర్ధారణచేయుటయే దేశీయ సంప్రదాయ మతముయొక్క ఆధిక్యత.

దొరతనమువారు ఏవిషయముల యందు ఎంతవరకు జోక్యమునుకలిగించు కొనవచ్చుననెడి విషయమున పలువురు భిన్నాభిప్రాయులై యున్నారు. ఈసందర్భమున మేమీవిషయమునుగూర్చి ఇంతకన్న విశేషముగ చర్చించవలసిన అవసరములేదు. దేశీయ సాంప్రదాయముయొక్క ప్రయోజనమును ఇంగ్లాండుదేశము సైతము అంగీకరించి చాలవరకు ఆచరణములోనికి దెచ్చినది.

ప్రజారోగ్యమును వృద్ధిచేయుపట్ల ప్రజకే సంపూర్ణ స్వాతంత్ర్యము నొసంగిన, లాభకారి గాదనియును పాలకులే ఈపనిని నిర్వహించ వలయుననియు, అందరును ఒప్పుకొని తీరవలసినదే. ఈవిషయమునుగూర్చి ఎన్నియో శాసనములు ఆంగ్లేయ ప్రభుత్వమువారు ప్రకటించిరి. ఇంతేకాక, విద్యాశిక్షణను కళానైపుణికివలయు బోధనాభ్యాసములకు తగిన సదుపాయముల నమర్చుటయునుకూడ సర్కారువారే వహించ

వలయునని అంగీకరించబడినది. ఆకారణమువలననే పాఠశాలల యందుచేరి విద్యనభ్యసించుట బలవంతము చేయబడినది. విద్యాశిక్షణను ప్రజలకు యథేచ్ఛగా విడిచిపెట్టక పాలకులేకైకొనిరి. వేయేల! కోట్లకొలది సవరనులను దేశరక్షణమునకును, ఆరోగ్య విద్యాభివృద్ధులకును, వృద్ధాప్యమునందొసంగబడెడి ఫించనులకును, ఉపకారవేతనములకును, వ్యవసాయ కళాభివృద్ధికిని బ్రిటిషు ప్రభుత్వమువారు ఖర్చుపెట్టిరి. ఖర్చుపెట్టుచున్నారు.

అపారముగ నింతధనసంచయమును బ్రిటిషుప్రభుత్వము వారూరక వెచ్చించుచుండుటలేదు. స్వదేశరక్షణయును, ఆరోగ్యవిద్యాభివృద్ధులును దేశీయౌన్నత్యమునకు ముఖ్యమని నమ్మి చేయుచున్నవారలు. "ప్రభుత్వావలంబనము ఈవిషయములయందు సంఘస్వాతంత్ర్యమునకు వ్యతిరేకమయ్యును, ప్రజలమెప్పునువడసినది. ఎట్టి ఆదర్శములతో పాలకులీ నియమమును పాటించుచున్నారో అవి శ్లాఘనీయములనియును అత్యుత్తమమైన వనియును ఎల్లరు నెరింగిన విషయమే; కాని పూర్వోక్తశాఖకు చెందిన అర్థశాస్త్రివేత్తలకు మాత్రము ఇవి రుచింపవయ్యె. ప్రభుత్వావలంబనయన్న వీరికి అనుమానగ్రస్తముగ నుండును. ఏలనన ఆరోగ్యమును విద్యయు వృద్ధియగుట వలన కలిగెడి ఆర్థికసంప్రదాభివృద్ధి ఇంతయుండునని నిర్ణయించుటకు వీలుచిక్కదు. ఇందులకునై వెచ్చింపబడిన ధనమును ఇతరత్రాలాభకరమగు పనులయందు ఉపయోగపర్చవచ్చును; అయిన ఆరోగ్య విద్యాభివృద్ధులకునై ఉపయోగించిన ధనము లాభకారియగునా లేదా యను విషయము విచారణీయము.



ఈ సందర్భమున మాత్రము ఖర్చునకు లాభము సరిపోవుచున్నదా లేదా యను విషయమును ప్రజలు చర్చించ నుంకించుటలేదు. ఎద్దేని యొకానొక ఆదాయ వ్యయపట్టిక నాధారము చేసికొని, ఈ మార్గము నవలంబించుటవలనలాభమే అధికముగ చేకూరుచున్నదని నిర్ధారణచేయుటకు వీలు చిక్కకున్నను, దేశీయౌన్నత్యము కొరకునై బహిరంగముగగాని ప్రచ్ఛన్నముగగాని దొరతనము వారెవ్వియేని నిర్బంధములను కలిగించినచో, ఆనిర్బంధము లామోదములై యగునని విశేషప్రజ యేకీభావమును కలిగియున్నది."*

ప్రస్తుతమున కొన్ని పరిస్థితులు ఎల్ల సందర్భముల యందును ఉపయోగార్హంబులైనను, నిజమైన రాజ్యతంత్రజ్ఞుడు ప్రస్తుతలాభము నొక్కదానినే సరకుగొనడు. ఏయార్థికనియమములను పాటించిన, తనదేశము ప్రస్తుత నష్టమునకోర్చియైన మున్ముందు విశేష ఔన్నత్యమునకు రాగలదో, అట్టి నీతులనే పరిగ్రహించును. ఏయేపరిశ్రమలును వ్యాపారములును ప్రభుత్వమువారు నిర్బంధనలను గల్గించనిచో ప్రస్తుతము విశేష లాభము నొందుచున్నను, ఆపరిశ్రమలు స్వదేశ ప్రజల నుండి తప్పిపోయి పరరాష్ట్రముల వారికి లాభకారియగునట్టి పద్ధతిని భావికాలస్థితులను బాగుగ గమనించి యవలంబించడు. ప్రస్తుతలాభము, ముందు రాబోవు శాశ్వతనష్టమువలన వమ్మైపోవునన్న విషయమును బాగుగ గమనించి, ఏ మార్గము నవలంబించిన దేశీయ ఔన్నత్యము వృద్ధిజెంది ప్రజల యాత్మగౌరవము వన్నెకెక్కునో అట్టి పద్ధతిని బూనియే రాజ్యతం

* The case against Free Trade by Cunninghm.

త్రమును నిర్వహించును. రక్షణ నవలంబించుటవలన, కళావాణిజ్యాదులు ప్రస్తుతము నష్టమువచ్చినను రానురాను వృద్ధియై దేశమునకు ఔన్నత్యమును దెచ్చును. అట్టి నీతి ననుసరించక అపక్వపదార్థ పుంజము నెగుమతిచేయుచు విదేశ వస్తువులను చౌకధరలకుకొని ఆనందించుచుండిన, ప్రస్తుతము లాభకారియయ్యును, రానురాను పరిశ్రమలును చేతిపనులును పూర్తిగ నశించిననగుటచే, ప్రతి వస్తువునకును అన్యరాష్ట్రములకు దాసులై, స్వపరిపాలన మన్న కలలోనివార్తయై బానిసతనము ననుభవించుచుండుటయేగాక, ఆత్మగౌరవ మనుమాట మరచి, అనాగరికతవలన అజ్ఞానాంధకార కూపమునబడి దరిద్ర దేవతకుపుట్టినిల్లై బరగుచుండును. జాతీయగౌరవమును దేశాభిమానమును ఏ మార్గావలంబనవలన వృద్ధిని గాంచునో, ఆపద్ధతిని రాజ్యతంత్రజ్ఞుడు ఆచరణములోనికి దెచ్చుటవిధి. ఈ విషయములను చక్కగ పరిశీలించి, అనుభవములోనికి తీసికొనిరాగల సమర్థత ఒక్కదొరతనమువారికే కలదు. కాన మాకెందుకని తప్పించుకొనక, సర్కారువారు ఈ విషయములయందు శ్రద్ధనువహించి మెలగవలసిన యావశ్యకత మెండు.

ప్రభుత్వములు పూర్వము అనేక పొరపాటుల నొనరించినవి. వాని శక్తిసామర్థ్యములను ప్రజాసౌఖ్యమునకు వ్యతిరేకముగ సైతము ఉపయోగించుచువచ్చినవి. ఇకముందు కూడ నట్టి పరిస్థితులు ఒకవేళ తటస్థించిన దటస్థించవచ్చును. అయినను, దేశీయాభ్యుదయమునకు నేయే మార్గము లాచరణీయంబులో, ఆసరణిని శాసన నిర్మాణమును గావించుటకును,



క్రమమైన నియమములను నెలకొల్పి వాణిజ్య వ్యాపారములను సౌకలను, నడిపించుటకు తగిన సౌకర్యములు ప్రభుత్వములకు దక్క ఇతరులయందు గానవచ్చుటలేదు.

దేశీయ సంప్రదాయమతము, ప్రభుత్వావలంబనము అగత్యమని యుద్ఘోషించుచున్నది. తన్మార్గావలంబకులై నాగరికతను గాంచిన సకలరాష్ట్రములును సర్వకళాపరిపూర్తిని గాంచి సంపదలతో తులతూగుచున్నయవి.

అమెరికా, ఫ్రాన్సు, జర్మనీ, జపాను రాష్ట్రము లీపద్ధతి నవలంబించియే ఆర్థిక సంపదను వృద్ధిచేసికొని, సకలజన గౌరవపాత్రంబులై వాసికెక్కినవి. పూర్వమతావలంబకులే యగుచో బిస్మార్కు ప్రభృతులు నుడివినట్లు నామమాత్రావశిష్టములుకావలసినవే! అసాధారణమైన సాంఘిక, రాజకీయ, పారిశ్రామిక వ్యవస్థలను గలిగియున్న హిందూదేశమునందలి మనకు, నితరదేశముల ఆర్థికపరిణామచారిత్రమును, విశేషించి దేశీయవాదుల సిద్ధాంతములును, విశేష అవసరములు. మన దేశస్థితిని జర్చించునపుడు, బ్రిటిషు సామ్రాజ్యమునకు మనకు గల సంబంధమును ముఖ్యముగా గమనించవలసి యున్నది. దైవానుగ్రహమువలన ప్రజాస్వాతంత్ర్యాభిలాషియగు నింగ్లాండుతో మనకు పొత్తు సంభవించినది. దేశమునందెల్ల శాంతిని నెలకొల్పి, క్రమమైన పరిపాలన నేర్పరుచుటయేగాక, ఒక రాష్ట్రమునుండి మరియొక రాష్ట్రమునకును, ఒక భాగమునందలి ప్రజలనుండి మరియొక భాగమునందలి ప్రజకును, యానసౌకర్యములు వృద్ధిచేయుటంబట్టి ఏవిధమైన యు[illegible]కులు

లేక ఇతర ప్రపంచ కళావాణిజ్య చక్రములతో సంబంధము గలిగించబడినది. విద్యావ్యాప్తివలనను పాశ్చాత్య నాగరికతా సంబంధమువలనను, మత సాంఘిక విషయములయందు ఏ మార్పులు కలుగుచున్నను, ఆర్థికస్థితియందు మాత్ర మపరిమితమైన ప్రభావమును కనబరచినది.

### ఈస్టిండియా కంపెనీవారి పరిపాలన.

ఇండియా రాజ్యతంత్ర నిర్వహణము చాలకాలము వరకు (1858-వ సంవత్సరమువరకు) ఈస్టిండియా వర్తక సంఘమువారి ఆధీనమున నుండినది. ఆవర్తకసంఘము మన దేశీయాదర్శకములకన్న సహజముగా వారి ఆదాయమును అభివృద్ధి చేసికొనుటయందే హెచ్చుశ్రద్ధను వహించుచుండెడిది. "అన్యదేశవర్తకులును, సరకులను పోటీగా తయారుచేయువారును తమస్వలాభము నాశించి కార్యనియమములను పాటించుచుందురేకాని, ఉత్కృష్టమైన నూతనపద్ధతుల ప్రవేశమును కలిగించి దేశీయకళలను వృద్ధిచేయు నుద్దేశ్యమును కలిగియుండుట కడుదుస్తరము. అట్టి ప్రయత్నములు కూడ చేయబడలేదు. సాధ్యమైనంత వరకు హిందూదేశము నందలి కళలకు బదులు బ్రిటిషు పారిశ్రామికకళలను దెచ్చు నుద్దేశ్యముతో అందుల కనుకూలమైన సరణిని రాజ్యతంత్రమును నిర్వహించిరి." *

పందొమ్మిదవ శతాబ్దారంభమున, నవయంత్ర కళా రచనా సాహాయ్యమువలన, విక్రమోపార్జితములైనట్టియు,

* రమేశచంద్రదత్తు.



తనప్రజ వలసపోయి సంపాదించినట్టియు, క్రొత్తపణ్యాచక్రములయందు పారిశ్రామిక శ్రేష్టత్వము వ్యాపించునట్లు, ఇంగ్లాండుదేశము విజృంభించుచుండ, ఇండియాదేశము వినాశకరములగు అన్యోన్య కలహములతో నిండి, వృద్ధియను మాట నరుగనిదై కృశించుచుండెను. పురాతన, ఆధునికచారిత్రములయందెల్ల వాసిగాంచినవని పేర్కొనబడిన సుప్రసిద్ధ భారతీయ కళలెల్లరూపఱె, శిల్పకారులును కళాదక్షులును వారివృత్తులకుదూరమై వ్యవసాయవృత్తినే శరణ్యముగ గ్రహింపవలసినవారైరి. క్రొత్తగా ట్రంకురోడ్డులను ఇనుపదారులను కఱవు దినములలో నిర్మించుటచే ఆపనులుచేయుటవలన వేలకొలది ప్రజలు యుసురులను నిలబెట్టుకొనగలిగినను, ఈనష్టమును మఱింత హెచ్చించినవి.

### అక్రమమైన పోటీ.

"కళాచక్రమున ఈదేశవాసులకుండు సంబంధము దినే దినే క్షీణించుచున్నది. కళాచక్రమునందు మనకుకలుగుచున్న పోటీవిదేశస్థులని వ్యథజెంద నవసరములేదు. కాని పోటీలో ఒకవిశేషముకలదు. యంత్ర ప్రభావమునకును, నిరాధారమగు మానవ పరిశ్రమకును కలుగుచున్నది. స్థిరముగా స్థాపింపబడిన కళాకౌశలమును శాస్త్రప్రభావమును ఒకవంకను, అజ్ఞానమును సోమరితనమును మఱియొకవంకను పోరాడుచున్నయవి. ఈ అన్యదేశ పోటీవలన ఆర్థికసంపద మనలను బాయుటయే గాక విశేషమయిన కళాకౌశలమును, సామర్థ్యమును చుఱుకుదనమునుకూడ మనల విడనాడి ఇతరుల జేరుచున్నయవి."*

* Ranade.

## హిందూదేశ ప్రత్యేకవ్యక్తిత్వము గమనింపబడలేదు.

ఇట్టిస్థితిలో మన దురదృష్టమునకుతోడు బ్రిటిషురాజ్య తంత్రజ్ఞులు వలసరాజ్యముల యొక్కయు ఆశ్రయదేశముల యొక్కయు ఆదర్శకములను సరకుగొనక గ్రేటుబ్రిటనుయొక్క కళావాణిజ్యముల నెల్లదిశలయందును పాదుకొల్పనెంచి నిరాఘాటమగు రక్షణపతాకమునుదాల్చిరి. కాన ఈస్టిండియా కంపెనీ వారుకాని, బ్రిటిషు రాజ్యతంత్రజ్ఞులుకాని, శిథిలములగుచున్న మనకళలను జీవికలనుగ చేయుటకాని, ఉత్కృష్టమైన నూతనపరిశ్రమలను ఆంగ్లేయకళా విధానము ననుసరించి, నిర్మాణమొనర్చి మనకు బలము కలిగించుటకుకాని, వీలలవడు మార్గావలంబకులు గాలేదు. తిరుగా గ్రేటుబ్రిటెను (ఇంగ్లాండు, స్కాట్లండు, అయిర్లండు దేశములు) రక్షణనునిరాకరించి స్వేచ్ఛావర్తకము నవలంబించినపుడు, బ్రిటిషు రాజ్యతంత్రజ్ఞులు ఇండియా దేశముయొక్క ఆర్థికవిషయములపట్ల నిష్కల్మష హృదయులు కాజాలరైరి. ఇతరవిషయముల సందర్భమున ఎన్నియోనూతన సంస్కరణములను ఆచరణములోనికి గొనిరా వలయునని వాక్రుచ్చిరేకాని, ఆర్థికవిషయములపట్ల స్వేచ్ఛావర్తకావలంబన యెల్లదేశములకు అమోఘమని నమ్మెడి వారు.

మనబ్రిటిషు పాలకులలో పెక్కుమంది, ఇంగ్లండుదేశమున కేసరణి ఆర్థికనియమములు పాటించిన లాభకరముగ నుండునో, ఆవిధానమే ఇండియాదేశమునకు కూడ అనుకూలముగ నుండునని నమ్మియుండిరి. ఇంగ్లాండుదేశ సాదృశ్యము ననుసరించి, ప్రయోజనత్వముకంటె వాదమే ప్రధానముగా



గల ఆంగ్లేయ అర్థశాస్త్రవేత్త లనుగ్రహించిన నియమములనే పాటించుచు, భూసారమునందును, శీతోష్ణస్థితియందును, సాంప్రదాయముల యందును, సాంఘికాచారములయందును, గల భేదములను సరకుగొనరైరి. యక్సైజుపన్నులను* 'సర్కారువారు స్వలాభాపేక్షచేతనే ఈసరకిని తీసివేయక అమలులో నుంచిరనెడి విషయమున మనతో నేకీభవింపక' హిందూదేశ క్షేమమునాలోచించియే ఆపన్నులు విధింపబడినవని పూర్వోక్త శాఖవారి సూత్రములే వేదప్రమాణములని నమ్మియాచరించెడి ప్రొఫెసరు లీస్మిత్తుగారువ్రాసిరి. స్వేచ్ఛావర్తకమును ఇండియా దేశమవలంబించునట్లు చేయుట, హిందూ దేశాభ్యుదయమునకు తోడ్పడునని సంపూర్ణ విశ్వాసముతో ఇంగ్లండు దేశము నమ్మినదనియును, ఆన్యాయమునే స్వదేశమునందు సైతమాచరించె ననియును వ్రాసిరి.

## సర్కారువారి సహాయ మవసరము.

హిందూదేశ సమస్యలంజర్చించునపుడు తారతమ్యము నెరుంగని నిరుపయుక్తపద్ధతిని (Abstract method) వారవ

---

*తొలుత రవిన్యూకొరకు ఇండియా దొరతనమువారు ఇంగ్లాండునుండి వచ్చెడి నూలుసరకులపై నూటికి $3\frac{1}{2}$ వంతున దిగుమతిపన్నును విధించిరి. లంకషైరు వర్తకులు ఆపన్ను ఇండియాయందు తయారగు నూలు సరకులకు రక్షణ నొసంగునదిగా పరిణమించునని భీతిజెంది ఇండియా నూలుయంత్రశాలలయందు తయారైన సరకులకు, ఎగుమతిచేయబడక పోయినను తయారైనవెంటనే, నూటికి మూడున్నరవంతు పన్ను చెల్లించవలసి నట్లుగా, ఇండియా దొరతనమువారిని నిర్బంధపరచిరి. ఈపన్నులకు యక్సైజు పన్నులని పేరు.

లంబించుట మేమంగీకరింపజాలము. దొరతనము వారెవ్విధమైన ప్రమేయమును కలిగించుకొనగూడదనెడివాదము ఇండియా దేశపు భావి యౌన్నత్యమునకు ఆటంకమైనది. సర్వసాధారణముగా ఎల్ల విదేశములును, విశేషించి బ్రిటిషు అధినివేశనములు (Colonies) సైతము రక్షణ పద్ధతి నవలంబించి విస్తారము కీర్తి సంపదలను గడించినవి. రాజస్వ, ఆర్థిక నియమముల పట్ల బ్రిటను దేశమునకు ఎట్టి విధానములయందు నమ్మకమున్నను, ఇండియాదేశ సమస్యలను కేవలము ఇండియా దేశముయొక్క అభివృద్ధికి తోడ్పడునట్టి సరణినే చర్చించి, ఆచరణములోనికి గొనివచ్చుట యత్యావశ్యకము. సర్కారు వారు వాణిజ్య పరిశ్రమలయందు ప్రమేయమును కలిగించుకొనగూడదనెడి నీతి, ఇండియాదేశమునకు నష్టదాయకమైనది కాని లాభకారికాలేదు. ఆపద్ధతి ఈదేశమునకు సరిపడదు. దేశమునందలి ద్రవ్యసాధనములనెల్ల క్షీణించకుండ రక్షించుచు, ఆర్థికసంపద వృద్ధియగుటకు తగిన పద్ధతుల ననుసరించుచు, ఇండియా దొరతనమువారు దేశీయ ప్రభుత్వముగ మారవలసియున్నది. ఇతరరాష్ట్రపాలకు లేతీరునవారి దేశీయాదర్శములను వృద్ధిజేయు విధానముల నవలంబించుచున్నారో, ఆతీరుననే మనదొరతనమువారు కూడ రాజ్యతంత్రమును నిర్వహించవలసి యున్నది. బ్రిటిషు రాజకీయ పరిస్థితుల ననుసరించిగాని, ప్రజాప్రతినిధి సభ (Parliament) యందలి ఇరుకక్షుల వారి * ఆవశ్యకముల ననుసరించి గాని ఇండియా రాజనీతియం



దెవ్విధమైన మార్పులను ఒనరించకూడదు. ఇండియాదేశము ఏపద్ధతి నవలంబించుట వలన ఐశ్వర్యవంతమై వన్నెకెక్కిన యన్యరాష్ట్రములతో సమానగౌరవ మర్యాదలం జెందునో, అట్టిరాజ్య నీతినే శరణ్యమని మనదొరతనమువారు గ్రహించవలసి యున్నది. ఇంగ్లాండు దేశమింకను స్వేచ్ఛావర్తకమునే గణ్యమని యెంచి పూజించుచున్నను, లేదా రక్షణపతాకమును దాల్చినను మనదేశ వ్యవహారములయందు మాత్రము ఇండియాగవర్నమెంటు వారి ఉద్యమమునకు ఎవ్విధమైన అడ్డంకులను గలుగ జేయవలను పడదు. ఇండియా దేశమునకు హితములగు పద్ధతులను, మన దొరతనమువారు ఆచరింపబూనినపుడు ఇండియాకార్యదర్శి అభ్యంతరములు కలుగజేయుట పాడిగాదు. మొన్నమొన్న నూరుమియనుల సవరనులను యుద్ధము నిమిత్తము బ్రిటనుదేశమునకు మన కోశాగారమునుండి ఇండియా దొరతనమువారు దానముచేసినపుడు, అప్పటి ఇండియా కార్యదర్శియగు చేంబర్లైయినుగారు ఇండియాదేశ మొనర్చిన సాహాయ్యమును గొనియాడుచు లంకషైరునుండి మనకు దిగుమతి యగుచున్న నూలుసరకులపై నూటికి నాలుగువంతున పన్నును హెచ్చుచేయుటకు అంగీకరించెను. గతసంవత్సరమున హార్డింజి ప్రభువు మాంచెష్టరు సరకులపై పన్నును విధించుట సమంజసమని ఆలోచన చేసినపుడు బ్రిటిషు వర్తకుల ఆశయములను మనమున నిడుకొని హార్డింజి ప్రభువుయొక్క ఆలోచ

*ఇంగ్లీషు ప్రజాప్రతినిధి సభయందు లిబరలు కక్షియనియు, కాన్సర్వేటివు కక్షియనియు రెండుకక్షులుగలవు. లిబరలుకక్షివారు ప్రజాస్వాతంత్ర్య ప్రధానులు. కాన్సర్వేటివు కక్షివారు రాజ్యతంత్రమునందు మార్పులకు ఇచ్ఛగించరు. రాజ్యతంత్రమునందు ఏమార్పును కలిగింపక ఉన్నటులనే ఉంచినయెడల శ్రేయోదాయకమని నమ్ముచుందురు.

నను అప్పటి ఇండియా కార్యదర్శి నిరాదరించె నన్న సంగతి మాచదువరు లెరింగియే యుందురు. ప్రస్తుతము సైతము ఈ క్రొత్తపన్నును విమర్శించుటలో, ఆస్క్విత్తు మహాశయుడు కూడ లంకషైరు వ్యాపారస్తులను పురస్కరించుకొని మనకు వ్యతిరేక వాదమును సల్పెను. యుద్ధానంతరమున ఈవిషయము తిరిగి చర్చించబడునని బోనరు లాగారు వాగ్దానము నొసంగిన తరువాత కదా ప్రత్తి పన్ను పార్లమెంటువారి ఆమోదమును నడసినది! ఈసంగతులను నిష్పక్షపాత బుద్ధితో నాలోచించితిమేని బ్రిటిషు ప్రభుత్వమువారు ఆర్థికవిషములపట్ల మన యాశయములను గుర్తించక ఇంగ్లండుయొక్క లాభమునే మనసున నిడుకొని రాజ్యతంత్ర నిర్వహణము నొనర్చుచున్నారని ఎవరికి గోచరముకాదు! ఈపన్నైనను స్థిరముగ నుండదని మనకప్పుడే వాసనలు దగులుచున్నయవి. ఇటీవల ఇంగ్లాండులో సమావేశమైన సామ్రాజ్య యుద్ధసభయందు బ్రిటిషు సామ్రాజ్యమునకు జెందిన ప్రతి భాగమును ఇతర భాగములయందు తయారుచేయబడిన అపక్వ పదార్థ సంచయమునకును పారిశ్రామిక కళలకును విదేశములకంటె ప్రాముఖ్యత నీయవలసి యున్నదని ఏకగ్రీవముగా తీర్మానించబడినట్లు బోనరులా గారు ప్రజాప్రతినిధి సభయందు ప్రకటించిరి. దీనినేసామ్రాజ్య సపక్షభాగమతమని (Imperial preference) యెదరు. ఈపద్ధతిని అవలంబించుటవలన ఇండియాదేశమునకు గలిగెడి లాభనష్టములను ముందు చర్చించుచున్నాము. మనదొరతము వారీపద్ధతి నవలంబించిన యెడల విశేషనష్టము మనకు సంభవించి తీరునని మాత్రమిచట సూచించక తప్పదు.



జ్ఞానోదయమును విస్తారముగ గలిగి విజృంభించుచున్న ఇంగ్లండు దేశమున సైతము ప్రజలు, ఈరాజ్యనీతిని పాలించుట యుక్తముకాదని వాదించుచున్నారు. దొరతనమువారు ప్రమేయము కలిగించుకొనక వాణిజ్య వ్యాపారాభివృద్ధిని పౌరుల యేర్పాటులకునే, విడిచిపెట్టినను ఇంగ్లండుదేశమున విడిచిపెట్టవచ్చును. కాని, పూర్వాచార పరాయణ ప్రియత్వమును, అజ్ఞానాంధకారా వృతమునై యనేక విషయముల పరరాష్ట్రములకన్న వెనుకబడియున్న మన ఇండియాదేశమును వృద్ధికి దేవలయునను యాశయముండినయెడలకళావాణిజ్య చక్రముల యందు సర్కారువారి ప్రయత్నము లెవ్విధమైన అభ్యంతరములు లేకుండ సాగించవలసిన యావశ్యకత మెండు.

## రనడేగారి యుద్దేశములు.

1892 సం॥ న పూనానగరమునందు పాశ్చాత్యదేశముల యొక్క భూతకాల, సమకాలిక యార్థిక చరిత్రలను విమర్శించుచు నొక గొప్ప యుపన్యాసమును, కీర్తిశేషులైన న్యాయమూర్తి మహాదేవ గోవిందరనడేగారు గావించిరి. అందలి న్యాయములు సర్వజనాదరణీయంబులై ఇప్పటికిని ప్రజామోదమును వడయుచుండుటయే గాక, నిష్పక్షపాత బుద్ధితో విషయములను పరిశీలించు బ్రిటిషు రాజ్యతంత్రజ్ఞుల మెప్పును సైతము వడయుచున్నవి.

“రికార్డో సంప్రదాయమునకు (Ricardo) సంబంధించిన ఆంగ్లేయ అర్థశాస్త్రి వేత్తల ముఖ్యసూత్రములు సర్వేసర్వత్ర సకల కాలములయందును, స్థలములయందును,

అన్నితరహాల యభివృద్ధి యందును ఉపయోగార్హములై యుండి తీరవలయుననెడి మతమును, ఐరోపాఖండమునం దావిర్భవించిన ఆధునిక భావము, నిరాకరించుచున్న యది. ప్రత్యేక వ్యక్తిత్వమును మాత్రమే గమనించక, సర్వప్రజలను అంగములుగా గలిగియున్న సంఘశ్రేయముసే, అర్థశాస్త్రవాదములాదర్శకములుగ గ్రహించవలసి యున్నదని ఆధునిక భావములుద్ఘోషించుచున్నవి. పూర్వోక్త మతముయొక్క సంప్రదాయములు వ్యర్థములుగాక జనాదరణీయములు కావలెనని ఎంచినచో, ప్రజారక్షణమును సాంఘికవిద్యయును దేశముయొక్క ఆర్థికసంపదను ప్రత్యేకము ప్రజలకే విడిచిపెట్టబడక సంఘము మొత్తముమీదనే నిర్వహించబడు చుండవలెను.''
ఇట్టి విశాలదృష్టితో ఇండియా దేశముయొక్క ఆర్థిక విషయములను విపులముగ జర్జించెను. రాష్ట్రములంబట్టి శ్రమావిభాగముండితీరవలయునని వాదించెడి పూర్వోక్తశాఖయొక్క ఆర్థిక నియమములను సహేతుకముగ ఖండించెను. వెనుకబడియున్న ప్రాగ్దేశములెల్ల అపక్వ పదార్థములను తయారుచేయుటయందే ఎన్నటికిని తమశక్తి యుక్తులను వినియోగించుచుండవలెననియును, అభివృద్ధిని గాంచిన పాశ్చాత్య దేశములు మాత్రమే యానవిధానముల (Transport) యందును కళాభివృద్ధియందును గుత్తను కలిగి యుండవలెనని వీరి మతముకాదు. ఎచ్చట అపక్వపదార్థములు అపారముగ పైరగుచుండునో, అన్యదేశవర్తకముకంటె స్వదేశమునందలి వర్తకము దేశమున కమితఫలప్రదాయియో, ఏదేశమునందు ద్రవ్యసాధనములు పెక్కులు స్వయంభువులో, శక్తి



యుక్తులుగల కర్మకరులకు ఏదేశమునందు వేతనములు కాఱు చౌకయో, అట్టిదేశము, అపక్వ పదార్థముల నితర రాష్ట్రములకు ఎగుమతిచేసి తిరుగా తయారైన సరకులను గ్రహించుటకుగాను పొగయోడల కూలికి ధనమును వెచ్చించుటకన్న, స్వదేశమునసే, ఆయాకళలను వృద్ధినొందించిన కడుసమంజసముగా నుండునని సహేతుకముగా సిద్ధాంతీకరించెను. గతనలువదియేబది సంవత్సరములక్రితము పేరు ప్రతిష్టలులేని ప్రాగ్దేశమునకు చేరిన జపానుదేశము, కళావాణిజ్య వ్యాపారముల యందాధిక్యతనుగాంచి విఖ్యాతిశయమువడసిన ఇంగ్లాండు దేశమువలన సైతము మిత్రత్వమును కాంక్షింపబడుట, ఈ వాదమునందలి హేత్వాభాసమును (Fallacy) నిర్ధారణగా వెలిబుచ్చినది. స్వదేశవర్తకమునకును విదేశవర్తకమునకును తోడు, దేశమున ఉచితమైన కళాస్థాపనముకూడ ఉండి తీరవలయును. లేనియడల దేశమునందలి కళలెల్ల అన్యదేశస్థుల పోటీలవలన నడుగంటి ఇండియాదేశమునకువలె స్వయంసహాయమనునది గగనకుసుమమై పరరాష్ట్రముల నాశ్రయించి యుండు దుర్గతి తటస్థించగలదు.

రనడేగారు గావించిన మహోపన్యాసమునందలి నీతుల ననుసరించి గత ఇరువది ముప్పది సంవత్సరములనుండి మన దొరతనమువారు కొంతవరకు రాజ్యతంత్ర నిర్వాహణ మొనర్చిరి. కఱవులును కాటకములును దేశమున నావరించి యుండి వేలకొలది ప్రజల నాహుతిగొను చుండునప్పుడు వారి యిక్కట్టులను బాపెడి భారమును దొరతనమువారే వహించుచున్నారు. ఇనుపదారులును నీటికాలువలును చాల

వరకు సర్కారువారి ఆధీనములే అయియున్నవి. రైతులను బాధింపకుండుటకునై అనేకరైతాంగపు చట్టములను దొరతనమువారు జారీచేయించిరి. ఋణదాతల బారిబడకుండ రైతులను కాపాడుటకు పరపతి సంఘములు సర్కారు ఉద్యమమువలననే స్థాపించబడినవి. వ్యవసాయ శాఖవారు కృషికళనంతయు సముద్ధరింపవలెనని ఎన్నియో విషయములను బహుదీక్షతో పరిశీలించుచున్నారు. దేశమునందంతటను పారిశ్రామిక విషయములను పరీక్షించి, ఎంతయో యుపయోగకరమగు సంగతులను ప్రజలకు దెలియపర్చిరి. కృషివ్యాప్తియును, తత్కళాసంరంభమును ఏరీతి సంస్కరణముల నాచరించిన విజృంభించునో కనుగొను నిమిత్తమై 3, 4, సంవత్సరములక్రిందట పూసానగరమునం దొకసభ సమావేశమయ్యెను. శిల్ప, వాణిజ్య, వ్యవసాయవిద్యల యభివృద్ధిమందగమనమయ్యెను కేవలము ఉపేక్షింపబడుటలేదు. శాస్త్రోక్తమగు విద్యయును, నవీనకళాస్థాపనమును దొరతనమువారి సాహాయ్యమును గ్రహించుచునేయున్నవి. సర్కారును వలయు సకల వస్తుసామగ్రిని, సాధ్యమైనంతవరకు ఇండియాదేశముననే కొనుటకు ఏర్పాటులు గావింపబడినవి. అభివృద్ధి ఇంతవరకు ప్రశంసనీయమే. ఇంతకంటె విస్తారముగా కళాభివృద్ధి నొనగూర్పగల సామర్థ్యమును గలిగియుండియు మనదొరతనమువారు రాజకీయయోచనలవలనను, మరికొన్ని ఇతరయోచనలవలనను మిన్నక యుండవలసివచ్చెను. "కళాభివృద్ధికి సర్కారువారుచేసిన సహాయమును అనాగరికతనుగాంచిన ఇతరరాష్ట్ర ప్రభుత్వములతో మనమెంచి చూచినపుడు ఇండియా దొర



తనమువారు వెనుకబడియుండిరన్న సంగతి వ్యక్తీకరింపబడకమానద"ని శ్రీయుత ప్రమథనాథ బెనర్జీగారు వ్రాసిరి.

ఈ సందర్భమున సర్కారు ఉద్యమమునకు మనదేశమున నెంత అవకాశమున్నదియు రనడేగారు సూచించియున్నారు. "దొరతనమువారు ఋణముచేసి తెచ్చిన ద్రవ్యమువలనను ఆర్థికసహాయత నొసంగుటవలనను, ఇనుప దారులను నీటికాలువలను నిర్మించగలిగినపుడు నూతనపద్ధతుల ననుసరించి కళాచక్రము నింకను వికసింపచేయుటకు నిశ్చయముగా వీలు కలదు."

1890-సంవత్సరమున పూనానగరమున జరిగిన ప్రథమ కళాసభా ప్రారంభోపన్యాసమున రనడేగారు "జ్ఞానోదయము నమితముగ గలిగిన ఐరోపా అమెరికాదేశ ప్రభుత్వములవలె, ప్రయత్నావస్థ (Experimental Stage) యందైనను దేశీయ కళలను సపక్షకరములైన పన్నులను (Preferential duties) విధించి, సముద్ధరించగల శక్తి మనకు లేదు. ఫ్రాన్సు, జర్మనీ రాష్ట్రములు తమ నౌకాకళను పంచదారవర్తకమును అభివృద్ధిలోనికి గొనివచ్చుటకు ఏయే విధానముల నాచరించిరో వానిని మన దొరతనము వారినుండి మనము గ్రహించజాలము. సర్కారువారు వసూలుచేసిన పన్నులనుండి కళాభివృద్ధికివలయు ఈవిగాని ఆర్థికసహాయతనుకాని దొరతనమువారిని దయచేయవలసినదని మనము కోరరాదు. మనకు బోధింపబడుచున్న ఆంగ్లేయ అర్థశాస్త్ర నియమములకు ఈ కోరికలు వితండవాద మతములుగ గన్పట్టుచుండును. ఈ నియమముల సత్యా

సత్యములను విమర్శించుటకునై మనమొనరించు చర్చ కేవలము వృధయగునేగాని స్వేచ్ఛావర్తకపథమునుండి వారిని మరలింపజాలమని" వాక్రుచ్చిరి.

ఈ మహానుభావుని వాక్యములయందలి నీతు లిప్పటికిని యథార్థములై యున్నవి. కళాచక్రమునందు దొరతనము వారు ఉచితరీతిని మనకు తగిన సహాయము నొసంగుటలేదని ఎల్లరెరింగిన విషయమే.

## ఇండియా కార్యదర్శి ఆటంకములు.

ఈ సందర్భమున మనమొక సంగతిని గమనించవలసి యున్నది. ఇండియాదొరతనము వారినిగాని స్థానికప్రభుత్వముల వారినిగాని మనము నిందించ నగత్యములేదు. చెన్నపురియందు ఛాటరుటనుగారు కళాశాఖకు డిరెక్టరుగా నున్నపుడు విశేష శ్రమనుతీసికొని ఒక అల్యూమినియము ఫాక్టరీని, చర్మములను క్రోముపద్ధతిని పదునుచేసి జోళ్లు వగైరాలను తయారుచేయుట కొకఫాక్టరీని నిర్మింపజేసి, ఆరెండు కళలను వృద్ధిలోనికిదెచ్చిరి. ఈతీరుననే మరికొన్ని నూతన ఆవేశనములను సర్కారువారు స్థాపించిన మిక్కిలి లాభకారిగా నుండునని ఛాటరుటనుగారు సిఫారసుచేయగా స్థానికప్రభుత్వమువారు అట్లుచేయుట కడు సమంజసముగ నుండునని ఇండియాకార్యదర్శిగారికి నివేదించిరి. సర్కారువారు కళాచక్రమున ప్రమేయమును కలిగించుకొనిన తమ వ్యాపారములు సన్నగిలి కొంపలు కూలునని తలచి ఆంగ్లేయ వర్తక సంఘములవారు స్థానిక ప్రభుత్వమువారి సిఫారసును మంజూరు చేయరాదని ఆందోళనము చేసిరి. జనులకు స్వేచ్ఛావృత్తిని గలిగించు తలంపుగల కక్షకుచేరినట్టి, విఖ్యాతయశముపడసిన మార్లేప్రభువు సైతము బ్రిటిషువర్తక సంఘముల యాశయములకు భంగకరములగు నేర్పాటులజేయ ననుజ్ఞనీయడయ్యె! క్రొత్తక్రొత్త యావేశనముల స్థాపించుటకు అనుజ్ఞనీయలేదు సరికదా. అదివరకు ఉండియున్న రెండు ఫాక్టరీలనుగూడ ఇతర కంపెనీలకు అమ్మివేయవలసినదని తీర్మానించెను. అధికారవర్గమునకుచేరిన వారి యాజమాన్యము క్రిందనుండుటకుగాను ఒక ఉన్నత సాంకేతిక విద్యాలయమును (Technological Institute) మదరాసునందు స్థాపించుట అవసరమనికూడ ఇండియా కార్యదర్శిగారికి నివేదింపగా, ఈ సిఫారసును సైతము మార్లేప్రభువు నిరాకరించెను. ఇంతయేల యుద్ధమువలన కలిగిన పరిస్థితుల మూలమున వ్యయాధికమగుటచే క్రొత్తపన్నులను విధించుటకుమారుగా మ్యాంచెస్టరు సరకులపై పన్నును విధించుట సమంజసముగ నుండునని హార్డింజిప్రభువరేణ్యుడు ఇండియా కార్యదర్శిగారికి నివేదింపగా ఈ సిఫారసుసైతము నిరాకరింపబడినది. స్థానికప్రభుత్వములును ఇండియా దొరతనమువారును మనకు సహాయముచేయ నెంచినను ఇండియా కార్యదర్శి ఆటంకములు కలుగజేయుచుండునని దీనినిబట్టి మనము తెలిసికొనవలసియున్నది. కాన దొరతనమువారిని నిందించిన లాభములేదు. కళావాణిజ్యచక్రములయందు బ్రిటిషుప్రభుత్వమువారు ఇండియా దొరతనమువారికి స్వేచ్ఛను ప్రసాదించిననేకాని, మనదేశాభివృద్ధికివలయు ప్రయత్నములనుచేయ వీలలవడదు.

భారతీయులన్న ఏవగించుకొను కర్జను ప్రభువంతటి మహానుభావుఁడు సైతము 1908 సం॥ మే నెల 24-వ తేదీని ప్రభువులసభలో నిట్లు ప్రసంగించెను:—"భరతఖండమును ఏకచ్ఛత్రముగ నేలుచున్న ఇండియా కార్యదర్శిగారి అధికారమున హిందూదేశ ఆర్థికస్వాతంత్ర్యవిషయ మెట్లున్నదో నిష్పక్షపాతబుద్ధితో పరిశీలించెదము. తమ యభిప్రాయముతో సరిపోయినను లేకున్నను ఇండియా దొరతనమువారు ఆర్థిక వ్యవహారమందు ఇండియాకార్యదర్శిగారి యభిప్రాయమును బడయవలసియున్నది. భారతీయుల సలహాకంటె ఇండియా కార్యదర్శిగారి అభిప్రాయమునే ఆంగ్లేయులు పాటించుచున్నారు." ఇట్టి నిదర్శనము లెన్నియో గలవు. ఇటీవల ప్రత్తిపన్నును పార్లమెంటువా రంగీకరించుట, బ్రహ్మాండమైనది. ఈ మహాసంగ్రామమువలన బ్రిటిషుప్రజల దృక్పథమునందు కొంత మార్పుగలుగుట చాల శుభసూచకము. "మనము హిందూదేశ క్షేమార్థమే పాటుపడుచున్నారమనియు, వారి క్షేమమునే మనక్షేమముగ నెంచుకొనుచున్నారమనియు వారు గ్రహించునట్లు మనము వర్తింపవలెనని" హార్డింజి ప్రభువు వాక్రుచ్చియున్నాఁడు. ప్రత్తిపన్నుల విషయమై చేయబడిన చర్చలో ఛాంబర్లైనుగారు ఇండియాయొక్క ఆధిక్యతను బలపరచిరి. ఆ సందర్భముననే లాయిడు జార్జిగారుకూడ హిందూదేశలాభమే ఆంగ్లేయులలాభమని వ్యక్తీకరించిరి.

కాన లాయిడుజార్జిగారు మనలను కరుణించి ఇండియా దొరతనమువారికి కళావాణిజ్యసందర్భముల సంపూర్ణస్వాతంత్ర్యమునొసంగి మనకృతజ్ఞతకు పాత్రులగుదురు గాక! సామ్రాజ్య సపక్షభాగసిద్ధాంతము వలసరాజ్యములకును ఇంగ్లాండునకును లాభకారియైనను మనదేశమునకు నష్టదాయకము గాన 1913-వ సంవత్సరమున అప్పటి కోశాగారమంత్రియగు ఫర్ గ్రైష్లీటు వుడ్ విల్సనుగారు సామ్రాజ్యశాసన నిర్మాణసభయందు సామ్రాజ్యసపక్షభాగ సిద్ధాంతము మనకు లాభకారి గాదని నిర్ణయించుటకు సెలవిచ్చిన హేతువులనుపాటించి, ఆర్థికస్వాతంత్ర్యమును మనకు ప్రసాదించెదరు గాత!



పయినవివరించుకొనిన వివిధఆర్థికవిషయములను ప్రపంచమొత్తముమీద చర్చించుటయేగాక ఆయాప్రత్యేకభాగములకు సంబంధించిన విషయములను విపులముగ చర్చించుట ముఖ్యము. ఈనీతి ననుసరించియే హిందూదేశ అర్థశాస్త్రవిషయముల ప్రత్యేకపఠనావశ్యకత కలుగుచున్నది.



# ఉత్పత్తి.

## PRODUCTION.

---

### హిందూదేశ నైసర్గిక ద్రవ్యసాధనములు.

మన పూర్వసుకృతమువలననో లేక పుణ్యభూమియని పురాణప్రసిద్ధిని బడయుటచేతనో, భరతఖండమునందు ద్రవ్యసాధనములు పెక్కులు స్వయంభువులు. ఆహారపదార్థములకునై మన మొకరిని ఆశింప నగత్యము లేదు. కొన్ని పదార్థములయందు ప్రపంచమునందంతటను సంపూర్ణమైన గుత్త (Monopoly) నుకూడ కలిగియున్నాము. సకల కళాభివృద్ధికిని వలయు నుపకరణములు మనదేశమునం దపరిమితములు. భూతలమునందలి సకలరాష్ట్రములనుండియు మనదేశము ప్రత్యేకింపబడినను, సకలసౌఖ్యముల ననుభవించుచు నాగరికతనుగాంచిన రాష్ట్రమనియే పేరుపొందగలము.

### ద్రవ్యసాధనములు.

మన దేశమునందలి ద్రవ్యసాధనములను మూడువిధములుగ విభజింపనగును:—1. ముఖ్యమైనపంటలు. 2. అడవులు. 3. గనులు, ఖనిజసంపద. అందు ప్రథమమున పంటలనుగూర్చి ముచ్చటించెదము.



### ముఖ్యమైన పంటలు.

పంటలలోకూడ అనేక తెగలుకలవు. ధాన్యములు, పప్పుదినుసులు, నూనెగింజలు, తోటపంటలు నారనుతీయు మొక్కలు, ఓషధులు, నిషావస్తువులు, రంగులు.

### ధాన్యములు.

మనదేశమున పైరగు సకలధాన్యములలోను వరి ఉత్తమోత్తమమైనది. మూడువంతులు మన దేశస్థులందరికిని వరిధాన్యమే ముఖ్యమైన ఆహారపదార్థము. సాధారణముగా నూటతొమ్మిదివేలచదరపుమైళ్ళ వైశాల్యముగల భూమియందు వరి పైరగుచున్నది. ఇందు సగమునకు సుమారు బంగాళా రాజధానియందే పైరగుచున్నది. విదేశముల కెగుమతి చేయకుండినచో, ఒక్క గంగానది డెల్టాయందు పండినపంట మనదేశమున కంతకును సమృద్ధిగా సరిపోవును. ఇటీవల, ఇతర ప్రదేశములకంటె బర్మా, ఆస్సాము రాష్ట్రములయందు విశేషముగ వరి పైరగుచున్నది.

### వరిపంటను విశేషముగ సేద్యముచేయుచున్న ఇతరరాష్ట్రములయందలి వైశాల్యము.

| | | |
|---|---|---|
| బర్మా | 13,000 | చదరపుమైళ్ళు. |
| ఆస్సాము | 5,000 | ,, |
| సంయుక్తపరగణాలు | 11,000 | ,, |
| చెన్నరాజధాని | 10,000 | ,, |
| మధ్యపరగణాలు | 7,000 | ,, |
| బొంబాయి రాజధాని | 4,000 | ,, |

కఱవులు కాటకములులేక సుభిక్షముగానుండు సాధారణ సంవత్సరములలో మనదేశమునుండి బియ్యము విశేషముగ ఎగుమతి చేయబడుచుండును.

| ఎగుమతులు. | హండ్రెడు వెయిట్లు. | విలువరూప్యములు. |
|---|---|---|
| 1899-1900 సంవత్సరముతో అంతమగు 10 సంవత్సరములలోను మొత్తముపైని సంవత్సరమునకు | 31,500,000 | 13 కోట్లు. |
| 1903-04 సంవత్సరమున | 44,000,000 | 19 కోట్లు. |

బియ్యముచాలవరకు బర్మారాష్ట్రమునుండి, ఎగుమతి చేయబడుచున్నవి. బంగాళా రాజధానికన్న వరిపంటయందు చాలతక్కువది యయ్యును, ఈరాష్ట్రమున ఎగుమతికొరకునైయే వరి పైరుచేయబడుచుండును. ఇతర భాగములయందు స్థానిక ఉపయోగార్థమే పండింపబడుచుండును. కాలము సుభిక్షముగాలేనపుడు విదేశముల కెగుమతిచేయబడు బర్మాబియ్యము మనదేశమునందే వినియోగింపబడుచుండును. పంటయందు మనకు గుత్తకలదు గాన ఎగుమతులమీద అధికమగుపన్నును విధించి రెవిన్యూను అభివృద్ధి చేయవచ్చును.

## గోధుమలు.

ఈపంట విశేషముగా ఉత్తరహిందూస్థానమున శీతకాలమునందు పైరగుచున్నది. దక్షిణహిందూస్థానమున అంతగాలేదు. 31,000 చదరపుమైళ్ళకు అధికముగా మనదేశమున గోధుమలు పైరగుచున్నవి.



| | వైశాల్యము. |
|---|---|
| పంజాబు, సరిహద్దురాష్ట్రములు | 13,600 |
| సంయుక్తపరగణాలు | 12,200 |
| బీరారును మధ్యపరగణాలు | 5,300 |
| బొంబాయిరాజధాని (స్వదేశసంస్థానములు సహా) | 3,400 |
| బంగాళము | 2,300 |

గోధుమలు పైరగుచున్నవి.

గోధుమలుకూడ సాధారణముగా ఇంగ్లాండునకును, ఇతర రాష్ట్రములకును ఎగుమతిచేయ బడుచుండును. ఎగుమతులయొక్క పరిమాణము కాలమునుబట్టి మారుచుండును. కఱవువచ్చినను, కఱవువచ్చునని తోచినను, ఎగుమతులు మందమయి, పండిన దినసు మనదేశమునందే వినియోగమగుచుండును.

| | హండ్రెడు వెయిట్లు. | విలువ. |
|---|---|---|
| 1899-1900 సం॥ అంతమగు 10 సంవత్సరములలోను, సంవత్సరమునకు సుమారు | 12,500,000 | ... |
| 1900-1సం॥ పెద్దకాటకముపట్టుటవలన | 500,000 మాత్రమే | ... |
| తిరిగి 1903-04 సం॥న | 26,000,000 | 11 కోట్లు. |

1903-వ సంవత్సరమున ఇంగ్లాండుదేశమునకు దిగుమతియైన 60,000,000, హండ్రడు వెయిట్లగోధుమలలోను మనదేశమునుండి 17,000,000 హండ్రడు వెయిట్లును, అమెరికా సంయుక్తరాష్ట్రములనుండి 24,000,000 హండ్రడు వెయిట్లును,

రష్యాదేశమునుండి సుమారు 17,000,000 రు ఎగుమతి చేయబడినవి. దీనిని బట్టిచూడ గోధుమపంటయందు కూడ మనకు సహజమైన గుత్తకలదని తెలుచున్నది. భారమమితమై క్రుంగుచున్న నేలపన్నును అధికముచేయ ప్రయత్నించుటకన్న, దేశమునుండి ఎగుమతి కాబడు ఆహారపదార్థములపై ఎగుమతి పన్నులను విధించి, దేశక్షేమమునకై ద్రవ్యమును అభివృద్ధి చేయవలసి యున్నది.

జొన్నలు, చోళ్ళు, పప్పుదినుసులు విశేషముగ పైరగు చున్నవి కాని అవి స్వదేశమునందే విస్తారముగ వినియోగింప బడుచుండుటచే అంతగా వ్రాయ నవసరము లేదు.

| 1903-04 సంవత్సరమున | ఎగుమతులు. | | విలువ. |
|---|---|---|---|
| జొన్నలు మొదలగునవి | 2,000,000 | హండ్రడుువెయిట్లు | 71లక్షలు. |
| కాయధాన్యములు శెనగలు, వులవలు మొదలగునవి. | 2,500,000 | ,, | 91½ లక్షలు. |

మొత్తముపైని 1916-17 సం॥న 34 కోట్ల రూప్యముల ధాన్యములు మనదేశమునుండి ఎగుమతి యగుచున్నవి.

## నూనెగింజలు.

గవర్నమెంటు వారి లెఖ్ఖల ప్రకారము సుమారు 19,000 చదరపుమైళ్ళ వైశాల్యముగల ప్రదేశము ఏటేట నూనెగింజలను పైరుచేయుటకునై వినియోగింపబడుచున్నది.



ఇందు మూడవపంతు ప్రదేశము బంగాళమునకు చెందియున్నది. బొంబాయి, చెన్నరాజధానుల యందును మధ్యపరగణాల యందును మూడేసివేల మైళ్లు సేద్యము చేయబడుచున్నవి. ఇతర భాగములయందు మరియొక పైరుతో మిశ్రితములై స్థానికోపయోగము నిమిత్తము పైరు చేయబడుచున్నవి. మన దేశమున నూనెను తీయు యంత్రములు విరివిగా లేని హేతువుచే, ఇతర రాష్ట్రములకు మన అపక్వపదార్థమును ఎగుమతి చేసి తయారు చేయబడిన నూనెలను గ్రహించుచున్నాము. ఇందు వలని నష్టములు రెండు:-పొగ యోడలకు రెండుసార్లు కూలినిచ్చుకొనుట యొకటి. మన కృషికళలకెంతయో సహాకారిగానుండు తెలకపిండిని విదేశముల కొసగి నష్టపడుట మఱి యొకటి. కళలు మనదేశమున అభివృద్ధిగాంచకుండుట గొప్ప నష్టము.

| ఎగుమతులు. | హండ్రడుువెయిట్లు. | విలువ. |
|---|---|---|
| 1891-1900 సం॥తో అంతమగు పదిసంవత్సరములలోను సంవత్సరమునకు సుమారు | 16,750,000 | 11 కోట్లు. |
| 1903-04 | 24,500,000 | 14½ కోట్లు. |

నూనెగింజలలో ముఖ్యమైనవి: నువ్వులు, అగిసెవిత్తులు, ఆవాలు, ఆముదపుగింజలు, వేరుశనగకాయలు.

## అగిసెవిత్తులు.

రమారమి 5,000 చదరపుమైళ్ళ ప్రదేశము పైరుచేయ బడుచున్నది. మధ్యపరగణాలయందు ఈపంట విశేషము.

బొంబాయి, బంగళాము సంయుక్తపరగణాలయందుకూడ విస్తారముపైరగుచున్నది. వైశాల్యమున, నూనెగింజలలో మూడవ స్థానము నలంకరించినను, ఈపంట మిగిలిన పదార్థములకంటె అధికముగ ఎగుమతి చేయబడుచున్నది. 1898-99—1903-04 సం॥ ల మధ్య 5,000,000 హండ్రడువెయిట్లనుండి 9,000,000 వరకు ఎగుమతులు పెరిగినవి. సమశీతోష్ణతగల ప్రదేశములలో ఈమొక్కలనుండినారనుకూడ తీయుదురు. ఈసందర్భమున, మన దేశమున చేసిన ప్రయత్నములంతగా జయప్రదములుకాలేదు.

### నువ్వులు.

బంగాళమున ఈపైరు ఇతరరాష్ట్రములకన్న అధికముగ సేద్యము చేయబడుచున్నది. దేశపు మొత్తము పైని 6,600 చదరపుమైళ్లు సేద్యమునందున్నది. నూనె యొక్కయు, తెలకపిండియొక్కయు ఉపయోగమును వివరించి వ్రాయ నగత్యము లేదు. ఈపంట విస్తారముగా దేశమునందలి వాడుక నిమిత్తమే పైరు చేయబడుచున్నది.

వేరుశెనగకాయలు దక్షిణహిందూస్థానమునందు విశేషము. ఆముదపు గింజలపంట బొంబాయి రాజధానియం దధికము. గసగసాలు, కొబ్బరి విస్తారముగా చెన్నరాజధానియందు పైరగుచున్నవి.

నూనెగింజలనుండి నూనెను తయారుచేసి వానిని ఎగుమతిచేయుటకు బదులుగా, ఆగింజలనే ఎగుమతి చేయుటవలన కృషికళకు విస్తారనష్టమున్నదని ముందు సూచించి యున్నాము. తెలకపిండి క్షేత్రముయొక్క సారమును హెచ్చించి పం



టలు పుష్కలముగా పండుటకై ఎంతయో ఉపయోగముగా నుండును.

### తోటపంటలు.

తోటపంటలలో నెల్ల చెఱకు ముఖ్యమైనది.

### చెఱకు.

పంచదార విస్తారముగా చెఱకునుండి తయారు చేయబడుచున్నది. కొంతవరకు తాటి కల్లునుండి ఈత కల్లునుండి కూడ తయారు కాబడుచున్నది. ముఖ్యమైనది చెఱకు పంచదార. అనేకరంగులుగల చెఱకు పైరు చేయబడుచున్నది.

బీటుచక్కెర* యొక్క పోటీవలన ఏటేట చెఱకు పైరు క్షీణించుచున్నది.

| | | | |
|---|---|---|---|
| 1889-1900 సంవత్సరముతో అంతమగు 10 సం॥ లోను ఏటేట సుమారు | 4,400 | చదరపుమైళ్లు | చెఱకు వ్యవసాయము జరగుచుండెడిది. |
| 1903-04 సం॥ లెక్కల ప్రకారము | 3,600 | | |

దీనిని బట్టి మనము గ్రహించిన విషయము ఏమనిన, నాలుగైదు సంవత్సరములలో 800 చదరపుమైళ్ల వైశాల్యముగల భూమి మరియొక పైరునకై వినియోగింపబడుట. ఇది

* బీటు అనే ఒక విధమైన తుంగ గడ్డినుండి తయారుచేయబడుచున్న పంచదారకు బీటు చక్కెర అని పేరు. విశేషముగా ఈచక్కెర జర్మనీ దేశమున తయారు చేయబడుచున్నది.

ఎంత శోచనీయమో చదువరు లూహించెదరుగాక! 1909 సం॥ న మనదేశమునందు 2.1 మిలియన్ల ఎకరముల భూమి యందు పైరు చేయబడినది.

| | ఎకరములు. |
|---|---|
| వంగ, విహార రాష్ట్రములు | 478,000 |
| అస్సాము | 36,500 |
| బొంబాయి, సింధురాష్ట్రములు | 62,900 |
| చెన్నరాజధాని | 87,500 |
| పంజాబు పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రములు | 447,600 |
| సంయుక్త పరగణాలును, అయోధ్య | 10,00,000 |
| బీరారు మధ్యపరగణాలు | 20,900 |
| బర్మా | 12,200 |
| మొత్తము మిలియన్లు | 2.1 |

1910 సంవత్సరమున 2¼ మిలియన్ల టన్నుల చెఱకు పైరు చేయబడినది. చెఱకు పంచదార వ్యాపారమును గురించి ఒక పెద్దగాథ కలదు. ఈస్టిండియా కంపెనీ వారి యజమాన్యము క్రిందకు మనదేశము రాక పూర్వము విదేశములకు మన శర్కర ఎగుమతి కాబడుచుండెడిది! ఇప్పుడది యంతయు తాఱుమారై, ఇతరరాష్ట్రములకు ఎగుమతి చేయుటకు బదులుగా జావా, మారిషస్, జర్మనుదేశములను మనమాశించ వలసివచ్చినది. గతసంవత్సరమున 15 కోట్ల రూప్యముల చక్కెర మనకు దిగుమతి అయినది. 1903-04 సంవత్సరమున



మన దేశమునకు ఇతర దేశములనుండి 5½ కోట్ల రూప్యముల విలువగల చక్కెర దిగుమతి అయినది. 1916-17 సంవత్సరమున 15కోట్ల రూప్యముల విలువగల చక్కెర దిగుమతి అయినది. 12 సంవత్సరములలో సుమారు 10 కోట్ల రూప్యముల విలువగల చక్కెర అధికముగా దిగుమతి అయినది. దీని నాపుటకు మనదేశముననే చెఱకు విస్తారముగా పైరుచేసి చక్కెర చేయుటకు ప్రయత్నములు సల్పబడవలెను.

## నారనిచ్చు మొక్కలు.

### ప్రత్తి, గోగు, జనుము మొదలగు నారదినుసులు.

### ప్రత్తి.

ఉష్ణదేశముల యందు విశేషముగ పెరుగును. తరహానుబట్టి 5 లేక 8 నెలలకు పైరగుచున్నది. వర్షములు విస్తారముగా కురియు సగత్యము లేదు. రేవటి నేలలయందు ఈ పైరునకు పెట్టినదిపేరు. మనదేశమునందలి ప్రత్తి తగిన ఎరువులను వేసి సత్తువచేయనందువలనను అనేకరకముల విత్తనములు కలిసిపోవుచుండుటవలనను, పరిశుభ్రమైన నూలును తయారు చేయుటకు వీలలవడుటలేదు. 20, 40 నంబర్ల మోటునూలు తప్ప 150, 200 నంబరుల నూలు తయారగుటలేదు. ఈజిప్టు దేశపు ప్రత్తిని పైరుచేసినను ఏటేట మనదేశమునందు క్షీణించి దూది తక్కువ అగును. అన్యదేశముల ప్రత్తిని మనదేశమున పైరుచేయుటవలన పురుగులు పట్టుటవలనను, అతివృష్టి అనావృష్టిదోషములవలనను, ఆయాదేశమునందలి పైరుకన్న విశేష నష్టమును పొందును. యకరమునకు సుమారు 1¼ బంగాళా

మణుగుల ప్రత్తియును $3\frac{3}{4}$ మణుగుల గింజలును తయారగును. ప్రత్తిగింజలుకూడ హెచ్చువిలువకలవి. వీటినుండి నూనెను తయారుచేయుచున్నారు. 1911-సం॥ 40 లక్షలు ఇంగ్లీషు బారువల ప్రత్తిగింజలు ఎగుమతి చేయబడినవి. విలువ 10 లక్షల సవరనులు అనగా కోటిన్నర రూప్యములు.

ప్రశస్థమైన అమెరికాదేశపు ప్రత్తితో సమానమగు 'కంబోడియా' అను ఒకవిదేశపుప్రత్తి మన చెన్నరాష్ట్రము నందు పైరుచేయబడు చున్నది. స్వదేశమునందలి జాతులకన్న ఎకరమునకు 4, 5 రెట్లుహెచ్చుగ ఈప్రత్తి తయారగుచున్నది. 1912 సంవత్సరమున 400 పౌన్లు బరువుగల 80,000 వేలబేళ్ళ కంబోడియాప్రత్తి పైరయినది. ఈజాతిప్రత్తి అలతికాలమున హిందూదేశమునందలి ప్రతిభాగమునను పైరుకాగలదు. సింధు రాష్ట్రమున ఈజిప్టుదేశపు ప్రత్తిజయప్రదముగా పైరు చేయ బడినది. కానివేగముగా ఈజాతిక్షీణించును. 1911 సంవత్సరమున 14.3 మిలియన్ల ఇంగ్లీషుబారువుల ప్రత్తితయారుచేయ బడినది. 1916-17 సంవత్సరమున 56 కోట్ల రూప్యములదూది మనదేశమునుండి ఎగుమతికాబడినది. మనవాంఛలు తీరుటకునే గాక ఇతరరాష్ట్రములకు ఎగుమతి చేయుటకుకూడ చాలినంత ప్రత్తి మనదేశమున పైరగుచునేయున్నది. యక్సైజుపన్నులను తీసివేసినయెడల ఇదివరకు చాలకాలమునుండి మనగుత్తయందున్న చీనాపణ్యచక్రమును జపానుదేశముకొల్లగొనకుండఆపుకొనగలము. ఇంతియేగాక సర్కారువారు రక్షణత్వము నవలంబించినయెడల మ్యాంచెష్టరు పోటీవలన ఏనష్టములు లేకుండ మనదేశముననే నూలును, బట్టలను, తయారు చేసికొనుటకు



వీలలవడును. ప్రస్తుతమున పణ్యచక్రములయందు మ్యాంచెష్టరునకు ప్రాముఖ్యతతగ్గి జపాను దేశముయొక్క ప్రభ హెచ్చగుచున్నది. విదేశములనుండి 1916-17 సం॥ మనదేశమునకు 60 కోట్ల రూప్యములబట్టలు దిగుమతి అయినవి. మనదేశమునుండి దూదినిపంపి నూలును బట్టలును గ్రహించుటకన్న స్వదేశముననే ఆకళ విజృంభించినచో ఎంతయొ తృప్తికరముగ నుండును.

## గోగునార, జనుమునార.

ఈపైరునందు మనదేశమునకు ప్రపంచమునందలి ఎల్ల దేశములయందును గుత్తకలదు. విస్తారముగా ఎగుమతిపన్నులను విధించి, ఎన్నియో ప్రయోజనకరములగు కార్యములను నిర్వహించుటకునై, మనదొరతనమువారు దేశాదాయమును వృద్ధిచేయనగును. ఎంతపన్నును మనమువిధించినను మనదేశమునుండి ఇతరరాష్ట్రములు ఈనారను కొనియే తీరవలెను. అట్టి పన్నును ఇచ్చుటకు ఇష్టముకానివారు వారివ్యాపారములనే ముగించుకొనినచో, అదిమరింత సుకరమైనపని. ఈ పైరునకు వినియోగింపబడు ప్రదేశమునందు ప్రత్తినివిశేషముగ పైరు చేయవచ్చును. అదియునుగాక గోనిపట్టాలను తయారుచేసియే, మనముఎగుమతి చేయవచ్చును. అందువలనమనకు మరింతలాభమధిక మగుచున్నది. జర్మను శాస్త్రకారులుకూడ దీనికి ప్రతి మరియొక నారనుసృష్టిచేయలేదు. ఇతరరాష్ట్రములవారు మన దేశమునుండి గోగునారను గ్రహించనగత్యము లేకుండుటకునై తిరిగి విశ్వామిత్ర మునిపుంగవుడు అవతరించి ప్రతిసృష్టిని ఆరంభింప వలయునేకాని కేవల మనుష్యమాత్రునివలన కానేరదు!

గోగునారపంట బంగాళమునం దధికము. సుమారు 4,700 చదరపుమైళ్ళ వైశాల్యమున ఆరాష్ట్రమునందిది పైరగుచున్నది. అస్సాము, నేపాళరాష్ట్రములయందుకూడ కొద్దిగ పైరుచేయబడుచున్నది. బర్మా, సరిహద్దురాష్ట్రములయందు మిక్కిలి స్వల్పము. ఎకరమునకు సాధారణముగ 15 బంగాళదేశపు మణుగులబరువుగల ప్రశస్తమైననార తయారగుచున్నది. కాని బాగుగా పండినపుడు దీనికి రెండురెట్లుకూడ తయారగుట కలదు. 1911-సంవత్సరమున 29.4 మిలియన్ల ఇంగ్లీషు బారువల గోగునార తయారైనది. అందు 16.2 మిలియన్ల బారువలకుపైగా ఎగుమతికాబడినది. 1903-04 సంవత్సరమునందు ఎగుమతులు 14,000,000 బారువలు. ఏడెనిమిది సంవత్సరములలో $2\frac{1}{5}$ మిలియన్ల బారువులు అదనముగా ఎగుమతిచేయబడినవి. విలువ సుమారు 14 కోట్ల రూప్యములు. నారను ఎగుమతిచేయుటకన్న, తయారైన సంచులు వగైరాలను ఎగుమతిచేయుట ఎంతయో లాభకారిగానుండును.

తాటినార.

ప్రత్తి, గోగునారలతో సమానము కాకపోయినను విశేషముగా మన చెన్నరాజధానినుండి ఈనార విదేశములకు ఎగుమతిచేయబడుచున్నది. ఈనార అనేకవిధములగు కుంచెలు (Brush) తయారుచేయుటయందు వినియోగింపబడుచున్నది.

కొబ్బరినార.

విస్తారముగా త్రాళ్లు, పగ్గములు మొదలగునవి తయారుచేయుటయందు ఉపయోగింపబడుచున్నది. ఈనార చెన్నరాజధానినుండియే విశేషముగ ఎగుమతియగుచున్నది. పొగయోడలకు ఈపగ్గములెంతయో అవసరములు.



కిత్తనార.

ఈ నారను విస్తారముగా కేన్వాసుగుడ్డ (Canvas) తయారుచేయుటకునై వినియోగమగుచున్నది. ఐరోపాఖండమునందు ఈ నారకు ఎంతయో గిరాకికలదు. లక్షలకొలది టన్నులను, ఎగుమతిచేసినను క్షణములో ఖర్చగును. ఈ నారను తయారుచేయుటకునై సులభమైన యంత్రములు (Decorticators) కలవు. చీనాదేశమున ఈనార, జోళ్ళు తయారుచేయుటకు సైతము ఉపయోగింపబడుచున్నది. పగ్గములకును త్రాళ్ళకునుకూడ ఉపయోగించుచున్న సంగతి అందరికిని తెలిసిన విషయమే.

ఈ నారను తయారుచేయుటయందు మనవారు విశేషశ్రద్ధను తీసికొనినట్లు కానరాదు. తోటకంచెలకువేయుటయే కాని, దీని నొకపంటగా పైరుచేయుటలేదు. హిందూపురము మొదలగు ప్రదేశములయందు మాత్రము కొందరు ఐరోపావర్తకులు వేలకొలది యకరముల భూమియందు ఈ మొక్కలను నాటి నారను తయారుచేసి ఎగుమతిచేయుచున్నారు. దీనిని సేవ్యము చేయుటయందు కూడ విశేషశ్రమలేదు. మొక్క నాటుకొనునంతవరకు నీరుపోసిన చాలును. తరువాత ఒక సంవత్సరమువరకు పశువులు మేయకుండ కాసినచాలును. అనేకవేల యకరముల పర్రనేల మనదేశమునందు కలవు. విశేషించి మన ఆంధ్రమండలమున ఈ కిత్తనారను తయారు

చేయుటకు అవకాశములు పెక్కులు. కాన ఆంధ్రమహాజనులు ఈ విషయమును గమనించెదరుగాక! విశేషమూలధనము కూడ అవసరములేదు. మనతాతతండ్రుల నాడు ఇట్టి పైరును సేద్యముచేయలేదు గాన మనము ఇట్టిపనికి పూనుకొనరాదని ఎంచిన కేవల మూఢతకాని వేరొండులేదు. విశేషధనమును స్వల్ప మూలధనముతో సంపాదింపవచ్చును.

## అనాస నార.

కిత్తనార మోటగా నుండును. కాని అనాసనార బహుమృదువైనది. సున్నితమును గలదియగుటచే, వస్త్రములు నేయుటకుకూడ పనికివచ్చును. రంగువేసి నేసినయెడల పట్టును బోలియుండును. నేతలో పేకగా అనాసనారనుంచి పడుగుగా పట్టునువాడిన, పట్టువస్త్రములనుండి పోల్చుట కష్టము. మంచి తివాసులను తయారుచేయుటకుకూడ ఉపయోగింపనగును. ఈ మొక్కలు విశేషముగ సింహాచలము కొండలయందు అడవివలె వ్యాపించియున్నవి. కండ్లకొరకే దీనిని పైరుచేయుచున్నారు. ఎంతయో, అమూల్యమగునారను గ్రహింపక మొక్కలను నరికి పారవైచుచున్నారు. కిత్తనారకువలె ఈనారను తీయుటకుకూడ యంత్రములుకలవు. ఒకే తరహా యంత్రములు ఈ రెంటిని తయారుచేయుటకు ఉపయోగములు. కొండ లోయలయందు అనాయాసముగ నామమాత్రమగు శిస్తులకు భూమిని తీసికొని, ఈ మొక్కలను పైరుచేయవచ్చును. పాఠక మహాశయులు ఈ విషయమును కూడ గుర్తించి ఈ కళను వృద్ధిచేసి ఆంధ్రమండలమునకు వన్నె తెచ్చెదరుగాక!



## అరటినార.

అరటిచెట్టు మనదేశమునకు కల్పవృక్షము వంటిది. దీనినిగూర్చి తోటపంటల సందర్భమున వ్రాయవలసినదిగాని నారనిచ్చు మొక్కలనుగూర్చి చర్చించునపుడు, ఈ నారను గూర్చి వ్రాయుట సమంజసముగ నుండుటచే నిచ్చట పొందుపరచుచుంటిమి. సుమారు ఒక అరయకరము నేలయందు అరటి చెట్లను నాటిన రోజున కొకరూపాయకు తక్కువలేకుండ ఆదాయమురాగలదని వంగరాష్ట్రమునందు ప్రతీతి. ఇది చాలవిశ్వాసనీయ మనినసంగతి ఎల్లరకు తెలిసియేయున్నది. కాని ప్రస్తుతము మనమాకల్పవృక్షమునుండి లాభమునంతయు గ్రహించుచుండుటలేదు. ఒక్కకాయలను ఫలములను మాత్రమే అనుభవించుచుంటిమి. లక్షలకొలది టన్నుల ప్రశస్తమైన నారను గ్రహించకయే, గెలను కొట్టివేసిన వెంటనే బొందలను ఊరక పారవైచుచున్నాము. ఈ పాడుబొందలను ఎచటనైన పారవైచుటకు తగినతావు కానుపించుటలేదని మొఱలిడు ఎందరినో తోటరైతులను గోదావరి డెల్టాలో కండ్లారజూచుచుంటిమి. గంజాము జిల్లాలో ఉద్దానమునందును, గోదావరిజిల్లాలో కోనసీమను, మలబారు జిల్లాయందును, ట్రావెన్కూరు, వంగరాష్ట్రములయందును అరటిచెట్లు విస్తారముగ పైరగుచున్నవి. ప్రశస్తమైననారను బొందలనుండి మనము తయారుచేయవచ్చును. ఈకళను వృద్ధి నొందించవలసిన యావశ్యకత విశేషముకలదు. ఎన్ని వేలటన్నుల నారను తీసినను ఇంగ్లాండు దేశమున నిముషములో విక్రయమగును. ఒకటన్ను నారకు 300 మొదలు 400 రూప్యములవరకు వెలనిచ్చెదరు. స్వదేశము

నందు ఈనారను పట్టునకు బదులుగా వస్త్రములు నేయుటయందును, విశేషించి కోట్లు, పాగాగుడ్డలను చేయుటయందును ఉపయోగింపనగును. రంగులువేసి ప్రశస్తమైన రత్నకంబళులనుకూడ తయారుచేయవచ్చును. ఈ నారను తయారుచేయుటయందును ఒక విశేషముకలదు. తగిన యంత్రములు ఇంగ్లాండునందుగాని, జర్మనీయందుగాని తయారుకాలేదు. విశేష సున్నితమైనది యగుటచే, కిత్తనార అనాసనారలను తీయు యంత్రములు ఈనారను ఉత్పత్తిచేయుటకు పనికిరావు. దేశమునందున్న చిన్నచిన్న యంత్రములు కళాప్రదర్శనముల కంపుటకు మాత్రము నారను తయారుచేయుటకు ఉపయోగించును కాని విశేషముగా వ్యాపారమును సాగించి లాభమును తీయుదమన్న నివి ప్రయోజనకారులుకావు. ఈ నారను తీయుటకు ఒకరసాయన శాస్త్రవిధానము కలదు. దాని సహాయమువలన సూక్ష్మముగా తయారుచేయ గలుగుదుము. ఈనార విశేషముగ ఖండాంతరముల విక్రయమగుటకు అవకాశములు ఏల కలిగెనని ప్రశ్నింప వచ్చును? నీటియందు పుట్టిపెరుగును గనుక అరటినారకు నీటియందు ఉపయోగింపబడి నపుడు చివుకునట్టి గుణములేదు. ఈనారతో తయారుకాబడిన పగ్గములును మోకుత్రాళ్ళును హెచ్చుకాలము పాడుకాకుండ నీటియందు వాడుక చేయుటకువీలగును. కాన విశేషముగా, ఈపగ్గములు ఓడలకు కావలసిన త్రాళ్లకై ఉపయోగపడుగును. తయారుచేసిన, మనకు అమ్మకము ఉండునో లేదో యని విచారించ నగత్యములేదు. సాహసమునుపూని ఈకళను వృద్ధికితెచ్చుట చాల యవసరము.



దేశముయొక్క ద్రవ్యసంపదను విశేషముగ వృద్ధిచేయుటకు వీలలవడును.

## నిషావస్తువులు.

పొగాకు, తేయాకు, కాఫీ, మద్యములు మొదలగునవి.

## పొగాకు.

పొగాకు మనదేశమున స్వయంభువుకాదు. తొలుదొల్త పోర్చుగీసువారిచేత మనదేశమునకు కొనిరాబడి చాల కాలము క్రిందవరకును జనసామాన్యముచే నిషేధింపబడుచు వచ్చినది. ఇపుడు మాత్రము నిషేధింపబడుట లేదాయని కొందరు ప్రశ్నించవచ్చును! నిజమే! కాని నిషేధించువారలల్పసంఖ్యాకులు. పెక్కుమంది విద్యాధికులు శిగరెట్లను నాగరికతా లక్షణముగ కూడ నెంచుచున్నవారు. ఇందువలన శరీరారోగ్యము పాడగుటయేకాని కొంచెమైనను లాభము లేదు. అభ్యసించువారలు కారణములను కల్పించ జాలరని మామతము కాదు.

అక్బరు చక్రవర్తి కాలమున ప్రభుసన్మానమును వడసి, పొగాకు మనదేశమున స్థిరస్థాయి అయినది. 10 లక్షల యకరముల భూమియందు పొగాకు సేద్యము చేయబడుచున్నది.

| 1909 సం॥ న | ఎకరములు. |
|---|---|
| వంగ, విహారరాష్ట్రములు | 440,400 |
| ఆస్సాము | 6,700 |
| సింధు, బొంబాయి | 101,500 |
| చెన్న రాజధాని | 200,900 |

| | 1909 సం॥ న ఎకరములు. |
|---|---|
| పంజాబు, సరిహద్దు | 64,000 |
| అయోధ్య, సంయుక్తపరగణాలు | 85,800 |
| బీరారు, మధ్యపరగణాలు | 31,600 |
| బర్మా | 82,000 |
| | 10,000,00 |

పై పట్టీని చూచిన వంగరాష్ట్రమునందు నగమునకు సుమారు పైరగు చుండుట కనిపెట్టుచున్నాము. 1825 సం॥ నుండి, మనదేశమునుండి పొగాకు ఎగుమతి చేయుటకారంభము. 1886-87 సం॥ న ఒక ముఖ్యమైన ఎగుమతి సరకుగ గమనింపబడినది. ఆసంవత్సరమున 5½ లక్షల రూప్యములు విలువగల పొగాకు ఎగుమతి అయినది. 1903-4 సంవత్సరమున 21 లక్షలవరకు అధికమైనది. ఇండియా, బర్మాదేశములందు చుట్టలకు గిరాకి అధికమగుటచే ఇంతవిస్తారముగ నెగుమతి చేయబడినది. ఇంతవరకు ఈవిషయము ప్రశంసనీయమేకాని దిగుమతులు ఎగుమతులకన్న అధికములుగనే ఉన్నవనిన సంగతి కడుంగడు శోచనీయము. 1903-4 సంవత్సరమున ఏబదిలక్షల రూప్యములు విలువగల చుట్టలు సిగరెట్లు మనదేశమునకు దిగుమతికాబడినవి. గ్రేటుబ్రిటనునుండి విస్తారముగ దిగుమతి కాబడుచున్న చౌకరకము సిగరెట్లు, ఇందులకు కారణభూతములు. పొగాకును ఎగుమతి చేయుటకంటె దేశమునందే సిగరెట్లు ఫ్యాక్టరీలను నెలకొల్పి విదేశములనుండి దిగుమతి కాకుండ ఏర్పాటులను చేయవలసి ఉన్నది. ఆకాలపు చౌకధరలకు మన



దేశమున తయారుకావని తోచినపుడు దిగుమతులపైని పన్నును విధించ నగును. పన్నును విధించుటవలన ప్రజలకు సిగరెట్లు చౌకగాలభించక కొంతకష్టముగా నుండునేమోయని ఊహించ నవసరములేదు! ఏలననిన సిగరెట్లను కాల్చుటదుర్వ్యసనములలో నొకటికాని సుగుణము కాదు. ఖరీదు అధికమగుటచే వాటిని కాల్చుటయే మానిన సర్వశ్రేయము. లేదా రెవిన్యూ అయినను వృద్ధియగును. ఏదియైనను సుకరమే!

## గసగసాలచెట్లు.

ఈ చెట్లపాలనుండి నల్లమందు తయారుచేయబడుచున్నది. ఉత్తరహిందూస్థానమున విశేషముగా పైరగుచున్నది. సర్కారువారి యాజమాన్యముక్రింద విహార సంయుక్తపరగణాల రాష్ట్రములయందు నల్లమందు తయారుచేయబడుచున్నది. గ్వాలియరు, ఇందూరు మొదలుగాగల స్వదేశ సంస్థానములు కూడ ఈచెట్లనుపైరుచేసి నల్లమందును తయారుచేసి ఎగుమతి చేయుచున్నారు. ఇదివిస్తారముగా చీనాదేశమునకు ఎగుమతియగు చుండెడిది. ఇటీవల చీనాదేశస్థులు దీర్ఘనిద్రనుండి మేల్కాంచినవారై ఈమత్తుదేవతను పూజించినంత కాలము తమదేశము నాగరికతనుగాంచిన ఇతరరాష్ట్రములతో సమాన గౌరవ మర్యాదలం జెందజాలదని కనిపెట్టిరి. ఈదరిద్రదేవతను తరిమివేయుటకునై అనేక ఏర్పాటులు చేయబడినవి. తమదేశమునందలి పంటనుకూడనశింపుచేయుటకు నిశ్చయించితిమనియు ఇండియా దేశమునుండికూడ ఎగుమతులను తగ్గించుచుండవలెననియు బ్రిటిషు దొరతనమువారితో సంధి చేసికొనిరి.

కాన అలతికాలములో చైనాదేశమునకు మనదేశము నుండి ఎగుమతులుపూర్తిగా ఆగిపోవును. ఒకవంక దేశ ప్రజ మద్యపానవిముక్తులుగ జేయుడని, సర్కారువారికి మొఱ పెట్టుచుండ కల్లు, సారాయి, ఇజారాలవలన వచ్చెడిరెవిన్యూ తగ్గిపోవుననియూహించి మనప్రార్థనలును పెడచెవిని పెట్టుచున్నారు. ఇట్టిస్థితిలో 5 లేక 6 మిలియన్లు ఏటేట నల్లమందు నుండివచ్చెడి రెవిన్యూను చైనాదేశస్థులు ప్రార్థించినంత మాత్రమున కేవలపరమార్థము నాలోచించి ఎటులనియ్యకొనినదియు కొంతచిత్రముగ తోచకమానదు! చైనాదేశస్థుల మాంద్యమును పోనాడుటకై బ్రిటిషుప్రజలు అంతశ్రద్ధను వహించినపుడు, మనదేశమునందలి మద్యపానమును నిషేధముచేసి మనకై పుసేల వదలగొట్టరాదో ఊహించశక్యముకాదు! రెవిన్యూకొఱకునై కల్లు, సారాయి, ఇజారాలను ఇంకను ఇచ్చుచున్నామని సర్కారువారు బదులుచెప్పినయడల అదిసహేతుకముగ కానరాదు. చైనాదేశము నుండివచ్చెడి రెవిన్యూను వదలుకొనినపుడు స్వదేశమునందలి రెవిన్యూను (పన్నునుండి వచ్చు ఆదాయము) సయితము ఏలవదలరాదు? చీనాదేశపు ప్రజలకు జ్ఞానోదయమును ప్రసాదించునపుడు, బ్రిటిషు ప్రభుత్వము క్రిందనున్న ఇండియాదేశపు ప్రజలకేల అట్టివరమును ప్రసాదించరాదు! కొద్దికాలములో నల్లమందునుండి వచ్చెడి రెవిన్యూ విస్తారము తగ్గిపోవునన్న సంగతిని మనముగ్రహించితిమి. 1916-17 సం॥ మన సర్కారువారికి నల్లమందునుండి వచ్చిన ఆదాయము 3,153,100 సవరనులు. 1917-18 సంవత్సరములకు 3,389,300 సవరనులు బడ్జెటుచేయబడినది. ఆదా



యము అధికమగుటకుగలకారణము పూర్వముకంటె వెలను అధికముజేయుటయే అయియున్నది. అనగా పూర్వము రూపాయికి మూడుతులములు అమ్ముచుండెడి నల్లమందు, ఇప్పుడు తులము ఒకరూపాయి అమ్ముచున్నది. ఇందుచే తయారైన సరకు చాలతక్కువయై యున్నను, ఆదాయము మాత్రము హెచ్చుగ కనబడుచున్నది. ఈచెట్లను పైరుచేయు వైశాల్యము కూడ చాలవరకు తగ్గించబడినది.

## తేయాకు.

పొగాకువలెనే తేయాకుకూడ మనదేశమున స్వతస్సిద్ధముకాదు. తొలుత ఈస్టిండియాకంపెనీ వారివలనను, తరువాత ఐరోపావాస్తవ్యులచేతను తేయాకువిశేషముగ ఇండియాదేశమునందు పైరుకాజొచ్చినది. మనదేశమునుండి ఎగుమతికాబడు దినుసులలో నిదికూడ ఒకప్రధానమైన వస్తువుగ పరిగణించబడుచున్నది. 1916-17 సంవత్సరమున 14 కోట్ల రూప్యములు విలువగల తేయాకు ఇంగ్లాండునకు ఎగుమతిచేయబడెను. ఇంగ్లాండు దేశమునందు మనకు చీనాదేశముతో తేయాకునకు పోటీకలదు. పోటీయందు మన తేయాకు నిలిచి చీనాతేయాకును క్రమముగా తొలగించుచున్నదన్న సంగతి చాలసుకరము! చీనాదేశపు తేయాకుపైని కొంచెము దిగుమతి పన్నునువిధించిన గ్రేటుబ్రిటను దేశమునకు వలయుతేయాకు నంతయును మనదేశమునుండియే పంప గలుగుదుము.

తేయాకుపంట దక్షిణహిందూస్థానమున అంతగాలేదు. ఉత్తరహిందూస్థానమున విశేషము. బొంబాయి మధ్యపరగణాలయందు తేయాకు పైరగుటయేలేదు.

**1909-వ సంవత్సరమున తేయాకు సేద్యమునందున్న భూమి.**

| | ఎకరములు |
|---|---|
| వంగవిహార రాష్ట్రములు | 143,000 |
| ఆస్సాము | 348,000 |
| చెన్నరాజధాని | 14,600 |
| పంజాబు, పశ్చిమోత్తర పరగణాలు | 9,900 |
| అయోధ్య, సంయుక్తపరగణాలు | 8,200 |
| బర్మా | 1,600 |
| | 525,000 |

1910-వ సంవత్సరమున మనదేశమునందు 261 మిలియన్ల పౌనుల తేయాకు పైరయినది. అందు 175 మిలియన్లు ఆస్సామునందును, 63 మిలియన్లు వంగరాష్ట్రమునందును, 20 మిలియన్లు దక్షిణహిందూస్థానమునను పైరయినది. ఆసంవత్సరమున మనము 243 మిలియన్లు పౌనులు ఎగుమతిచేసితిమి. అందు మూడువంతులు ఇంగ్లాండుదేశమే గ్రహించినది. బ్రిటిషు ద్వీపములలో వాడుకయగుచున్న తేయాకునందు నూటికి 63 వంతున మనదేశమే ఎగుమతి చేయుచున్నది.

కాఫీ.

తేయాకునకువలె కాఫీ అంత విస్తారముగ మనదేశమున పైరగుటలేదు. మైసూరు, కొడగు, తిరువాన్కూరు, వైనాడు, నీలగిరి సవరాయి (Shevaroy) పర్వతములయందు మాత్రము అధికముగ పైరగుచున్నది. 1903 సం॥ న కాఫీతోటలయందు 82,000 కూలీలు పని చేసిరి. 1903-4 సం॥ న ఎగుమతుల



విలువ ఒకకోటి ముప్పది ఏడు లక్షలరూప్యములు. కాఈ చౌకధరలకు అమ్మబడుచున్న బ్రెజిలియను కాఫీ ఐరోపాఖండమునందంతటను అమ్మబడుచుండుట వలన మనకాఫీ ఎగుమతి వర్తకమునకు నష్టమువచ్చినది. మనదేశమునకు సరిపోవు కాఫీవిత్తులు దేశమునందే తయారగుచున్నవి.

నీలిమందు.

మనదేశమునందలి రంగు పదార్థములలో ముఖ్యమైనది. ఈపైరును గూర్చి విచారకరమైన గాథను తెలియపర్చవలసియున్నది. చాలకాలమువరకు మనదేశమున విశేషముగ పైరుచేయబడి ఇతరరాష్ట్రములకు ఎగుమతి చేయబడుచు వచ్చినది. కాని జర్మను రసాయన శాస్త్రజ్ఞులు వారి ప్రజ్ఞావిశేషమువలన నీలిమందును కృత్రిమముగ (Artificial) తయారుచేయ మొదలిడినది మొదలు, మన నీలిమందు పోటీకి ఆగలేకపోయినది. అందువలన విదేశములకు ఎగుమతులు నష్టగిలుటయేగాక స్వదేశమునందుకూడ ఖర్చు తక్కువ అయినది. ఇది ఎంతయు శోచనీయము! యుద్ధమువలన జర్మను ఎగుమతులు నిలిచిపోవుటచే మన నీలిమందుకు తిరిగి గిరాకి అతిశయించినది. తిరుగా ఈపైరును విశేషముగ సేద్యముచేయ నారంభించిరి. ప్రశస్తమైన నీలిమందును మనదేశమున తయారు చేయుటకు పెక్కుఅవకాశములు కలవు. నీలితోటలకు విహారరాష్ట్రము పెట్టినది పేరు. సర్కారువారి సహాయము ఈవిషయమున మిక్కిలి అవసరము. యుద్ధానంతరమున, జర్మనుదేశమున తయారగు సరకులను బ్రిటిషు సామ్రాజ్యమునందలి ఏభాగమునకును రానీయకుండు ఏర్పాటులను బ్రిటిషు ప్రభుత్వమువారు చేయుచున్నారు. కాన

మనదేశపు నీలిమందునకు మంచిదశ రానున్నదని మన మూహింపవచ్చును.

తొగరు, చిరువేరు, కుసుంబా, జాఫరా మొదలగు సహజములైన రంగుపదార్థములు మనదేశమునకలవు. సర్కారువారు ఒక నిపుణుని రంగుకళ అభివృద్ధియగుటను గూర్చి మనదేశము నందలి సాధనములను పరీక్షించుటకై నియోగించుట బాగు.

## అడవులు.

ఉష్ణదేశములలో అడవులు ప్రాణసమానముగ నెన్న బడవలయును. వీనివలన దేశమునకు పెక్కులాభములు కలవు.

1. వర్షములు కురిసిన ఆ నీరంతయు నిష్ప్రయోజనముగ కొండప్రక్కలగోసి ప్రవహింపకుండునట్లు చేసి, నదులను సర్వకాలములయందు ఏకరీతిని మందగమనమున ప్రవహించునట్లు చేయుచున్నవి. ఈ అడవులే లేనియడల వర్షాకాలము ఆఖరుకాగానే మన మహానదులన్నియు ఎండిపోయి, నీటికొరకు వరుణదేవుని తిరిగి ప్రార్థించవలసివచ్చును. నదీప్రవాహములు విశేష భూభాగమును కోసి వేయకుండ అడవులు కాపాడుచున్నవి.

2. చెట్ల ఆకులనుండి నీటి ఆవిరిని నలుదెసల వ్యాపింపజేయుటవలన పవనుని ఉష్ణతను తగ్గించి శాంతునిగ జేయును. అందువలన దేశము శాంతత్వమును వహించును.

3. అసంఖ్యాకములగు జంతుసమూహమునకు మేతకు కసవు నొసంగుచున్నవి. కృషికళావ్యాప్తి పశువుల నాశించి యుండును. వర్షములులేక కాటకములుపట్టి, మేయుటకు



గడ్డి దొరకనప్పుడు అడవులకు పశువులను మేతకు తోలి పెట్టుటవలన వాటికి ప్రాణదానము నొసంగుటకు వీలగుచున్నది. వంట చెఱకునకును, గృహనిర్మాణమునకును వలయు కలప దొరకుచున్నది. చెట్ల ఆకులు మేతకేగాక, భూమికి ఎరువుగాకూడ ఉపయోగమగుచున్నవి.

4. ఇంతేగాక, అనేకములగు వాణిజ్యోపయుక్తములగు పదార్థములు మన అడవులయందు బయలుదేరుచున్నవి. కర్పూరతైలము, మైనము, రబ్బరు, లక్క, తోళ్ళను పదును చేసి శుభ్రము చేయుటకు పనికివచ్చు చెట్లపట్టలు, ఏలకు పళ్ళు, కాకితములు తయారుచేయుటకు ఉపయుక్తమగు 'శాబై గడ్డి' (Sabai grass) వెదురు, గుగ్గిలము, మొదలగు విశేష విలువగల పదార్థము లెన్నియోగలవు. దేశముయొక్క కళాకౌశలము విరివిగాంచుచున్న కొలదిని, నూతన పద్ధతులను పూని వీనిని ఉపయోగములోనికి గొనివచ్చు సమర్థత ప్రజలకు అధికమగుచున్న కొలదిని, ఈ వస్తువులయొక్క విలువ హెచ్చుగుచుండును.

పూర్వకాలమందు భరతఖండమున చీమలుదూరని చిట్టడవులును కాకులు దూరని కాఱడవులును గలవని ప్రతీతి. కామ్యక, ద్వైత, దండక నైమిశాది వనములు పురాణప్రసిద్ధములు. కాని మనవారి వివేకశూన్యతచే, అట్టి కాఱడవులన్నియు నశింపు చేయబడినవి.

ఆమహారణ్యంబులన్నియు మంటగలియుటచేతనే క్షామదేవత మనదేశము నాశ్రయించినది. రామరాజ్యమున నెలకు

మూడువానలని ప్రసిద్ధి. ఇపుడాసంగతి కలలోనివార్త. నెలకొకవానయైనను, కొన్నిప్రదేశములయందు అధమము సంవత్సరమున కొకపుష్కలమైన వర్షమైనను పడుటలేదు. వనరాజి నశించుటచేతనే మనకిట్టి యిక్కట్టులపాలు కావలసివచ్చినది. ఈకారణముచేతనే విఖ్యాతయశము వడసిన స్పెయినుదేశము కూడ అనావృష్టికిలోనై ప్రభతగ్గియున్నది.

ఈవిషయమును ఇంగ్లీషు ప్రభుత్వమువారు చక్కగ గమనించిన వారై ఈదేశమున మిగిలియుండు అడవులను రక్షించుటకును, లేనిచోట తిరిగి ఉత్పత్తిచేయుటకును శాసనములను ఏర్పఱచియున్నారు. ఇదియెంతయు ప్రశంసనీయము. మనలో మూఢులుకొందరు వంటకట్టెయలకు పుల్లలు స్వేచ్ఛగా దొరకుటలేదని, సర్కారువారి రాజ్యనీతిని ఈవిషయమునందు నిందించుచున్నారు. తత్కాలిక ప్రయోజనములను మాత్రమే గుర్తించి భావిపరిస్థితులను సరకుగొనక యుండుటవలననే, సర్వవిధముల మనదేశము దరిద్రదేవతకు పుట్టినిల్లయినది. ఇకముందైనను మనప్రజలు తాముజేయు కార్యములపట్ల భావి పరిస్థితులను దీర్ఘదృష్టితో పరికించెదరు గాక!

1878 సంవత్సరమున సర్కారువారు సర్వోత్కృష్టమైన ఈఉద్యమమునకు పూనుకొనిరి. 1908సం॥న హిందూదేశ వైశాల్యమునందు నూటికి 24 వంతున అడవులు పెంచబడినవి. బర్మాయందు-వనరాజివిస్తారము-నూటికి 76-వ వంతు, ఆస్సాము తూర్పు బంగాళములు 31-వ వంతు, చెన్నపురి 14-వ వంతు బొంబాయి 9-వ వంతు, పంజాబు 9-వ వంతు, బంగాళమున 6-వ వంతు, అడవి ప్రదేశము లున్నవి.



## అడవులు మూడుతరగతులు.

ఇండియా దేశమునందలి అడవులు మూడు తరగతులుగ భాగింపబడినవి:—

1. ఆపుదలచేయబడినవి. (Reserved) ఇవి పూర్తిగ సర్కారువారి యాధీనమందున్నవి. జనసామాన్యము యొక్క ఉపయోగమునకు విడిచిపెట్టబడకుండ కేటాయింపుగ నుంచబడినవి.

2. రక్షించబడుచున్నవి. (Protected) ఈ అడవులయందు సర్కారువారు అంతప్రమేయమును కలిగించుకొనరు. చాల విషయములయందు ఆ చుట్టు ప్రక్కలనున్న జనసముదాయమునకు స్వేచ్ఛయొసగ బడుచున్నది.

3. ఏతరగతికిని జెందనివి. కొద్దికట్టుబాట్లతో ప్రజా వినియోగమునకే విడిచిపెట్టబడినవి.

## అడవుల వైశాల్యము.

ఈక్రింది పట్టీవలన 1910-వ సంవత్సరమున ఇండియా దేశమునందలి వివిధరాష్ట్రములకు జెందిన అడవులవైశాల్యమును తెలిసికొనవచ్చును.

| | సర్కారువారిచే కేటింపుచేయబడినవి. చదరపు మైళ్లు. | రక్షించబడుచున్నవి. చదరపు మైళ్లు | ఏ తరగతికిని చెందనివి చదరపు మైళ్లు. | 1910-సంవత్సరమున అడవులవలన వచ్చిన నికర ఆదాయము. |
|---|---|---|---|---|
| | | | | సవరనులు |
| బర్మా | 26,077 | ... | 111,150 | 440,000 |
| బీరారు, మధ్యపరగణాలు | ... | .. | 21,384 | 32,000 |
| చెన్న రాజధాని | 18,629 | ... | 1,401 | 36,000 |
| బొంబాయి | 14,006 | 1042 | ... | 107,000 |
| అస్సాము, తూర్పు బంగాళములు | 6,491 | 4 | 22,416 | 55,000 |
| వంగ విహారరాష్ట్రములు | 4,254 | 3698 | ... | 31,000 |
| సంయుక్త పరగణాలు | 3,958 | 9100 | 186 | 90,000 |
| పంజాబు | 1,952 | 5222 | 1684 | 51,000 |
| హిందూదేశముపైని 1910-సం॥ము మొత్తము. | 96,000 | 9,000 | 141,000 | 796,000 |



ఇంతియేకాక అండమాను దీవులయందు అమితములైన వనసమూహములు గలవు. ఆద్వీపములుకూడ ఇండియా దొరతనమువారి ఆధీనముననే యుండుట వలన, మనదేశమునకు చెందినవనియే వాడవచ్చును.

## అడవులవలని ఆదాయము.

వైశాల్యమున స్పెయిను, బెల్జియము, పోర్చుగలు దేశములయొక్క వనరాజితో సమతుల్యమయ్యు సర్కారువారి ఆదాయము మాత్రము ఎకరమునకు మూడు అణాల కన్న గిట్టుటలేదు. మన అడవుల యందు ఆర్థిక సంపద ఎంతయో ఉపయోగమునకు తీసికొనిరాకుండ ప్రచ్ఛన్నమై యున్నది. దొరతనమువారు ఈవిషయమును గూర్చి ఇప్పుడు శ్రద్ధను వహించుచున్నారను సంగతి, సంతోషజనకము. ఎంతయో రాజస్వమును అధికము చేయవచ్చును. ఈమధ్య ఇంగ్లాండులో సర్ రాబర్టు కార్లైలుగారు మన అడవులను ఆర్థికోపయుక్తముగ జేయుటను గూర్చి దొరతనమువారు విశేషశ్రద్ధను వహించుచున్నారని ప్రశంసించిరి. ముఖ్యముగా కాగితములను తయారు చేయుటకు ఉపయోగమగు వెదురును గడ్డియును విస్తారముగ కలదని నుడివిరి. ఈప్రసంగము పైని మదరాసు టైమ్సుపత్రిక, యుద్ధమువచ్చి మూడు సంవత్సరములు కావచ్చెననియు, కాగితములకు కఱవుపుట్టి క్రొత్తవార్తా పత్రికలను స్థాపించుట యటుండ ఉన్నవానికే కాగితములు, ఈ దేశముననేగాక ఇంగ్లాండునందు సైతము, కఱవగుచుండ ఇండియా దొరతనము వారింకను వృథాయుపన్యాసములనే చేయుచు

కార్యక్రమమునకు పూనకుండుట కడు విషాదకరమని, వ్రాసినది. టైమ్సుపత్రిక వ్రాతసహేతుకముకాదని ఎవరనగలరు? కాగితములను ఎగుమతిచేయుటకు ప్రపంచము నందంతటను ఆస్ట్రియాదేశము గుత్తనుకలిగి యుండెడిది. తరువాత బెల్జియము. ఈదేశములు రెండును సమరమున చిక్కుకొనుటచే, ఈమహాకాటకము సంప్రాప్తమైనది. స్వీడనుదేశస్థులు ఇంగ్లాండునకు కాగితపు గుజ్జును (Wood pulp) ఎగుమతిచేయుట నిలుపుచేసిన తోడనే, కఱవుమరింత అధికమైనది. ఇప్పటికిన మన దేశమునకు సరిపోవు కాగితములను తయారు చేసికొనుటకు కావలసినసామగ్రి మన దేశమునందు అపారముగనున్నదని మనము గుర్తించవలసియున్నది. సర్కారువారి సహాయముండిన జాలును.

అండమాను ద్వీపులయందలి అడవులను ఆర్థికప్రయోజనములుగ జేసి సర్కారువారి ఆదాయము నధికముచేయుటకై ఏర్పాటులు చేయుచున్నారు. కొడగుదేశమునందలి అడవులను రెండు ట్రాంబండ్లను నిర్మించి అందలివస్తు సముదాయమును సుళువుగా పణ్యాచక్రములకు కొనివచ్చుటకు నిర్ణయించిరి. ఇందువలన రెవిన్యూ విశేషవృద్ధి గాంచును. శ్రీయుత ఏ. ఆర్. బానర్జీగారు కొచ్చిను సంస్థానమున దివానుగా నున్నపుడు, అడవులయొక్క ఆదాయమును ట్రాంబండ్లను నిర్మించియు, రబ్బరుతోటలను నాటుటకు విశేషమైన సదుపాయములను సమకూర్చియు, వృద్ధిచేసిరి. గతసంవత్సరమున పంజాబు దొరతనమువారు గుగ్గిలపు వ్యాపారమును వృద్ధిచేయుటకై ప్రయత్నముచేసిరి. అందువలన దొరతనమువారి ఆదాయము



క్రిందటి సంవత్సరము అధికమైనది. ఇంకను సర్కారు ఆదాయమును వృద్ధిచేయుటకు వీలగుపదార్థము లెన్నియోకలవు. దొరతనమువారు యుద్ధానంతరమున నీపనికి బూనుకొన నిశ్చయించుట శుభసూచకము.

ఆదాయమును అధికముచేయుటయే ముఖ్యోద్దేశముగ భావించి సర్కారువారు విచక్షణలేకుండ అడవులను నాశనము చేయకయును, నిర్మూలముచేయునపుడు దానితోపాటు క్రొత్త మొక్కలనుకూడ నాటుచును మనవనరాజిని కాపాడెదరుగాక.

## అటవీసంపద.

ఇండియా దేశమునందలి యడవులలో దొరకు పదార్థములలో అమూల్యములైనవి, టేకుదూలములు. 1911 సంవత్సరమున 73 లక్షల రూప్యములు విలువగల కలప ఎగుమతి అయినది. కరక్కాయలు 50 లక్షలు రూప్యముల విలువగలవి, ఎగుమతి అయినవి. రెండుకోట్ల రూప్యములువిలువగల లక్క ఎగుమతియైనది. రబ్బరు, మంచిగంధపు తరువులు, విరుగుడు చేవమ్రానులు, ఇవిగాక పట్టు, మైనము, గుగ్గిలము, కాచు, వార్నీషులు, తోళ్ళను పదునుచేయుటకు ఉపయోగమగు చిల్లర వస్తువులుకూడ మన అడవులయందు సమృద్ధిగానున్నవి. దేశమునందు వెదురు, మంచిగంధము, ఇండ్లుకట్టుకొను నిమిత్తము టేకు, గుగ్గిలపు మద్దిమానులుకూడ వినియోగింప బడినవి. వంటచెఱకునుగూర్చి ఇచట ప్రసంగించపనిలేదు. మన వనరాజియందు ఏనుగులుకూడ దొరకును. ఏనుగులయొక్క ఉపయోగమును వేరెచర్చించి వ్రాయనగత్యములేదు. చదువరు

లలో వీటినిగురించి తెలియనివారుండరు. 1906 సంవత్సరమున సర్కారువారి అడవులనుండి వచ్చిన నికరాదాయము 828,512 సవరనులు.

### చర్మములు

అడవులకు చెందని వయ్యును, తోళ్ళను పదునుచేయు పదార్థములనుగూర్చి వ్రాయునపుడు, ఇచ్చటనే చర్మములను గూరించి ప్రసంగించుట యుక్తమనితోచెడిని. చర్మములు విస్తారముగ జోళ్ళను తయారుచేయుటకును, పెట్టెలు సంచులు వగైరాలు తయారుచేయుటకును ఉపయోగింప బడుచున్నవి. 1913-14 సంవత్సరమున 79,26,000 రూప్యములు విలువగల జోళ్ళు మన దేశమునకు దిగుమతియైనవి. చర్మములను విపరీతముగ పరదేశములకంపి, జోళ్ళను పైనుండి సంగ్రహించుచున్నాము. ఇది యెంతయు విషాదకరమైనసంగతి. మనవాంఛలు తీరుటకునేగాక ఇతరరాష్ట్రములకు ఎగుమతిచేయుటకు కూడ అసంఖ్యాకములగు చర్మములు మనదేశమున కలవు. పదునుచేయుటకు అవసరములగు కరక్కాయలు, కాచువగైరా దినుసులు మన అడవులయందు అసంఖ్యాకములు. గతసంవత్సరమున (1916-17) 24 కోట్లరూప్యముల విలువగల చర్మములు మనదేశమునుండి ఎగుమతికాబడినవి.

### ఖనిజసంపద.

"ఇండియాదేశము, ప్రపంచమంతటినుండి ఏసంబంధము లేక వేరుచేయబడినప్పటికిని లేదా ఇతర దేశములయొక్క పోటీలనుండి ఆదేశమునందు ఉత్పత్తియగు లోహాదులను రక్షణ నవలంబించి కాపాడినయెడల, ఆదేశమునకు కావలసిన యెల్ల



లోహములను తానే సరఫరా చేసికొనుటకు తగిన సామర్థ్యమున్నదని నుడువుటకు, ఎవ్విధమైన అనుమానమును లేదు." అని బాల్ (Ball) అను నొక ఆంగ్లేయపండితుడు ఇండియాదేశపు ఆర్థిక భూగర్భశాస్త్రమున వ్రాసి యున్నాడు.

### ఖనిజస్థితి.

ప్రపంచమునందలి ఖనిజ సంపదయందంతటను మన దేశము అగ్రస్థానము నలంకరించుచున్నది. తాతా అండుసన్సు వారివలన కాలిమటిలో (Kalimatv) స్థాపింపబడిన అయః కర్మాగారము (ఇనుము, ఉక్కు ఫ్యాక్టరీ) దక్క నూతన పద్ధతుల ననుసరించి మనఖనిజసంపద ఉపయోగింపబడుట లేదు. ఇది చాల విచారకరము. కాన లోహములన్నియు పరదేశయాత్ర వెడలుచున్నవి. విదేశములయందు వస్తురూపముగ తయారుచేయబడి తిరుగా మనదేశమునకు దిగుమతి చేయబడుచున్నవి. పూర్వపు పద్ధతుల ననుసరించి పనిచేయుచున్న మన లోహకర్మాగారములు విదేశీయుల పోటీకి ఆగజాలక కృంగుచుండుట తటస్థించుచున్నది. కావుననే అశోధిత లోహములను ఏటేట విస్తారముగ ఉత్పత్తి చేయుచున్నను, తయారై దిగుమతియగుచున్న సరకులసంఖ్య హెచ్చుగుచున్నది. ఒకకోటి యేబది లక్షల రూప్యములు విలువగల అపక్వ లోహపదార్థ సంచయమును ఏటేట మనము విదేశముల కంపి(బొగ్గు, ఉప్పు, కిరసనాయిలు,సురేకారము మినహా) ఇరువదిఆరుకోట్లయాభయి లక్షల రూప్యముల మూల్యముగల లోహాదులను, లోహాదుల వలన తయారు చేయబడిన సరకులను మనము గ్రహించుచున్నాము. ఇటీవల మైసూరు ప్రభుత్వమువారు తమ రాష్ట్రము

నందలి ఖనిజసంపదను వృద్ధిచేయుటకు ప్రయత్నములు సల్పుచుండుట శుభసూచకము. ఇండియా దొరతనమువారు కూడ ఈవిషయమున తగిన శ్రద్ధను తీసికొని మనఖనిజ సంపద విదేశీయులచే కొల్లగొన బడకుండ కాపాడెదరు గాక! ఇక మన లోహాదులను గూర్చి వివరముగా చర్చించెదము:—

## రాక్షసిబొగ్గు.

మన ఖనిజసంపద యందంతటను ఉత్కృష్టస్థానము నలంకరించునది రాక్షసిబొగ్గు. కళాప్రపంచమును సముద్ధరించుటకు బంగారము కన్న రాక్షసిబొగ్గే హెచ్చుప్రయోజనకారి యని చెప్పుట అతిశయోక్తి కాదు. దేశమునందలి కూలివాండ్రకు వృత్తులను కల్పించుటలో, ఈఖనిజమే విశేష సహాయమగుచున్నది. ఉత్పత్తి చేయబడుచున్న పదార్థసంచయములో నూటికి 94-వ వంతు మన దేశీయ కళలను వికసింప చేయుటయందే వినియోగమగుచున్నది.

రాక్షసిబొగ్గు విశేషముగ రైల్వేలవలన వాడుక చేయబడు చున్నది. 1884 సంవత్సరమున ఇండియాదేశము నందలి ఇనుపదారులలో నూటికి 68 మాత్రమే వాడబడుచుండెడిది. 1903 సంవత్సరము సరికి 99 వంతు మనదేశపుబొగ్గే రైల్వేలయందు ఉపయోగము కాజొచ్చినది.

ఇండియా దేశమునందు, ఉత్పత్తియగుచున్న సీమ, బొగ్గులో సగము ఝర్రియా (Jherria) బొగ్గు గనులనుండియు మూడవవంతు రాణీ గంజ గనులనుండియు వచ్చుచున్నది. ఇరువదియవ వంతు గిరిడీ గనులనుండి వచ్చుచున్నది.



## ఝర్రియాగనులు.

27 మైళ్లు పొడవును $9\frac{1}{2}$ మైళ్ళు వెడలుపును కలిగియున్నవి. ఈగనులయందు అపారమైన బొగ్గుకలదు. ఎంతకాలమువరకు దొరకు చుండునను విషయమును ఇంతలో మనము చర్చించ నగత్యములేదు.

## రాణీగంజి బొగ్గుగనులు.

రమారమి ఒకశతాబ్దమునుండి వాడుక చేయబడు చున్నవి. ఈస్టిండియన్ రైల్వే 1854 సంవత్సరమున నిర్మింపబడునంత దనుక, ఈగనులయందలి బొగ్గు ఆచుట్టుపట్లనే ఉపయోగింప బడుచుండెను. దాల్టను గంజి, రాజమహాలు, రామఘర్ — బొకారియా, సంబలపూరు బొగ్గు గనులు కూడ వంగ, విహారరాష్ట్రములయందున్నవి. డాల్టను గంజియందు 70,000 టన్నులు ఉత్పత్తియగుచున్నది. మిగిలిన మూడు గనులనుండియు వత్సరమునకు కొన్నివేల టన్నులు మాత్రమే తయారగుచున్నది. మనదేశమునందు ఉత్పత్తియగుచున్న రాక్షసిబొగ్గునందు నూటికి తొంబదివంతున పైనపేర్కొన బడిన వంగవిహారరాష్ట్రములయందలి ఏడుగనుల నుండియు తయారగుచున్నది. ఈరెండు రాష్ట్రములయందు గాక హైదరాబాదు నైజాము వారి రాష్ట్రమునందలి శింగరేణియందు అయిదులక్షల టన్నులు ఏటేట ఉత్పన్నమగుచున్నది. 1910 సంవత్సరమున ఉత్పన్నమైన బొగ్గులో నూటికి 4-వ వంతు సింగరేణి బొగ్గుగనుల నుండి వచ్చుచున్నది.

శింగరేణిగనులు, ఝరియా, రాణీగంజి, గిరిఢీగనుల తరువాతనాలుగవదిగా నెన్నబడుచున్నవి. మధ్య పరగణాల యందలి మొహాపాణి(Mohapani) గనులు 52,000టన్నులును, బెలూచిస్థానమునందలి ఖోస్టుగనులు 41,000 టన్నులును, పంజాబు దేశమునందలి సాల్టురేంజి 30,000 టన్నులును, బికనీరు దేశమునందలి గనులు 14,000 టన్నులును, 1911 సంవత్సరమున ఉత్పత్తిచేసినవి. ఇండియా దేశమునందలి ఇతర గనులు—మధ్య హిందూస్థానమునందలి 'ఉమారియా' ఆస్సామునందలి 'మాకుమ్' పశ్చిమోత్తర పరగణాలయందలి 'హజారా' యును అయియున్నవి. 1911 సంవత్సరమున ఉత్పన్నమైనబొగ్గు 12.7 మిలియన్ల టన్నులు. విలువ 2½ మిలియన్ల సవరనులు. ఈ గనులయందు పనిచేసిన కూలీలసంఖ్య 116,153. విదేశములకు ఎగుమతిచేయబడిన బొగ్గు 873,987 టన్నులు. ఇటీవల కలకత్తాపట్టణమున జరిగిన 'ఇండియా ఖనిజ సమావేశముల' (Iudian mining Federation) ద్వితీయ వార్షికసభయందగ్రాసనాధిపత్యమువహించిన యన్. సి. సర్కారువారిట్లు వాక్రుచ్చియున్నారు. "రాకాసిబొగ్గుయొక్క ప్రస్తుతధరలు, చాలకాలమునుండి నష్టము ననుభవించుచున్న బొగ్గుగనులకు, నూతనోజ్జీవనమును కల్గించుచున్నవి. ఈ యుద్ధము ముగియునంతవరకు, దొరతనమువారికి కావలసినబొగ్గు అధికముగనుండును. యుద్ధానంతరమున మనదేశపు బొగ్గునకు విదేశములయందు విశేషగిరాకి కల్గుగునట్లు సూచనలు పొడగట్టుచున్నవి. తగినంతసరకును మనము ఉత్పన్నముచేసి సరఫరాచేయలేకపోతిమేని, ఆదరఖాస్తు (demand) మనలనుండి



తొలగిపోవును". దీనినిబట్టిచూడ మనబొగ్గువర్తకమునకు విశేషముగ గిరాకికలదనియును మంచిరోజులు వచ్చినవనియును చెప్పకతీరదు.

## బంగారము

విస్తారముగా మైసూరు సంస్థానమునందలి కోలారుగనుల నుండి ఉత్పన్నమగుచున్నది. 1911 సం॥ న మనదేశమునం దుత్పన్నమైన బంగారు 583,567 ఔన్సులు. దీనివిలువ 2.23 మిలియన్ల సవరనులు. తయారైనపదార్థ సంచయమంతయు విదేశయాత్ర వెడలెను. మొత్తములో నూటికి 95-వ వంతు కోలారు గనులనుండియే ఉత్పన్నమైనది. 3-వ వంతుకుకొంచెము తక్కువగా, నిజాము రాష్ట్రమునందలి హుత్తి గనినుండి ఎత్తబడినది. ధార్వార్ గని విడిచివేయబడినది. కాళహస్తిదగ్గరనున్న సువర్ణరేఖ మొదలగు కొన్నినదీము తల్లులుకూడ బంగారపు ఇసుకను ఒసంగుటకలదు. సింధునదియొక్క పైభాగమున కాశ్మీరుసంస్థానమున 1903-వ సంవత్సరములో 106 ఔన్సుల ఇసుకయెత్తబడినది. 1902 సంవత్సరమున ఐరావతీనదియొక్క పైభాగమునందు మియిట్క్యీనాకు పైభాగమునందు బంగారపుటిసుకను త్రవ్వుటకు కొన్నియంత్రములనుపయోగించిచూచిరి. 1903-వ సంవత్సరము జూను నెలవరకు నదీప్రవాహమునంతను పరిశీలించిచేసిన ప్రయత్నములు లాభకరములేయని గమనించినవారై మరికొన్ని యంత్రములను ఏర్పాటుచేయుటకు నిర్ణయించిరి. నదీప్రవాహములనుండి ఎత్తబడినబంగారము చాల తక్కువ. మైసూరు సంస్థానమునందలి గనులు ఒక బ్రిటిషు కంపెనీవారిచే పనిచేయబడుచున్నవి.

## కిరోసన్ నూనె.

దీనికి శిలాతైలమనియు, మట్టితైలమనియు కూడ పేరు కలదు. హిమాలయ పర్వతముయొక్క తూర్పుపశ్చిమభాగములయందు ఇండియాదేశముయొక్క కిరోసినునూనె నిచ్చుగనులు కలవు. పశ్చిమమున ఐరేనియనుపంక్తి, (Iranian) (పంజాబు బెలూచిస్థానములతో సహా) పారశీకమువరకు వ్యాపించియున్నవి. తూర్పున అరకానుపంక్తి, (Arakan) (అస్సాము, బర్మాలతో సహా) సుమిత్రా, బోర్నియో, జావా, కిరోసిను నూనెగనులవరకు వ్యాపించియున్నది. ఈరెండు పంక్తులయందును, బర్మాదేశమునందలి స్థితిగతులు నూనెనుసిలవచేయుటకు చాల అనుకూలముగనున్నవి. యేనాన్గ్యాఙ్గు (Yenangyang) నూనెగనులు ప్రశస్తమైనవి.

పంజాబుదేశమునకూడ నూనెఊటలు రావల్ పిండి జిల్లాయందుకలవు. కాని పంజాబునం దుత్పన్నమగు నూనె దేశమొత్తములో చాలతక్కువ. ఒకటి రెండువేల గాలనుల నూనె మాత్రమే ఏటేట ఎత్తబడుచున్నది.

అస్సాముురాష్ట్రమున కిరోసన్ నూనె విశేషముగా ఎత్తబడుచున్నది. 118 అంగుళములలోతున మాకుమ్ (Makum) నద్దనున్న ఒకపెద్దఊటనుండి అస్సాము ఆయిల్ కంపెనీవారు 1899 సం॥నుండి నూనెను తయారుచేయ నారంభించిరి. 1903 సం॥న ఈఊటనుండి 2,529,000 గాలన్లనూనె ఎత్తబడినది. 1913 సంవత్సరమున 632,000 గాలనులుమాత్రమే ఎత్తబడినది. ఏటేట ఈకంపెనీవారి వ్యాపారము వృద్ధియగుచున్నది.



బెలూచిస్థానమున కూడ విశేష నూనె ఊటలుకలవు. వీటిలో ముఖ్యములైనవి, మర్రి పర్వతములయందలి ఖట్టన్ (Khattan), పిరాణిదేశమునందలి మొగల్ కోట ఊటలు. 1891 సం॥ మున కొన్నిచిన్నయూటలను పరీక్షించిచూడగా ప్రశస్తమైననూనె నోసంగునట్టివిగా నున్నవి. ఈఊటలనుండి జయప్రదముగా నూనెను తయారుచేయుటకు ప్రయత్నములు సలుపబడలేదు.

## బర్మా.

అరకాను యోమాపంక్తియొక్క తూర్పుభాగమున నున్న ఐరావతీనదియొక్క లోవయందు యేనన్గ్యాంగు, సింగుపు యానాన్గ్యాటు అనుగొప్ప నూనె-ఊటలుకలవు. బర్మాదేశమునందు ప్రస్తుతము ఎత్తబడుచున్న నూనె విస్తారముగా ఈమూడు ఊటలనుండియే. ఇంకను మినుబు, అత్యాటిమో, ప్రోము, థింద్వీను లోవయందుకూడ నీటిఊటలుకలవు. కాని ఈఊటల నంతగా ఇంకను ఉపయోగములోనికి తీసికొనిరాలేదు.

| | | |
|---|---|---|
| 1899 సం॥ న ఎత్తబడిననూనె | 32,309,531 | గాలనులు |
| 1903 సం॥ న ,, | 85,328,491 | గాలనులు |

మొత్తముపైని మనదేశమున 1910 సంవత్సరమున 215 మిలియన్ల గాలనులనూనె ఎత్తబడినది. ఇందు 988,000 టన్నుల నూనె విదేశములకు ఎగుమతి కాబడినది. ఈనూనె వ్యాపారమున 1910 సం॥న పనిచేసిన జనులసంఖ్య 116,000.

## మేంగనీసు.

గత ఇరువది సంవత్సరములనుండి గనులనుండి, ఎత్తుట ప్రారంభమైనది. ఈవ్యాపారము అలతికాలములో విశేషవ్యాప్తినిగాంచినది. ప్రపంచములో ఈలోహమును ఉత్పత్తిచేయు దేశములలో రెండవదిగమనదేశము ఎన్నబడుచున్నది. 1903-వ సం॥ 171,806 టన్నులు తయారైనది. 1911 సంవత్సరమున 807,907టన్నులులోహము ఎత్తబడినది. కొలదికాలములోమన దేశమే ఈలోహమును ఉత్పత్తి చేయుటయందు అగ్రస్థానము నలంకరించగలదు. మధ్యపరగణాలయందు నాగపూరుప్రదేశమున విశేష గనులుకలవు. ఇదిగాక బాలాటు, చిండ్వారా జబల్పూరు జిల్లాలలోకూడ గనులున్నవి. నూటికి 69-వ వంతు మధ్యపరగణాలయందలి ఉత్పత్తి. చెన్నరాజధానినుండి నూటికి 15-వంతు లోహము ఎత్తబడుచున్నది. విజయనగర సంస్థానమునందలి గరివిడిగనుల ప్రసిద్ధి పాఠకు లెరింగియే యుందురు. గంజాముజిల్లా, కళ్ళికోట సంస్థానమునను, బల్లారి జిల్లాయందలి సాండూరు పర్వతములయందును ఈ గనులుకలవు. వీనిని ఉపయోగములోనికి తేవలసియున్నది. బొంబాయి రాజధానియందు మహాబలీశ్వరము చుట్టుప్రక్కలను, సతారా బీజపూరు, ధార్వార్ జిల్లాలయందును గనులు కలవు.

బొంబాయినుండి ఉత్పత్తి యగుచున్నది. నూటికి 3.75 వంతు

| | | | |
|---|---|---|---|
| మైసూరు | ,, | 5.3 | ,, |
| వంగదేశము | ,, | 5.2 | ,, |
| మధ్యహిందూస్థానము | ,, | 1.5 | ,, |



## సూరేకారము.

విస్తారముగా విహారరాష్ట్రమునందుత్పత్తి. ఈపదార్థము విశేషముగా వ్యవసాయమున కిరవగు, ఎరువుగను రసాయనకళలకును ఉపయోగించును. మనదేశమునందుత్పన్నమగు సరకంతయు విదేశములకు ఎగుమతి చేయబడుచునే యున్నది.

## మెగ్నీషైటు.

దక్షిణహిందూస్థానమున విశేషముగ కలదు. శేలము వద్ద ఈఖనిజము విశేషముగకలదు. ఈఖనిజముచే నావరింపబడియున్న ప్రదేశము సుద్దకొండలని పేర్కొనబడుచున్నవి. ఈలోహము, ప్రస్తుతము విరివిగాఎత్తబడి వ్యాపారము బాహాటముగా జరుగుచున్నది.

## తృణమణి.

బర్మాదేశమున తగుమాత్రము కలదు.

## గ్రాఫైటు.

పెన్సిళ్ళలోవేయు సీసపుబొగ్గు. విశాఖపట్టణ పర్వతపంక్తియందును, స్వతంత్రసంస్థానమగు భట్టీసాగరు ప్రాంతమునను కొండగు, గోదావరి జిల్లాలయందును, అప్పరుబర్మాయందును, ఈలోహముకలదు. కాని తిరువాన్కూరు సంస్థానమున తప్ప, ఎచ్చటను ఈఖనిజసంపద ఆకర్షించబడుటలేదు. మరియు, అల్యూమినియము, సీసము, తుత్తినాగము, కోబాల్టు, నికెలు, కాటుకరాయి, జిప్సము, పటిక, గంధకము, మొదలగు ఎన్నియో లోహములు కలవు.

తగరపు రేకు.

వంగదేశమునకు చెందిన హాజర్‌బాగు జిల్లాయందలి పాలన్‌పూరు సంస్థానమున ఈలోహము విశేషముగ కలదు. దీనిని బాగుగాపరిశీలించి వాడుకలోనికి తీసికొని రావలసిన ఆవశ్యకత మెండు. బర్మారాష్ట్రమునకూడ ఈఖనిజము ఉత్పత్తి యగుచున్నది. మనదేశమునకు వలయునంత తగరపురేకు దేశమున దొరకుటలేదు. (స్ట్రెయిటు శెటల్మెంట్సు) జావా, బొర్నియో, సింగపూరు, మలకాలనుండి మనమువిస్తారముగా ఈ రేకును గ్రహించుచున్నాము.

అభ్రకపు రేకు.

చాల సంవత్సరములనుండి అభ్రకమును ఉత్పత్తిచేయుటయందు మనదేశమగ్రపీఠము నలంకరించియున్నది. ప్రపంచమునందలి యావత్తు ఉత్పత్తిలోను సగమునకధికముగా మన దేశమే ఉత్పత్తిచేయుచున్నది. అభ్రకము రేకును ఉత్పత్తిచేయుటయందు ముఖ్యమైన ప్రదేశములు రెండు. నెల్లూరు జిల్లాయందును, అరవైమైళ్ళ పొడవును, పండ్రెండుమైళ్లు వెడలుపును కలిగి గయ, హాజరిభాగు, మాంఘియరు జిల్లాలయందు వ్యాపించియున్న ఒక పంక్తియందును విస్తారముగ కలదు. వంగరాష్ట్రమున, అభ్రకపువ్యాపారము విశేషకాలమునుండి జరుగుచున్నది. నెల్లూరు జిల్లాయందుమాత్రము 1892 సం॥న ప్రారంభమైనది. ఈవ్యాపారము విశేషలాభకారిగా నున్నది. 1911 సం॥న మన దేశమున 31,686 ఇంగ్లీషుబారువల అభ్రకము ఎత్తబడినది. అందు 31లక్షుల రూప్యముల విలువగల సరకు ఎగుమతిచేయబడినది. ఈగనులను త్రవ్వుటయందు నూతనపద్ధతులను మన వారు ఉపయోగించుటలేదు. ప్రస్తుతము లాభకరముగనున్నను రానురాను నూతన పద్ధతుల ఆవశ్యకత వ్యక్తీకరించబడక మానదు.



రాగి, వెండి.

ఈ రెండులోహములును మన దేశమునందంతగా లేవు. వెండి బహుస్వల్పము. ఈలోహమును ఎప్పుడును మనముపై దేశములనుండి—ముఖ్యముగా అమెరికానుండి—గ్రహించుచుండవలసినదే. పూర్వము మన దేశమున రాగి విశేషముగ నుండెడిదికాని ఆగనులన్నియు ఇపుడు నిస్సారములైనవి. ఈ లోహముకూడ విశేషముగ మన దేశమునకు ఇటీవల దిగుమతి యగుచున్నది.

రత్నములు.

భరతఖండము రత్నములకు పెట్టినదిపేరు. అనేక శతాబ్దములనుండి వినియోగించ బడుచుండుటవలన ఇపుడవి చాల వరకు సన్నగిలినవి. 1911 సం॥న 288,216 కేరట్ల రత్నములు (కెంపులు వగైరా) ఎగుమతి చేయబడినవి.

ఇనుము.

ప్రశస్తమైన ఇనుపగనులు దేశమునందంతటను వ్యాపించియున్నవి. ఈ ఇనుముయొక్క పరిశుద్ధత నాలోచించిన ఇంగ్లాండునందలి ఇనుపవర్తక యజమానులకు సైతము నోరూరకమానదు. మరియొక విశేషమేమనిన పరిగ్రహణమునకు విశేషశ్రమ యవసరములేకుండ పెక్కుస్థలములయందు పై

భాగముననేయున్నది. ప్రశస్తమైన డామస్కసు కత్తులను తయారుచేయుటకు సైతము పనికివచ్చెడి ఉక్కుగనులు కుప్పలుగానున్నవి.

### తాతా అండుసన్సువారి కర్మాగారము.

ఐరోపాదేశ పద్ధతుల ననుసరించి ఇనుమును తయారుచేయుట మన దేశమునందు రెండు చోట్లనే జయప్రదముగ జరుగుచున్నది. ఖరగ్‌పూరునకు సమీపముగానున్న శాక్చీ (Sakchi) పట్టణమున తాతాఅండుసన్సు వారిచే ఒకగొప్ప అయఃకర్మాగారము స్థాపింపబడినది. ప్రశస్తమైన ఉక్కును, ఇనుమును తయారుచేయబడుచున్నవి. మన రైల్వేలకు కావలసిన కమ్ములువగైరా సామానులు చాలవరకు, ఈ కర్మాగారమున తయారగుచున్నవి. ఈ కర్మాగారమును విరివిచేయుటకునై గతవత్సరమున ఏర్పాటులు చేయబడినవి. మనదేశమున అలతికాలములో ఆవిరియంత్రములుకూడ తయారుచేయబడనున్నవి. యుద్ధము ఎడతెగక జరుగుచుండుటవలన ఆంగ్ల వర్తక నౌకలు విశేషముగ, నావికాదళమున చేర్చబడుటచే, మన దేశమునుండి ఎగుమతులు చేయుటకు ఓడలయొక్క గిరాకి అతిశయించినదన్న సంగతి చదువరు లెరింగియేయుందురు.

### ఇండియా వర్తకనౌకలయొక్క ఆవశ్యకత.

నూలుసరకులను ఎగుమతి చేయుటలో చీనాదేశమున జపానుదేశమునకును మనకును పోటీయున్న సంగతి ఇదివరకే సూచించియున్నాము. ఆంగ్లనౌకలు విస్తారము రాకపోకలు



జరిగించుచుండుట లేమివలన మన వ్యాపారమునకు అభ్యంతరము కలుగుచున్నది. జపానుదేశము ఓడల సంఖ్య నధికముగా వించుటవలన వాణిజ్యచక్రమున విజృంభించుటకువీలగుచున్నది. ఇటీవల బొంబాయిలో జరిగిన నూలువర్తక యాజమానుల సంఘముయొక్క సాంవత్సరికోత్సవ సమావేశమునందు శ్రీయుత మానమోహనదాసు రాంజీగారు మనదేశ వాణిజ్య వ్యాప్తికి పొగఓడలయొక్క ఆవశ్యకతను గూర్చి ముచ్చటించిరి. ఓడల నిర్మాణము కొలదికాలమున మనదేశమునకూడ జరుగవలసియున్నది. నావికానిర్మాణము మనదేశమున క్రొత్తది కాదు. పూర్వచరిత్రలను చదివినచో తెల్లమగును. ఈ ఓడల నిర్మాణమునకు, వలయు పరికరములన్నిటిని కాలిమటియందలి తాతావారి కర్మాగారమే తయారుచేయగలదని వ్రాయుట కెంతయో సంతసముగనున్నది.

బంగాళా దేశమునందలి ఇనుప కర్మాగారము నందుకూడ నూతన పద్ధతులపైని పిగ్-ఐరను, ఉక్కును, తయారుచేయబడుచున్నవి. ఇదిగాక మధ్యపరగణాలయందు ఇంకను పూర్వపద్ధతులపైని ఇనుము కఱగించ బడుచున్నది. రైల్వేల కతిదూరముననుండు ప్రదేశములయందు ఈ విధానము కొంత లాభకరముగనే యున్నది.

### ఇనుపగనులుగల ప్రదేశములు.

విస్తారముగా ఇనుపగనులు గల ప్రదేశములు శేలం జిల్లా, బళ్ళారిజిల్లాయందలి సాండూరు (Sandur) సంస్థానము, మధ్య పరగణాలయందలి చందా, రాయపూరు, జబల్‌పూరు

ఛోటానాగపూరు, ఒరిస్సా యందలి మూర్‌భంజ్ సంస్థానములు. మూర్‌భంజిసంస్థానమునందలి గనులనే తాతాఅండు సన్సువారు 99 సంవత్సరముల కవులుకు తీసికొని కాలిమటీయందు పనిచేయుచున్నారు. మైసూరు సంస్థానమునందలి బాబాబూడన్ పర్వతములయందు గొప్ప ఇనుపగనులున్నవి. ఈగనులకు సమీపమున బొగ్గుగనులు లేకపోవుటవలన, ఈకనుమలయందలి ఖనిజసంపదను ఆకర్షించుటకు నీలుచిక్కక ఇంతకాలమువరకు వేచియున్నది. కాని ఇటీవల సర్ విశ్వేశ్వరయ్యగారి మంత్రిత్వమున అన్నివిధములను మైసూరు సంస్థానము అభివృద్ధిగాంచు చున్నదన్న సంగతి నిర్వివాదాంశము. తాతా అండుసన్సువారి కర్మాగారమును విశేషప్రజ్ఞచే నడిపించు చున్న పి. పి. పెరిన్ అనునిపుణునిచే ఇటీవల కొన్ని శోధనలు గావింపబడినవి. పెరిన్‌గారు రాక్షసిబొగ్గు లేదని ఈలోహమును విడిచిపెట్ట నవసరము లేదనియు, కఱ్ఱలను కాల్చి బొగ్గు తయారుచేసి ఆబొగ్గువలన ఇనుమును కఱుగ వచ్చుననియు అభిప్రాయము నిచ్చిరి. బొగ్గును తయారు చేయుట కొక యంత్రసామగ్రిని, ఇనుమును కఱగుటకు బ్లాస్టుఫర్నేసను * యంత్రమును స్థాపించి, పనిచేయుటకు నేర్పాటులు గావింపబడినవి. కెమ్మనగుండి కనుమలయందు 5 లక్షల టన్నుల ఉత్కృష్టమైన ఇనుమును లక్షలకొలది టన్నుల

* గనులనుండి ఎత్తిన అశోధిత లోహమును శుభ్రపర్చుటకై కరిగించవలసిన ఆవశ్యకత కలదు. కరుగుటకై బ్లాస్టుఫర్నేసు అను సాధనము వాడుక చేయబడుచున్నది. అశోధిత లోహమంతయు ఈఫర్నేసునందు వైచి కరిగి వడకట్టిన మంచిలోహము లభించును.



రెండవ తరగతి ఇనుమును ఉన్నట్లు ఇటీవల వార్తాపత్రికలయందు ప్రకటితమైనది. సేలము బళ్లారిజిల్లాలయందలి ఇనుపగనులనుకూడ, కఱ్ఱలను కాల్చి తయారు చేసిన బొగ్గువలన, విశేషలాభకరముగ పనిచేయవచ్చునని ప్రొఫెసరు ఛాటరుటనుగారు అభిప్రాయము నిచ్చిరి.

1911 సంవత్సరమున మనదేశమున 366,180 టన్నుల ఇనుము తయారుచేయబడినది. ఇందు 21 లక్షల రూప్యముల విలువగలది పైదేశములకు ఎగుమతి చేయబడినది.

## ఉప్పు.

1910 సం॥ న మనదేశమున సుమారు 34 మిలియన్ల మణుగుల ఉప్పు తయారుచేయబడినది. అందు నూటికి 91-వ వంతు సరస్సులనుండియు సముద్రములనుండియు నీటిని ఆవిరిగా చేయుటవలనను, 9-వ వంతు గనులనుండి ఆకర్షించుటవలనను దొరుకుచున్నది.

(1) ఉప్పుమళ్ళ నుండి:

| | | |
|---|---|---|
| చెన్నరాజధాని | 12.6 మిలియన్ల | మణుగులు. |
| సింధు, బొంబాయి రాష్ట్రములు | 12.5 | ,, |
| బర్మా | ½ మిలియను | ,, |
| (2) రాజపుత్రస్థానమునందలి సాంబారు సరస్సునుండి | 4.8 | ,, |
| (3) పశ్చిమోత్తర పరగణాలయందలి ఖాటిఉప్పు,సాల్టు రేంజినుండియు పంజాబుగనుల నుండియు. | 3.3 | ,, |

ఉప్పు పన్నువలన మన దొరతనమువారికి వచ్చుచున్న ఆదాయము 1916-17 సం॥ న 4,785,900 సవరనులు. ఉప్పు యొక్క ప్రయోజనము ఈఆదాయమునుండి గ్రహించనగును.

గనులయందు పనిచేయుచున్న కర్మకరులు.

ప్రస్తుతము మనదేశమున గనులయందు సంవత్సరము పొడుగునను దినమునకు ఒకలక్ష యాభయి వేల జనులు పని చేయుచున్నారు. గనులను విస్తారముగా త్రవ్వుటకు మొదలిడిన కొలదిని వేలకొలది ప్రజలకు వృత్తులు కల్పింపబడును. బొగ్గు గనులకు చాలమంచి కాలము రానున్నదని సూచించి యున్నాము. దేశస్థులు గమనించవలసిన విషయము ఒకటి కలదు. అన్యదేశీయులను మనఖనిజసంపదను కొల్లగొననీయవచ్చునా ?

మన గనులను భారతీయులే ఉపయోగములోనికి తీసికొని రావలయును గాని అన్యదేశీయులను కొల్లగొననీయరాదు. ఇదివరకే చాలనష్టము ననుభవించి యుంటిమి. ఈసందర్భమున కీర్తిశేషులైన దివాను బహదూరు ఆర్. రఘునాధరావు పంతులుగారి వచనములు జ్ఞప్తికివచ్చుచున్నవి. రఘునాధరావు గారి స్వాంతభూములలో ఒక మేంగనీసుగని యున్నది. దానిని ఎందఱో విదేశీయులు పనిచేయుట కనుజ్ఞ దయచేయుడని కోరగా ఆమహాశయు డిట్లనెను. ఎప్పటికైన స్వదేశస్థుడగు భారతీయుడే నాగనిని త్రవ్వుటకు పూనుకొనవలయునేగాని, అన్యదేశీయుల కెన్నడు నేను ఇవ్వదలచుకొనలేదని ఖండితముగా బదులు చెప్పెను. అందువలని లాభము స్వదేశమునసనే ఉండి తీరవలయునుగాని పరదేశీయుల నైశ్వర్యవంతుల జేయరాదు. భారతీయులెల్లరు ఈవిషయమును గమనించెదరు గాక.



గోఖలే మహాశయుని అభిప్రాయము.

గోఖలే మహాశయుడు సైతము వెల్బికమిషను ఎదుట సాక్ష్యమిచ్చుచు నితీరుననే వాక్రుచ్చెను. "నాకు గొప్ప ఆస్తి యున్నచో నేననుభవింప వలసినదేగాని ఇతరులు దానిలాభము పొందుటకు వీలులేదు. ధర్మవిరుద్ధముగ నా ఆస్థినంతయును యితరులనుభవించుచు నాకు భరణముక్రింద కొంతస్వల్పభాగమునిచ్చుట చాలహాస్యాస్పదము. నాఇష్టము వచ్చినరీతిని నేను అనుభవింపవలసినదే గాని ఇతరు లెంతమాత్రము పాలుగొనకూడదు. వర్తమానమందు నేను అనుభవించినను లేక పోయినను పరులకీయక నాసొత్తుగ నేనేయుంచుకొనియెదను." ఈపంచాయితీవారి ఎదుటనే మరియొక సందర్భమున గోక్లేగారిట్లు సాక్ష్యమిచ్చిరి:—"నాఅర్థము తెల్లము జేయుటకునేనొక దృష్టాంత మిచ్చెదను. ఒక గృహమున్నది. దానిలో ఒక్కడే కాపురముండెను. వీనికి పక్షవాతరోగము సంభవించినది. వీనిగృహమందు సుందరమగు వస్తువు లనేకములున్నవి. పక్షవాతముచే పీడింపబడుచున్న ఈగృహస్థు వీనిసుఖము, సంతోషము పొందజాలడాయెను. కాన పరులెవరో వాని యింట ప్రవేశించి ఇంటనున్న వస్తువులలో, స్వల్పభాగము మాత్రము వానికిచ్చి మిగిలిన గొప్పవస్తువుల నన్నిటిని గొంపోయిరి. ప్రస్తుతమందు మాపని ఇదేరీతిగ నున్నది."

కాన దేశీయులే, దేశమునందలి ద్రవ్యసాధనములను ఉపయోగములోనికి గొనివచ్చి తమకును దేశమునకును కీర్తి తేవలసియున్నది.

## శ్రమ. (Labour)

ద్రవ్యోత్పత్తికి మూలాధారములు మూడువిధములు.

ప్రకృతి, (Nature) శ్రమ (పని), మూలధనము. ఇంతదనుక మనము మొదటిదియగు ప్రకృతినిగూర్చి చర్చించితిమి. దేశమునందలి ద్రవ్యసాధనములు ప్రకృతిజనకములే. ఇక రెండవదియగు శ్రమను గూర్చి విమర్శింతము.

శ్రమ యనగా కర్మకరుల (పనివాండ్ర) శక్తి యుక్తులు. ఏదేశమున ద్రవ్యసాధనములకు తోడు శ్రమా విభాగము (Division of labour) చక్కగానుండునో, ఆదేశము ఐశ్వర్యవంతమగుటకు ఇసుమంతయైనను సందియము లేదు.

### శ్రమావిభాగము.

కర్మకరులసంఖ్య మనదేశమున విస్తారము. వేతనములు కూడ కాలుచౌక. అయిన ఒక్కకర్మకరుల సంఖ్యనుబట్టియే మనము శ్రమావిభాగమును నిశ్చయించరాదు. పదునొకండవ ఇండియా కళాసభయందు బొంబాయి నగరమున అగ్రాసనాధిపులగు సర్ దొరాబు తాతాగారిట్లు వాక్రుచ్చిరి! "కర్మకరుల సంఖ్యనుబట్టియే మనము శ్రమావ్యవస్థను నిర్ణయించరాదు. మొత్తములో ఎంతమంది నిపుణులు కలరో, వారి కౌశలమును బట్టి నిశ్చయించ వలసి యున్నది."

### కర్మకరులపై మోపబడుచున్న నేరములు

ఐరోపా దేశమునందలి కర్మకరులతో సరి పోల్చిచూచినపుడు మనకర్మకరులు కార్యసాధనత్వమున కడునిష్ప్రయోజ



కులుగ నున్నారని మనము తఱుచు వినుచున్నాము. ఇండియనులు చేతిపనులన్న సేవగించు కొందురనియు, శ్రమ యొక్క గౌరవమును గమనించుట లేదనియు కూడ వినుచునే యున్నాము. ఈరెండవ నిందారోపణ విద్యాధికులను గూర్చి కాని సామాన్యప్రజను గురించి చెప్పినదికాదు. ఇది సత్యమే! మనలో విద్య నభ్యసించినవారు వాణిజ్య పరిశ్రమలయందు వారి బుద్ధి కుశలతను వినియోగించి దేశమునకును తమకును కీర్తిసంపదను గడించవలసిన యావశ్యకతను ఈసరికిని గ్రహించుట లేదు. ఇది కడువిషాదకరమైన సంగతి. విద్యాధికులు పరిశ్రమలయందు ప్రవేశించకపోవుటచేతనే ఇండియాదేశమునందలి కర్మకరులు నిష్ప్రయోజకులనియు కౌశలమన్న నెట్టిదియో ఎరుంగరనియు నిందారోపణ చేయబడుచున్నది. ఇప్పటికైనను తెలివి తెచ్చుకొని బి. ఏ., యమ్. ఏ. పరీక్షలయందు దారి తేరినవెంటనే రెవిన్యూ ఉద్యోగమునందు చేరుటగాని, లా కాలేజియందు జేరి వకీలు పట్టాలను గ్రహించుటగాని కట్టిపెట్టి మన కళాకౌశలముసందిగ్ధ స్థితిలోనున్న ఇట్టిసమయమున తమబుద్ధి వైశద్యమును కళాచక్రమునకు ధారపోసి యశఃకాములగుదురు గాక!

### నిందారోపణమును బాపుకొనుటకు విధానములు.

ఈనిందారోపణమును బాపుకొనుటకుగలవిధానములు రెండు. దేశమునందెల్లయెడల విద్యావ్యాప్తిని జేయుట ఒకటి. రెండవది, సమర్థులగు బోధకులనియమించి చిన్ననాటనే శిల్పముమొదలగు చేతిపనులయందు శిశువును గరపుట. చిన్నతనముననే శిశునువడసినచో, పనిచేయుటయన్న ఏవగించు

కొనరు. పనిచేయుటయనగా ఉద్యోగములు చేయుటకాదు. పరిశ్రమలయందు బుద్ధికుశలతను ఉపయోగించుట.

### నిపుణులగు కర్మకరులు ప్రస్తుతము లేని మాత్రమున కళాచక్రము వికసించజాలదా?

నిపుణులగు కర్మకరులు దేశమున లేరనియెడి సిద్ధాంతము ఊతగాగొని ఎన్నటికిని ఇండియాదేశముయొక్క కళాప్రపంచము వికసించనేరదనియును ఈస్థితిలో సర్కారువారు పరిశ్రమకును సహాయము నొసంగుటకూడ అసంభవమనియును వాదించుప్రముఖులు కూడగలరు. ఇది ఎంత విశ్వాసార్హమో, పరిశీలించెదము. తొలుదొల్త భరతఖండము సర్వరాష్ట్రీయుల యందును కళాపరిపూర్తినిగాంచి వన్నెకెక్కినసంగతి నిర్వివాదాంశము. ఈస్టిండియాకంపెనీవారి యాజమాన్యము క్రింద మనదేశమున్న కాలమున ఇంగ్లీషువర్తకుల యాశయములు సఫలీకృతములగుటకు అనేకవిధముల మనకళలను రూపుమాపిరి. కళాప్రపంచము తేజోవిహీనమగుటచే, త్రాగుటకె గంజిలేక మనకళాదక్షులెల్ల వ్యవసాయవృత్తినే శరణ్యముగ గ్రహించవలసిన దుస్థితిపట్టినది. ఆకారణమువలన ఇండియాదేశము కృషికళ నభివృద్ధిచేయుటకేగాని పారిశ్రామిక దేశమెన్నటికిని కాజాలదని వాదించుట సమంజసముగ నున్నదేమో చదువరులూహించెదరుగాక! పారిశ్రామికవిద్యను సర్కారువారు ప్రసాదించినయెడల పూర్వపునౌన్నత్యమును జ్ఞప్తికిదెచ్చు కళాదక్షులు తిరిగి బయలువెడలకపోరు. కర్మకరుల వేతనములు మనదేశమున కారుచౌకయని ముందుసూచించితిమి. ఇంగ్లీషు



పనివాండ్రతో పోల్చిచూచినపుడు మనదేశస్థులు వెనుకపడియున్నారను సంగతిని ఆధారముచేసికొని దేశములో కూలిచౌకయగుటకు బదులు బహుప్రియమైనదని గూడ వాదుచున్నారు. దీనికివారుచూపు నిదర్శనమేమనగా, ఒకలంకషైరు పనివాడు దినమునకు చేసినపని, ఇండియాదేశమున నలుగురుమనుష్యులుగాని చేయజాలకపోవుట. ఈ సందర్భమున నొకప్రశ్న. ఇండియాదేశమునందలి వర్తకసంఘములు ఏకర్మకరులనుండి పనిని గ్రహించి కోట్లకొలది ధనమునార్జించగలిగిరి? సర్కారువారు ప్రమేయమును గలిగించుకొని పారిశ్రామికవిద్యను దేశమునందంతటను వ్యాపింపజేసి, పరిశ్రామిక వ్యవహారములయందు నేర్పుతో పాటుపడుటకు సంసిద్ధులజేసినేని శ్రమసమస్య తనకు తానే సద్దుకొనును.

### శిల్పుల కొసంగవలసిన విద్య.

మనశిల్పులకొసంగెడి విద్య వ్రాయుట, చదువుట, లెక్కలువేయుట అనునీమూడు విషయములతోనే ముగించినలాభములేదు. కళాపరిపూర్తినిగాంచి విజృంభించుచున్న ప్రపంచమందలి ఇతర రాష్ట్రీయములయందెట్టి విద్యనొసంగుచున్నారో అట్టివిద్యనే మనశిల్పులకుకూడ గరపవలసియున్నది. లేనిచో ఎప్పటి స్థితిలోనేయుండును.

### భారతీయుల ప్రజ్ఞ.

ఎద్దానినైన సూక్ష్మముగ గ్రహించుటయందు మనదేశస్థులు మిక్కిలి సమర్థులు. ఇతరవిషయముల యందెంతనీరసస్థితియందున్నను, ప్రజ్ఞావిశేషమునమాత్రము ఇతర రాష్ట్రీయుల

వారికి మనవారు తీసిపోరు! టావర్నియరను (Tavernier) ఒకఫ్రెంచి యాత్రికుడు అక్కాలపు పరిస్థితులనుగూర్చి ఇట్లు వ్రాసెను. "ప్రశస్తమైన సాధనసామగ్రిని కలిగియున్న ఐరోపా కర్మకరు లేవిధముగ సరకులను తయారుచేసిరో, ఆరీతినే నాజూకననెట్టిదో యెరుగని హీనదశయందున్న పనిముట్లతో ఇండియా దేశపు పనివాండ్రు వస్తువులను తయారు చేయుట చాల ఆశ్చర్యకరముగ నున్నది." టేవర్నియరు కాలము నందు యంత్రకళలన్నవి పేరునకైనలేవు. అట్టి స్థితిలోనే ఐరోపు కర్మకరులతో జయప్రదముగ పోటీయందు నిలిచి నపుడు, తగినపరిశ్రామిక శిక్షనొసంగి సంసిద్ధులను చేసినచో ఇపుడుకూడ కళాచక్రమున వారికి సమానులుకాగలరు. క్రికెట్టు ఆటయందు ఇంగ్లాండునంతను మన రంజిత సింగు జయించెను. పరంజపి, త్యాగరాజను, మొదలగు ఎందరు భారతీయులు గణితశాస్త్రమునందు విదేశీయులకంటె ఉన్నతిగాంచ లేదు. ఇంగ్లీషుభాష మన కన్యభాషయయ్యు సురేంద్రనాథ బానర్జీవంటి యెందరువక్తలు బయలుదేర లేదు. బ్రజేంద్రనాథశీలు హేరంబచంద్ర మైత్రావంటి ఎందరు సుప్రసిద్ధ ఇంగ్లీషుప్రొఫెసరులు మనదేశము నలంకరించుటలేదు. ఇదియంతయు మనబుద్ధి కుశలతను, చెప్పక చెప్పుచున్నది. తగినఅవకాశమును అభ్యాసమును ఒసంగి అనుకూలమగు పరిస్థితులను గల్పించినచో, మానవప్రపంచమున కవసరమగు ఏశాఖయందైనను ప్రసిద్ధులగువారితో సముడని ఉత్తీర్ణత గాంచగలశక్తి భారతీయునకు కలదు.



## కర్మకరులయందు చలనములేకుండుట.

కేవల నిరర్థకులనియు కౌశలమననెట్టిదో ఎరుగనివారనను నిందారోపణనుగూర్చి ఇంతవరకును చర్చించితిమి. మోపబడిన నేరములలో నికరెండవదానినిగూర్చి విమర్శింతము. త్రాగుటకుగంజియున్న, అల్ప సంతుష్టులగుటచే ఒకపూట మాడుచున్నను, మనదేశమునందలి కూలివాండ్రు పరదేశములంబట్టి పోరనుట. ఉన్నయూరినే ఆశ్రయించుకొనియుందురు గాని హెచ్చువిత్తము నార్జించుటకై విదేశములకేగ కుండుట రెండవ దోషము.

అన్యదేశములకన్న స్వదేశమునందు పనివాండ్ర చలనము తక్కువయనుమాటసత్యమే. మనమతాచారములు ఇందునకు చాలతోడ్పడినవి. మోక్షేచ్ఛయేగాని ఐచ్ఛికచింతఅంతగా మనప్రజల నావరించుటలేదు. ప్రస్తుత ప్రపంచస్థితిలో ఐశ్వర్యోపార్జనకేగాని మోక్షమునకు ప్రయత్నించుటకు వీలంతగా లేదు. మనదేశము మూలవడియుండుటకు అల్పసంతుష్టియును, సాహసలోపమును చాలవరకు తోడ్పడినవి.

కర్మకరులయందలి చలనము మనపత్రికలు లారోపించునంత నీచదశయందున్నదియాయనుసంగతిని విమర్శింతము. చలనము తక్కువగా నున్నంత మాత్రమున కదలికయేలేదనియును కూపస్థ మండూకము వలె ఉన్నచోటనే పడియుందురనుటకు, వీలులేదు. ఇందునకు ప్రత్యక్ష నిదర్శనములు గలవు. వలసరాజ్యములయందు మనకూలివాండ్రు పొందుచున్న బాధలను శ్రీగంధి మహాశయుడు వారిని సముద్ధరించుటకు

చేసిన ప్రయత్నములును వారకు తెలియంగకపోరు. అన్ని బాధలకును ఒడబడి, ఏల మనకర్మకరులు విదేశముల కేగుచున్నారు? ఇది కదలికలేకపోవుటవలననా ? ఆస్సాము, విహారరాష్ట్రముల యందలి నీలి, తేయాకుతోటలకు ఏదేశమునుండి కూలీలుచేరి పనిచేయుచున్నారు? వారచ్చటయెన్ని ఇడుములగుడుచు చున్నదియును, గంధిమహాశయుడు మోతిహారియందు చేయుచున్న విచారణవలన బహిరంగము చేయబడును. బ్రిటిషుతోట యాధికారులకు నీకిరాకచాల ఆందోళనము కలిగించు చున్నది. గుట్టుబయలుపడునేమో యని భీతావహులైనట్లు తోచెడిని! కూలివాండ్ర చలనము లేదని వాదించువారు రంగూనుపట్టణమును వీక్షించికేని పంజాబుమొదలు, తిరువాన్కూరు వరకు సకల రాష్ట్రములనుండియువచ్చి పనిచేయుచున్న కర్మకరులు వారిదృష్టిపథమున దవ్వుల్కానియెదరు.

కళాచక్రమును విరివిచేసి తగినవృత్తులు, మనదేశమునందు కల్పింపబడినచో, కర్మకరు లెంతయో సంతసముతో దేశముననేయుండ నుద్యుక్తులగుదురు. స్వదేశముననే తగిన వసతులున్న బాధలు పడుటకునై విదేశముల కేగ నలసియుండదు. ఇందులకొక దృష్టాంతము. గంజాం జిల్లాలో బరంపురం, నరసన్నపేటలు పట్టుసాలీలకు ప్రసిద్ధి. అందులో నరసన్నపేటయందు పూర్తిగ పట్టుసాలీలే నివసించుచుండెడివారు. ఊరియందు 12 పేటలలోను, ఇపుడుచూచిన పట్టుసాలీలను వెతకవలసినదేగాని మునుపటివలె ఎక్కడచూచినను వారేలయి కానవచ్చుటలేదు. వీరేమయిరి? అదృశ్యులయ్యిరా? లేదు. పవరుమగ్గముల పోటీకి ఆగలేక జీర్ణదశలోనికి



వచ్చి నిలువ నాస్కారము లేకపోవుటచే వంగరాష్ట్రమునందలి సెరంపూరు గ్రామమునకు వేలకొలదిచేరిరి. బరంపురం సంగతి కూడనిట్లే. నేతకళ విదేశములపోటీకి ఆగలేకపోవుటచేత కదా ఈపట్టు సాలీలకునిట్టి దురవస్థపట్టినది. స్వస్థానముననే సెరంపూరునకువలె ఆకళను నూతన పద్ధతులపైని స్థాపించినచో, గృహములను స్వగ్రామములను విడిచి వారుపోవకయుందురు. మనకర్మకరులకు కదలిక కలదో లేదో చదువరులీవిషయమును బట్టి యూహించెదరుగాక!

### శ్రమాభివృద్ధికి మార్గములు.

ఇక రంధ్రాన్వేషణము నటుంచి ప్రస్తుతము మన శ్రమావ్యవస్థ హీనదశయందుండుటకుగల కారణములను చర్చించుచు, సాధనాంతరములకూడ పొందు పర్చనగును:-

### ఆర్జనశక్తిని అధికముచేయుట.

మనదేశమునందలి కర్మకరులు చాలతక్కువ కూలికి పనిచేయుట కలవాటుపడియుండుట అందరు నెరింగినదే. ఈ అల్ప సంతుష్టిత్వము వారిపురోభివృద్ధికి అడ్డు కలుగుచున్నదేమోయని తోచెడిని. అయిన, మనశిల్పులయొక్క ఆర్జనశక్తిని అధికము చేయుటకు వీలగు ప్రయత్నములు సల్పినంతమాత్రముననే చాలదు. ఏలనన, అధికముగ సంపాదించిన సొమ్మును పిన్నవయసునం దలవాటుచేసికొనిన త్రాగుడు మొదలగు దుర్వ్యసనములక్రింద వినియోగించును. లేదా, దినమునకు తాను సంపాదించవలసిన సొమ్ము, వేతన మధికముగ వచ్చుచుండుటచేత కొంతకాలము మాత్రమే పనిచేసిన చేకురునని

ఊహించినవాడై రోజంతయు పాటుపడక కొంతవరకుమాత్రమే పనిచేసి ఊరకయుండవచ్చును. ఈరెంటిలో నేపద్ధతి నవలంబించినను, శ్రమానిపుణత పూర్వస్థితియందే యుండును.

## జీవనశైలిని అధికము చేయుట.

కావున కర్మకరులయొక్క ఆర్జన పాటవమును వృద్ధి చేయుటతో తృప్తినొందక, ఆవెంటనే వారు పూర్వముకంటె ఉత్కృష్టమగు శైలిని జీవనము నడుపుటకు ఉద్యుక్తులుగ జేయవలసి యున్నది. గొప్పగా బ్రతుకుట కలవడుట ఆరంభమయిన కొలదిని, పూర్వమువలెగాక నిత్యమును కావలసిన వస్తువుల సంఖ్య అధికమగుచుండును. వాంఛలదనమగుచున్న కొలదిని, హెచ్చుగా పాటుబడి ధనము నార్జించవలె నన్న ఆవశ్యకత స్ఫురించును. ఇయ్యది వారిపురోభి వృద్ధికి చాలతోడ్పడును. నాగరికత వ్యాపించుచున్న కొలదిని కోరికలధికమగుచుండుట మనము గమనించుచున్నాము. వాంఛాపూర్తికినై పాటుపడు నపుడు కౌశలమును, ఋజువర్తనమును, సకాలమునకు పని చేయుటకు వచ్చుటయు మొదలగు సుగుణము లలవడకమానవు. కాబట్టి ఆర్జనపాటవముతో పాటు, జీవనశైలిని సైతము అధికము చేయవలసియున్నది. లేనిచో నిష్ప్రయోజకమగుట యేగాక, పూర్వముకన్న దుర్విషయముల దవుల్కొనుటచే మరింత హీనస్థితికి కూడ వచ్చును. అటులగాకుండ కాపాడ వలసి యున్నది.

## యజమానులకునుకర్మకరులకును, అన్యోన్యతను పెంపుచేయుట.

యజమానులకును పనివాండ్రకును గల అన్యోన్య సంబంధమునకు హెచ్చుప్రాముఖ్యత నీయవలెను. యజమాని



యగువాడు కేవల ధనార్జనాసక్తితో కర్మకరులయెడల ప్రవర్తింపరాదు. కొంత పరమార్థ చింతను కలిగి వారల కష్టసుఖములను తనవిగా భావించి వర్తించుచుండవలెను. మంచివేతనముల నొసగుట, తగిన వాసయోగ్యమగు ఉనికిపట్టులను కర్మకరులకు ప్రసాదించుట మొదలుగాగల సదుపాయములను పనివాండ్రకు కలిగించుచు వారి జీవనములను గౌరవముగ జరుపుకొనుటకు సహాయము నొనర్చ వలసి యున్నది. మదరాసు దొరతనము వారిచే నియమింపబడిన నేత కళాదక్షుడగు (Weaving expert) యస్. సుబ్రహ్మణ్యఅయ్యరు బి.ఏ. గారు సూచించినటుల సర్కారువారు తామభివృద్ధిలోనికి గొనిరాదగు కళలకు తగిన సానుభూతినొసంగి మార్గదర్శకులు కావలసి యున్నది. ఆకళలు పూర్వపు పుంతలంబోక నూతన పథములం ద్రొక్కవలసి యున్నది. అది ఎట్లనిన, పనివాండ్రుకూడ లాభమునందు పాల్గొనుటకు వీలయ్యెడి పద్ధతిపైని క్రొత్తకళలను స్థాపించుట. కర్మకరులకుకూడ లాభమునందు వంతుదొరకు నట్లేర్పాటులు గావింపబడినపుడు, వారుసహజముగ మిక్కిలి శ్రద్ధతోను నిపుణతతోను కార్యముల నిర్వహింప బూనుదురు. లాభాపేక్ష ఎట్టిఛాందసునైనను విశేషశ్రమ తీసికొనునట్లు పురికొల్పక మానదు. ఈపద్ధతిని మనవ్యవహార నిర్మాతలు పరిశీలించవలసి యున్నది.

## వ్యవహార నిర్మాతల ఆవశ్యకత.

మన శ్రమావ్యవస్థయందలి నాలగవ లోపము- తగినవ్యవహార నిర్మాతలు లేకయుండుట. ఎంతకళా కౌశల

మున్నను, నడిపించు నాయకులు సమర్థులగువారు లేనియెడల ఆవ్యాపారమంతయు పాడువడుటయే గాక శ్రమ యంతయు నిరర్థకమగును. ఈలోపము వలననే, స్వదేశాభిమానము నూతనసోజ్జీవమును గల్గించుటచే స్థాపింపబడిన, వందలకొలది జాయంటుస్టాకు కంపెనీలు (సంభూయసముద్ధానములు) మూల వడుట ఎల్లరెరింగిన విషయమే. కళాచక్రమును సముద్ధరింప వలెననెడి భక్తి విశ్వాసములు గాఢముగ కలవారై ఎందరో వకీళ్ళు తగుమనుష్యులు చోదకులుగనుండి కంపెనీలను స్థాపన చేసిరి. కాని వీరికి పారిశ్రామికశిక్ష లేనిలోపముచే, శ్రమ యంతయు వృథయయ్యెను. వ్యవహార నిర్మాతల యావశ్యకత మనకు విస్తారముగ నున్నది.

## కర్మాగారములయందు అభ్యాసశిక్ష నొందవలసిన అగత్యము.

ఈలోపమును సముద్ధరించుటకు నేర్పాటులు చేయ బడుచునే యున్నవి. అనేకమంది యువకులు విదేశములకేగి పారిశ్రామిక కళలయందుత్తీర్ణు లగుటకు విద్యను గఱచు చున్నారు. పూర్వముకంటె ప్రస్తుతము విద్యార్థులకు గూడ శిల్పవిద్యలయం దభిరుచిగలుగుచున్నది. ఇదియంతయు ప్రశంస నీయమే. కాని ఒక్క సంగతిని మనము గ్రహించవలసి యున్నది. ఐరోపా అమెరికా జపానుదేశములకేగి శిల్పకళా శాలల (Teachnological schools) యందు విద్యనభ్యసించి నంత మాత్రముననే వ్యవహార నిర్మాతలు కాజాలరు. సర్ ఫ్రెడరికు నికల్సనుగారు హాలెండు పారిశ్రామిక పంచాయతీ యెదుట సూచించినట్లు పారిశ్రామిక విద్య కళాశాలలయందు అభ్యసించుట ప్రథమసోపానము వంటిది. కళాచక్రమునంతయు ధీ విశాలతతో నిర్వహించ గలుగుటకింకను కొన్ని దశలు గడువవలసి యున్నవి. విద్యపూర్తి అయిన వెంటనే ఒకకర్మా గారమునందు ప్రవేశించి అభ్యాసశిక్ష (Apprentice) నొంద వలసియున్నది. కర్మాగారములయందు అభ్యాసశిక్షను వడసిన గాని తామభ్యసించిన విద్యకును అభ్యాసమునకునుగల తారతమ్యమును, గ్రహింపజాలరు. పారిశ్రామిక మర్మములన్నియు కళాశాలలనుండియే గ్రహింప ననువుగాదు. అభ్యాసమువలన గాని సకలమును తెల్లముగాదు. ఈవిషయమునే సర్ దొరాబు తాతాగారు బొంబాయి నగరమునందు జరగిన పదునొకండవ కళాసభాయందు నొక్కి-వక్కా-ణించిరి. ఈపద్ధతి నవలంబించిన యెడల నిర్విఘ్నముగ కార్యములు సాధించగల వ్యవహార నిర్మాతలు బయలువెడలక పోరు.

ప్రతికక్షులు విరామములేక సాటుచున్నంత దుస్థితిలో మనశ్రమావ్యవస్థ లేదని పాఠకులు గమనించవలసి యున్నది. వలయు నవకాశము లమర్చినచో, సమర్థులగు కర్మకరు లీదేశ మున పెక్కు-లుందురని దృఢముగా చెప్పగలము.

## మూలధనము (Capital).

పరిశ్రామిక పురోభివృద్ధి కవసరములగు ప్రకృతి, శ్రమ, మూలధనములు మూటిలోను, మనదేశ పరిస్థితులయందు మూలధనమే అగ్రస్థానము నలంకరించుచున్నది. ఏలననిన మూలధన ప్రాబల్యము మనదేశమున లేకపోవుటవలన రత్న గర్భయనిపేరు గాంచినను, భరతవర్షము మూలధనము విష

యమున హీనదశయందుండుట కడు సంతాపకరము. ప్రస్తుత స్థితి ఎటులనున్నదో చర్చింతము.

## మూలధన మననేమి?

మూలధనమనగా దేశమునందలి ధన సంపదయని భ్రమించరాదు. పరిశ్రమలయందు పెట్టుబడి పెట్టుటకు ఎంత ధనము దేశమున అలవడునో దానినే మూలధనమందురు. దేశమున రత్నరాసులపారములుగ నున్నను ఆసంపద చేతిపనులను యంత్రకళలను ఉత్పత్తి చేయుటయందు తోడ్పడదేని పరిశ్రామిక విషయములపట్ల ఆదేశమును కడుబీదస్థితియందున్నదనియే పరిగణింపబడవలెను. అక్కరకురాని ధన సంచయము ఎంతయుండిన నేమిప్రయోజనము!

## దేశమునందలి మూలధనము.

మన దేశమునందలి ధనసంపద ఎంతయున్నను కళాచక్రమున నుపయోగించుటకు అలవడునది మాత్రము బహు స్వల్పము. ఈ విషయమున ఇతర దేశములకన్న మనదేశము వెనుకబడియున్నది. కోట్లకొలది ధనము మనదేశమున నగల క్రిందనో నాణెముల క్రిందనో పాతుపడియున్నదని ఒక ప్రతీతి కలదు. ఇది కొంతవరకు సత్యమేకాని, ప్రతికక్షులనుకొనునంత హెచ్చుస్థితిలో లేదని నిర్భయముగా చెప్పవచ్చును. కళాచక్రమున వినియోగింపబడకున్నను, దేశమునందంతధనము మూల్గుచున్న మనకీ హీనదశ కలిగియుండదు. బ్రిటిషుప్రభుత్వమువారు మనదేశమునకు రాకముందు మహమ్మదీయ పరిపాలనమున దేశమున శాంతి లేకపోవుటచే, ప్రజలు కొంత



వరకు ధనసంచయమును మరుగుపర్చ జొచ్చిరి. ప్రస్తుతము ఈ పద్ధతి అంతగా కాన్పించదు. నూతనాదర్శములను మన వారుకూడ గ్రహించుచున్నారు. అయినను తమ స్వగ్రామములకనతిదూరమున స్థాపింపబడిన పరిశ్రమలయందు ధనమున్ను పెట్టుబడి పెట్టుట కింకను మనదేశస్థులు జంకుచునేయున్నారు. బొంబాయి రాజధానియందు 1915-వ సంవత్సరమున, ఎన్నియో స్వదేశీబ్యాంకులు దివాలాతీసినవి. ఈ బ్యాంకులు దివాలాతీయుటవలన ప్రజలయందు నెమ్మదిగా అంకురించుచున్న విశ్వాసము తిరిగి సన్నగిలజొచ్చినది. తమ సొమ్మునకు సాధ్యమైనంతవరకు భయములేదని సంపూర్ణమైన నమ్మకము కలిగినగాని, పరిశ్రమలయందు ప్రజలు ధనమును పెట్టుబడి పెట్టుటకు ఇష్టపడరు. అయినను నిపుణులవలన బాగుగా పరిశోధింపబడి స్థాపితములైన కళలయందు, తమ ధనమును ప్రవేశపెట్టుటవలన లాభకరముగ నుండునని మనవారు గ్రహించుచున్నటుల సూచనలు పొడగట్టుచున్నవి.

## పరిశోధనయొక్క ఆవశ్యకత.

కళాదక్షులగు వారిచేత పూర్తిగ పరిశీలింపబడి, ఎచ్చోట నూతనపరిశ్రమల స్థాపించిన లాభకారిగ నుండునో ఆస్థలముననే నూతన పరిశ్రమలు స్థాపింపబడవలెను. పరిశోధనకగు ధనవ్యయమును, [illegible] మనదేశమునందలి సుప్రసిద్ధ వ్యవహా[illegible]ఖ్యాతినివడసిన సర్ జెమ్సెట్జీ తాతాగారు, ఎచ్చోట అయఃకర్మాగారమును స్థాపించిన జయప్రదముగ జరుగునోయని ఐరోపా అమెరి[illegible] దేశ

ములనుండి నిపుణులను రావించి దేశమునంతటను పరిశోధనలను గావించిరి. ఒరిస్సా రాష్ట్రమునందలి మార్భంజ సంస్థానమున కాలిమటియను ప్రదేశమున స్థాపించిన జయకరముగ నుండునని నిర్ణయింపబడినది. పరిశోధనల కొరకు లక్షరూప్యములవరకు టాటాగారు వ్యయపర్చిరి. ప్రతిఫలమును మనము కండ్లార జూచుచున్నాము.

టాటా అండుసన్సువారి అయః కర్మాగారమునకు వలయు మూలధనమంతయు మన దేశముననే చేకూరినది. ఈ మూలధన మంతయు మనదేశమున దొరకదని ఈ కంపెనీకి ఇంగ్లాండునందలి ధనమును సేకరింపదలచి, అచ్చటి ప్రజలనుకోరిరి. కాని అక్కడ వీరుచేసిన ప్రయత్నములు సఫలములుకాలేదు. ఈ కంపెనీ జయప్రదముగ జరుగదని ఆంగ్లప్రజ శంకించెనేమో? వారు శంకించుట మనకు శుభమైనది. దేశస్థులే వలయుమూలధనమునంతయు సమకూర్చిరి.

తరువాత లోనవ్లా కొండల యందొక విద్యుచ్ఛక్తి జనిత స్థానమును నిర్మించుటకై మరియొక కంపెనీ టాటా అండు సన్సువారి వలననే స్థాపింపబడెను. ఈ రెండు కంపెనీలకునుఆరుకోట్ల రూప్యములు మూలధనము కావలసివచ్చెను. ఈ ద్రవ్యమునంతను దేశస్థులే అను గ్రహించిరి. ఇటీవల ఈ రెండు కంపెనీలకును మూలధనము హెచ్చించ అడినది. యుద్ధపరిస్థితులవలన, ఈ ఆవేశనముల రెండింటిని విరివిచేసిన విస్తారము లాభము సంపాదించనగునని గ్రహింపబడినది. ఈ ద్రవ్యముకూడ దేశస్థులనుండియే సేకరింపబడి



నది. ఈ సందర్భమున స్వతంత్ర సంస్థానాధిపులగు బరోడా, మైసూరు, గ్వాలియరు, భావనగరు మహారాజులును, శ్రీ దర్భంగా మహారాజుగారును విశేషధనమును పెట్టుబడిపెట్టి తమ సానుభూతిని కనబర్చిరని వ్రాయుట కెంతయు సంతసముగానున్నది. ఈ మహాశయులు తమ స్వస్థానములయందలి కళలను పోషించుటకేగాక, బ్రిటిషు ఇండియాకు చెందిన మన కళాప్రపంచమునకుగూడ వారి సానుభూతిని కనబర్చుచుండుట భావి ఫలసూచకముగాని వేరొండుగాదు.

## పరపతి సంఘములయందు చేయవలసిన మార్పు.

విద్యాప్రవాహము దేశమున వెల్లి విరిసిన కొలదిని, వివాహములకును శ్రాద్ధములకును అమితమైన వ్యయమును చేయక మనదేశమునందలి ధన సంపదను పరిశ్రమలయందు వినియోగ పర్చవలెననెడి అభిరుచి ప్రజలకు కలుగకపోదు. మన దేశమున స్థాపితములైయున్న పరపతి సంఘములు (కో ఆపరేటివు క్రెడిటు సొసైటీలు) రానురాను వడ్డీనితగ్గించి, ధనమును కళాచక్రము ఆకర్షించునట్లుచేయుటకు వీలును కలిగించవచ్చును. పరపతి సంఘముల తాలూకు మూలధనమును నూటికి 75 వంతున గవర్నమెంటు ఋణపత్రములయందు నియోగించవలెనని చెన్నరాజధాని దొరతనమువారు మొదట తీర్పుచేసిరి. కాని ఇటీవల మనవారు ఈ తీర్మానమును రద్దు చేయవలెనని దొరతనమువారిని కోరగా కనీసపక్షము నూటికి 50-వ వంతైనను గవర్నమెంటు ఋణపత్రములయందుండి తీరవలయునని నిర్ణయించిరి. ఇటుల తీర్మానించుటవలని

నష్టము లెవ్వియనిన—మూలధనము చాలవరకు సర్కారు ఋణపత్రముల బడియుండుటచే మనకు వచ్చువడ్డీ చాల తక్కువయగుట అటుండగా, ఆధనము మన కళలయందు ఉపయోగము చేయుటకు వీలు చిక్కకున్నది. ఇది ఎంతనష్టదాయకమో చదువరు లూహించెదరుగాక. నూటికి 50-వ వంతున ఋణపత్రముల యందుంచవలెనని తీర్మానము చేసినను బ్యాంకి డిరెక్టరులకు అధమము అరవై లేక 65-వ వంతైన ఋణపత్రముల యందుంచుట బాగుండునని సర్క్యులరు జారీ చేసినట్లు వార్తాపత్రికలయందు ప్రచురమైనది. తీర్మానము ప్రకారము 50-వ వంతుకన్న అధికముగ, గవర్నమెంటు పత్రములుకొన నవసరము లేకుండ జేయునట్లు మదరాసు దొరతనమువారు చేయవలసియున్నది.

## భూములపై వడ్డీతగ్గించవలసిన అగత్యము.

నూటికి 18 లేక 24 రూపాయలవడ్డీ భూమితాకట్టుపైని వ్యాపారస్థులకు గిట్టుచున్నంతకాలము క్రొత్తగా స్థాపింపబడిన కళలనుండివచ్చెడి సామాన్యరాబడి, వీరిని ఆకర్షించజాలదు. రైతులకు భూమిపైని నూటికి ఆరురూపాలకన్న అదనముగాకుండ వడ్డీని గ్రహించరాదని సర్కారువారు తీర్మానించిన బాగుగనుండునని కొందరు మహాశయుల యభిప్రాయము. అటుల జేసినచో, ఋణదాతల బారినుండి రైతు విముక్తుడగుటయేగాక చాలధనము మనచేతిపనులకును యంత్రకళలకును వినియోగించుటకు లభ్యమగును.



## విదేశములనుండి మూలధనము గ్రహించవచ్చునా?

స్వదేశమున ధనముచేకూర నప్పుడు విదేశములనుండి గ్రహించవచ్చునా లేదాయని ఒకసమస్య:— ప్రస్తుతము ఈవిషయమునుగూర్చి అంతగా చర్చించవలసిన యగత్యము కాన్పించదు. ఏలనన, కోట్లకొలదిధనము ప్రతిదినమునను ఈమహాసంగ్రామము నోటబడుచున్నది. యుద్ధానంతరమున తిరిగి చాలకాలమువరకు ఐరోపా అమెరికాదేశ వాస్తవ్యులు ఇతరదేశములకు పెట్టుబడిపెట్టజాలరు. వారిదేశములకు వలయు ధనమును సేకరించుటయే దుర్లభముగానుండును. కావున మనకళావ్యాప్తికి అవసరమగుధనము మనదేశములనుండియే సమకూరవలసియున్నది. జేమ్సెట్జీ తాతాగారివలె ప్రథమమున కళాదక్షులరావించి పరిశోధనలు లెస్సగా సలుపుటయు, తగినవ్యవహారనిర్మాతలను నియమించుటయు మొదలగు ఉపాయముల వలన ప్రజలకు స్థాపింపబడబోవు నూతన పరిశ్రమలయొక్క ప్రయోజనమునందు గాఢవిశ్వాసములను కల్గించుటవిధి. నమ్మకమును కలుగజేసినచో, ధనసంచయము చేకూరక పోదు. పైనసూచించిన రెండు విధములలోను ఏమాత్రము లోపము చేసినను అందుధనమును పెట్టుబడిపెట్టిన భాగస్వాములకేగాక దేశమునకంతకును ఉపద్రవము తెచ్చినవారగుదురు. ఈవిషయములను వ్యవహార నిర్మాతలు జాగరూకతతో జ్ఞప్తియందుంచుకొన వలయును.



# విభజన.
# DISTRIBUTION.
## శిస్తు.

---

### భూముల పైసలాలు.

స్వదేశ సంస్థానములయందలి పైసలాపద్ధతులను గూర్చి మనము విచారించవలసిన అగత్యములేదు. హిందూదేశమునకు చెందియున్నను, ఇండియా దొరతనమువారితో ప్రత్యేకముగా ఒడంబడికలు చేసికొనుటవలన సంస్థానములయందలి ఏలుబడి విధానము లెటుల నున్నను బ్రిటిషు ఇండియాయందు నివసించెడి భారతీయులకు అంతగా ఉపచరించవు. కనుక బ్రిటిషు ప్రభుత్వమువారి సంపూర్ణపరిపాలనములోనున్న దేశమునందలి భూముల పైసలాలనుగూర్చి మాత్రమే ఇచట పొందుపరచుచున్నాము.

భూముల పైసలాపద్ధతులు మూడువిధములు :—

1. శాశ్వత పైసలాపద్ధతి. ఈపద్ధతి అన్నిటికంటెను ఉత్తమమైనది. ఈపద్ధతి వంగవిహారరాష్ట్రములయందును, సంయుక్తపరగణాలయందలి కాశీప్రాంతమునను చెన్నరాష్ట్రమునందలి గోదావరీ, మహానది మధ్యప్రాంతములయందును విరాజిల్లుచున్నది.

2. గ్రామపద్ధతి. దీనినే మహల్వారీ పద్ధతియని కూడ వాడుచుందురు. పంజాబు, సంయుక్తపరగణాలు ఈపద్ధతిని కలిగియున్నవి. అయోధ్యప్రాంతములయందలి గ్రామములు మాత్రము దొరతనమువారిచే స్వయముగ పైసలా కాబడక, తాలూకుదారులను మధ్య మనుష్యులద్వారా వ్యవహరించబడుచున్నవి. అయిన రహితుపై, తాలూకుదారునకు గల్ల అధికారము బహుస్వల్పము.

3. రైతువారీపద్ధతి. ఈపద్ధతి బొంబాయి, చెన్నపురి, సింధురాష్ట్రములయందు అమలులోనున్నది. ఈ పద్ధతియే ఆస్సాము, బర్మారాష్ట్రములయందు సైతము వాడుక చేయబడుచున్నది. వంగరాష్ట్రమునందలి తగుమాత్రము పర్వతప్రదేశములును, ఒరిస్సాయందలి సముద్రపుటొడ్డు భాగముకూడ శాశ్వతముగ పైసలా చేయబడలేదు.

మొత్తముపైని బ్రిటిషు ఇండియా యొక్క విస్తీర్ణములో 5-వ వంతు ప్రదేశమున శాశ్వత పైసలాపద్ధతి అమలులోనున్నది. ల్యాండు రివిన్యూలో (నేలపన్ను) నూటికి 53-వ వంతు మొదటి రెండు తరగతుల భూముల అమరకమునుండియును, 47-వ వంతు రైతువారీపద్ధతినుండియును వసూలగుచున్నది.

### శాశ్వతపైసలా పద్ధతి.

ప్రస్తుతము ఇండియాయందు జమీందారులు అనుపేర పిలువబడు నేలఖామందులు పెక్కులు గలరు. జమీందారులు అనగా పన్నులను వసూలుచేయువారనుట. ఈ నామము, మహమ్మదీయ పరిపాలనమునందు నేలపన్నును వసూలుచేసెడి ఉద్యోగస్తులకు ఒసంగబడెను. ఈ ఉద్యోగస్తులకు ముసల్మాను

ప్రభువుల ఏలుబడియందు భూములపై ఎవ్విధమైన హక్కును ఈయబడియుండలేదు. హైందవ పరిపాలనమునందు, దొరతనమువారికిని రైతులకును మధ్యగా క్షేత్రమునందు ఒకవిధమైన స్వాతంత్ర్యమును గలిగిన మధ్యవర్తులు ఉండెడివారు. సర్కారువారికి నియామకముగ చెల్లవలసిన పన్నును వీరు వసూలు చేయుచుండెడివారు.

1793 సం॥న కారన్వాలీసుప్రభువు బంగాళము నందలి జమీందారులకు, శాశ్వతపైసలాపద్ధతిని నెలకొల్పెను. ఒక చరిత్రాత్మకవిషయమును చదువరులు ఈతరుణమున గమనించవలసియున్నది. ఈపద్ధతి వంగదేశమునకు ఐశ్వర్యప్రదాయిగనున్న హేతువువలన కారన్వాలీసుప్రభువు వంగదేశస్థులకు లాభమును కలుగజేయవలెనను దృఢవిశ్వాసముతో ఇట్టిపద్ధతిని నెలకొల్పెనని పొరపడరాదు. కారన్వాలీసు ప్రభువునకు పూర్వము ప్రతిసాలునను భూములు ఏలము వేయుచుండుటయును, ఎవరు హెచ్చుసొమ్మునకు పాడుకొనిరో వారలకా సంవత్సరమునకు భూముల నొసంగుటయును ఆచారముగనుండెడిది. అందువలన సర్కారువారికి తరుచుగా తక్కువ ఆదాయమే లభ్యమగువచ్చెను. ఆకాలమున గంగానది వరదలవలన పంటలు విశేషము నష్టమగుచుండుటకూడ తటస్థించుచువచ్చెడిది. ఆనకట్టకట్టి నదీప్రవాహమును కేవలము సముద్రగామిగాకుండ, సస్యముల కనుకూలమగు తెరవున, కాలువలు త్రవ్వబడియుండలేదు. అట్టి పరిస్థితులలో కారన్వాలీసు ప్రభువు సర్కారు రాజస్వమును పెంపుచేయవలయుననియెడి ఉద్దేశ్యముతో శాశ్వత పైసలాపద్ధతిని ఆచరణములోనికి గొని



వచ్చెను. ఈపద్ధతి ప్రకారము నిర్ణయించబడిన శిస్తులు విపరీతముగా అధికమైనవి. సర్ జాన్ షోరు అను మహనీయుడు, ఇంత కఠినతరమగు పైసలాపద్ధతులను నెలకొల్పుట ప్రమాదజనకమని గంభీరముగా ఆక్షేపించెను. ప్రస్తుత వంగదేశ ఔన్నత్యమునకు కారణభూతమయ్యును, ఈ శాశ్వతపైసలా పద్ధతి ప్రథమమున కఠినతరముగ నుండెనని తెలిసికొనవలసియున్నది. కారన్ వాలీసు ప్రభువుయొక్క ఉద్దేశ్యము వంగదేశీయులకు ఉపకారము చేయవలెనని కాకపోయినను, తుదకు ఐశ్వర్యప్రదముగ పరిణమించినది.

జమీందారులను నేల ఖామందులుగ గ్రహించి, పుత్రపౌత్ర పారంపర్యముగ భూములను అనుభవించుటకును, విక్రయించుటకును తనఖా పెట్టుటకును గూడ హక్కునొసంగెను. అయిన నిర్ణీతమగు వాయిదానాటికి పన్ను చెల్లించక పోయినయెడల ఈ హక్కులు అన్నియును తొలగిపోవునట్లుగకూడ నిర్ణయించబడినది. సర్కారునకు చెల్లవలసినపన్ను సకాలమునందు వసూలగుటకై ఈషరతు చేర్చబడినది.

సర్కారువారికి ప్రతిసాలునను చెల్లించవలసిన శిస్తుమొత్తమును శాశ్వతముగా నిర్ణయించబడెను. ఈనియమిత మొత్తమును ప్రభుత్వమువారు ఎన్నడును హెచ్చుచేయరాదు. శిస్తుమొత్తమును చెల్లించుటయేగాక కొన్ని నిర్ణీతమైన పనులనుకూడ నెరవేర్చునట్లుగా షరతు ఏర్పర్చబడెను. 1870 సం॥ ఈ పనులు నిర్వహించుటకు బదులుగా కొంత హెచ్చుపన్ను చెల్లించునట్లు మార్పుచేయబడెను.

భూములయొక్క విస్తీర్ణమును శిస్తును తెలుపుచు జమీందారులు రయితులకు పట్టాల నొసంగునట్లుగా కూడ నిశ్చయించబడెను. ఈషరతు ప్రాయశః రయితులనుండి హెచ్చు సొమ్ము జమీందారులు సేకరించకుండ నుండుటకై చేసిన ఏర్పాటై యుండవచ్చును. పట్టాయందుశిస్తు నమోదు చేయనిచో, ఠాణాదారులు ఎంతసొమ్ము వసూలుచేసినను రయితు చెల్లించవలసియేయుండును. రైతుయొక్క క్షేమము నిమిత్తమై ఈషరతు విధించబడెను.

మరొకముఖ్యమైన షరతుకలదు. రైతుయొక్క హక్కులను మామూళ్ళను స్థిరపర్చు విషయమై దొరతనమువారి వలన జారీచేయబడు శాసనములకు జమీందారులు బద్ధులుగ నుండవలయును. రైతులను క్షోభ పెట్టకుండుటకునై సర్కారు వారు నిర్మించిన శాసనములకుకూడ జమీందారులు అనుకూల వర్తనులు కావలసియున్నది. మదరాసు ఎస్టేట్సు ల్యాండు ఆక్టు(1908) ఇందులకొక ఉదాహరణము. శిస్తునకు అదనముగా జమీందారువిధించెడి శుల్కములన్నియును తీసివేయబడెను. సరకులను ఒకతావునుండి మరియొకతావునకు గొనిపోవునపుడు (Transit duties) చెల్లించవలసిన పన్నులును రోడ్డుహాశీల్లును పడవహాశీళ్ళును సర్కారువారి ఆధీనముక్రిందనే యుంచబడెను. మార్కెటుహాశీల్లును, చేపలపన్నును (Fisheries) పోరంబోకు భూములనుండియు వృక్షములనుండియు వచ్చెడిఆదాయమును జమీందారులకు విడిచిపెట్టబడెను.

తాలూకు దార్లకు జమీందారులకుగల హోదా ఒసంగబడెను. వీరుప్రత్యేకముగా సర్కారువారికి చెల్లవలసిన నియామకపు శిస్తును చెల్లించవచ్చును. పెద్దజమీందారుద్వారా వారు వ్యవహరించవలసిన ఆవశ్యకత లేకుండ స్వాయముగా దొరతనమువారితో సంబంధమును కలిగియుండుటకు వీలేర్పర్చబడెను.

చెన్నపురి, ఒరిస్సా రాష్ట్రములయందలి పెక్కండ్రు చిన్న సంస్థానాధీశులకు వారికిగల స్వతంత్ర పాలనాధికారములను పూర్తిగాతగ్గించి జమీందారులకువలె నియామకపు నేలపన్నును చెల్లించవలసినట్లుగా ఏర్పర్చబడెను. వీరిహోదా జమీందారుయొక్క హోదాతో సరిపుచ్చబడెను.



## శాశ్వతపైసలాపద్ధతివలని నష్టములు.

ప్రతిసంవత్సరమును దొరతనమువారికి రాబడియందు 4½ కోట్లరూప్యములు నష్టమువచ్చుచున్నది. శాశ్వతముగ నిర్ణీతముకానిచో, జమీందారు లనుభవించుచున్న హెచ్చుశిస్తుపైకము సర్కారుకుచేరవలసి యుండును. ఈ 4½కోట్ల రూప్యములును శ్రమపడకుండ సంపాదించిన లాభముగ (Unearned increment) ఆర్థికశాస్త్రమునందు పరిగణించ బడుచున్నవి. శ్రమపడకుండ సంపాదించినలాభము నేలఖామందునకు చెందవలెననియు, బ్రిటిషుపాలకులు నేలఖామందులగుటచే, ఇండియా దొరతనమువారు, ఈధనసంచయమును రాబట్టుకొనుటకు అర్హులనియును, శాశ్వతపైసలాపద్ధతి ఇందులకు ప్రతికూలముగ నున్నదనియును కొందరిమతము.

రాజస్వమునందు అంతమొత్తము జమీందారుల వశమగుచుండుటవలన ఇండియాదొరతనమువారు పన్నులనధికము

చేయవలసి నట్టుగను, బంగాళము చెన్నరాష్ట్రములయందలి జమీందారులు లాభము ననుభవించుచుండగ ఆ హెచ్చు పన్నులను బ్రిటిషు ఇండియాయందు ఇతర ప్రజలెల్లరును చెల్లించవలసి వచ్చినట్లుగను సీటను—కార్, జోన్సు మొదలగు వారు వ్రాసిరి.

జమీందారులు తమవశమగుచున్న ధనమును సార్థక వ్యయమునందు ఉపయోగించక పోవుటవలన చాలనష్టము కలుగుచున్నది. తరుచుగా జమీందారులు స్వదేశ కళాప్రపంచమును తమ దృష్టిపథమును జేరనీయక ఏపట్టణ రాజములయందో కాలమును వెళ్లబుచ్చుచుండుట మనము కండ్లారగాంచుచున్నాము. వీరు చేసెడి వ్యయము చాలవరకు నిరర్థక వ్యయమే. కృషికళను పెంపుచేయుటగాని, విద్యావ్యాప్తికి శ్రమపడుటగాని జమీందారులు ఎరుగరు. ఇటీవల కొందరు జమీందారులు విద్యావ్యాప్తికి సహకారులగుచుండిరన్న సంగతి నిజమేకాని, ఇంకను వీరు చేయవలసిన కార్యములు పెక్కులుగలవు. రహితు వద్దనుండి ధనమును సేకరించుటయే తమ ముఖ్యకార్యముగ యోచించు జమీందారుల సంఖ్య ఇంకను తగ్గవలసి యున్నది. కృషికళావాణిజ్యములను పెంపు చేయుటకు సమర్థత కలిగియుండియును, వీరు ఆదరి జేరకుండుట కడు శోచనీయము. బంగాళమునందలి జమీందారులు చాలవరకు విద్యాధికులై దేశీయాదర్శములను చక్కగ గుర్తించినవారై పాటుపడుచున్నారు. చెన్నరాష్ట్రమునందు, ఇంకను అట్టిపరిస్థితి అలవడుటలేదు. ఇది చింతనీయమైనవిషయము. జమీందారులలో చాలవరకు, జమీను గ్రామములను విడిచి



పెట్టి ఏచెన్నపట్టణ నగరమునో వాసస్థానముగ చేసికొనుచుండుటవలన, అక్కడిరైతులయొక్క కష్టసుఖములను గుర్తించుటకు సైతము వీలుచిక్కక యున్నది. సార్థకవ్యయమును చేసినవారలై, దేశమును ప్రజలను సముద్ధరించవలసిన బాధ్యత జమీందారులకు కలదు.

## శాశ్వతపైసలా పద్ధతివలని లాభములు.

ఇక శాశ్వతపైసలా పద్ధతియందలి లాభములను పొందు పరచుచున్నాము. ముందు పేర్కొనబడిన నష్టములు మూడింటిని కప్పివేయగలుగు లాభములు ఈపద్ధతియందు గలవు. పాఠకులు ఈక్రిందిఫలితములను చక్కగ గమనించినచో, హిందూదేశమునందంతటను ఈపద్ధతి వ్యాప్తమై యున్న యెడల ఎంతసుకరముగ నుండునదియును చక్కగ గ్రహించగలరు.

సర్కారుకు ఏటేట చెల్లవలసిన శిస్తుపైకము మార్పు చెందకుండ నిశ్చయించబడెను. వేలము పద్ధతి యున్నచో ఒక వత్సరమున పెరుగుటయును ఒకసంవత్సరమున తగ్గుటయును కూడ కలుగుచుండును. నిర్ణీతమైన శిస్తు వసూలు కాదనియెడి భీతిలేదు. నియామక కాలమునకు పూర్తిగా రివిన్యూ చెల్లి తీరవలసియున్నది.

హిందూదేశము నందలి ఇతర ప్రాంతములయందు అనగా రైతువారీ పైసలా పద్ధతి అమలులోనున్న ప్రదేశములయందు పైసలాలు శాశ్వతముగ జేయబడని హేతువువలన రైతులకు ప్రతిపైసలా సమయముననుకలిగెడి కష్టనష్టములకు ఈపద్ధతి చోటిచ్చుటలేదు. అనగా, తరంవారీకట్టి శిస్తును నిర్ణ

యించెడి అధికారులబాధ శాశ్వత పైసలాపద్ధతిని కలిగియున్న రైతులకు లేదు.

సేవ్యపర్చక పోరంబోకుగా వదిలివేయబడిన ఎంతయో భూమిని జమీందారులు వ్యవసాయమునకు మరల్చిరి. భూమిని బాగుచేసినది రైతే అయినను, జమీందారుయొక్క సహాయమువలననే అట్టి పరిస్థితులు లభ్యమయ్యెను. జమీందారులను నేలఖామందులుగ సర్కారువారు అనుగ్రహించుటవలననే, ఇండియాయందలి ఇతరరాష్ట్రములకంటె బంగాళమునందలి క్రిందిభాగమున (Lower Bengal) క్రొత్తలగు గొప్ప కృషికళలు " స్థాపించబడెనని మెయినుగారు వ్రాక్రుచ్చియున్నారు. సర్కారు ఉద్యోగస్థులవలె తరుచు మార్పుజెందక జమీందారు స్వస్థానమున నుండువాడగుటచే కృషికళను పెంపుచేయుటయందు విశేష ఆసక్తి కలిగియుండుటకు కారణమగుచున్నది. సర్కారు ఉద్యోగస్థులు అంతగా శ్రద్ధతీసికొనుటకు అవకాశము లేదు.

విశేషసంపదను కలిగియున్న వారగుటచే జమీందారులు కృషికళాభివృద్ధికినై ఎంతధనము వెచ్చించవలసివచ్చినను సమర్థులగుచున్నారు. క్రొత్తక్రొత్త ఏర్పాటులనుచేసి వ్యవసాయకళను పెంపుచేయుటకు ధనవంతులగుటచే, జమీందారు లర్హులు. రైతులకట్టి మూలధనప్రాబల్యము చిక్కుట కడుదుర్లభము. సర్కారుకు చెల్లవలసిన కిస్తీ సకాలమున చెల్లించుటకే, ఎన్నియో కడగండ్లబడుచుండుట సామాన్యముగ సంభవించుచున్నది. విస్తారముగ కృషికళను పెంపుచేయుటకు శాశ్వతపైసలాలు కలిగిన ప్రాంతములయందే అనువగుచుండును.



క్షామదినములయందు ప్రజలకు సదుపాయమొనర్చుటకును, కఱవులచే అల్లాడుచున్న ప్రజల క్షుద్బాధనివారణముచేయు నిమిత్తమై ఆహారపదార్థములను ఆప్రాంతములకు గొనిపోవుటకును, కొన్నిపనులను కల్పించి జీవయాత్రనడుపుటకు అనువగు ఏర్పాటులను గావించుటకును పెద్దజమీందారులున్న ప్రాంతములయందు వీలేర్పడుననియును, గ్రామపద్ధతియును రైతువారీపద్ధతియును అమలులోనున్న ప్రాంతములయందుకంటె విశేషసౌకర్యమును కలుగజేయుటకు జమీందారులకు శక్తిగలదనియును సీటన్ కార్ గారు వ్రాసిరి. ప్రజలను బాగుచేయుటకుగాని చెరుపుటకుగాని జమీందారులకు విశేషశక్తికలదు. ప్రజలు తమ్మెంత బాధించినను తమ ఏలికగా పరిగణించి భృత్యతను కనబరచుచుండుటయే ఇందులకు తార్కాణము. మదరాసు ఎస్టేట్సుల్యాండు ఆక్టు రహితులకు సంపూర్ణ అధికారము నొసంగినను, జమీందారులు దైవసములుగ ఇంకను ఎన్నుకొనబడుచుండుటవలన, ప్రజలను సంరక్షించుటకును వారిమెప్పువడయుటకును వీరికిగలశక్తి వ్యక్తీకరించబడుచున్నది. దర్బారు ఉత్సవములకు వేనవేలుగ ప్రజలు మూగుచుండుట ఎల్లరెరింగియే యున్నారు. ధర్మకార్యములను విశేషముగచేసి ప్రజల మెప్పునువడయుటకు జమీందారులకు గలశక్తి విశేషము. ఈనీతులన్నియును స్వస్థానమున నివసించెడి జమీందారులకు మాత్రమే వర్తించును.

ప్రజలకును ప్రభుత్వమువారికిని మధ్యగా, రాజభక్తి కలిగిన జమీందారీబృందము శాశ్వత పైసలాపద్ధతి నెలకొల్పుటవలన ఉత్పన్నమయ్యెను. సిపాయిలముట్టడియందు వీరు

విశేషరాజభక్తిని కనబర్చినట్లు ఒక ఆంగ్లేయచరిత్రకారుడు వ్రాసియున్నాడు. రాజభక్తివిషయక మటుండ, దేశమునందంతటను ఆరోగ్య విద్యాభివృద్ధులకును, వాఙ్మయకళాపోషణమునకును క్షామపీడితులను దరిజేర్చుటకును జమీందారులు విశేష సహకారులైరన్న సంగతి నిర్వివాదాంశము. వేయేల ఆంధ్రవాఙ్మయాభివృద్ధికి, పూర్వకాలముననేమి, ప్రస్తుతముననేమి ఎందరు జమీందారులు తోడ్పడినదియును పాఠకులెరింగిన విషయమే.

శాశ్వతపైసలాపద్ధతి బంగాళమునకు మరియొకలాభమునుగూడ సమకూర్చెను. జమీందారులయొక్క ఆస్తి పంపకము చేయబడక ఒక్కపెద్ద కుమారుడే అనుభవించవలయునను నియమము ఆరాష్ట్రమునందు లేదు. కుమారులందరును సమభాగములను గ్రహించ నర్హులు. ఇందువలన కుటుంబములు వృద్ధియగుచు వచ్చినకొలదిని సామంతుల సంఖ్య అధికము కాజొచ్చెను. సామంతులసంఖ్య అధికమగుటవలన వీరు సామాన్యప్రజలతో కలసిమెలసి సంచరించుటకు వీలేర్పడుటయేగాక దేశీయ పురోభివృద్ధికి తోడ్పడుటకుకూడ అవకాశము చిక్కెను. వంగదేశపురోభివృద్ధికి, శాశ్వత పైసలాపద్ధతియే కారణమని నొక్కి చెప్పవచ్చును.

## మహల్వారీ లేక గ్రామపద్ధతి.

గ్రామపద్ధతి పంజాబు, సంయుక్త, మధ్య పరగణాలయందు అమలులోనున్నదని ఇదివరకే సూచించియున్నాము. గ్రామపద్ధతియందలి విశేషమేమనిన, సర్కారువారు గ్రామ



స్థులు యావన్మందితోను రాబడి నిర్ణయించుట. అనగా ఆయా గ్రామములకు చెల్లవలసిన రివిన్యూయొక్క జవాబుదారీ గ్రామస్థులందరును వహించియున్నారనుట. రివిన్యూ సకాలమున చెల్లనపుడు దొరతనమువారికి గ్రామస్థులలో ప్రత్యేకముగాకూడ ఎల్లరును బాధ్యులే. గ్రామమొత్తమునకు నిర్ణయించబడిన రాబడి చెల్లించుటకుగాను గ్రామయజమాని సంతకము చేసి దొరతనమువారికి ఒడంబడికను దాఖలుచేయును. తరువాత గ్రామములోని వారందరు తమలో తాము ప్రతి సాగుభూమికిని ఇంతింత శిస్తు చెల్లించవలయునని నిర్ణయించుకొందురు. కొందరు వంశపారంపర్యముగ తాము అనుభవించుచు వచ్చిన భూములను నిర్ణీతమైన శిస్తుచెల్లించెడి పద్ధతిపైని తమ యధీనముననే ఉంచుకొనియెదరు. గ్రామ పంచాయితీలు నిర్ణయించిన శిస్తులు సక్రమముగ ఉన్నదియును లేనిదియును, దొరతనమువారి, పైసలా ఉద్యోగస్తులు కనిపెట్టుచుందురు. గ్రామ పటములను, హక్కులను తెలియపర్చెడి లెక్కలను భద్రముగా దాచబడుచుండును. పైసలా స్థిరమైనదికాదని చదువరులు ఈవరకే గ్రహించియుందురు. సంయుక్తపరగణాలయందు ముప్పది సంవత్సరముల కొకతూరియును, పంజాబు మధ్యపరగణాలయందు ఇరువది సంవత్సరముల కొకసారియును పైసలాలు మార్పుజెందుచుండును. ప్రతి పైసలాయందును నిర్ణీతమైనశిస్తు తిరుగా పైసలాకాలము ఆసన్నమగువరకును మార్పుజెందక స్థిరముగనుండును. దొరతనమువారి పైసలా ఉద్యోగస్థులు భూములకు తరంవారికట్టి, ధాన్యాదులయొక్క ధరలనుబట్టియును సమీప ప్రాంతములయందలి భూముల

శిస్తునుబట్టియును చెల్లవలసిన శిస్తును నిర్ణయించుచుందురు. కఱవుదినములయందు, చెల్లించవలసిన రెవిన్యూ తగ్గించబడుచుండును. దీనినే "రిమిషను" అని మనరైతులు వాడుచుందురు.

గ్రామపద్ధతియందు సర్కారువారు రైతులతో ప్రత్యేకముగా అమరకములు నిశ్చయించుకొనకుండ, మధ్యమనుష్యులద్వారా వ్యవహరించుచుందురు. గ్రామయజమాని తన గ్రామమున కంతకును సంతకముచేసి ఒడంబడిక దాఖలు చేయుటనుగూర్చి వ్రాసియేయున్నాము. శ్రీయుత రమేశచంద్రదత్తు దేశబాంధవుడు, కర్జనుప్రభువు పరిపాలనమున తటస్థించిన ఘోరకాటక సమయమున నిర్భయముగా నేల పన్నునుగూర్చి వ్రాసినలేఖలు కొంతవరకు పైసలాపద్ధతులను మార్చజాలినవి. అంతకు పూర్వము సర్కారువారు సేకరించు రాబడి నూరింటతొంబదిపాళ్ళు. ప్రస్తుతముఏబదిపాళ్ళగను అంత కన్న తక్కువగనుకూడ నిర్ణీతమైనది. బొంబాయి రాష్ట్రమునమాత్రము సర్కారుగ్రహించగల శిస్తుపైకమునకు మితి ఏర్పర్చబడ లేదు. ఈ పైసలాయందు మరొక విశేషముకలదు. పైసలా అధికారి (Settlement Officer) చే నిశ్చయించబడిన శిస్తును తగ్గించవలయునని ఏ న్యాయస్థానమునను మొరపెట్టుటకు వీలులేదు. పైసలా అధికారితీర్పు కఠినతరమయ్యును, స్థిరత్వమును గాంచవలయునేగాని వేరుసాధనాంతరములు గానరావు. పైసలా అధికారి ఎంతన్యాయముగా పరిశీలించి శిస్తును నిర్ణయించినను, ఆ అధికారితీర్పు పై న్యాయస్థానమునకు విమర్శనాశక్తి నొసంగకుండుట చాల కష్టతరమని నిస్సంశయముగా చెప్పకతీరదు.



నిర్ణీతములైన శిస్తులను చెల్లించుటయేగాక రోడ్లకును, ధర్మ ఆసుపత్రులకును, విద్యాశాలలకును ఉపయోగించు నిమిత్తమై కొన్నిపన్నులు అదనముగ వసూలు చేయబడుచున్నవి. గ్రామయజమానులకును తలారులు మొదలగు వారికిని చెల్లించవలసిన జీతములకొరకుకూడ కొన్నిపన్నులు వసూలు చేయబడుచున్నవి.

అయోధ్యరాష్ట్రమునందు తాలూకుదార్లతో సర్కారువారు ఒడంబడికను చేసికొనుచున్నారని ఇదివరకే సూచించబడెను. గ్రామస్థుల మొత్తముపైని నిర్ణయించుటకు బదులుగా తాలూకుదారుతో ప్రత్యేకముగా దొరతనమువారు వ్యవహరించుచుందురు. తాలూకుదారులు సర్కారుకు చెల్లవలసిన యావత్తుపైకమును వసూలుచేసి, వసూలుచేయుటకగు ఖర్చులను, తాముశ్రమపడి పనిచేసినందులకును, జీవయాత్ర గడచుటకును తమగౌరవమును కాపాడుకొనుటకు దయచేయబడిన సొమ్మునినహాయించుకొనుటకు షరతుకలదు. తాలూకుదారునకును జమీందారునకును విశేషభేదము గలదు. తాలూకుదారులు ముస్తాదరులను బోలియుందురు. ముస్తాదరులు తాము చెల్లించెదమని ఒప్పుకొన్న పైకమును ఖామందులకు చెల్లించి శేషమును తమలాభముగ గ్రహించుచుందురు. ముస్తాదరులకు ఏ ఒకటి రెండుసంవత్సరములకో షరతు విధించబడి యుండును. తాలూకుదార్లవలె ఇరువది ముప్పది సంవత్సరముల వరకును వ్యవహరించ వీలులేదు. జమీందారులకువలె తాలూకుదార్లకు భూములయందు శాశ్వత హక్కులేదు.

## రైతువారి పద్ధతి.

బొంబాయి, సింధు మదరాసు రాష్ట్రములయందు ఈపద్ధతి అమలులో నున్నది. గ్రామపద్ధతి వలెను, శాశ్వత పైసలాపద్ధతివలెను మధ్యమనుష్యుల ద్వారా వ్యవహరించక, సర్కారువారు రైతులతో స్వయముగ వ్యవహరించుట ఈపద్ధతియందలి విశేషము. ప్రతిగ్రామమును చక్కగా సర్వేచేయబడి, ప్రతిరైతుయొక్క భూమియు గ్రామపటమునందు ప్రత్యేకముగా నిరూపింపబడుచున్నది. పైసలా ఉద్యోగస్థుడు రైతునకుగల హక్కులను తెలియపర్చుచు ఆ సామీవారీగా సేవ్యమునందున్న భూమివివరమును, సర్కారుకు చెల్లవలసిన పన్నులును, సరిహద్దులను తెలుపు పట్టాల నొసంగుటయే గాక అన్ని లెక్కలను భద్రపరచుచుందురు. చక్కగా వ్రాయబడియుండుటచేత, రైతులకు ఇతరులవలన అన్యాయము జరుగుటకు వీలుండదు. తగాయిదా వచ్చినప్పుడు, దొరతనమువారికి దరఖాస్తుచేసిన సరియైన హంశములను నకళ్ళను గ్రహించుటకు వీలున్నది. పట్టాభూములయందు రహితునకు స్వతంత్రహక్కులు ప్రసాదించబడెను. తన ఇష్టము వచ్చినవారికి భూములను మార్పించుటకును, అమ్ముకొనుటకునుగూడ రహితునకు హక్కుకలదు. తనతోనే పట్టాఅంతరించక పుత్రపౌత్ర పారంపర్యముగ, పట్టాభూములను అనుభవించుటకు రహితునకు హక్కుకలదు. ఇక రైతుయొక్క బాధ్యత ఎట్టిదనిన పైసలా కాలమునందు, నిర్ణయించబడిన శిస్తును సకాలమునకు చెల్లించుటమాత్రమే. సకాలమున శిస్తు పైకము చెలామణి చేయకపోయినయెడల జప్తికాబడి



ఏలము వేయబడును. సర్కారువారికి ఏరహితు సేవ్యమునందున్నను నష్టములేదు. నియామకపుశిస్తునకు అనుభవదారు బాధ్యుడైయేయుండును. ఇతరవిషయములయందు మహల్వారీపద్ధతినిపోలియే రైతువారి పైసలాకూడ ఉండును. ఆతీరుగనే ఇరువది సంవత్సరములకో ముప్పది సంవత్సరములకో ఒకసారి తిరుగాసర్వేకాబడి పైసలాచేయబడుచుండును. ముప్పది సంవత్సరముల కొకతూరి చెన్నరాష్ట్రమునందు పైసలా అగుచున్నది. పైసలా అధికారితీర్పునకు ప్రతిహతమేదియును లేదు. ఆతీర్పుప్రకారము అమలుజరిగి తీరవలసినదే.

ఈ సందర్భమున మదరాసు ఎస్టేట్సు ల్యాండు ఆక్టును గూర్చి కొంతవరకు ముచ్చటించుట సంభావ్యముగ గన్పట్టెడిని. ఈ శాసనము 1908-వ సంవత్సరమునందు జారీచేయబడినది. తొలుత ఈశాసనము రహితులపాలిటి కల్పతరువుగ ఎన్నుకొనబడినది. కాని రానురాను రహితులకు నష్టప్రదాయిగనున్నయటుల విషయమును పరిశీలించిన ఎల్లరును అభిప్రాయపడకతీరదు. ఇటీవల దొరతనమువారుకూడ ఈశాసనముయొక్క అమలు సంతృప్తికరముగలేదని ప్రకటించియున్నారు. రైతునకు భూమియందు స్వతంత్రహక్కును ప్రసాదించిన సంగతి సత్యమే. కాని ఈహక్కు లాభకరముగ పరిణమించుటకుమారు విప్లవకారియగుచున్నది. ఈ శాసనముక్రింద దాఖలుకాబడుచున్న వ్యాజ్యెములసంఖ్య విపరీతముగ పెరుగుచున్నది. స్టాంపుఖర్చులకును, వకీళ్ళఫీజులకును చక్కగా ఉపయోగపడుచున్నది.

యుద్ధానంతరమున ఈశాసనము తిరిగి సవరణచేయబడగలదు. జమీందారులకు కొంతవరకు అనుకూలముగనుండునట్లు మారవచ్చును. న్యాయస్థానములయందు విచారణ అలవడునట్లుగ సవరణచేయుట ముఖ్య ఆవశ్యకము. ప్రస్తుతమున చాలవరకు కలెక్టరులవలనను, రివిన్యూ బోర్డువారివలనను తగాయిదాలు తెగగొట్టబడుచున్నవి. ఉత్తమన్యాయస్థానమునకు వీరితీర్పులపై అధికార మొసంగబడలేదు.

స్థిరమగు పైసలాపద్ధతులు అలవడని కారణమువలన సంభవించెడి నష్టములు పెక్కులు. సర్కారువారి రాజస్వమును కొంతవరకు పెంపుచేయగలుగుటనుతప్ప, దేశీయ పురోభివృద్ధికి అనువగుమార్గములు అస్థిరపద్ధతివలన అలవడుటకు వీలుచిక్కకున్నది. ముఖ్యమైన నష్టములనుమాత్రమే ఈ దిగువ పొందుపర్చుచున్నాము:—

శాశ్వత పట్టారహితునకు ఒసగక పోవుటవలన, క్షేత్రమును అభివృద్ధిచేయవలయుననియెడి సంకల్పము కృషికుల మనంబుల నావరించుటకు వీలులేదు. విస్తారము మూలధనమును వెచ్చించి, తనసేద్యమునందున్న భూమిని రైతు సస్యాఢ్యగా చేసినచో, అందలి ఫలితము తనకు దక్కదుగదా యనుభీతి ఎల్లపుడు బాధించుచునేయుండును. పైసలాకాలము తిరుగా ఆసన్నమైనపుడు రహితు తన స్వాంతమూలధనమును వెచ్చించిచేసిన అభివృద్ధిపైనికూడ పైసలా అధికారులు శిస్తును పెంపుచేసెదరన్న విషయము సర్వకాలసర్వావస్థలయందును, కృషికుల మనోవీథిని తాండవమాడుచుండును. అట్టి పరిస్థితులలో క్షేత్రమును వృద్ధిచేయవలయునని రైతునకు ఉత్సాహము జనించదు. తాను వెచ్చించిన ధనమునకు తగినలబ్ధిదొరకునని తోచినప్పుడుకదా ఎట్టి వ్యాపారియైనను సాహసించును! అటులగానిచో కృషికళ స్వదేశమునందు చక్కగ వికసించుచున్నుట వట్టికల్ల.

పైసలా సమయము దగ్గరబడుచున్నకొలదిని, విశేషముగా పండుచున్నదని తోచినయెడల పైసలా అధికారులు శిస్తులను పెంపుచేయుదురనియెడి భీతివలన పైరులనుకూడ సరిగా పెట్టుటమానుదురు. పంటవలనిలాభము తక్కువగ గిట్టుచున్నట్లు అధికారులు గమనించవలయునని రైతులు ఇట్టి తంత్రములను పన్నుచుందురు. అందువలన కృషికళకు చాల నష్టము కలుగుచున్నది. తిరుగా పైసలా పూర్తి అగువరకును సరిగా సేద్యము జరుగదు. రహితునకు మనోశాంతి ఉండదనుమాట అటుండ పంటలు సరిగాపండకపోవుటవలన దేశమునకు కూడ నష్టము.

సర్కారువారు రైతులకు అనుగ్రహించు పట్టా భూములు విస్తీర్ణమున బహుస్వల్పములు. మొత్తము పైని అయిదు ఎకరములకు ఒకపట్టాక్రింద ఇచ్చుట ఆచారముగ నున్నది. క్రొత్తక్రొత్త పైరులను నెలకొల్పజేసి కృషికళను పెంపు చేయవలయునన్న సేద్యమునందున్న భూమియొక్క విస్తీర్ణము చాల హెచ్చుగనుండవలయును. లేనియెడల మూలధనమును వెచ్చించి నూతనవిధానమున వ్యవసాయము చేయుటకు గిట్టదు. ఇందులకొక ఉదాహరణము. యుద్ధపరిస్థితుల వలన స్వదేశమునందలి చెఱకు పంచదారకు గిరాకి అతిశ

యించెనన్న సంగతిని పాఠకులు గమనించియే యుందురు. నూతన విధానములను ఈపైరునునాటి పంచదారను తయారు చేయవలయుననిన అధమము ఏబది యకరముల భూమియైనను లభ్యమైనగాని వీలేర్పడదు. చెఱకుతోటలకు నీరు విశేషముగ అవసరమని ఎల్లరెరింగినదే. ఏతములతోను, మోటలతోను తృప్తినొందక గొప్పనూతులను త్రవ్వి యంత్రసాహాయ్యమున జలమును సస్యములకు పారించవలయునన్న పెక్కు ఎకరముల భూమి ఒక్కప్రదేశమున సాగుచేయుటకు అలవడినగాని గిట్టదు. పైరులయొక్క ఉత్పాదకశక్తులను నూతనవిధానముల నాచరించి, ఇనుమడింప నెంచినచో, సేద్యమునకు క్షేత్రము విస్తారముగ చిక్కుట ఆవశ్యకము. ఈ పద్ధతి అమలులోనున్నంత కాలము అట్టిపరిస్థితు లలవడుట దుర్లభము.

ప్రతి ఇరువది, ముప్పది సంవత్సరములకును పైసలాపూర్తియగుటకు దొరతనమువారికి విశేష ధనవ్యయమగుటయును, రైతులయొక్క మనోశాంతికి భంగము కలుగుటయును గూడ తటస్థించుచున్నవి.

రైతులకు జీవయాత్ర నడుపుకొనుటకు మాత్రము తగుమాత్రముగా విడిచిపెట్టబడి, మిగిలినదంతయును అమలులోనున్న పైసలాపద్ధతులవలన సర్కారు బొక్కసములను జేరుచున్నయది. ఈవిషయమున అధికారవర్గమునకు చెందిన వారికిని, సుప్రసిద్ధభారతీయ నాయకులకును అభిప్రాయభేదము కలదు. రాజస్వప్రకరణమునందు నేలపన్నునుగూర్చి వ్రాయునపుడు, ఈవిషయము విపులముగ చర్చించబడును.



ఈకారణములవలన చరస్వాభావికమగు (Temporary) పైసలాపద్ధతులు దేశీయపురోభివృద్ధికి అభ్యంతరములుగ నున్నవి. శాశ్వతపైసలాపద్ధతి భరతవర్షమునందంతటను నెలకొల్పబడినచో, ఒక్క కృషికళయేగాక సర్వకళలును విజృంభించుటకు అవకాశమున్నది.

### కర్మకరుల వేతనములు. (Wages.)

కర్మాగారములయందు పనిచేయుటకు వేతనముల నధికముగ నొసంగినను ఇండియాయందలి కర్మకరులుత్సాహమును జూపుటలేదని ప్రొఫెసరు లీస్మిత్తుగారు తమ గ్రంథము (India and the Tariff problem) నందు వ్రాసియున్నారు. ఇట్టి పరిస్థితులు అలవడుటకు గల ముఖ్యకారణములు రెండు:-విద్యాగంధము నెరుంగనివారగుటచే, నాగరికతగల దేశములలోని కర్మకరులవలె జీవయాత్ర నడపుటయందు అంతగా ధనము వెచ్చించరు. వీరికిగల వాంఛలు బహుస్వల్పము. వాంఛలధికమగుటయేకదా నాగరికతాలక్షణము. వాంఛలధికమగు కొలదిని విశేషశ్రమ తీసికొని పాటుపడి ధనము నార్జించవలసిన ఆవశ్యకత కలుగును. అట్టివాంఛలు స్వల్పమైనపుడు ఏపట్టెడు అన్నమో అంబలియో, గంజియో త్రాగుటకు దొరకిన యెడల తృప్తినొందుచుండుట తటస్థించును. అట్టివారలకు ధనాకర్షణమునందును ఆసక్తి అంతగాయుండదు. మరియొక ముఖ్యకారణము. హిందూదేశమునందలి కర్మకరులు తమ స్వగ్రామములను ఆలుబిడ్డలనుబాసి పాశ్చాత్యదేశములకుంబలె పట్నములంబట్టిపోరు. పట్నములయందు కొంతకాలము నివసించి కొంతసొమ్ము జాగ్రతపర్చుకొనిన వెంటనే స్వగ్రామము

లకు పోవుచుందురు. జన్మస్థానమును వీడి పోవుటయనిన మరణముతో సమానముగ నెంచుచుందురు. ధనమునే అపరదైవముగా పాశ్చాత్యులకువలె పూజించుట నెరుంగని వారగుటచే కూలి అధికముగ గిట్టుచున్నను తమకు అనుకూలముగ లేని పనులయందు శ్రమపడుట కిచ్ఛగించరు. అందువలననే బొగ్గుగనులను త్రవ్వుటకును, ఆస్సామువగైరా ప్రాంతములయందలి తేయాకు తోటలకును కర్మాగారములలో పనిచేయుటకును కర్మకరుల లభ్యమగుట కష్టసాధ్యమగుచున్నది. అయిన పూర్వమున్నంత అసూయత ఇపుడు గానవచ్చుటలేదు. క్రమముగా తగ్గుచున్నది. ఇట్టిదురవస్థను తొలగించుటకు ప్రారంభవిద్యను దేశమునందెల్లెడల బలవంతముగా ఎల్లరును అభ్యసించునట్లు శాసించబడవలయును. జీతములు వసూలుచేయకనే ప్రతిబాలునకును విద్యగరపవలసియున్నది. విద్యావ్యాప్తమగు కొలదిని పూర్వాచారములను వదలి పాశ్చాత్యసోదరులవలె ఇండియాయందలి కర్మకరులుకూడ పాటుపడ నిచ్ఛగింతురు. కొంచెము శిల్ప శిక్షణముకూడ అవసరము. వాంఛలను అధికముచేసిన వెంటనే ఎట్టిపనినైనను నిర్వహించి ధనాకర్షణమును చేయవలయుననియెడి కుతూహలము జనించకమానదు. ప్రతి కక్షులు హైందవ కర్మకరులకు నిపుణతయన నెట్టిదియో తెలియదని ఆరోపించెడు నెపములకు సైతము ఎడముండదు. నిపుణతలో ఒకరికి తీసిపోవువారు కారని రెండవప్రకరణమునందు సూచించియేయున్నాము.

కృషికళయందు నియమితులైన కర్మకరులకు వేతనములు నాణెముల రూపకముగగాక వస్తురూపకముగనే పెక్కు



తావులయందు ఒసంగబడుచుండుట ఆచారమైయున్నది. వ్యవసాయపు పనివాండ్రకు నెల జీతములు నగదుగాక ధాన్యరూపకమైయున్నవి. కోతల తరుణమునను కుప్పనూర్పులయదనునను కూలివాండ్రకు ఒసంగెడి కూలి పండిన పంటలలో నుండియే ఒసంగబడుచుండును.

కర్మకరులయొక్క విరివినిబట్టి వేతనములు పెరుగుచుండుటయును తగ్గుటయును కలుగుచుండునని ఆర్థికన్యాయము. ఈన్యాయము ఇండియాయందు సైతము వర్తించుచున్నది. కర్మకరులకు అయోమార్గములు, నీటికాలువలు మొదలగునవి నిర్మించునపుడు గిరాకి అతిశయముగ నుండును. అప్పుడు వేతనము లధికమగుటకలదు. యంత్రశాలలును, కర్మాగారములును అనేక నగర రాజములయందు నెలకొల్పబడుటచేతను, ఖనిజసంపద విస్తారముగా ఆకర్షించబడుచుండుటచేతను, కొన్నికొన్ని కళలు స్థాపింపబడి నిర్విఘ్నముగ జరుగుచుండుటవలనను, వేతనములు కొంతవరకు వృద్ధియయ్యెను. ఏకళయందలి కర్మకరులకు ఎంతెంత వృద్ధియైనదియును వాకొనుటకు తగిన సాధనాంతరంబు లలవడమి చింతసీయము. సరకులయొక్క వెలలు పెరుగుటనుబట్టి, వేతనములు పెరుగుచుండుట మాత్రము కానరాదు. విపరీతమైన కాటకములు పట్టినపుడు వేతనములు తగ్గుటకూడకలదు. ఆహారపదార్థములు అతిప్రియముగ అమ్మబడుచున్నను, వేతనములు తగ్గిపోవుట కలుగుచున్నది. ఏలననగా పంటలు నష్టమగుటవలన కృషికులకు భోజనమునకే కష్టము తటస్థించినప్పుడు, వేతనముల నిమిత్తమై విశేషముగ వెచ్చించనిష్టపడరు. పని

కొరకు వెతకుకొను కర్మకరులసంఖ్య అధికమగుటవలన కూలి తగ్గుచుండును. తిండికివలయునన్ని ధాన్యము దొరకిన కడుసంతోషముతో బనిచేయుటకు కూలివాండ్రిచ్ఛగింతురు.

ఇంపీరియలు గేజటీయరునందు బంగాళము, ఆస్సాము: పంజాబు రాష్ట్రములయందు వేతనములు ఈ క్రిందివిధముగా పెరిగినట్లు వ్రాయబడియున్నది:—

| | | బంగాళము. | ఆస్సాము. | పంజాబు. |
|---|---|---|---|---|
| కృషికళయందలి కూలివాండ్రకు | నూటికి | 39 వంతు | 41 | 49 |
| శిల్పులకు | | 48 | 65 | 50 |

చెన్నరాష్ట్రమునందును, మధ్య పరగణాలయందును కర్మకరుల వేతనములు ఇంతగా పెంపుజెందలేదు. నూటికి 6 మొదలు 15 కంటె అధికముకాలేదు. పైరాష్ట్రములయందు వేతనములు వృద్ధియగుట ఒకహంశమును స్పష్టీకరించుచున్నయది. కర్మకరుల వేతనములకును, ముఖ్యఆహార పదార్థమునకును గల సంబంధమును వెల్లడిచేయుచున్నది. పైరాష్ట్రములయందు వరి బియ్యము ముఖ్యఆహారపదార్థము. బియ్యముయొక్క ధర పెరుగుటచేత, వేతనములుకూడ వృద్ధియైనట్లు తేలుచున్నది.

వేతనములు ధాన్యరూపకముగ ఒసంగబడినప్పుడు సరకులయొక్క వెలలుపెరిగినను కూలివానిని బాధించవు. తనకు దొరకిన ధాన్యాదులను కొంతవరకు విక్రయించి లాభము సంపాదించిననేతప్ప, ధాన్యరూపకమగు వేతనములు కూలి



వానికి నష్టదాయకంబుగ పరిణమించును. పాశ్చాత్యదేశములలో వలె కర్మకరులు సమ్మెకట్టుట ఇండియాయందులేదు. ఇచట వేతనములు ఇంకను ఇదివరకు అమలులోనున్న పద్ధతిని అనుసరించియే చాలవరకు నిర్ణీతము లగుచున్నవి. కర్మకరులకు విద్యాదానము అత్యవసరము. హిందూదేశముయొక్క భావిస్థితి, నిపుణులగు కర్మకరులనుబట్టి యుండును. అట్టికర్మకరు లలవడనిచో ఇతర దేశములతో స్వదేశకళలు పోటీకి నిలచుట కష్టము.

భారతీయులు 1916-1917 సంవత్సరములో ఏయే వృత్తులయందు ఎందరు పనిచేయుచున్నదియును ఈ క్రిందిపట్టీవలన తెలియును.

| | |
|---|---|
| వ్యవసాయము | 22,46,95,900 |
| గనులుత్రవ్వుట మొదలగునవి | 2,33,44,192 |
| కళలయందు | 3,53,23,041 |
| వాణిజ్యము | 1,78,39,102 |
| ప్రభుత్వోద్యోగములు | 55,86,766 |
| విద్యాశాఖ | 53,25,357 |
| ఎగుమతి దిగుమతులయందు | 50,28,900 |
| ఇతరవృత్తులు | 1,72,86,678 |

## తేయాకు, నీలితోటలయందలి కూలీల కష్టములు.

తేయాకు, నీలివగైరా తోటలయందు పనిచేయుచున్న కర్మకరులనుగూర్చి ఒక్కింతవ్రాయుట సమంజసము. 1916-వ సంవత్సరమున లక్ష్మణపురమున (Lucknow) సమావేశమైన

దేశీయ మహాజనసభయందు మహాత్మగాంధిగారిని బేహారము నందలి ఐరోపియను తోట యజమానులు భారతీయులనెటుల ఆదరించుచున్నదియును విచారించవలసినదని ఒకతీర్మానము గావించబడెను. మహాత్మగాంధిగారు దక్షిణ ఆఫ్రికాయందలి భారతీయుల ఇక్కట్టులను బాపుటకు ఎంతకష్టనష్టములకు ఓర్చి నదియును చరిత్రాత్మకమైయున్నది. కొన్ని నెలలక్రిందట మోతీహారియందుగాంధిగారు విచారణచేయ నారంభించిరి. గాంధిగారు విచారణ ప్రారంభించెదరని తెలిసినవెంటనే ఐరోపియనుతోట యజమానులుజెందిన కలవరము వార్తాపత్రికలం జదివినవారి కెల్లరకును తెలిసియేయున్నది. మహాత్మగాంధీగారిని విచారణ చేయనీయకుండ తరిమివేయుటకై ఎన్నియో కుతంత్రములు పన్నబడినను విచారణ జయప్రదముగ జరిగినది. గాంధిగారు తమఅభిప్రాయమును బేహారుప్రభుత్వమువారికి నివేదనపత్రము నంపిరి. తోటయజమానులకు గౌరవముగా నివేదనపత్రముండి నట్లు కానరాదు. మదరాసుమెయిలు గాంధిగారిపై వ్రాసిన పిచ్చివ్రాతలకు సమాధానమిడుచు పోలకు మహాశయుడు "గాంధిగారి నివేదనపత్రమును వెల్లడిచేసినయెడల ఆసేతు హిమాచల పర్యంతమును హిందూదేశము అట్టుడికినట్లుడుకు"నని తెలియజేసెను. ఇందువలన ఐరోపియను తోటయజమానుల ప్రవర్తన సక్రమమైనదికాదనియును భారతీయులు పెక్కుకడగండ్లను గుడుచుచుండిరనియును స్పష్టమగుచున్నది. ప్రస్తుతము బేహారుస్థానిక ప్రభుత్వమువారు గాంధిమహాశయుని ఒకసభ్యునిగ నియమించి ఒకవిచారణ సభనేర్పర్చియున్నారు. దానివలన తోటయజమానులగుట్టు వీధిబడకమానదు. భార



తీయుల యెడల వీరు క్రమముగ వర్తించుటలేదని చెప్పకవీలు లేదు.

### ఒడంబడిక పద్ధతిపైని వలసపోవు కూలీలు.

ఇక ఒడంబడికె (కంట్రాక్టు) పద్ధతిపైనికూలీలను గొని పోవు పద్ధతినిగురించి కొంతవరకు విశదపర్చవలసి యున్నది. 1910 సం॥న గోఖలేమహాశయుడు సామ్రాజ్యశాసన నిర్మాణ సభయందు ఒడంబడిక పద్ధతిపై కూలీలను గొనిపోవుటను ఆపివేయవలసినదని ఒకతీర్మానమును ప్రతిపాదించెను. మూడు విషయములను ఈ సందర్భమున గమనించవలసి యున్నదని గోఖలేగారు వాక్రుచ్చిరి:—చాలకాలము క్రిందట ఆపివేయ బడిన బానిసపద్ధతిని ఈ ఒడంబడికపద్ధతి పునర్జీవికను జేయు చున్న విషయమొకటి.

ఇక రెండవవిషయము బానిస వృత్తినుండి ఇటీవలనే విముక్తులైన నీగ్రోజాతివాడు సైతము ఈపద్ధతిని నిరసించు చుండుట. నీగ్రోలునిరసించు పద్ధతిని స్వేచ్ఛగా సంచరించు చున్న ప్రజలకు కట్టిపెట్టుటమరియొకటి.

తోటయజమానుల బలవంతముపైని పునర్జీవికను జేయు చున్నను, అప్పటప్పట ఇండియా దొరతనమువారును, సామ్రాజ్య ప్రభుత్వమువారును ఈపద్ధతియందలి దోషములను విచారణవలన కనగొనినవారై, ఒడంబడికపద్ధతిని ఆపుచేయు చుండుటనుబట్టిగూడ సర్కారువారికి సైతము ఈపద్ధతి సమ్మతి లేనటుల తేలుచున్నది. ప్రజాప్రతినిధిసభయందు సైతము ఈ పద్ధతి ఒకసారి నిరసించబడినది; కాని తక్కువ మంది ప్రతి

నిధులు సమావేశమైయున్న యదనున తిరిగి మూలధన ప్రాబల్యాలే విజయమునుగాంచిరి.

ఈపద్ధతిని అమలులోనుంచరాదని వాక్రుచ్చుచు తమ వాదమును బలపర్చుకొనుటకునై గోఖలేగారు ఈక్రిందిఅయిదు కారణములను నుడివిరి:—

1. ఈపద్ధతిక్రింద విదేశములకేగు కూలివాండ్రుతొలుత తామేగుదేశస్థులయొక్క భాషనుగాని, ఆచారవ్యవహారములనుగాని ఎరుగనట్టియు, స్నేహితులుగాని బాంధవులుగాని ఇరుపార్శ్వములను లేని క్రొత్తవియగు దూరదేశములకు పనినిమిత్తమై పోవుటకు ఒడంబడికవ్రాసి ఇత్తురు.

2. అచట కేగినపిమ్మట తామెన్నడును ఎరుగని ఏయజమానివద్దనో పనికి కుదురునట్లుగ ఏర్పాట్లు గావింపబడును. యజమాని తమ్ముగాని తాము యజమానిని గాని అదివరకు ఎరుగకపోవుట అటుండగా, తమఇచ్చవచ్చిన యజమానివద్ద చేరి పనిచేయుటకునుగూడ వలనుపడదు.

3. యజమానియొక్క భూమియందే నివసించునట్లుగను, యజమానియొక్క సెలవుచీటిలేనిదే ఇతరప్రదేశములకు పోకుండునట్లుగను, నియమించబడిన పనులు ఎంత కాఠిన్యముగనున్ననుచేసి తీరవలసినట్లుగను ఒడంబడిక వ్రాసి కొనబడును.

4. ఒడంబడిక సాధారణముగా ఐదు సంవత్సరముల వరకు నిర్ణయమగును. నియమిత కాలములో షరతులకు వ్యతిరేకముగా తప్పించుకొనుటకు వీలులేదు. ఎన్ని కడగండ్లను గుడుచుచున్నను ఒడంబడిక ప్రకారము అమలుజరుగవలసినదే.



5. తాముపనిచేయ నియమితమైన సంవత్సరములలో చుట్టుప్రక్కల లభించుకూలికన్న, చాలతక్కువగా నిర్ణీతమైన కూలికి పనిచేయవలసి యున్నది.

పోయెడిప్రదేశములలో కూలివాండ్ర నడవడియందు ఏమైన లోపములువచ్చినయెడల ఏశిక్షాస్మృతి ననుసరించివారిని దండించెదరో ఆసంగతి తెలుపుటలేదు. అన్యభాషలో వలసపోవువారు వ్రాసియిచ్చు ఒడంబడిక షరతులకు ఏ స్వల్పలోపమువచ్చినను, శిక్షాస్మృతిప్రకారము శిక్షింపబడుచున్నారు. జర్మనీమొదలగు ఇతరదేశములయొక్క వలసరాజ్యములకు పోవుకూలీలను అట్టిస్వల్పలోపములకు శిక్షాస్మృతిప్రకారము దండించక న్యాయస్థానములలో విచారించబడుదురు. ఈవిషయము గోఖలేమహాశయుడు సామ్రాజ్యశాసన మహాసభలో గంభీరముగా వాక్రుచ్చెను.

ఈవిషయమునే 1916-సం॥నందు 'ఫిజి' దీవులకుబోయి అక్కడి వ్యవహారములను చూచివచ్చిన సి. యఫ్. ఆండ్రూసు, (Andrews) పియర్సను (Pearson) గార్లు తమ నివేదన పత్రమునందు ప్రచురించిరి. వీరి విచారణపత్రికను జదివిన ఏభారతీయునకును ఒడలుకంపించకమానదు. నూర్గురు మగవాండ్రకు నలువదేసి స్త్రీలచొప్పున వలసరాజ్యములకు పంపబడుచున్న సంగతిని దొరతనమువారే ఒప్పుకొనిరి. 4 లేక 5 గురు పురుషులకు ఒక్కొక్క స్త్రీయుండుటయును, అందువలన భారతనారీ

మణుల పాతివ్రత్యమునకు భంగకరమగుటయును చూచివచ్చిన ఆంద్రూసు, పియర్సనుగార్లు కంఠశోషణముగా నివేదించిరి. పంపబడిన స్త్రీలు సైతము చెడునడవడులకు అలవాటుపడిన వారుగనే ఉండుచువచ్చుట తటస్థించినది. నీతివిషయకమటుండ ఐరోపియను యజమానులు పెట్టుబాధలను సైరించజాలక ఎందరో బలవన్మరణముల పాలగుచున్నారు. ఈపద్ధతి వ్యాప్తమైయున్న ప్రదేశములయందు నివసించెడి భారతీయులందరును కూలీలుగనే పరిగణింపబడుచున్నారు. వారు ఏవృత్తియందున్నను వలసప్రజల దృక్పథమున హైన్యభావమునే కలిగియున్నారు. ఈపద్ధతి భారతీయజాతీయ గౌరవమునకు కళంకమును దెచ్చుచున్నది. త్వరలో రూపు మాపవలసియున్నది. ఇదివరకే కాలహరణమగుటచే ఇండియా దొరతనమువారు త్వరపడుటవిధి. హార్డింజిప్రభువు ఇండియాను వీడిపోవుటకుముందు ఒడంబడిక పద్ధతిని రూపుమాపెదమని వాగ్దానముచేసియున్నాడు. ఆంద్రూసు పియర్సనుగార్లు ఫిజీదీవులనుండి ఇండియాకు విచ్చేసిన తరువాతను, లక్షలకొలదిసభలు గావింపబడి ఈపద్ధతి గర్హ్యమైనదని తీర్మానములు గావింపబడినవి. పోలకు గారు [illegible] సంచరించి ప్రతి ముఖ్యపట్టణమునందును గావించిన గంభీరోపన్యాసములు చదువరులు గమనించియే యుందురు. కొందరు ప్రముఖులు చెల్మ్సుఫర్డు ప్రభువువారినిదర్శించి, హార్డింజి ప్రభువరేణ్యుని వాగ్దానమును అమలులోనికి గొనిరావలయునని నివేదించిరి. దర్శించబోయిన వారిలో కొందరు భారతనారీమణులుకూడ గలరు గవర్నరు జనరలుగారిచ్చిన సమాధానము సంతృప్తికరముగలేదు. ఇండియాకార్యదర్శియగు ఛాంబర్లెయినుగారు కూడ నిరసనభావమును జూపిరి.



1917 సం॥ ఏప్రియలు నెలయందు ఇంగ్లాండునందు సమావేశమైన సామ్రాజ్యయుద్ధ ఆంతరంగిక సభకు పంపబడిన ఇండియాప్రతినిధులు (ప్రభుత్వమువారిచే నెన్నుకొనబడినవారు) ఈపద్ధతినిగూర్చి ఒక పత్రమును దాఖలు చేసిరి. అది విచారణకు తేబడక, విషయవిమర్శనమునకై నియోగించబడిన సభవారికంపబడినది. మనప్రతినిధులు ఏమి తెలియపర్చినదియును, ప్రభుత్వమువారు ఎట్టి సానుభూతిని దానియెడల కనుబరచినదియును, తెలిసికొనవలసిన ముఖ్యులమగు మనకు తెలియపర్చలేదు. నియోజించినసభకు గాంధి, పోలకు, ఆంద్రూసు పియర్సను గార్లలో ఒకరినైనను అనుభవైకవేద్యులను సభ్యులుగ ఏర్పాటుచేయలేదు. ఇట్టి గూఢప్రవృత్తికి దొరతనమువారేల కడంగినదియును గోచరమగుట లేదు.

ఇది ఇట్లుండగా గవర్నరు జనరలుగారు దేశసంరక్షక శాసనము ననుసరించి ఇటీవల వలసబోవు పద్ధతిని నిలుపుచేసినందులకు భారతీయులు కృతజ్ఞులే. కాని పూర్తిగా నిలుపుచేయబడినదని ప్రకటించక, దేశసంరక్షక శాసనముక్రింద ఆపుచేసినట్లు ప్రకటించుట సంభావ్యముగలేదు. యుద్ధానంతరమునైనను ఈపద్ధతిని పునర్జీవికనుజేయ వలనుపడదు. భారతజాతీయ గౌరవమునకు కళంకము కలుగును. ప్రపంచమునందలి బానిసవృత్తిని తొలగించుటకునై ఘోరప్రయత్నములుసల్పిన ఇంగ్లాండుదేశము భారతీయుల యాత్మగౌరవమునకు భంగకరమగు నేర్పాట్లను తొలగించక మిన్నకుండుట పాడిగాదు.

యుద్ధపరిస్థితుల వలన బ్రిటిషు పాలకుల దృక్పథమునందు మార్పు కలిగినట్లు వినుచున్నాము. ఆమార్పు రాజకీయ విషయములయందు ఎటుల పరిణమించినను, భారతీయుల గౌరవమర్యాదలను నిలవబెట్టుటకునైన తోడ్పడి తీరవలెను.

## వడ్డీ (Interest).

ధనము క్రయసత్వమును గలదియయ్యును ఇతరవస్తువులతో పాటు (ఇదియుకూడ) ఒక పదార్థముగనే పరిగణించబడవలసియున్నది. ఇతర వస్తుసముదాయమునకు వర్తించు ఆర్థికన్యాయములు ధనమునకుగూడ సమముగ వర్తించును. ఏవస్తువైనను సమృద్ధిగా దేశమునం దమరియున్నయెడల, ఆ సరకునకు గిరాకి క్షీణించుచుండునన్న విషయము సామాన్య ఆర్థికన్యాయమే. రాశి తక్కువగనుండి, సరకుయొక్క అవసరము అధికమగుచో గిరాకి అతిశయించి మూల్యము హెచ్చుచుండును. ఈ న్యాయము ప్రకారమే వ్యాపారములయందు ఉపయోగించబడుటకునై దేశమునందు మూలధనము పుష్కలముగ నున్నయెడల వడ్డీ తక్కువగనుండును. అటులగాక ధనరాశి స్వల్పముగ చిక్కుచున్నయెడల వడ్డీ అధికమగుచుండును. వడ్డీ అధికమగుట ఈ ఒక్కవిషయమునుబట్టియే నిర్ణీతము కాకపోయినను, ఈ విషయమునకు మాత్రము హెచ్చు ప్రాముఖ్యతకలదు. అప్పుతీయువాని ఋజుమార్గ వర్తనమును బట్టియును, హామీనిబట్టియునుకూడ వడ్డీ నిర్ణీతమగుచుండును.

హిందూదేశమున మూలధన ప్రాబల్యము నాగరికతను గాంచిన ఇతరరాష్ట్రములతో సరిపోల్చిచూడ కడుహీనదశయం



దున్నదని రెండవ ప్రకరణమునందు సూచించియేయున్నాము. స్వతస్సిద్ధమగు ధనలోపమునకుతోడు, దొరతనమువారి రాజస్వనీతియును, నాణెముల చెలామణీనీతియును (Currency policy) మరింత సహాయభూతములగుచున్నవి. నిలవయున్న ధనరాసులును. (Cash balances) వినియోగము లేకుండ సర్కారువారి కోశాగారములయందు త్రుప్పు పట్టునట్లుగ పాతరవేయబడుచున్నవి. ఈ ధనసంచయమును దేశీయ బ్యాంకులకు ఒసంగినయెడల ఎంతయో అనుకూలముగనుండి యుండును. సర్కారువారికి నాణెముల ముద్రణములవలన అపారమైన లాభము వచ్చుచున్నది. ఈ లాభమునంతను బంగారుప్రమాణ (Gold standard reserve) నిధియను పేర ఇంగ్లాండునందు ప్రోగుచేయుటవలన ఇండియాకు కొంచెమైనను లాభము కలుగుటలేదు. ఇండియా కార్యదర్శిగారి సభయందు విశేషపలుకుబడిగల ఇంగ్లీషు బ్యాంకర్లకు చాలతక్కువ వడ్డీలకు ధనము లభించుచున్నది. ఇది ఎంతయు శోచనీయము. ఈ కారణముల వలన ఇండియాయందు నూటికి 6 మొదలు 10 వరకు వడ్డీ నిచ్చినగాని పెద్ద వ్యాపారములకు మూలధనము చిక్కుట లేదు. ఇంగ్లాండునందన్నచో 3 మొదలు 5 వరకు వడ్డీ నిచ్చిన యెడల అచటి వ్యాపారస్తులకు మూలధనము సులభముగ అలవడుచున్నది.

## ఇండియాయందు అధికవడ్డీలు.

సామాన్య వ్యాపారములయందు రైతునకు గావలసిన విత్తనములు, కూలిపనులు వగైరా పెట్టబడులకును, సర్కారు శిస్తు చెల్లించవలసియుదనునను, వడ్డీ విపరీతముగ చెల్లించ

వలసి వచ్చుచున్నదన్న సంగతి ఎల్లరెరింగియే యున్నారు. ఇందులకుగల ముఖ్యకారణము రైతుయొక్క అవసరము. ఈ సంగతిని షాహుకారు గమనించి విషమ షరతులను ఏర్పర్చి రైతునకు విశేషనష్టమును కలిగించుచున్నాడు. నూటికి నెలకు రెండురూపాయలు వడ్డీకి, సొమ్మిచ్చినయెడల రైతు అదృష్టవంతుడే. తరుచుగ, మూడు రూపాయల రెండణాలు వసూలు చేయుచుండును. నెలవడ్డీలు గాక కొన్ని ప్రాంతములయందు వారపువడ్డీలుకూడ ప్రబలముగ పీడించుచున్నవి. ఈ వడ్డీలు న్యాయముగ విధించబడుట లేదు. ఇతరమార్గము లేక ఎట్టి కడగండ్లకైననోర్చి బీదరైతులును సామాన్యస్థితిపరులును షాహుకార్లవలలో పడి చిక్కుపడుచున్నారు. షాహుకార్లు పెట్టుబడి పెట్టుటలో రెండువిధములుగలవు. వడ్డీకి సొమ్మునొసంగుటయేగాక విత్తనములకును, రైతుయొక్క సాదరునకును ధాన్యమునిచ్చుటకూడ కలదు. ఈ ధాన్యమునకు తిరిగి ద్విగుణముగా పంటలుపండిన తరువాత క్రొత్తధాన్యము వసూలుచేయుటకూడ కలదు. సాధారణముగా నూటికి ఏబదివంతున వడ్డీతో, వసూలు చేయబడుచుండును. దివాణపుశిస్తు చెల్లించవలసిన వాయిదా తటస్థమయినపుడు అప్పటి వరిపంటపైనిగాని, మరియే ఇతరపంటపైనిగాని, చాలతక్కువ ధరలకు తిరిగి ధాన్యములను కొలిచి అప్పగించెడి పద్ధతిపైని, అప్పు ఇచ్చుచుండుటకూడకలదు. కాలవశమున ఆ సంవత్సరము పంటలునష్టమైనచో తిరిగి క్రొత్తసంవత్సరపుపంటలకు వ్రాసికొనబడుచుండును. ఈ పద్ధతి సంప్రాప్తించినయెడల రైతు క్రుంగిపోవుట తటస్థించును. రెండు మూడు సంవత్సరములు ఈ



రీతిగ గతించినతరువాత భూమి వేలమువేయించి సాహుకారు తన స్వాధీనము చేసికొనుచుండును.

ఉన్నతన్యాయస్థానములయందు, నూటికి నెలకు రెండురూప్యములకన్న అదనముగ వడ్డీచెల్లించెదమని పత్రములో వ్రాసికొన్నను రద్దుచేయబడుచున్నవి. వారపు వాయిదాలు న్యాయశాస్త్రసమ్మతములుకావు. నెలకు నూటికి రెండురూపాయలు పైబడిన వడ్డీ చెల్లించనగత్యము లేదు. ఇండియాయందలి ఎల్ల ఉత్తమ న్యాయస్థానములును, ఈ విషయమున సమభావమును కలిగియున్నవి.

వడ్డీకివడ్డీ కట్టుచుండుట మనదేశమునందు సామాన్యముగ జరుగుచున్నది. ఈకారణమువలన సాధారణముగా ఋణముతీర్చుసరికి అసలుకంటె వడ్డియే అధికమగుచుండుటకూడ తటస్థించుచున్నది. కలకత్తా పట్టణమునందును, బొంబాయి రాజధానియందును 'దండూపట్' న్యాయము అమలులోనున్నది. ఈన్యాయప్రకారము వడ్డీఅసలును మించరాదని నిర్దేశించబడినది. ఈన్యాయము ఎంతయుక్తముగ నున్నదియును పాఠకులు గుర్తించగలరు. అసలునకుమించి వడ్డీఉండరాదన్న న్యాయము, ఈరెండుచోటులలో మాత్రమేవర్తించి, ఇతరప్రాంతములయందు వర్తించకుండుట ఆప్రాంతవాసుల దురదృష్టము దక్క వేరొండుగాదు. ఈన్యాయమును హిందూదేశమునకంతకును వర్తించునట్లుగ దొరతనమువారు శాసించుట సమంజసము. అటులగావించినయెడల చాలమంది ప్రజల ఇక్కట్టులను బాపినవారగుదురు.

బంగారు నగలయొక్కయు వెండినగలయొక్కయు హామీపైనిసైతము ఋణము లీయబడుచున్నవి. నగల హామీయున్నను మార్వాడీలు విధించుచున్న వడ్డీలు చాలహెచ్చుగనున్నవి. భూములతనఖా పైనికూడ కృషికళకు ధనమొసంగబడుచున్నది. ఇందలివిశేషమేమనిన స్వల్పకాలములోనే ఆఋణము తీర్మానముచేయవలసి యున్నదనియెడి షరతును కలిగియుండుటచేత, ప్రయోజనకారి యగుటకు మారుదుఃఖ భాజనమగుచున్నది. అప్పుతెచ్చినసొమ్ము, భూమిని అభివృద్ధిలోనికి గొనివచ్చుటకునై ఉపయోగించ వీలులేక యున్నది. ఏలయనిన అయిదారు సంవత్సరములు గడవున్నగాని క్షేత్రమునుండి మరమ్మతు వగైరాలుచేసి లబ్ధిని గ్రహించుటకు వీలుచిక్కదు. క్షేత్రముయొక్క అభివృద్ధి నిమిత్తమై వినియోగించబడని ఋణధనము నిష్ప్రయోజనము. వడ్డీని పెంపుచేయుటకుదక్క వేరొండు ప్రయోజనకారి కాజాలదు.

మారువాడీలకును సాహుకారులకునుతోడు, ఐరోపియను వ్యాపారస్థుల పాయకార్లును గుమస్తాలును రైతుయొక్క సంపదను కొల్లగొనుచున్నవారలు. ఇది ఒకతరహావడ్డీ వ్యాపారము. దీనిఫలితము, అన్యదేశీయులకు ఇండియాధనము జేరుటయే! గోగునార, నూనెగింజలు వగైరాలు పండక పూర్వము ఈపాయకార్లు (వ్యాపారస్థులయొక్క ఏజంట్లు) తగుమాత్రముగా సొమ్మునొసంగి, పంటలు తేలినవెంటనే రైతునకు లబ్ధిలేకుండ తక్కువధరలకు అపక్వపదార్థసంచయమును గ్రహించి, విదేశములకు ఎగుమతిచేసి అందలి విశేషలాభముల వలన ఈవ్యాపారస్థులు \ స్వల్పకాలములో లక్షలకొలది ధనమును ఆర్జించుచున్నారు.



ఇందులకొక యుదాహరణము. జూలైమాసమునందు గోగునారను సేద్యముచేయు నిమిత్తమై కృషికులు వ్యాపారస్థులయొద్ద బజానా (Advance) పుచ్చుకొనుచున్నారు. అక్టోబరునెలలో గోగునారను ఇచ్చెడిపద్ధతిమీద, ఈబజానా లొసంగబడుచున్నయవి. మణుగు (బంగాళాదేశపుమణుగు) నకు 9 మొదలు 10 రూప్యములు విలువగల గోగునారను 5 మొదలు 5½ రూప్యములు బజానాగా గ్రహించి ఐరోపియను వ్యాపారస్థులకు సమర్పించుచున్నారు. మణుగునకు ఏడురూప్యములు విలువగల సీమ అవిసెగింజలను అయిదురూప్యములు బజానా ఇచ్చియును, మూడునాలుగు నెలలలో వాపసుచేసెడి రెండున్నరరూప్యములు విలువగల ధాన్యమునకు ఒకటిన్నరరూపాయనిచ్చియును, అన్యదేశ వ్యాపారస్థులు స్వదేశమునందలి పంటలను కొల్లగొనుచున్నారు. ముందుగా సొమ్మునొసంగినందులకు కొంతవడ్డీ తగులుబడియైనను, ఈవ్యాపారస్థులు గ్రహించుచున్నలాభము అపారముగనున్నదనియొప్పుకొనక తీరదు. విశేషశ్రమపడి పండించిన పంటలయొక్కలాభము కృషికళకుజెందకవిదేశస్థుల నోటబడుచున్నది. పరపతిసంఘములు విచ్చలవిడిగ దేశమునందంతటను అమరినగాని, ఈదుస్థితి తొలగుమార్గము గాన్పింపదు. వినియోజకాన్యోన్య సంఘములును, ఉత్పత్తిసంఘములును విశేషముగా మనదేశమున వ్యాప్తము కావలసియున్నది.

### పరపతిసంఘముల ఆవశ్యకత.

ఇకపరపతి సంఘములనుగూర్చి విమర్శింతము. పరపతిసంఘములనుగూర్చి 1904 సం॥ ఇండియాదొరతనమువారు

ఒకచట్టమును జారీచేయించిరి. 1912-వ సం॥ న కొన్ని సవరణలు చేయబడెను. ఈ సంఘములు ప్రస్తుతము బాల్యావస్థయందున్నవి. ఇంకను విరివి కావలసిన యావశ్యకత కలదు. ఐరోపా ఖండమునందు సహకార సంఘములు విశేషప్రతిభనుకలిగియున్నవి. విశేషించి జర్మనీదేశమున విస్తారముగా, వ్యాపించి, ప్రజలకు అనేకవిధముల సహకారు లగుచున్నవి. ప్రభుసన్మానమును విశేషముగ, గలిగియున్నవగుటచేత ఐరోపాఖండమునందు ఈ ఉద్యమము విశేషవ్యాప్తినిగాంచి సకల విషయములయందును ప్రజలకు తోడ్పడుచున్నది. ఇండియాయందు ప్రభుసన్మానము ఏమియులేదని నిరూపించుట మా మతముకాదు. సర్కారువారు విశేషముగ ప్రోత్సాహము చేయవలసిన ఆవశ్యకత మనదేశమున విస్తారము. ఋణదాతల బారినుండి పేదరైతును తొలగించి క్షేత్రమునకును రైతునకును క్షేమముగూర్చుటకును, అన్యదేశీయులు స్వల్పమొత్తములను ముందుగానొసంగి పదార్థసంచయము నంతయును చౌకగా గ్రహించుటకు వీలలవడకుండ జేయుటకును సహకార సంఘములు అవశ్యములు. ఈసంఘములుపెరిగి విజృంభించుటకు దొరతనమువారి తోడ్పాటు మిక్కిలి అవసరము. సహకారసంఘములయొక్క మూలధనములో దొరతనము వారొసంగునది నూరింటనాలుగు పాళ్ళుమాత్రమే! యీసహాయము కొంతవరకు క్షేమకారియయ్యును బహుస్వల్పమని చెప్పక తప్పదు. ఆస్ట్రియా, హంగరీప్రభుత్వమువారు హంగరీల్యాండు క్రెడిటు బ్యాంకునకు ఒకమిలియను క్రౌనులను (క్రౌను 25 షిల్లింగులు అనగా మూడురూప్యముల నాలుగణాలు) వడ్డీలేకుండదయచేసిరి.



ఈబ్యాంకి కృషికుల ఉపయోగార్థమై ఏర్పర్చబడినది. ప్రభుసన్మానము విశేషముగ అలవడినగాని ఏదేశమందైనను ముఖ్యముగా ఇండియాయందు, ఇట్టి యుద్యమములు చక్కగా వ్యాప్తిని గాంచజాలవు. సహకార ప్రవృత్తివలన లభింపెడి లాభములను పాఠకు లెరింగియే యుందురు. సహకార సంఘములు దేశమందంతటను వ్యాపించియున్నయెడల వడ్డీ తగ్గగలదు. నూటికి రెండు రూపాయలు మొదలు మూడు రూపాయలవరకు వడ్డీ చెల్లించవలసిన అగత్యముండక, అర్థ రూపాయకో, పది అణాలకో వలయుధనము చిక్కుచుండును. క్రమముగా వడ్డీ ఇంకను తగ్గగలదు.

సహకార ప్రవృత్తి బహువిధములు. ప్రస్తుతము ఇండియాయందు అమలులోనున్న పద్ధతి, పరపతినొసంగుట ఒక్కటియే. కృషి విషయకమగు సహకార సంఘములును, వినియోజ కాన్యోన్య సంఘములును, సరకుల విక్రేత సహకార సంఘములును, వేయేల మానవకోటికి సంబంధించిన సర్వవ్యాపారములకును సహకార సంఘము అలవడుటవలన ప్రజలకును దేశమునకునుగూడ క్షేమకరము. నేతవిషయికమగు సహకార సంఘములు జయప్రదముగ జరుగుచున్నవని వ్రాయుటకు చాల సంతసముగానున్నది. సకలవ్యాపారములయందును సహకార సంఘములు స్థాపింపబడవలెను. ఇట్టి ఉద్యమములు విరివియగుటకు విద్యావ్యాసంగమును బాగుగ గలిగిన యువజనులయొక్కయు, నాయకులయొక్కయు ప్రోత్సాహము అత్యవసరము. విద్యాధికులు తటస్థముగ ఊరకున్నయెడల ప్రతికక్షులు మనయందు ఆరోపించు అపవాదములసంగతి

యటుండ, స్వదేశమునందలి కళలు అభివృద్ధిగాంచి భారతీయుల
గౌరవ ప్రతిప్రత్తులు నిల్చుటకునీలుచిక్కదు. విద్యాధికులమని
విర్రవీగక మన సోదరులగు కృషికులయొక్కయు, శిల్పులయొ
క్కయు, కర్మకరులయొక్కయు కష్టసుఖములను గుర్తించి, సర్వ
విధములవారికి సహాయులయినగాని, దేశముఅభివృద్ధిని గాంచ
జాలదు. దేశమునందలి ప్రజలెల్లరు సుఖులైనగదా, ఆదేశము
యొక్క ప్రతిభ ఇతరదేశముల వారివలన పొగడ్తనుగాంచును!
పాఠకమహాశయులు ఇందలి ప్రాశస్త్యమును గమనించినవా
రలై తమప్రాంతములయందు సహకారసంఘములు వేనవేలుగ
బయలు వెడలునట్లు పాటుపడుట మిక్కిలి ఆవశ్యకము. ప్రతి
గ్రామమునను ఒకసంఘముండి తీరవలయును.

## జిల్లా బ్యాంకులు.

పరపతి సంఘములకు విద్యాధికులయొక్కయు సామం
తులయొక్కయు ప్రోత్సాహము అవసరమని నిరూపించియే
యున్నాము. సంఘముల యొక్క ఏర్పాటులయందు కొన్ని
నియమములు మార్పును జెందవలసియున్నది. ప్రతిజిల్లాయం
దును, పరపతిసంఘముల నిమిత్తమై, ఒకసెంట్రలుబ్యాంకి ఉండి
తీరవలయును. సెంట్రలుబ్యాంకి అనగా ఆయాజిల్లాలయందలి
పరపతిసంఘముల కన్నిటికిని పెట్టుబడిపెట్టుటకునై నియోజింప
బడిన కొఠియనుట. ఈనిధి మూడుకార్యములను నిర్వర్తించు
నదిగ నుండవలయును:—

1. అడిగినవెంటనే వాపసుచేయు పద్ధతిపైని దానికి
సంబంధించియున్న సంఘములనుండి స్వల్పవడ్డీకి ధనమును



గ్రహించుచుండుట (డిపాజిట్లు). 2. ఆసంఘములకు ఋణము
నొసంగుట. 3. వానియొక్క లెక్కలను తనఖీచేసి ఆదాయ
వ్యయములను తేల్చి సలహా నొసంగుటయును సెంట్రలుబ్యాంకి
చేయుచుండవలయును. అటుల గావించుటవలన జిల్లాయందలి
సర్వసంఘములకును తగినసలహా చిక్కుచుండుటయేగాక
లెక్కలను తనిఖీ చేయుటకుగూడ విశేషధనము వ్యయము
చేయ నవసరములేదు. జిల్లామొత్తముపైని అన్యోన్యముకొంత
వరకు పెంపుజెంది, పరపతి వృద్ధియగుటకు వీలలవడుచుండును.
సెంట్రలు బ్యాంకి చేయుపని మరియొకటిగలదు. తనకు సంబం
ధించియున్న సంఘములయొక్క లెక్కలను ప్రకటించుచు
వచ్చుటచేత విద్యాధికులయొక్కయు సామంతులయొక్కయు
దృష్టిని ఆకర్షించుటకు వీలలవడునట్లు చేయగలదు. ఎట్టివ్యవ
హారమైనను జయప్రదముగ జరుగుచున్నయెడల ఇతరుల దృష్టి
పథమును అట్టివ్యాపారముల సరణికి మరల్చుటకు అనువగు
చుండును. సెంట్రలుబ్యాంకి చేయగలుగు ఘనకార్యము మరి
యొకటి గలదు. ప్రస్తుతము పరపతి సంఘములు ఇతర
జామీనుదార్ల జామీనుపైని ఋణము నొసంగుచున్నవి.
అట్లు ఒసంగబడెడి ఋణము అంతగా నుండదు. భూముల
తనఖాపైని ఋణము నొసంగుచో హెచ్చు ధనమును సంగ్ర
హించుటకు వీలుండును. క్షేత్రమును వృద్ధిచేయుటకు తగిన
యేర్పాట్లనుచేయుటకై హెచ్చుధనము అవసరము. భూముల
మరమ్మతులు చేయుటకును, నూతులువగైరా జలాశయము
లను నిర్మించి క్రొత్తపైరులను నాటుటకును క్రమమైన ఎరువు
లతో భూమిని సత్తువచేసి సేవ్యపర్చి లాభమును గ్రహించుట

కును స్వల్పకాలముచాలదు. వెంటనే అనగా స్వల్పకాలములో తీర్చెడిపద్ధతిపైని ఋణముతెచ్చి అమలు జరుపుటకు వీలు చిక్కదు. ఇరువది, ముప్పది సంవత్సరములవరకు షరతున్నగాని, ఋణముతెచ్చి భూములను అభివృద్ధి చేయుటవలన లాభముగిట్టదు. ఇంతకాలము వరకును సెంట్రలుబ్యాంకులు తమ తాలూకు మూలధనమును వినియోగించి ఓపిక పెట్టజాలవు. కనుక సెంట్రలు బ్యాంకులు డిబెంచరుల (బ్యాంకులయొక్క ఋణపత్రము) మూలముగ, మూలధనమును గ్రహించినవియై భూముల తనఖాపైని సొమ్మునొసంగుటకు వీలుగలిగియుండును. ఈపద్ధతి ఐరోపాఖండమునందలి ప్రషియా, బల్గేరియా, ఆస్ట్రియా, హంగేరీ దేశములయందు నిర్విఘ్నముగ జరుగుచున్నది. ఈ బ్యాంకులు విశేషసహకారులుగనున్నవని వేర వ్రాయబనిలేదు. పరిపతిసంఘములయొక్క సిఫారసులుపైనను, ఆ సంఘమునందలి సభ్యులజవాబుదారీ పైనను సెంట్రలు బ్యాంకుల జవాబుదారీపైనను ఋణము లొసంగబడుచున్నవి. సెంట్రలు బ్యాంకులు తమ జిల్లానుండియేగాక ఇతర ప్రాంతముల నుండిగూడ తక్కువవడ్డీలకు ధనమును గ్రహించగలవు. కనుక ప్రతి జిల్లాయందును, ఒక్కొక్క సెంట్రలుబ్యాంకి నెలకొల్పబడవలెను. భూముల తనఖాపైని ఋణము లొసంగుటనుకూడ కలిగియుండవలెను.

## రైఫీసనుపద్ధతి.

గ్రామ పరపతిసంఘములు బంగాళమునందు బేహారు (విహారరాష్ట్రము) నందును, బొంబాయి, మధ్యపరగణాలయందును రైఫీసన్ (Raiffesen) పద్ధతులపై నెలకొల్పబడి



నవి. రైఫీసన్ పద్ధతియందు సంఘములయందలి సభ్యులు కొన్ని భాగములను సొమ్ము వెచ్చించి కొనన గత్యము లేదు ; సంఘమునందలి అందరి సభ్యులు జవాబుదారీ పైని వ్యవహారము జరుగుచుండును. ఈ పద్ధతి బంగాళమునందు విశేష జయప్రదముగ జరుగుచున్నది. పంజాబు సంయుక్త రాష్ట్రములు, బర్మా రాష్ట్రములయందు ఈపద్ధతి కొంతమార్పును జెందియున్నది. చెన్నరాష్ట్రమునందుకూడ సభ్యులు కొన్ని భాగములను కొని తీరవలసినదిగనే యున్నది. భాగములు కొనవలసిన పద్ధతిప్రకారము పరపతి సంఘములు స్థాపింపబడుటవలన ఒక కీడు కలుగకమానదు. భాగములు కొన్నవారికి తప్ప ఇతరులకు ఈ సంఘములు పరపతి నొసంగవు. వ్యవహారము జయప్రదముగ జరుగుచున్న కొలదిని, నూతన సభ్యులను చేర్చుకొనుటకు సైతము ఈ సంఘములు పూనుకొనవు. సహకార ప్రవృత్తియొక్క ముఖ్యోద్దేశ్యము బీదసాదలనక సహాయము నపేక్షించు ఎల్లరకును సహాయము నొసంగుటయే అయియున్నది. అటులగానిచో సహకార ప్రవృత్తి యనునది నామమాత్రమే అగుచున్నది. జర్మనీదేశమునందు జయప్రదముగ అమలు జరుగుచున్న పద్ధతి ఇండియాయందుకూడ నిర్విఘ్నముగ జరుగగలదు. బంగాళమునందుకూడ ఈపద్ధతి సుకరముగనే అమలు జరుగుచున్నపుడు పంజాబు, బర్మా, సంయుక్తపరగణాలు, చెన్నరాష్ట్రము మొదలగు ప్రాంతములయందుకూడ లాభకారిగనేయుండునని వేరుగ చెప్పనక్కరలేదు. ఇండియా యందెల్లడల రైఫీసను పద్ధతి ప్రకారమే, గ్రామ పరపతి సంఘములు నెలకొల్పబడవలెను.

## విభజనసంఘములు.

ఈ సందర్భమున విభజన సంఘములను (Distributive societies) గూర్చికూడ కొంత వ్రాయవలసియున్నది. జీవయాత్ర నడపుటకు ఆవశ్యకములగు పదార్థములనెల్ల విభజన సంఘములు జాగ్రతపరచి సరఫరా చేయుచుండిన యెడల పెక్కులాభములు కలుగుచుండును. అందుత్తమమైన సరకులయొక్క నాణ్యతనుచూచి పరిశుభ్రమైన వస్తుసముదాయమును సేకరించుటకు వీలలవడుచుండును. సరకులయొక్క వెలలు కూడ తగ్గుటకు వీలున్నది. పాశ్చాత్య దేశములయందు విభజన సంఘములు పెక్కులుకలవు. ఈ సంఘములు ఆయాదేశములకు విశేష ప్రయోజనకారులుగా నున్నవి. సహకార ప్రవృత్తి సంఘములు, విద్యావ్యాపకములకును, కర్మకరులకు పనులు కల్పించుటకునుగూడ, స్విట్జర్లాండు ఇటలీదేశములయందు గలవు. ప్రతి విషయమునందును సహకార ప్రవృత్తి మార్గములు లాభకారులేయగును. ఈ సంఘములు వెల్లివిరిసినట్లుగ, స్వదేశమునందు వ్యాపించినగాని, మనకళల నెల్ల పీల్చి పిప్పిచేయుచున్న అధికవడ్డీలు తగ్గుటకు మార్గములేదు. అన్యదేశీయులు మన అపక్వపదార్థ సంచయమును కొల్లగొనుటకుగూడ వీలుచిక్కదు.

సహకార సంఘములవలని ఆర్థిక ఫలితములకంటె అన్యోన్యతను ఇనుమడింప జేయుటవలన సంఘమునకు కలిగెడి బలము వేయిరెట్లు అధికమైనది. సంఘబలమే దేశబలము. దేశము బలీయముగ నున్నయెడల ప్రజలు సుఖించుటకు వీలే



ర్పడును. పాఠకమహాశయులు సహకార సంఘములయొక్క ఆవశ్యకతను గ్రహించినవారలై, ఆంధ్రమండలమున ప్రతి గ్రామమునందును రైఫీసను పద్ధతిపైని సహకారసంఘములు స్థాపించుటకు తగిన ఏర్పాటులనుగావించి, ఆ ప్రాంతములయందలి ప్రజలను సంరక్షించవలసిన ఆవశ్యకత విశేషముగనున్నది.

## లాభము.

ఆంగ్లేయ ఆర్థిక శాస్త్రములననుసరించి ఈ విషయమునుగూడ కొంతవరకు చర్చించవలసియున్నది. స్వదేశమునందలి కళలు విజృంభించి వాణిజ్యవ్యాపారములు పెంపుగాంచినగాని, ఈవిషయచర్చ ఉపయోగకారి కాజాలదు. వ్యవహారములయందు ఖర్చులుపోను చిక్కెడిద్రవ్యములాభముగ పరిగణించబడును. వ్యవహారములనగా యంత్రకళలును హస్తకళలును స్థాపింపబడి, తయారుకాబడిన సరకులవిక్రయములనుట. ఎల్ల వ్యాపారములనుగూర్చి ఇచట చర్చించ తగవుగాదు.

లాభము మూడువిధములగు ద్రవ్యమునుచేరియున్నది:

i. మూలధనముయొక్క వడ్డీ.

ii. వ్యాపారమునందు నష్టము రాకుండ చేయబడిన భీమా (Insurance against Risk.)

iii. వ్యాపారమును నడిపించినందులకు, ఉద్యోగస్థునకు ఈయవలసిన ప్రతిఫలము.

స్వదేశ వ్యాపారములయందు మొదటిరెండువిధములగు ధనమును పెట్టుబడి పెట్టిన భాగస్వాములకు చెందుచున్నది. పెద్ద వ్యాపారములయందు వ్యవహారమును నడిపించుటకు

ప్రత్యేకముగా ఒక అధికారి నియమింపబడుచుండును. ఈ మూడు విధముల ధనమును ఒకరికే లభింపుటలేదు. ఇంగ్లాండు నందువలెగాక ఇండియాయందు కళానిర్మాణమునకునై వెచ్చించ నగత్యమగు మూలధనమునకు విశేషవడ్డీ ఒసంగవలసి యున్నదన్న సంగతి ఎల్లరెరింగినదే. కావున వ్యవహారములు జయప్రదముగ జరుగవలెనన్న విశేషలాభము అలవడినగాని గిట్టదు. భూముల తనఖాపైని విశేషద్రవ్యము జమీందారులు మొదలగువారు సేకరించుచుండుటచేత కళాప్రపంచమును సముద్ధరించుటకు చాలినంత మూలధనము అలవడుటలేదు. ధనాధికులకు ఋణములనొసంగి వడ్డీలను గ్రహించుటయే విశేష లాభకరముగ నున్నటుల కానవచ్చుచున్నది. అట్లుగానిచో, కళానిర్మాణమున తమధనమును వెచ్చించక ఊరకుండరు.

అపక్వపదార్థ సంచయమును విదేశములకు ఎగుమతి చేయుటవలన కలిగెడి లాభమును పూర్ణముగ మనవారు గ్రహించుటలేదు. ఏ హాల్వ్వెల్సను కంపెనీ నోటనో స్వదేశస్థులకు చెందవలసిన లాభము పడుచున్నది. మనవర్తకులు బస్తాకు ఒకకానివచ్చిన అదియే పదివేలుగ పరిగణించుచున్నంత వరకును, విదేశవ్యాపారులే విశేషలాభమును గ్రహించుచుందురు. ఏ దేశమునందు ఏ పదార్థమునకు గిరాకికలదో తెలిసికొనినవారలై, జడియక ఆయాదేశములకు సరకులను ఎగుమతిచేసి సంపూర్ణముగ లాభమును భారతీయులే గ్రహించవలసియున్నది.

---

# మారకము.

# EXCHANGE.

---

## హిందూదేశ నాణెములచరిత్ర.

మహమ్మదీయులు హిందూదేశమును జయించుటకు పూర్వమును, తరువాతకొంతకాలము వరకును పెద్దవ్యాపారములయందు బంగారునాణెములే చెలామణి యగుచుండెడివి. ఇప్పటికిసైతము మనవారు వరహాలు మాడలు అని లెక్కించుచుందురు. వెండినాణెములుకూడ ముద్రింపబడుచు వచ్చెను గాని బంగారుకంటె తక్కువ. చిల్లర వ్యాపారములలో ఉపయోగించుటకు రాగినాణెములుకూడ ముద్రింప బడుచుండెడివి. పల్లెటి గ్రామములయందు గవ్వలుకూడ వాడుకచేయబడుచువచ్చెను.

ఆల్టమషు అను ముసల్మాను సుల్తాను ఏలుబడియందు (1233 A.D.) తొలుత హిందూదేశమున వెండిరూప్యము ముద్రింపబడెను. ఈనాణెమునకు అప్పుడు టాంకా అనిపేరు. 1542 సం॥ ష[illegible]షా ఏలుబడియందు ఈనాణెమునకురూప్యము అనిపేరువచ్చెను. అప్పటినుండియు ప్రస్తుతమువలెనే రూప్యము 180 ధాన్యపుగింజల బరువు కలిగియున్నది. మొగలాయి చక్రవర్తుల పరిపాలనమునందు వెండినాణెములును బంగారునాణెములును స్వేచ్ఛగా ముద్రింపబడుచువచ్చినవి. లెక్కలన్నియు

రూప్యములలోనే లిఖింపబడుచు వచ్చెను; బంగారునాణెములు నజరులు, కప్పములు చెల్లించు సమయములయందు ఉపయోగింప బడుచుండెడివి. దక్షిణ హిందూస్థానమున మాత్రము 1818-వ సంవత్సరమువరకు, బంగారునాణెములే చెలామణియగు చుండెడివి. మహమ్మదీయ దండయాత్ర దక్షిణదేశమును, ఉత్తరహిందూస్థానమువలె బాధించక పోవుటచేత వెండినాణెములకు బదులుగా బంగారు నాణెములే చెలామణి అగుచుండుట తటస్థించెను. ఈస్టిండియా కంపెనీవారి వెండి నాణెములవలన, 1818 సంవత్సరమునుండియు బంగారు నాణెముల చెలామణి అడుగంటెను.

## నాణెముల చెలామణిస్థితి.

నాణెముల చెలామణిస్థితి ఎంత గందరగోళముగా నున్నదియును 1773-వ సం॥ హిందూదేశమున వాడుకలో నున్న నాణెములనుబట్టి గ్రహింపనగును. 139 రకముల బంగారు మొహర్లును, 61 విధముల వరహాలును (పగోడాలు) 556 తరగతుల వెండినాణెములును వీటికితోడు 214 తెగల విదేశ నాణెములును వాడుకలోనుండెడివి. భరతఖండమునకు అన్యదేశములతో వాణిజ్యవ్యాపారము లమితముగ నుండుట చేత, ముఖ్యముగా దక్షిణహిందూస్థానమున విదేశనాణెములు హెచ్చుగా వాడుకయందుండెడివి. ఇట్టిస్థితిలో ఈస్టిండియా కంపెనీవారు 1778 సం॥న కలకత్తాయందు రెండవ షాఆలము చక్రవర్తియొక్క పాలనమునందు సిక్కా రూపాయలను ముద్రించ నారంభించిరి.



1885 సం॥ నందు హిందూదేశమున కంతకును వెండిరూప్యమే, ఋణతీర్మానములకును, ఎల్ల వ్యాపారములకును చెలామణి యగునట్లుగ శాసించబడెను. ఇంతవరకును సర్కారువారు బంగారు, వెండినాణెములను రెండింటిని చెలామణియందుంచిన బాగుండునని ప్రయత్నములుసల్పెడివారు. 1835 సం॥ నుండియు వెండినాణెమునే, సర్కారుకు చెల్లవలసిన శిస్తుదస్తుఅకును ఋణతీర్మానములకును ప్రభుత్వమువారు ప్రమాణముగ అంగీకరించిరి. బంగారు నాణెములకును వెండి నాణెములకునుగల మారకపువిలువ వీరు నిర్ణయించలేదు. ఆనిర్ణయమును వ్యాపారులకే వదిలిపెట్టిరి. నాటినుండియు బంగారు మొహర్లును, వెండినాణెములును ఆంగ్లేయ ప్రభువులయొక్క చిహ్నములతో ముద్రింప నారంభింపబడెను. రూప్యమును మాత్రమే హిందూదేశమున చెలామణి నాణెముగా సర్కారువారు శాసించిరి. బంగారు నాణెములు అప్పటి బజారు ధర ప్రకారము సర్కారు కోశాగారములయందు చెలామణి యగుచు వచ్చెను.

1817 సంవత్సరమునుండియు, బంగారు వెండి నాణెములు స్వేచ్ఛగా సర్కారు టంకశాలలయందు ముద్రించుటకు ఏర్పాటులు చేయబడినవి. ఈపద్ధతి 1893 సం॥ వరకు అవిచ్ఛిన్నముగాజరిగెను. నాణెముల ముద్రణమువలని లాభమును ప్రజలే గ్రహించుచుండిరి. నాణెముల ముద్రణమువలన లాభము నెట్లు సంపాదించనగునని పాఠకులకు కొందరికి సందియముతోచ వచ్చును. రూప్యముయొక్క భారము 180 వడ్లగింజలయెత్తు ఉండవలయునని, ఇదివరకే సూచించి యుంటిమి. రూప్యము

నందుపయోగింపబడిన లోహమంతయును వెండికాదు. అందు 165 వడ్లగింజల యెత్తువెండియును 15 వడ్లగింజలయెత్తు టంకమును ఇమిడియున్నవి. ఈ టంకము ఎత్తు లోహము యొక్క విలువ నాణెముల ముద్రణమువలన లభ్యమగును. రూప్యములనువలయువారు టంకశాలల యొద్దికిపోయి, వెండి నొసంగుచో, వెండియొక్క విలువనుబట్టి రూప్యములు చిక్కుచుండెడివి. రూప్యముయొక్క విలువ రెండు షిల్లింగులుగ నుండెడిది.

అమెరికాయందును మరి ఇతరదేశములయందును వెండిగను లపరిమితముగ బయలుపడుటచే, వెండియొక్క విలువ, బంగారుతో సరిపోల్చిచూడ క్రమముగ క్షీణించనారంభించెను. ఒకసమయమునందు రెండు షిల్లింగులకుమారుగా, రూప్యముయొక్క విలువ ఒక్క షిల్లింగే అయ్యెను. అందువలన కాసు పదిరూపాయలు ఖరీదగుటకు మారు ఇరువది రూప్యములయ్యెను. సీమఖర్చులను (Home charges) పేర ఇండియాదొరతనమువారు సంవత్సరమునకు 18 మిలియన్ల పౌనులను ఇంగ్లాండుకు బంపవలసి యుండుటచేత, పూర్వముకంటె విశేషముగా రూప్యములను చెల్లించవలసిన యవస్థపట్టెను. వెండియొక్క విలువ తగ్గిపోవుటవలన సర్కారువారికి రెండుగత్యంతరములు కానవయ్యెను. సీమఖర్చులను ఇంగ్లాండునకు పంపునిమిత్తమై పన్నులను వృద్ధిచేసి ధనమునుసేకరించు పద్ధతియొకటి. రెండవది రూప్యముయొక్క విలువను అధికముచేయుట. హిందూదేశమున పన్నులను వృద్ధిచేయుట ప్రమాదజనకమని దొరతనమువారు గ్రహించిరి. కాబట్టిరూప్యముయొక్క మారకపు



విలువను అధికముచేయవలసిన గత్యంతరమొక్కటియే సర్కారువారికి కానవచ్చెను. కొంతకాలమువరకును ఇట్టి పరిస్థితులు అంతర్జాతీయ ఒడంబడికల (International agreements) వలన చేకూరునని వేచియుండిరి.

హెర్షలు పంచాయతి.

కాని అట్టిస్థితిలభించదని గమనించి 1893 సం॥న హెర్షెలు ప్రభువుయొక్క యాజమాన్యముక్రింద ఒకపంచాయతీ నియమింపబడినది. టంకశాలలో ప్రజలకు స్వేచ్ఛగా రూప్యములను ముద్రించియిచ్చుట ఆపివేయవలసిన దనియును, ప్రజలు బంగారును టంకశాలలకు గొనిపోయి రూప్యములనీయవలసినదని కోరుచో, ఒకవంతు బంగారునకు 15 రెట్ల చొప్పున రూప్యములను ముద్రించి టంకశాలలు సరఫరా చేయవలయుననియును ఈ పంచాయతీవారు తీర్మానించిరి. ఈపంచాయతీ తీర్మానములయొక్క సారాంశములను సంక్షేపముగా 1893 సం॥ జూను 7-వ తేదిని ఇండియా దొరతనము వారికి ఇండియా కార్యదర్శి గారంపిన తంతియందు పొందుపర్చబడియున్నది. ‘‘బంగారును ప్రమాణముగా గ్రహించి టంకశాలలను ముగింపుచేసెదమని, ఇండియా దొరతనము వారుచేసిన సిఫారసును ఈపంచాయతీవారు అంగీకరించిరి. ప్రజలఉపయోగము నిమిత్తమై టంకశాలలు మూసివేయబడినను, సర్కారువారు మాత్రము రూప్యమునకు పది పెన్సుల విలువచొప్పున నాణెములను ముద్రించుచునే యుందురనియును అటులజేయుట మారకమునందు విలువ అధికము కాకుండునట్లు చేయు నిమిత్తమనియును దొరతనమువారు ప్రకటించవలసిన

దని ఈసభవారు అభిప్రాయపడుచున్నారు." ఈ సిఫారసు యొక్క ఫలితము వెండియొక్క విలువపెరిగి 1893 సం॥ సరికి పైనజెప్పిన (రూప్యమునకు పదిపెన్సులు) రేటుప్రకారము బంగారు వెండి నాణెముల ధరలునిర్ధారణ చేయుటకు వీలు చిక్కెను. 1893-వ సం॥ మొదలుకొని 1897-వ సం॥ వరకు కొన్నిసమయములయందు మాత్రమే రూప్యములు ముద్రింపబడినవి.

## ఫౌలరు పంచాయతి.

హెర్షెలు పంచాయతీయొక్క పనిపూర్తిచేయుటకును మరికొన్ని ఇతరవిషయములను పరిశీలించుటకును 1898 సం॥ ఫౌలరు పంచాయతీయను పేరిట మరొక పంచాయతీ నియమింపబడెను. ఫౌలరుపంచాయతీ వారి తీర్మానములను పూర్ణముగా ఇండియాదొరతనమువారును, ఇండియా కార్యదర్శియును, ఆచరణములోనికితెచ్చియుండిన 1907-1913 సం॥ల మధ్య ఇండియా దొరతనమువారికి సంప్రాప్తించిన చిక్కులు తటస్థించకనే పోయెను. ఈ పంచాయతివారి తీర్మానముల యొక్క సారాంశము:—బంగారును వెండికిమారుగా ఇండియాయందు ప్రమాణముగ అంగీకరించి తీరవలెననియును, బంగారునాణెములను స్వేచ్ఛగా ముద్రించుటకుగాను టంకశాలలు నెలకొల్పబడవలయుననియును తీర్మానించిరి. వెండి నాణెములను ముద్రించు విషయమునమాత్రము, స్వేచ్ఛకు మారుగా సర్కారు యాజమాన్యముక్రింద నడిపించవలెనని అభిప్రాయపడిరి.



ఈపంచాయితివారి అభిప్రాయమున వెండినాణెముల ముద్రణమునందు ప్రజలకు స్వేచ్ఛయొసంగక సర్కారువారి కట్టుబాట్లకు లోనైయుండవలసినట్లు తీర్మానించబడినది. నాణెముల ముద్రణమువలన లభించిన లాభమునుచేర్చి ఒకనిధి (బంగారునిధి) ని నెలకొల్పవలసినట్లుగాకూడ నిశ్చయించబడినది. పాఠకమహాశయులు గమనించవలసిన ముఖ్యవిషయము ఇండియాయందు బంగారురూకల చెలామణియును, బంగారు నాణెములు ముద్రించుటకు ఒక టంకశాలయును ఉండి తీరవలసినదిగా నిర్దేశింపబడినది. కాని ఇప్పటివలె బంగారును మాటసామ్యమునకు ప్రమాణముగ నంగీకరించి, బంగారు నాణెముల చెలామణిలేకుండ జేయుట ఈపంచాయతీవారి సన్మానమును వడయలేదు.

## పంచాయతీల సిఫారసులను గవర్నమెంటు అమలులో పెట్టకపోవుట.

గవర్నరు జనరలుగారికి ఇండియాకార్యదర్శి 1890 సం॥ జూలై 25-వ తేదీని వ్రాసిన ఉత్తరమునందు (Despatch) వెండినాణెములను ప్రమాణముగ అంగీకరించుటకు సాధ్యముకాదని ఫౌలరు పంచాయితీ వారొసంగిన తీర్మానము తమ ఆమోదమును వడసినట్లు ఖండితముగా వ్రాక్రుచ్చిరి. పంచాయితీవారి తీర్మానములను ఎవ్విధమైన అనుమానమును లేకుండ అమలులోనికి గొనివచ్చుటకు తగిన ఏర్పాటులను చేయవలసినదని కోరిరి. ఈ ఉద్దేశ్యముతోనే ఇంగ్లాండునందు చెలామణియగుచున్న సవరనును (పెద్దకాసు) సర్కారువారు ఎల్లవిష

యములయందును ప్రమాణముగ అంగీకరించ వలయునని యును, హిందూదేశమున సవరనునే వాడుకలో నుండు నట్లుగ శాసించవలయుననియును ఇండియాకార్యదర్శి సిఫారసు చేసెను. "బంగారు నాణెములను ముద్రింపించు కొనుటకు ఎవ్విధమైన అభ్యంతరములు లేకుండ టంకశాలలు ప్రజలకు ఉపయోగము నిమిత్తమై విడిచిపెట్టబడ వలయునని" ఈఉత్తరమునందు వ్రాయబడెను. వెండి నాణెములను టంకశాలలయందు కొన్ని నియమములకు లోబడి ముద్రించుటకు మాత్రము సర్కారు వారంగీకరించిరి. ఇంగ్లాండు దేశమునుండి ఇండియాదేశమునకు దిగుమతి యగు వస్తువులయొక్క విలువను చెల్లించుటలో ఇంగ్లీషు బ్యాంకులహుండీలు కొనుటకంటె రూప్యములను రవాణా చేయుటయే లాభముగా నుండునని తోచినపుడు, ఆరూప్యములకు బదులు సమాన విలువగల బంగారును బంగారుప్రమాణ నిధులనుండి ఇచ్చుచుండవలెనని ఇండియా కార్యదర్శి తెలియపరచెను.

ఫౌలరు పంచాయితీయొక్క తీర్మానముల నామోదించియు వాటిని ఆచరణములోనికి ఇండియా దొరతనమువారు గొనిరాకుండుట కడువిచారకరము. ధనము నిలవయున్నపుడెట్లు వ్యవహరించవలయు ననువిషయము ఆలోచించ వలసియున్నది. నిలవయున్న ధనమును పన్నులు తగ్గించు విషయమునగాని, లేదా ఆరోగ్య విద్యావిషయికములగు ప్రజోపకరములైన పనుల నిమిత్తమై వెచ్చించుటగాని చేయవలసినదని ఫౌలరు పంచాయితీవారి అభిప్రాయము. అటుల చేయుటమాని ప్రభుత్వమువారు అజ్ఞానముచే ఆవరింపబడి యున్న రైతునకువలె, సర్కారు కోశాగారములయందు బంగారును ఎవ్విధమైన ఉపయోగమునకును కొనిరాకుండ పాతర వేయుటగాని, లేదా "వర్తకముయొక్క సులువు" నిమిత్తమను నెపమున ఇంగ్లాండునందు నిలవచేయుటనుగాని, చేయుచున్నారు. నిలవయున్న ధనము 1907 సం॥ వరకు 46 మిలియన్ల పౌనులకు పెరిగినది. ఇంగ్లాండునందలి బ్యాంకరులు కౌన్సిలు హుండీలను కొనుట కలవాటు పడిరనియును, ఆహేతువు వలన ఈపద్ధతి ఉంచితీర వలయుననియును సర్కారువారు సమాధానము నిచ్చుచున్నారు. 1913 సంవత్సరము నందు నెలకొల్పబడిన ఛాంబర్లెయిను సభవారు, కౌన్సిలు హుండీలు తరుచుగా వర్తక వ్యాపారముల కనవసరమగు సమయముల సైతము విక్రయింపబడుచు వచ్చెనని, ఒప్పుకొనక తప్పినదికాదు. ఈపద్ధతి నవలంబించుట వలన, ద్రవ్యము ఎప్పుడు అత్యవసరమో అట్టి సమయములయందు దొరకుట కష్టముగానున్నది. అందువలన హిందూదేశముయొక్క ద్రవ్యము దేశాభివృద్ధికి తోడ్పడుటలేదు.



## కౌన్సిలుహుండీల అమ్మకమననేమి.

ప్రతిబుధవారమును ఇండియా కార్యదర్శి ఈహుండీలను అమ్ముచుండును. హుండీలనగా బొంబాయి, మదరాసు, కలకత్తా గవర్నమెంటు కోశాగారములపై ఇవ్వబడిన ఆజ్ఞాపత్రములు కౌన్సిలు హుండీలను ఈకోశాగారముల ఎదుట దాఖలు చేసిన ఎడల సొమ్ము ఇవ్వబడును. కౌన్సిలు హుండీలయొక్క ఖరీదును, లండనునందు సరకులను కొనిన వ్యాపారస్తులు చెల్లించవలసిన బంగారును ఇండియా కార్యదర్శి గ్రహించుచుండును.

కౌన్సిలు హుండీలను తపాలా ద్వారా పంపుటకు ఒక పక్షము దినములు పట్టునని ఎంచి, త్వరగా నున్న యెడల తంతిమూలముగా కూడ మార్చబడుచు వచ్చుచున్నవి. కౌన్సిలు హుండీల విలువకంటె కొంచెము సొమ్ము అధికముగా ఇచ్చినయెడల తంతిమూలముగా పంపబడును. ప్రతి బుధవారమును చేయుచున్న అమ్మకములు చాలనట్లు, అప్పుడప్పుడు నిజమైన అవసరముల నిమిత్తముగాని, మరెందులకైనగాని, ప్రత్యేకవేలములుగూడ వేయుట తటస్థించుచుండును. ఈప్రత్యేక వేలములయందు ఇండియా కార్యదర్శిగారు చాల తక్కువ ధరలకు హుండీలను విక్రయించు చుందురు. ఈవేలములయందు ఇవ్వబడిన హుండీలు బంగారు ప్రమాణ నిధికిని, బ్యాంకినోట్ల నిధికిని ఇవ్వబడుచుండును. ఈహుండీలు తరుచు బంగారును ఎగుమతి చేయుటకగు ఖర్చుకంటె సైతము తక్కువగా విక్రయింపబడు చుండుటచేత, హిందూదేశమునుండి విశేష బంగారము పరదేశయాత్ర వెడలుట తటస్థించుచున్నది.

## పంచాయతీ తీర్మానములను అమలు చేయనందువలసి నష్టములు.

ఫౌలరు పంచాయితీవారు బంగారును చెలామణి నాణ్యముగా అంగీకరించ వలయునని తీర్మానించినను ఇండియా దొరతనమువారు ఆతీర్మానమును ఆచరణములోనికి గొనిరాకుండుట విషాదకరము. 1904—1908 సంవత్సరముల మధ్య, నలభై మిలియన్ల పౌనుల విలువగల రూప్యములను ముద్రించిరి. వాడుకలోనున్న నాణెములలో బంగారుకంటె వెండి నాణె



ములు మూడురెట్లు అధికముగ వాడబడుచున్నవి. సుమారు 180 కోట్ల రూప్యములు ప్రస్తుతము వాడుకయందున్నవి. ఇటులజేయుట, ఫౌలరు పంచాయితీవారి సిఫారసులకు వ్యతిరేకము. ఇది ఇంతటితో పూర్తికాలేదు. ఫౌలరు పంచాయితీవారు బంగారు నాణెములను ఇండియాలోనే చేయవలసినదని తీర్మానించిరి. సర్కారువారికి అటుల చేయుటకు వీలు లేనియెడల నాణెములను ముద్రించుటవలన దొరతనమువారికి లభించుచున్న లాభమును ఇండియాయందే బంగారు నిధిగా కూర్చినచో, మారకమున కెంతయో సహాయకారిగా నుండియుండును. ఈ లాభమునంతను హిందూదేశమున నుంచక లండను నగరమున నద్దీపత్రముల మూలకముగ (Securities) నుంచబడినది. ఇండియాదేశమున, తగినంత బంగారును నిలవచేయక పోవుట సరిగదా, 4 మిలియన్ల పౌనులు వెండినాణెములయందు నిలవ చేయబడుచున్నది. నాణెముల చెలామణి పద్ధతిసరిగా అమలు జరుప బడనందున, ఇంగ్లాండునం దుంచబడుచున్న బంగారు ప్రమాణ నిధియందలి సగముధనము ఇనుపదారుల వ్యయము క్రింద 1906-1907 సంవత్సరములయందు వినియోగించబడెను. సామ్రాజ్యశాసన నిర్మాణసభయందలి దేశీయ ప్రతినిధులు ఈ అన్యాయమునుగూర్చి ఎంతయో ఉద్ఘోషించిరి. ఇట్టి పద్ధతి నవలంబించుటవలన 1907 సం॥ నందు అమెరికా దేశమున సంభవించిన ధనక్షోభము వలన (Monetary crisis) మన ప్రభుత్వమువారు చాల చికాకు పడవలసివచ్చెను. ఇండియా కార్యదర్శిగారి హుండీలు చెల్లక పోవుట తటస్థించెను. హార్డింజి ప్రభువరేణ్యుడును, కోశాగారమంత్రియగు సర్ గై ఫ్లీటువుడ్

విల్సనుగారును ఫౌలరు పంచాయితీ తీర్మానములను పూర్ణముగా ఆచరణములోనికి గొని రావలసియున్నదని వ్రాక్రుచ్చిరి. 1913 సంవత్సరమునందు గవర్నరు జనరలుగారు టంకశాలలు బాహాటముగా ప్రజల ఉపయోగమునిమిత్తమై యుంచవలయునని ప్రబలవాదనను సల్పిరి.

తిరిగి నాణెముల ముద్రణ ప్రారంభము.

ఇంతవరకు హెర్షెలు, ఫౌలరు పంచాయితీల తీర్మానములును, దొరతనమువారు ఆతీర్మానముల యెడల ఎట్టి సానుభూతిని కనబరచినదియును చర్చింపబడినది. 1900 సం॥ నుండి నాణెముల ముద్రణ తిరిగి ఆరంభమయినది. బ్యాంకి నోట్ల నిధి (Paper currency) యందుంచబడిన బంగారుతో వెండినికొని సర్కారువారు రూప్యములను ముద్రించుటకు ఆరంభించిరి. 1910 సం॥ మార్చి 31-వ తేదీ సరికి సర్కారువారు ముద్రించిన రూప్యములు సుమారు 17 కోట్లు రూప్యముల ముద్రణము వలన దొరతనము వారికి విశేషముగ లాభము లభించుచున్న దన్న సంగతి ఎల్లరెరింగినదే. ఈలాభముతో మారకమునందు కలుగుచుండెడి విలువయొక్క తేడాలను సవరించుటకుగాను 1901-వ సం॥ నందు ఒక బంగారు నిధి (Gold reserve fund) నెలకొల్పబడియెను. 1906-వ సంవత్సరమునందు ఈలాభములో 6 కోట్ల రూప్యములు ఇండియా యందుంచుటకు తీర్మానించబడెను. నాటినుండియు ఈనిధి 'బంగారుప్రమాణనిధి' యనుపేర బరగుచున్నది. 1907-వ సం॥ నందు ఈనిధియందలి ధనములో చెరిసగము ఇనుపదారులకునై వ్యయపర్చబడెనని ఈవరకే ముచ్చటించితిమి. 1906-1907 సంవత్సరముల మధ్య ఇండియా దొరతనమువారి నాణెముల ఉత్పత్తి పద్ధతి (Currency policy) హ్రస్వదృష్టిని కలిగినదియై, క్రమముగా నుండలేదని, అధికార వర్గమును పొగడు కీన్సు (Keynes) సైతము ఒప్పుకొనక తీరినదికాదు. ఈనిధి యందు 1908-సంవత్సరాంతమున 18 కోట్ల రూప్యములవరకు వెండి పెరిగినది. 1913-వ సంవత్సరాంతమునకు 'బంగారు ప్రమాణనిధి' యందుంచబడిన ద్రవ్యము 22,571,333 పౌనులు. ఈనిధిని ఇంగ్లండునందు నెలకొల్పుటచేత, ఇండియా దేశమునకు విశేషనష్టము కలుగుచున్నది.



ఛాంబర్లెయిను పంచాయతీ.

ఛాంబర్లెయిను (1913) సభవారు బంగారు ప్రమాణ నిధి యందలి, వెండికోశాగారమును తీసివేసి, ఈనిధియందలి రూప్యములను బ్యాంకినోట్ల నిధికి మార్చవలయునని అభిప్రాయము నొసంగిరి. ప్రస్తుతము ఈనిధి బంగారును, బంగారు హామీగల పత్రములను (Gold securities) కలిగి యున్నది. ఛాంబర్లెయిను సభవారుకూడ బంగారునే పెంపొందించ నుంకించుట చేత ఈవిషయమున యుద్ధము సంప్రాప్తించక పోయిన చో గొప్పమార్పులు జరిగియుండును. అయినను ఈనిధియందలి వెండినాణెములు పంచాయితీవారి తీర్మానము ప్రకారమే బ్యాంకినోట్లనిధికి మార్చబడినవి. అందువలన ఈనిధియందలి ధనమంతయు బంగారుక్రిందగాని, బంగారు హామీగల పత్రముల క్రిందగాని ఉండుట తటస్థించినది. 1915 సంవత్సరాంతమునకు (అనగా 31 మార్చి ఆఖరుకు) ఈనిధియొక్క విలువ

$25\frac{1}{2}$ మిలియన్ల పౌనులు ; అందు సగము బంగారు పత్రముల* క్రిందను, ఒకకోటి డెబ్బది లక్షుల రూప్యములు బంగారు రూపకముగను ఇంగ్లండునందుంచబడెను; శేషించిన ధనములో ఇండియాయందు $5\frac{1}{4}$ మిలియన్ల పౌనులు బంగారు నాణెములుగను, 7 మిలియన్ల పౌనులు ఇండియా కోశాగారముల నిలవ నిమిత్తమును ఉంచబడినవి. ఇంగ్లాండునందు బంగారు-పత్రములక్రింద నుంచబడిన ధనము ఇటీవల ఇంగ్లీషు యుద్ధ ఋణముగ మార్చబడినది.

## బ్యాంకినోట్లు.

ఇక బ్యాంకినోట్లను గురించి వ్రాయవలసి యున్నది. 1839-43 సం॥ ల మధ్య రాజధాని బ్యాంకులకు, అడిగిన వెంటనే సొమ్ము చెల్లించుపద్ధతిని నోట్లు జారీచేయుటకు అనుజ్ఞ యొసంగబడెను. 1862 సంవత్సరమున ఈ నోట్లను గురించి సర్కారువారు ప్రత్యేకముగా ఒక శాఖను నెలకొల్పిరి. బ్యాంకినోట్ల (కరెన్సీనోట్లు) ను గురించి, 1910-వ సంవత్సరమునందు ఒక చట్టము జారీ చేయబడెను. ఆసంవత్సరమున, 5,10,50 రూప్యములవిలువగల అన్నినోట్లును ఇండియాదేశమున చెలామణియగు నట్లుగను, ఈనోట్లేగాక గవర్నరు జన

* బంగారుపత్రములనగా ఆపత్రములు చెలామణియందు పత్రములకుబదులు సొమ్మియవలెనినిన బంగారు నాణెములనే చెల్లించవలెను. ఇప్పుడు అమలులోనున్ననోట్లు వెండిపత్రములగుటచేత మనము సర్కారును, బంగారును ఇమ్మనికోరినను ఇచ్చుటకు బాధ్యతలేదు. వెండిని అనగా వెండినాణెముల నిచ్చుటకుమాత్రము సర్కారుబాధ్యులు.



రలుగారు ఇండియా గెజటునందు ప్రకటించిన ఏనోటులయినను ఇండియాయందంతటను చెలామణియగునట్లుగనుండవలెనని శాసించబడినది. 1911 సం॥ నూరు రూపాయిల నోట్లు కూడ సర్వత్ర చెల్ల వలసినట్లుగా తీర్మానించబడెను. 1911-వ సం॥ కరెన్సీనోట్లనిధి 12 కోట్లనుండి 14 కోట్ల రూప్యములవరకును అధికము చేయబడెను. కరెన్సీనోట్ల శాఖవారు, హద్దులేకుండ ఎన్నినోట్లను ప్రకటించ వలయునన్న (Issue) అన్నినోట్లను ప్రకటించుటకు హక్కును గలిగియున్నారు. కరెన్సీనోట్లనగా అడిగిన తక్షణమే సొమ్ము చెల్లించవలసిన షరతును గలిగియున్న, ఇండియా దొరతనమువారి, ప్రామిసరీనోటు. ప్రస్తుతము వాడుకలోనున్న అన్నినోట్ల మూల్యమును, బంగారు వెండినాణెముల క్రిందగాని, గ్రేటుబ్రిటను, ఇండియా దొరతనముల ఋణపత్రములక్రిందగాని జాగ్రతపర్చబడియే యున్నది. ఈ ఋణపత్రముల క్రింద 140 మిలియన్ల రూప్యములకు పైబడి యుండరాదనియును అందు నలభై మిలియన్లు బంగారు పత్రములక్రింద ఇంగ్లాండునందుండునట్లుగను తొలుత శాసించబడినది. 1891-వ సం॥సరికి అనేక చట్టముల మూలమున 30 మిలియన్లుమాత్రము బంగారు పత్రములయందుంచునట్లుగ శాసించబడెను. కరెన్సీనోట్ల హామీ నిమిత్తము ఏర్పర్చబడిన నిధియొక్క మొత్తము 1911-వ సంవత్సరమునందు 140 మిలియన్లుగ నిర్ణయింపబడినది ; అందు 20 మిలియన్లు (Consols) సర్కారువారు తీసికొను అప్పుపత్రములు క్రింద నుంచవలసినట్లుగకూడ నిశ్చయించబడెను. ప్రస్తుతము ఈనిధియందున్న ధనము (1,529 లక్షుల రూప్యములు) 10,200,000

పౌనులు. యుద్ధము ఆరంభమగుసరికి ఈనిధి, ఇంతకంటె చాల హెచ్చుగ నుండెడిది. 75,44,00,000 రూప్యములు. ఇందులో 9,15,00,000 రూప్యములు ఇంగ్లాండునందు బంగారుక్రిందను, నాణెములక్రిందను 40,00,000 రూప్యములు పత్రములక్రిందను ఉంచబడుచు వచ్చినవి. యుద్ధపరిస్థితులవలన పెక్కుమంది నోట్లను వాపసుచేసి బంగారును గ్రహించుటకు ఆరంభించిరి. తొలుత దొరతనమువారు పదివేలపౌన్లనోట్లను ఒక్కసారి దాఖలుచేసినవారికి మాత్రమే బంగారు నొసంగెదమనిరి. దానికికూడ కొందరు సిద్ధముగ నుండుటచేత, కరెన్సీనోట్లకు బంగారు నాణెముల నొసంగుట ఆపుచేయబడెను. బంగారును కొందరు నోట్లువాపసుచేసి గ్రహించుటచేత 1914 సం॥ నవంబరు సరికి 60 కోట్ల రూప్యములుగల మొత్తపునిధి 1915 సం॥ నవంబరుసరికి 61 కోట్ల రూప్యము లయ్యెను.

### టంకశాలలయందు ప్రజలకు స్వేచ్ఛగా నాణెములను ముద్రించి ఇవ్వవలసిన ఆవశ్యకత.

ఇండియాయందలి టంకశాలలు బంగారునాణెములను ముద్రించుటకు ఎవ్విధమైన ఆటంకములను కలుగనీయకుండ శాసించవలయునని దేశీయ ప్రముఖుల యాశయము. ఆర్థిక విషయములనుబట్టి ఆలోచించిన యెడల ఇందలి ఆవశ్యకత వ్యక్తీకరించబడును. 1898-వ సం॥ న సమావేశమైన ఫౌలరు పంచాయితీవారు కూడ దేశీయ ప్రముఖుల అభిప్రాయ ప్రకారమే తమ తీర్మానము నొసంగిరి. అట్టి స్వేచ్ఛయగు టంకశాలలు లేనిచో మారకమునందు గలిగిన వెలల మార్పు తేడాలను వెంటనే సవరించుటకును, ధరలయందును వట్టములయం



దును (Prices & Discounts) గలిగిన తేడామొత్తములను సరిపుచ్చుటకును వీలు చిక్కదు. 1913 సం॥ ఇండియా దొరతనమువారి విమర్శనమునందు కూడ ఈభావమే వ్యక్తీకరించబడెను. బాహాటముగా నాణెములను ముద్రించుట లేనిచో, 1907-13 సం॥ ల మధ్య తటస్థించినట్లే నాణెముల ముద్రణము అప్పటి కోశాగారమంత్రియొక్క ఊహాపోహలనుబట్టి యుండును; క్రొత్తనాణెములను చేయుటగాని, చేయకపోవుటగాని, అక్కాలమునం దధికార వర్గముతో సంబంధమును గలిగిన రాజస్వ కూటమువారి (Financial clique) ఆశయముల ననుసరించి రాజ్యతంత్రమును నడుపుటకు వీలుండును. హిందూదేశ పురోభివృద్ధికి ఇట్టి పద్ధతి చాల ఆటంకకరము. భరతవర్షము తిరిగి కళావాణిజ్య వ్యాపారాదులయందు వాసిగాంచి, పేరెన్నికగన్న రాష్ట్రములతో సమాన గౌరవమర్యాదలం జెందవలయునన్న, తత్ఫలప్రాప్తికి చౌకగా లభించెడి మూలధనము అపారముగ చిక్కవలసి యున్నది. ఇంగ్లాండునందలి వ్యాపారస్తులకు వలయు మూలధనము నూటికి 3 మొదలు 5 వంతున వడ్డీకి చిక్కుచున్నది. భారతీయ వర్తకుల కన్నచో 6 మొదలు 10 వరకు వడ్డీనిచ్చిన గాని మూలధనము అమరుట లేదు. ఇట్టిస్థితిలో ఇండియాదేశము యొక్క ద్రవ్య (కరెన్సీ) పద్ధతిని ఇండియాయందు మూలధనము తక్కువవడ్డీకి దొరకునట్లు ఏర్పర్చవలసి యున్నది. ఇది గొప్ప ఆవశ్యకము. ప్రభుత్వమువారు అమలులో నుంచిన పద్ధతివలన చాల నష్టములు సంప్రాప్తించుచున్నవి. పరదేశములనుండి, మూలధనము చౌకగా ఇండియాయందు ప్రవేశిం

చుటకు తగిన అవకాశములు కలిగించుటలేదు. ఇంతేకాక హిందూదేశమున (విశేషశ్రమపడి) కూడబెట్టిన మూలధనమును సైతము, ఇండియాయొక్క స్వంతకార్యములయందు, వినియోగించుకొనుట కాస్కారము లేకుండ, లండను నగరమునకు గొనిపోయి, ఆనగరమునందలి పణ్యచక్రముయొక్క లాభము నిమిత్తమై ఉపయోగింపబడుచున్నది. సీమఖర్చుల నిమిత్తమను పేరిట ప్రతిసాలునను ఇండియానుంచి 18 మిలియన్లపౌనులు ఇంగ్లాండునకు పంపబడు చున్నవి. మేజరు విన్గేటుగారి అభిప్రాయమున ఈ ధనసంచయము నంతయు, సముద్రమున వైచిన ఎంతలాభమో, ఇండియాకు అంతలాభము సంప్రాప్తమగుచున్నది. సీమఖర్చుల సంగతి యటుండనిండు! అందుల కవసరమైనంత ద్రవ్యమును కౌన్సిలు హుండీలను విక్రయించి కార్యదర్శిగారు వ్యవహరించిన బాగుగనే యుండును. ఆసొమ్ముగాక ఒకసంవత్సరమున, 14 మిలియన్ల పౌనుల హుండీలను ఇండియా కార్యదర్శి విక్రయించినట్లుగా, వెబ్బుగారు సూచించిరి. వెబ్బుగారి లెక్కప్రకారము అనవసరముగా, ఇండియానుండి సీమకు గొనిపోయిన మూలధనము 50 మిలియన్లపౌనులు.* ఈద్రవ్యము ఇండియాయందలి స్వదేశ బ్యాంకర్లకు అప్పుగ నీయబడక, ఇంగ్లాండునందు ఋణమీయబడుచున్నది. ఇదియెంతయు శోచనీయము. శామ్యుయల్, మాంటేగు అండు కంపెనీ అనుబ్యాంకర్లకు రెండు మిలియన్ల పౌనులు, చలనములేని ఋణముగ (Standing loan) ఈయబడినట్టు వెబ్బుగారు ప్రకటించిరి. చలనములేని ఋణమనగా

* D. P. Webb's Advance India.



స్వల్పకాలమునకు తొలుత తక్కువవడ్డీకి ఋణమునిచ్చి, వాయిదా దాటినవెంటనే, తిరిగి క్రొత్త ఋణముక్రింద లెక్కలలో నమోదు చేయుచుండుట యనుట. ఇందలి ఫలిత మేమనిన, ఐశ్వర్యవంతమగు ఇంగ్లాండుదేశమునకు తక్కువ వడ్డీకి మూలధనము నొసంగుచు, ఇండియాయందలి వ్యాపారములు తగిన మూలధనములేక క్రుంగుచుండుట. ఐశ్వర్యవంతుల ఐశ్వర్యము వృద్ధిగాంచుటయును, ఇండియాయొక్క దరిద్రస్థితి ఎన్నటికిని విమోచనముగు సాధనాంతరములు గలుగమియు, తటస్థించుచున్నది. దీనికితోడు, ఇండియా దొరతనమువారు సర్కారు కోశాగారములయందు, నిలవధనమును అనుపయోగముగ పాతర వేయుచుండుటకూడ, ఇండియా వ్యాపారస్తులకు కష్టనష్టములను గలిగించుచున్నది. ఛాంబర్లెయిను పంచాయితీవారు (1913) రూప్యముయొక్క మారకపు విలువను తరచుగా మారకుండునట్లుగ స్థిరపద్ధతిపైని నిర్ణయించవలయుననియును, హిందూదేశమున బంగారు నాణెములను ముద్రించు టంకశాలలుండి తీరవలయుననియు స్పష్టముగ తీర్మానించకున్నను, అట్టిపద్ధతియందు తమకుగల సానుభూతిని వెల్లడించిరి. ఇండియాదొరతనము వారు ఫౌలరు పంచాయితీ వారి తీర్మానమును, ఇప్పుడైన అమలులోనికి గొనితెచ్చి, భారతీయుల ఇక్కట్టులను బాపెదరుగాక !

## బంగారు నాణెముల చెలామణి.

ఛాంబర్లెయిను పంచాయతీవారు ఇండియాయందు బంగారునాణెముల చెలామణియొక్క ఆవశ్యకతను గమనించ

లేదు. కాని బొంబాయిపట్టణమున, లండను టంకశాలాధ్యక్షుని యాజమాన్యముక్రింద, ఒక టంకశాలనుస్థాపించి, ఇంగ్లాండు నందువలె కాసులను, అరకాసులను ముద్రించుటకు, తమకుగల సానుభూతిని వెల్లడించిరి. ఇండియాయందు వేరొకతరగతి బంగారు నాణెములు ముద్రణమగునో, ఇదివరకే గందరగోళముగానున్న నాణెముల చెలామణి పద్ధతియందు చిక్కులు తటస్థించు ననియును, క్రొత్తనాణెములు ప్రజల ఆమోదమును పడయననియును, క్రొత్తనాణెములను గ్రహించుటకు ప్రజలు జంకుదురనియును వీరభిప్రాయమిచ్చిరి. ఈ పంచాయితీవారి నివేదనపత్రమునందు, సర్ జేమ్సు బెగ్బీయను నాతడు పంచాయితీవారితో నేకీభవించక స్వంతముగా వ్రాసిన అభిప్రాయమునందు (Minute) దేశీయ ప్రముఖుల కోరికను వ్యక్తీకరించెను. ఇంగ్లాండునకువలె, కాసులను, అరకాసులను తయారుచేయక ఇండియాయొక్క ఆశయములకనువగు క్రొత్త నాణెములను తయారుచేయుట యుత్తమమని వాక్రుచ్చెను. బెగ్బీవారి యభిప్రాయమే భారతీయుల అభివృద్ధికి తోడ్పడును.

## ఛాంబర్లెయిను పంచాయతివారి తీర్మానములు.

ఛాంబర్లెయిను పంచాయతీ వారు ఇండియాకుబంగారు నాణెము లవసరము లేదని తీర్మానించిరి. బంగారు నాణెములను, ఇండియాయందు వాడుకయగునట్లుచేయుట అవసరమని ఈకమిటీవారి ఎదుట నివేదించిన హేతువులను, వానికి పంచాయితీవారొసంగిన సమాధానములను ముందుగా నిచటపొందుపరచి, తరువాత ఇతరచర్చకు పూనుకొనెదము.



1. వెండినాణెములకంటె, బంగారునాణెములు మూల్యమును హెచ్చుగ గలిగి యుండుటచేత ఒక ప్రాంతమునుండి మరియొక ప్రాంతమునకు గొనిపోవుటకు చాల సౌకర్యముగ నుండునని దేశీయులయభిప్రాయము. గొప్పమొత్తములను చెలామణి చేయవలసినప్పుడు బ్యాంకినోట్లను (కరెన్సీనోట్లు) ఉపయోగించ వచ్చుననియు, చిన్నమొత్తములను చెల్లించవలసి వచ్చినప్పుడు రూప్యములను వాడుక చేయవచ్చుననియు వీనికి కమిటీవారి సమాధానము. పెద్దవియు చిన్నవియు కాని మొత్తముల చెలామణి ఎటులజేయ వలసినదియును కమిటీవారు తృప్తికరముగ సమాధానము నీయజాలరైరి.

2. ఉత్తమమైన నాణెముల చెలామణిపద్ధతిని (Ideal currency) దేశమునందు నెలకొల్పుటకు, బంగారునాణెములను వాడుకలోనికి దెచ్చుట, ముఖ్యసోపానము. ఆర్థికశాస్త్రజ్ఞులందరును బంగారును విశేషముగా నిధియందు జేర్చి, చెలామణిపద్ధతి నంతయు నోట్లమూలకముగ జరుపుటయే, ఉత్తమపద్ధతియని ఏకాభిప్రాయమును గలిగియున్నారు. ఆపద్ధతియే ఇండియాయందు అమలులోనికి దేవలెనని దేశీయుల వాదము. ఏదేశచరిత్రలోను ఈపద్ధతి అమలులోనున్నట్లు కనుపించదని కమిటీవారు సమాధానమొసంగిరి. త్వరితముగ సొమ్ము చెలామణిచేయబడుచున్న, నోట్లపద్ధతియే ఎక్కువ లాభకరమైన పద్ధతియని వారిఅభిప్రాయము. ఈసమాధానము తృప్తికరముగలేదు.

3. బంగారునాణెములు దేశమున చెలామణియగుచుండినయెడల దేశమునకు గౌరవము వచ్చుననియును, వెండినాణెములను గలిగియుండుట దేశము ఇంకను అభివృద్ధిలోనికి రాక

వెనుకబడియున్నదని చాటుచుండుననియును దేశీయులు చెప్పిన మరియొక కారణము. విదేశములకు ఈయవలసిన మొత్తములకు ఇండియా బంగారునే ఇచ్చుచున్నది. గనుక దేశీయగౌరవమునకు లోపములేదని కమిటీవారిజవాబు. ఇండియాయందు బంగారు నాణెములు చెలామణి యగుటకును, విదేశములకు ఇంగ్లండులోనున్న బంగారు ప్రమాణనిధులనుండి బంగారు నొసంగుటయు సమానము కాజాలవు. కమిటీవారు ఇచ్చిన సమాధానము నిజస్థితిని మరుగుపరచుటకై చేసిన యుక్తికాని వేరుకాదు.

4. మారకముయొక్క విలువలో తేడాలురాకుండ చేయుటకు బంగారు నాణెములను విస్తారముగా వాడుకలో నుండునటుల ఏర్పాటులను జేయుటయే ఉత్తమమార్గమని దేశీయుల అభిప్రాయము. కమిటీవారు ఈ వాదమునకు రెండు సమాధానముల నిచ్చియున్నారు. i. జర్మనీ, ఫ్రాన్సు మొదలగు దేశములు, బ్యాంకినోట్లనే వారిదేశమున వ్యాపారమునందు చెలామణిగ గలిగియుండియు, బంగారునిధులను నెలకొల్పుట వలనను ఇతరదేశములనుండి తమకురావలసిన ద్రవ్యముయొక్క హుండీలను నిలవయందుంచుట వలనను, ఇతర దేశములకు తాముచెల్లించవలసిన సొమ్మును చెల్లించ గలుగుచున్నారు. ii. కొంచెము బంగారము మాత్రమే వాడుకలో నున్నయెడల, ధనక్షోభలు (Money crises) సంభవించినపుడు విదేశముల కెగుమతి చేయబడుటకు వీలుచిక్కకుండును. విస్తారముగా బంగారునాణెములు దేశమున వాడబడుచున్నయెడల దేశముయొక్క బంగారునిధులు అందుకు తగినట్లుగనే క్షీణదశయందుండును. గనుకమారకమునకు సహాయభూతము కాజాలదు.



కమిటీవారి మొదటి ఆక్షేపణకు జర్మనీ ఫ్రాన్సుదేశముల ఆర్థిక న్యాయములతో ఇండియా ఆర్థిక న్యాయములను పోల్చుట సాహసమని మాసమాధానము. ఇతరదేశములలో ధనక్షోభలు సంభవించినపుడు వారు ఏప్రకారముగ సమర్థించు కొనుచున్నారో ఆప్రకారమే ఆయాస్థితిగతుల ననుసరించి ఇండియా దొరతనమువారు సమర్థించుకొనగలరని కమిటీవారి రెండవ ఆక్షేపణకు మాసమాధానము.

5. క్రొత్తరూప్యములను తరుచుగాముద్రణముచేయుట సమంజసము కాదనియును, బంగారునాణెములు విరివిగా చెలామణియగుచుండినయెడల క్రొత్తరూప్యములను ముద్రించుటకు అవసరముండదనియును, దేశీయులఅభిప్రాయము. బంగారు నాణెములు విశేషముగా వాడుకయందున్నను అవి రూప్యముల చెలామణినితగ్గింప జాలవనియును బ్యాంకినోట్లు చెలామణి తగ్గించుననియును, అందువలన క్రొత్త రూప్యములను ముద్రించుట అవసరమగుచునే యుండుననియును, కమిటీవారి ఆక్షేపణ. బ్యాంకినోట్లశాఖయొక్క అధికారులు (Paper currency commissioners) ఇట్టి అభిప్రాయమును కలిగియున్నారనియును, ఇందుకు తార్కాణగా బంగారు నాణెముల వాడుక విరివియగుచున్నకొలదిని పంజాబు, పశ్చిమోత్తర పరగణాలయందునోట్లు తక్కువగా ఖర్చగుచున్నవనియును కమిటీవారు తెలియపర్చుచున్నారు.

6. ఇండియాయందు బంగారు నాణెముల చెలామణి అమలులో నుండనియెడల ఇండియాలో నాణెముల చెలా

మణిపద్ధతి నిజమైనదిగాక కృత్రిమమైనదగుటయును ఇతర దేశీయులవలన వ్యవహరింప బడుచుండుటయును సంప్రాప్తించుచుండునని దేశీయులవాదము. ఇతరులు చెలామణిపద్ధతిని, వ్యవహరించుచున్నంత మాత్రముననే ఇట్టిపద్ధతి నింద్యమైనదనుట న్యాయముగాదనియును వెండివిలువకంటె హెచ్చువెలకు రూప్యము చెలామణియగుచున్నంత మాత్రమున పద్ధతిని నిందించరాదనియును కమిటీవారి సమాధానము. రూప్యములు వాణిజ్య వ్యాపారములయొక్క అవసరములనుబట్టి ముద్రణమగుచున్నవనియును, దొరతనమువారు తమఇచ్ఛవచ్చినట్లెల్లనాణెముల ముద్రణమునకు గడంగుటలేదనియును కొన్ని నిబంధనలకులోనై వ్యవహరించుచున్నారనియును కమిటీవారి వాదము. దొరతనమువారెట్టి నిబంధనలకు లోనై రూప్యములను ముద్రించుచున్నదియును, తాత్కాలిక కోశాగార మంత్రియొక్క కటాక్ష వీక్షణముల కీ పద్ధతిలోనై యుండుననియును, అధికారవర్గమునకు సంబంధించిన రాజస్వ-కూటమువారి ఆశయములనుబట్టి నూతననాణెముల నిర్మాణ ముండుననియును ఇదివరకే సూచించి యున్నాము.

7. బంగారులోహము విశేషముగా ఉత్పన్నమగుచుండుటవలన ప్రపంచమునందు ముందుముందు వెలలు విపరీతముగ పెరిగిపోవుస్థితి రానున్నదిగాన హిందూదేశముకూడ ప్రపంచమును సముద్ధరించుటకునై బంగారును విస్తారముగా ఆకర్షించునట్లుచేయుట సమంజసమని దేశీయులవాదము. ఇతర దేశములవలె ఇండియాయందు బంగారు విస్తారముగా, నెలకొని యుండునట్లుచేయుట యుక్తియుక్తము కాదనియును,



ఇండియాయొక్క వాంఛలను అవసరములనుబట్టియే, ఎంత బంగారము ఆకర్షించబడవలసి యున్నదో నిర్ణయించవలెననియును కమిటీవారి ఆక్షేపణ.

పై ఆక్షేపణములతో బంగారునాణెముల చెలామణి ఇండియాయందు అవసరములేదని నిర్ణయించుచు ప్రస్తుత పద్ధతిని స్థిరముగానుండునట్లు చేయుటకు కమిటీవారు మూడుకారణములను సూచించుచున్నారు. ఆ కారణములనుగూడ ఖండించి, వెనుక కమిటీవారు స్వయముగ వెల్లడిపరచిన అభ్యంతరములయందలి హేత్వాభాసములను పొందుపరచుచున్నాము.

ప్రస్తుతపద్ధతియే యుండునట్లు చేయుటకు కమిటీవారొసంగిన కారణములు:—

1. ప్రజలు, బంగారు నాణెములకంటె వెండి నాణెములనే ఆసించుచుండుటచేత, దొరతనమువారు వెండినాణెముల ముద్రణమునకు కడంగుచున్నారు. ఈ కారణము ఎంత సహేతముగ నున్నదియును, ఇటీవల ఇండియాదేశము ఎంత బంగారును ఆకర్షించినదియును గమనించిన తెల్లమగును. దీనినిబట్టి ఇండియా బంగారునే విస్తారముగ కోరుచున్నట్లు కానగును.

2. రషియా, ఆస్ట్రియా, జపాను దేశముల చెలామణి పద్ధతులు చాలవరకు సామ్యమును కలిగియుండుటచేత, ప్రస్తుతపద్ధతియే బాగుండునని వారి రెండవకారణము. ఇతర దేశములయొక్క స్థితిగతులతో ఇండియాను సరిపోల్చ వీలు లేదు. ఇతరదేశములయం దాకర్షణము చేయబడిన బంగారు నాణెములుగాని, లోహముగాని, ఆ ప్రభుత్వములయొక్క

కనకరాసులను పెంపొందజేయుట కలవడుచున్నవి. ఇండియా యందలి స్థితిగతులు వేరుగాన వానితో సామ్యము పనికిరాదు.

3. ఇండియా దేశప్రజలకు బంగారుకంటె విశేషలాభకరమగు ఇతర చెలామణి పద్ధతియొక్క లాభమును బోధపర్చవలసియున్నది. ఇది మూడవకారణము. అయిన బంగారును ఇటీవల విస్తారముగా ఆకర్షించుచుండుటవలన ఇండియా దేశమునకు కృత్రిమపు రూప్యమునందు (Token-coin) నమ్మకమున్నటుల గానరాదు. కావున దేశీయులకు బోధపరచవలసిన ముఖ్యవిషయము, పాతరబడియున్న కనకరాసులను బయటికిదెచ్చి, లాభకరముగ ఉపయోగించునటుల చేయవలసియున్నది. బంగారు నాణెములనుగాని లోహమునుగాని ఇచ్చిపుచ్చుకొనుటలో వాడవలయునని సర్కారువారు శాసించినచో ఆపద్ధతి అమలులోనికివచ్చును. అటుల గావించుటకు, వాడుకలోనుండు బంగారును పెంపుచేయుట అవసరము. క్రమక్రమముగా, బంగారుయొక్క స్థానమును, బంగారు-నోట్లు గైకొనవచ్చును.

ఛాంబర్లెయిను కమిటీవారికి, బంగారునాణెముల చెలామణి పద్ధతిని ఇండియాయందు నెలకొల్పుటకు గల యభ్యంతరములను ఈ దిగువను పొందుపరచుచు, వాటిని సహేతుకముగా ఖండించుచున్నాము:—

1. **మారకపు తేడాలను తగ్గించుటకు బంగారును వాడుకలో నుంచుటకంటె నిధియందుంచుట లాభకరము.** ఈ వాదమునకుగల ఆక్షేపణములు మూడు.



(i) బంగారు సామాన్యముగా వాడబడుచున్న యెడల, బంగారుయొక్క స్థానమును, బంగారు-నోట్లు ఆవరించి ఆబంగారునంతటిని బంగారు నిధియందు జేర్చుటకు వీలలవడును.

(ii) కృత్రిమపు చెలామణి పద్ధతికంటె, బంగారు వాడుకలో నుండుటయే ఉత్తమము.

(iii) బంగారు నాణెముల చెలామణిని దేశమునందు, నెలకొల్పుటచే, బ్యాంకినోట్ల నిధియందు విశేషముగా నుంచబడిన రూప్యములు తగ్గి, ఆ నిధియందు బంగారు చేరుటకు వీలుండును.

2. **బంగారును చెలామణి నాణెముగ కలిగియుండుట వ్యయాధిక మగుపద్ధతి.**

ప్రస్తుత పద్ధతివలన, బంగారు పాతర బడుచుండుట సంప్రాప్త మగుచున్నది. గనుక ప్రయోజన శూన్యమగు ఈ పద్ధతికంటె, వ్యయాధికమైనను బంగారు చెలామణి పద్ధతియే కొంత లాభకరముగ నుండును.

3. **బ్యాంకి నోట్లయొక్క వ్యాప్తికి బంగారు నాణెములు ప్రబల శత్రువులు.**

కృత్రిమ (Artificial) నిర్బంధనల నుంచినంతమాత్రమున, నోట్లయొక్క వ్యాప్తి ఇనుమడింప జాలునా! ఎట్టి చెలామణి పద్ధతియు, దాని ఉపయోగమును బట్టియే ప్రజల సన్మానమును వడయుచుండును. సాధారణముగా ద్రవ్యమును ఒకతావునుండి మరియొక తావునకు పంపవలసి వచ్చినపుడు ప్రజలు నోట్లనే వాడుచుందురు.

4. భారతీయులు, బంగారును నగలక్రిందనో నాణెములక్రిందనో, నిలవజేయుటకు అలవాటుపడియున్న వారగుటచేత, బంగారు చెలామణిని ఇండియాయందు ప్రవేశపెట్టినను, ఆ బంగారంతయు పాతరబడుచునే యుండునుగాని ఎన్నడును చెలామణికి అలవడదు.

బంగారు విశేషముగా ప్రజలవలన నిలవ చేయబడుచుండుటకు గల ముఖ్యకారణము, ప్రజలకు కృత్రిమపురూప్యమునందుగల నమ్మకపు లోపమే. కావున బంగారు చెలామణి పద్ధతి, స్వదేశమునందు నెలకొల్పుచో దాని కలవాటుపడిన కొలదిని, ప్రజలు బంగారును నిలవచేయుటకుమారు బంగారు-నోట్లనే (Gold notes) నిలవచేయుటకు అలవాటు పడుదురు.

### బంగారునాణెముల చెలామణి అవసరము.

కాబట్టి ఇండియాయందు బంగారు నాణెముల చెలామణిపద్ధతి తప్పక అమలులో నుంచవలయును. స్థలసంకోచముచే, ఈ విషయమును ఇంకను చర్చచేయవలసి యున్నను విరమించవలసి వచ్చినది. ఒకటి రెండు సంగతులను మాత్రము పొందుపర్చక తీరదు. దొరతనమువారి చెలామణి నీతిని విమర్శించు ప్రముఖుల అభిప్రాయమేమనిన—ప్రస్తుతము అమలులోనున్న మారకపుపద్ధతిని మార్పుచేయకుండ అమలు జరుపుచు, క్రొత్త రూప్యములను ముద్రించుట మానవలయును. కొంతకాలమునకు, అరుగుదల వలనను ఇతర ఉపయోగముల వలనను రూప్యములు సన్నగిలుటవలన రూప్యమును అవసరములేని నాణెముగ (Subsidiary coin) పరిగణించ



వచ్చును. మరి కొంతకాలమునకు వాడుకలోనున్న బంగారు స్థానమును ఆక్రమించుటకు బంగారు—నోట్లు ముద్రింపబడవలయును. అప్పుడు బంగారంతయు నిధులయందు జేరి, బంగారు నిధులప్రాపున—ఉత్తమమైన చెలామణి పద్ధతి—దేశమునందు నోట్లే చెలామణి యగుచుండుట, ఇండియాకు సంప్రాప్తించగలదు.

ఉత్తమపద్ధతి చేకూరుటకు, నాలుగుదశలు (Stages) గడవవలసి యున్నది:—

1. క్రొత్త రూప్యముల ముద్రణమును ఆపివేయుట.
2. బంగారును విశేషముగావాడుకలోనికి గొనివచ్చుట.
3. బంగారు—నోట్లను ముద్రించి వ్యాపకముచేయుట.
4. బంగారునిధులప్రాపున, నోట్లు దేశమునందు చెలామణియగుచుండుట.

### సర్కారుబ్యాంకి.

నాణెముల చెలామణి సభవారి యెదుట, రాజధాని బ్యాంకులు, ఇండియాయొక్క కళాపురోభివృద్ధికి తోడ్పడుట లేదనియును, ఆకారణము వలన సర్కారు బ్యాంకి నొకదానిని, నెలకొల్పినయెడల, పక్షపాతములేకుండ స్వదేశవ్యాపారస్తులకు గూడ సదుపాయములను గలిగించుచుండునని, కొందరుప్రముఖులు సాక్ష్యమిచ్చిరి. విద్యాసాగర పాండ్యాగారు, మదరాసు (రాజధాని) బ్యాంకి ఆంగ్లేయవర్తకులకేగాని ఇండియనువర్తకులకు సహకారి యగుటలేదని, మదరాసు వార్తాపత్రికలకు ఇటీవలవ్రాసిన వ్రాతలను చదివిచూ

చిన సర్కారుబ్యాంకియొక్క ఆవశ్యకత విశదముకాగలదు. హిందూదేశమునందలి, వివిధప్రాంతముల వ్యాపారస్తుల ఆశయములు దీర్చునట్లుగను, స్వదేశ అన్యదేశవ్యాపారములను పోషించవలసిన విషయములయందును, చక్కగ కార్యతంత్రమును నిర్వర్తించుటకు తగిన సాధనముల నలవర్చుట కష్టసాధ్యము. ఇదివరకే పెంపుచెందియున్న అధికారవర్గ కూటములను, ఈసర్కారుబ్యాంకి విరివి చేయుననికూడ చాలమంది అభిప్రాయ పడుచున్నారు. మామతమున, సర్కారుబ్యాంకి యోచనవదిలిపెట్టి, దొరతనమువారు, ఇండియనుబ్యాంకులు విశేషముగ దేశమున మొలకలెత్తుటకు తగిన సాధనాంతరములను గల్పించిన బాగుగనుండునని తోచుచున్నది. ఇండియను బ్యాంకులు విశేషముగా వ్యాప్తిజెందినయెడల హిందూదేశ కళాభివృద్ధికి అమితమగు సాహాయమునొసర్చిన వగుటయేగాక. ఇండియాయందలి మూలధనము మార్కెట్లు దరిజేరుటకు జంకుచుండునని యెడి అపవాదముకూడ తొలగిపోగలదు. సర్కారు ధనమును యాజమాన్యమునందు గలిగియున్న రాజస్వసంఘములుగాని, రాజధాని బ్యాంకులుగాని ఇండియనుబ్యాంకులు అభివృద్ధిలోనికి వచ్చునట్టుగ సహాయముచేయుట అవసరము. సర్కారునిలవ ధనములోకొంతభాగము, రాజధానిబ్యాంకులు తక్కువవడ్డీకి గ్రహించుచున్నవి. ఇండియాయందలి మారకపు బ్యాంకులు (Exchange Banks) కూడ, లండను నందు తక్కువవడ్డీలకు డిపాజిట్లను గ్రహించుచున్నవి. ఒకఇండియను బ్యాంకులుమాత్రమే వెలివేసినట్టు సర్కారుసాహాయమునకు దూరమైనవి. ఇదిక్రమమైన రాజ్యనీతికాదు.



సర్కారుబ్యాంకి విషయమై ఛాంబర్లెయిను పంచాయితీవారు నిశ్చితాభిప్రాయము నొసంగజాలక, నిపుణులను కలిగిన ఒకచిన్నికమిటీ ఈవిషయమునుచర్చించి నిర్ణయించునట్లుగా తీర్పుచేసిరి. సర్కారు బ్యాంకిని నెలకొల్పుటకన్న, ఇండియను బ్యాంకులకు సహాయసంపత్తి నొసంగుట సుకరము.

## తాతాబ్యాంకి.

ఇండియాలో వర్తకరాజు లనదగిన తాతాకంపెనీవారు ఒక కళావాణిజ్యములబ్యాంకి (Industrial Bank) ని 6 కోట్ల రూప్యముల మూలధనముతో స్థాపించి సర్కారువారికి మార్గదర్శకులయ్యిరి. ఈబ్యాంకి నూతనకళలనుస్థాపించుటకు, ప్రస్తుతము రాజధాని బ్యాంకులవలెగాక, చాలకాలమువరకు వాపసు చేయనక్కరలేని అప్పులనుఇచ్చి, కళాప్రపంచమున కెన్నియో విధముల తోడ్పడనున్నది. పని ప్రారంభింపబడినది. పశ్చిమ సముద్రతీరముననున్న కొబ్బరివ్యాపారమును దేశముననే నడపుటకుగాను ఒకఫ్యాక్టరీని కొచ్చియందు స్థాపించు ఏర్పాటులు చేయబడుచున్నవి. ఇట్టిబ్యాంకులు రాజధానికి ఒకటివంతున నైనను ఉండితీరవలెను. ఇండియా అభివృద్ధికి తోడ్పడు ముఖ్యమై పనులనుచేయుటకు ఎల్లప్పుడును వెనుకంజవేయు బ్రిటిషు పాలకులు తాతాకంపెనివారి మార్గము నవలంబింతురుగాక.

## ప్రస్తుత హెచ్చుధరలకు కారణములు, ఫలితములు.

దేశమునందు ఆహారధాన్యముల వెలలుపూర్వముకంటె విపరీతముగాపెరిగినవి. ఈ మహాసంగ్రామమునకు పూర్వమే ధరలధికమయ్యెను.

(1873 సం॥ యొక్క ధరలు = 100)

| సంవత్సరము | బియ్యము. | గోధుమలు. |
|---|---|---|
| 1873 | 100 | 100 |
| 1893 | 164 | 125 |
| 1903 | 162 | 129 |
| 1907 | 238 | 165 |

పైపట్టీవలన 1873-వ సంవత్సరము యొక్క ధరలతో 1907-వ సంవత్సరపు ధరలు సరిపోల్చిచూడగా దేశప్రజల యొక్క ముఖ్య ఆహారపదార్థములగు ధాన్యములయందు, విశేష తేడా కానవచ్చుచున్నది. బియ్యముయొక్కధర నూటికి నూరును గోధుమలధర నూటికి ఏబది వంతునను ఇతర ధాన్యములయొక్క వెలలుకూడ ఆతీరుగనే పెంపొందుట వ్యక్తీకరించబడుచున్నది. 1904-1907 సం॥ల మధ్య, పంటలు సామాన్యముగ మంచిస్థితియందున్నను, ధరలుమాత్రము నూటికి 25 చొప్పున పెరిగెనని అప్పటి కోశాగారమంత్రి వాక్రుచ్చెను. వెలలు పెరుగుటకు గల కారణములను విమర్శించుటకుముందు ఒక దురభిప్రాయమును ప్రజల మనంబులనుండి పారదోలవలసిన ఆవశ్యకతకలదు. అర్థశాస్త్రవేత్తలలో కొందరు, ధరలు పెరుగుచుండినచో, దేశముయొక్కసంపద పెంపుగాంచుచున్నదని సంతసించువారలు కలరు. వారలలో సుప్రసిద్ధ ఫ్రెంచి ఆర్థికశాస్త్రజ్ఞుడగు (Charles Gide) ఛార్లెసు జీడ్ మహాశయుడొకడు. ఇతరదేశములకు ఈఆర్థికన్యాయము వర్తించును గాని ఇండియాయందు మాత్రము ఐశ్వర్య చిహ్నమగుటకు మారు దరిద్రహాంశను సూచించునని చెప్పకతప్పదు. హెచ్చు



ధర లైశ్వర్యజనకములేయగుచో, ఆలాభము నేల ఖామందులను జెందునుగాని, పేదరైతును బాగుచేయజాలవు. అటులగానియెడల స్వదేశమునందలి కృషికులు హైన్యస్థితియందుండుటకు కారణమేమి? నేలఖామందు సంగ్రహించగా మిగిలినది; సరకులను ఎగుమతిచేయు ఆంగ్లేయ వ్యాపారస్తుల బారిబడుచున్నది. రైతుస్థితి యథాప్రకారమే. సరకులయొక్క ధరలు పెరుగుటతోపాటు, స్వదేశమునందలి కళలభివృద్ధినిగాంచినయెడల హెచ్చుధర లైశ్వర్యజనకములని ఊహించనగును. ధాన్యాదులయొక్క వెలలతోపాటు, కర్మకరుల వేతనములు కూడ పెంపుగాంచిన యెడల బాగుండెడిది. అటుల జరగుటలేదు. కళావాణిజ్యములు అభివృద్ధియందున్న ప్రాంతములయందు మాత్రము కర్మకరుల వేతనములు కొంతవరకు పెరిగినను, పల్లెటిగ్రామములయందు నివసించునప్పటికంటె, ఆపట్టణరాజములయందు జీవయాత్రను గడుపుటకు విశేషముగా, ధనము వెచ్చించవలసి వచ్చుటవలన, లభించిన అధికకూలి వమ్మైపోవుచున్నది. కర్మకరునకు, మిగులునదంతగాలేదు. ఈవిషయమటుండ, వెలలసందర్భమున, ఒక ముఖ్యాంశమును గమనించవలసియున్నది. ఇతర దేశములకువలెగాక, హెచ్చుధరలు ఇండియాదేశమునకు హానికరములుగాని వేరొండుగాజాలవు. ఏలననిన, హెచ్చుధరలు, కర్మకరులయొక్క వేతనములను అధికముచేయును. శ్రమ చౌకగా లభించనిచో, సరకులను ఉత్పత్తిచేయుటకుగల ఖరీదు ఇనుమడించక మానదు. భరతఖండమునకు, ఇతరదేశములకంటె పనివాండ్రు లభించుటయందు మాత్రము ఆధిక్యతకలదు. అనగా కర్మకరుల వేత

నము లీదేశమున కాలుచౌకయగుటచే, కళాచక్రమునందు ఈ విషయమున ఇతరదేశములకంటె, మంచి స్థితియందున్నది. శ్రమ ప్రియమైనయెడల, ఇప్పుడిప్పుడే తలలెత్తుచున్న మన కళలు చక్కగా స్థాపింపబడిన విదేశకళలపోటీకి ఆగలేక, క్రుంగవలసినఅవస్థపట్టును. హెచ్చుధరలు,విదేశములకేగుచున్న ఎగుమతులనుకూడతగ్గించగలవు. ఎగుమతులు తగ్గిపోయినయెడల,ప్రతిసంవత్సరమునుఇండియావిదేశములకు చెల్లించవలసిన, 25 కోట్ల రూప్యములును లభించుట దుర్లభము. విదేశములకు చెల్లవలసిన ధనము, ఎగుమతుల వలన సేకరించబడక పోయినయెడల, దేశమునందు క్రొత్తపన్నులను విధించవలసి వచ్చెను. విదేశముల కంపవలసిన ధనసంచయములో, సీమ ఖర్చులే విశేషముగానున్నవి. ఈ కారణములవలన, ధరలు పెరుగుట ఇండియా కళాభివృద్ధికిని, రాజస్వమునకునుగూడ విప్లవకారియే యగుచున్నది. కావున, హెచ్చుధరలు ఐశ్వర్య చిహ్నములని భ్రమించరాదు.

ఇక వెలలు పెరుగుటకుగల కారణములను చర్చించ నగును. ఈక్రింద పేర్కొనబడిన కారణములయందు, ఎయ్యది ఎంతవరకు తోడ్పడెనో నిశ్చయించుటకు సాధ్యముకాదు. ప్రతికారణమును కొంతవరకు సహకారియే అయ్యెను. కొన్ని కారణములు ప్రత్యక్షముగను కొన్ని పరోక్షముగను కూడ వెలలను పెంచుటకు సహాయభూతములైనవి.

1. కఱవులును కాటకములును దేశమునుపీల్చి పిప్పి చేయుచుండుట ప్రథమకారణము. ఈ కారణమును ముందు



పేర్కొనుటచే ఇదియేముఖ్యముగ తోడ్పడెనని యూహించ రాదు. ఇదిస్వభావసిద్ధమగు కారణముగాన ముందుపేర్కొన బడెను. 1891-92 సం॥ యొక్కధరలతో సరిపోల్చిచూడగా 1896-97,1899-1900 సంవత్సరములయందువెలలుఅపారముగ పెరిగెను. కఱవులుదేశమునుపీల్చి పిప్పిచేయుచుండగా,ఆతరుణముననే అన్యదేశములయందు మనఆహారధాన్యములకు గిరాకి అతిశయించుచువచ్చెను. ఎగుమతులధికమగుటచేత స్వదేశమునందలి వెలలుసైతము అధికమయ్యెను. మహాకాటకములు సంభవించినప్పుడుసైతము, బియ్యముఎగుమతులు యథాప్రకారముగ నేజరుగుచుండెను. 1898-99 సం॥లలో ఆహారధాన్యముల ఎగుమతులు ముప్పదిలక్షలటన్నులు అధికమయ్యెను. రెండవగొప్ప కాటకపు సంవత్సరమునకు (1900)ముందు సంవత్సరమున, ఇట్టి స్థితి సంభవించెను. సుభిక్షమగు దినములలో వెలలుతగ్గుటయు కలదుగాని, ఏసంవత్సరమునందలి వెలలును పూర్వపువెలలతో సామ్యమును గాంచుటలేదు. పుష్కలముగ పంటలు పండినప్పుడుధాన్యాదులమితముగ ఎగుమతి చేయబడుచుండుటచేత, వర్షములు ఎటామటివలనగాని వరదలు విశేషమగుట వలన గాని పంటలుతగ్గినప్పుడు, వెలలు సామాన్యజనులను బాధించుచున్నవి.

2. ఆహార ధాన్యములయొక్క ఉత్పత్తి, వానికిగల గిరాకితో సరిగా అభివృద్ధినొందుటలేదు. అనగా ధాన్యముల యొక్క పంటలు గిరాకి అతిశయించినంత హెచ్చుగా ఇండియా యందు అధికమగుటలేదు. బంగాళాదేశమునను, బొంబాయి యందలి కొన్నిప్రాంతముల యందును, వరిపంటకంటె ప్రత్తి

గోగునారపంటలు హెచ్చులాభము వచ్చునవియగుటచే, వరికంటె హెచ్చు ప్రదేశమున సేద్యము చేయబడుచున్నవి. అందువలన వరిసేద్యమందున్న భూమితగ్గుచు వచ్చుచున్నది. 1897-98 సం॥ లయందు ఆహారపదార్థముల సేద్యమునందున్న భూమియొక్క విస్తీర్ణము 182¾ మిలియన్ల ఎకరములు. 1906-07 సరికి 195 మిలియన్లకు సుమారుగా పెరిగినది. పదిసంవత్సరములలోను నూటికి 7½ చొ॥ న వరిపంటక్రిందనున్న భూమి పెరిగినది. ప్రత్తి సేద్యమునందున్న భూమి నూటికి ఏబదిరెట్లును గోగునార సేద్యమందున్న భూమి డెబ్బదిరెట్లును పెరిగినది. జనసంఖ్య అధికమగుచుండుటచేత ఉత్పత్తియగుచున్న పదార్థము చాలకపోవుట కూడ ఒక కారణము. రోడ్లు, ఇనుపదారులు మొదలగు యానసౌకర్యములు దేశమునందు పెంపు చేయబడుటచేత మూలమూలలనున్న ప్రదేశములనుండి సైతము ధాన్యాదులు పణ్యాచక్రములకు చేరుచున్నవి. యానసౌకర్యములు విస్తారముగా అలవడుటచేత పండినప్రదేశమునను పండని ప్రదేశమునను కూడ, ధరలు ఒకేతీరుగనుండుట సంభవించుచున్నది. ధాన్యరాసులు ఎగుమతులకు వీలులేక కొన్నిప్రదేశములయందు పాతరబడియుండుట చాలఅరుదు. రైల్వేలుగల ప్రాంతములయందలి ప్రజలు, పూర్వము ధనవంతులు అనుభవించవలసిన వస్తువులని విడిచిపెట్టబడిన సరకులను, సామాన్యస్థితివంతులు సైతము ఉపయోగించుచున్నారు. పూర్వము ఏగంటి అన్నమునో, చోడిఅంబలినో తినెడివారు ఇప్పుడు వరిఅన్నమునకు అలవాటు పడియుండుట ఎల్లరెరింగియే యున్నారు. ఈకారణములవలన పదార్థ



ముల సరఫరా, గిరాకితో సమముగ నుండక వెనుకబడుచుండుట చేత, వెలలు పెరుగుట తటస్థించుచున్నది.

3. హిందూదేశమున ఆహారపదార్థములయందు చాలమంది ప్రజలకు వరియే ఆధారమైయున్నది. అట్టి పదార్థము విశేషముగ పరదేశయాత్ర వెడలుచున్నదని ఈ వరకే సూచించియున్నాము. బియ్యపు ఎగుమతికి యానసౌకర్యములు చౌకగా అలవడునట్లు చేయుటవలన, ఏయేట ఎగుమతులు జాస్తియగుచున్నవి. ఐశ్వర్యవంతములైన వగుటచే అన్యదేశములు మనపదార్థములకు హెచ్చుధరలను చెల్లించగలవు. హెచ్చువెలలు విదేశములయందు లభ్యమగుచుండ చౌకధరలకు స్వదేశమునందు అమ్ముటలేదు. ఎగుమతులు విస్తారమగుచున్న కొలదిని పూర్వము స్వల్పధరలకు అలవడుచున్న సరకులు సైతము చాల హెచ్చుధరలకు అమ్మబడుచుండుననన్న సంగతి ఎల్లరెరింగినదే!

బియ్యపు ఎగుమతులయొక్క రాసియు మూల్యమును.

| సంవత్సరము | రాసియొక్క టన్నులు | విలువ రూప్యములు | ఉజ్జాయింపున టన్ను ఒక్కంటికి ధరలు. |
|---|---|---|---|
| 1903-04 | 22,50,000 | 19,08,28,000 | 85 |
| 1904-05 | 24,74,000 | 19,61,90,000 | 79 |
| 1905-06 | 21,52,000 | 18,63,69,000 | 86½ |
| 1906-07 | 19,35,000 | 18,52,51,000 | 95 |
| 1907-08 | 19,18,000 | 20,33,63,000 | 105½ |

అయిదు సంవత్సరములలో ఎగుమతికాబడిన టన్ను బియ్యముయొక్క ధర 85 నుండి 105½ రూప్యములవరకు పెరిగినది. అనగా నూటికి 24 వంతున హెచ్చినది. ఆకాలముననే ఇండియాయందలి ధరలు 162 నుండి 238 వరకు పెరుగుటచేత నూటికి 45 వంతున హెచ్చెను. దీనినిబట్టి మొత్తపు ఎగుమతి ధరలకంటె చిల్లరగా అమ్మబడు (పదార్థముల) ధరలే విశేషముగ పెరుగుటను గాంచుచున్నాము. దేశమునందలి వాంఛలుదీర ఉపరిగానున్న ధాన్యాదులు మాత్రమే ఎగుమతి యగుచున్నవని కొందరి మతము. తరచుగా కఱవులును కాటకములును పీడించు ఈ దేశమున వాంఛలుదీర ఉపరిగా ఉత్పన్నమగు ధాన్యాదులుండుట కల్ల. స్వదేశమునందు వలయునంత ధాన్యము పండుటలేదని ముందే సూచించియున్నాము.

4. దొరతనమువారి నాణెముల చెలామణి పద్ధతియే ధరలను పెంపుచేయుటకుగల ముఖ్యకారణమని శ్రీయుత గోపాల కృష్ణ గోఖలే మొదలగు మహాశయుల అభిప్రాయము. వీరి అభిప్రాయము ఆర్థికశాస్త్రమునందలి ముఖ్యసూత్రముల ఆధారమునువడసినదేగాని, తర్కముకొరకు ఎత్తిన పన్నుగడ కాదు. వాడుకలోనున్న నాణెముల సంఖ్యనుబట్టి సరకులధరలు నిర్ణీతములగుచుండునన్న సంగతి ఆర్థికశాస్త్రము నందలి సామాన్యసూత్రమే. దేశముయొక్క వాణిజ్యవ్యాపారములకు వలయునన్ని నాణెములు వాడుకలోనుండక పోయినయెడల, ఆనాణెములకు గల గిరాకి అతిశయించును. గిరాకి అతిశయించినవెంటనే సామాన్యవస్తువులవలెనే ఈనాణెములయొక్క వెలలు పెరుగును. అనగా పూర్వముకంటె హెచ్చుగా పదార్థ



ములను కొనుటకు ఆనాణెములకే శక్తికలుగును. అందువలన వెలలు తగ్గుట తటస్థించును. వాడుకయందున్న నాణెముల సంఖ్య వ్యాపారములకు అవసరమైనంతకంటె హెచ్చుగ నుండుచో, ఆనాణెములయొక్క మూల్యము తగ్గి వాటి కొనుబడివిలువను తగ్గించును. ఆకారణమువలన సరకులను గొనునప్పుడు పూర్వముకంటె హెచ్చునాణెములను చెల్లించవలసివచ్చును. అప్పుడు సరకులయొక్క ధరలు పెంపుగాంచును. రాసి అధికమగుచున్న కొలదిని మూల్యము తగ్గుచుండునన్న ఆర్థికన్యాయము ఇతరవస్తువులకువలెనే నాణెములవిషయమున కూడ వర్తించుచుండును. ఇండియాదేశ నాణెముల చెలామణి పద్ధతియందిట్టి స్థితియే సంభవించెను. 1893 సం॥ న టంకశాలలు ప్రజల ఉపయోగమునకు వీలుగాకుండ మూసివేయబడుటయును, అప్పటినుండియు సర్కారువారే రూప్యముల ముద్రణమునకు గడంగుటయును పాఠకు లెఱింగియే యున్నారు. రూప్యముయొక్క విలువ స్వభావవిరుద్ధముగా 1 షిల్లింగు 4 పెన్సులక్రింద నిర్ణయించబడిన సంగతికూడ తెలిసికొనియే యుందురు. అప్పటినుండియే సిక్కారూప్యమనుపేరు పోయి కృత్రిమపునాణ్యమను బిరుదమును మననాణ్యము ధరించుట కారంభించినది. కృత్రిమపు నాణ్యమనగా రూప్యముయొక్క విలువ అందలి లోహపువిలువకంటె హెచ్చు చేయబడినది. రూప్యమును వెండిక్రింద కరిగించి అమ్మకము చేసినయెడల, మూడువంతులలో రెండువంతులకంటె ఖరీదురాదు. లోహపు విలువతో సమముగ నాణెముయొక్క విలువ, సర్కారువారు స్వయముగ నాణెములను ముద్రించుటకు పూర్వ ముండెడిది.

బంగారు నాణెములను చెలామణి రూకలుగ చేయనందువలన ఇట్టిగతిపట్టినది. రూప్యములు విశేషముగ ముద్రింపబడెనని ఈ వరకే సూచించియున్నాము. ప్రస్తుతము వాడుకలోనున్న రూప్యములసంఖ్య రెండువందలకోట్లకు పై బడియున్నది. టంకశాలలనుండి విస్తారముగా నాణెములను ముద్రించుటవలన ఇతర వస్తువులకువలెనే, ఈనాణ్యముల మూల్యము తగ్గికొనుబడి విలువ క్షీణించెను. అందువలన ధరలు పెరుగుటకు వీలు చిక్కెను. రూప్యముల నూరకముద్రించుట లేదనియు వ్యాపారములయొక్క ఆవశ్యకతను బట్టియే ముద్రింపబడుచున్నవనియును, సమాధానము నొసంగుచున్నారు. వ్యాపారములు హెచ్చుగా జరుగుచున్న సమయములయందు, ఈసంగతి నిజమేయనుకొందము. కాని ఒకసారి రూప్యములను ముద్రించినచో, అవి వాడుకలోనే ఉండితీరును. ఏలననిన, తక్కువ విలువ గలిగినవగుటచే, ఆనాణెములను ఎవ్వరును కరిగించుటకుగాని పాతరవేయుటకుగాని పూనుకొనరు. టంకశాలలు స్వేచ్ఛగా ప్రజోపయోగమునకై విడిచిపెట్టబడినంతకాలము మార్కెట్లయొక్క అవసరమునుబట్టి రూప్యములు అధికము చేయబడుటకుగాని తగ్గించుటకుగాని వీలుండెడిది. ఇపుడది సాధ్యము గాదు. ఒక్క గోఖలేమహాశయుడే గాక వెబ్బు, జే. యమ్. కీన్సు మొదలగు ప్రముఖులుగూడ రూప్యముల నధికముగ ముద్రించుటవలననే ధరలు పెరిగినవని వ్రాక్రుచ్చిరి. ఫౌలరు పంచాయితీవారి తీర్మానములను ఆచరణములోనికిగొని రాకుండ ఇండియా దొరతనమువారు వ్యవహరించుటవలన రూప్యములు విశేషముగా ముద్రణమగుటయే గాక రాజస్వవిషయమున



పెక్కు కీడులు వాటిల్లెనని చెలామణి రాజ్యతంత్రమును విమర్శించునపుడు విశదీకరించియే యున్నాము.

5. బంగారును ప్రమాణముగ నంగీకరించియు, బంగారు నాణెములను ఇండియాయందు ముద్రణము చేయకపోవుటవలన, బంగారునాణెములను చెలామణి నాణెములుగాగల దేశములయందు, ధరలు పెరిగినప్పుడెల్ల ఇండియాకు నష్టముసంభవించుచున్నది. స్వదేశమునందు పెరిగిన ధరలు బంగారునాణెములను వాడుకచేయు దేశములయందలి ధరలనుబట్టి కలిగినవే అయినయెడల కొంతకాలమునకు తిరిగి తగ్గవచ్చుననియెడి భ్రాంతి కలుగుచున్నది. కాని, ఇతర కారణములుకూడ సహకారులగుచుండుటచేత, అట్టి యాశలతో ప్రయోజనములేదు. నాణెముల చెలామణి నీతిని సవరించినగాని ధరలు చక్కబడవు.

### ధర లధికమగుటవలన ఫలితములు.

ఇక ధరలధికమగుటవలని ఫలితములను పేర్కొనవలసియున్నది. రైతునకు విశేషమైన లాభమేదియు ఉండజాలదనియు నేల ఖామందే ఆఫలితమును గ్రహించుననియు ఇదివరకే సూచించబడినది. ముఖ్యముగా సామాన్యగృహస్థులను, దేశములోని వాడుకనుబట్టి ద్రవ్యవేతనములు గ్రహించు కర్మకరులను ఉద్యోగస్థులను హెచ్చుధరలు పీడించుచుండును. శ్రమను ప్రియముచేయుటకు గూడ హెచ్చుధరలు తోడ్పడుచుండును. సరకులను ఉత్పత్తిచేయుటకుగల మూల్యము హెచ్చగుటచేత, ఎగుమతులు సన్నగిలుటకూడ తటస్థించును. కళావాణిజ్యచక్రములకును, దేశమునందలి ప్రజలకునుకూడ ఆహారపదార్థముల వెలలు ఇనుమడించుట వలన కీడు వాటిల్లకమానదు.

## బ్యాంకుల పద్ధతులు.

### షాహుకార్లు.

పల్లెటి గ్రామములయందు షాహుకార్ల వలన రైతులకు పెట్టుబడి ఈయబడుచున్నది. చెన్న రాజధానియందలి షాహుకార్లు నాటుకోటిసెట్లు, చెట్టియార్లు, కోమట్లునైయున్నారు. ఉత్తర హిందూస్థానమునందలి షాహుకార్లు మారువాడీలు, మహాజనులు, సెట్‌లు, బనియాలు, క్షత్రీలు అను తెగలకు చెందియున్నారు. కొందరిమతమున షాహుకార్లు దేశమునకు అరిష్టదాయకులుగ పరిగణింపబడుచున్నారు. కాని పల్లెటి గ్రామములయందలి రైతులకు కృషికివలయు విత్తనములు మొదలగు ఉపకరణములకు కావలసిన వెచ్చమును సరఫరా చేయుటయేగాక, పంటలు తేలువరకు భోజనమునకును ఇతర అవసరములకును వలయు ద్రవ్యమునుకూడ సరఫరా చేయుచుండుటవలన, షాహుకార్లను పేదరైతులు సాదర భావముతోనే చూచుచున్నారు. పరపతి సంఘములు దేశమునందంతటను వెల్లి విరిసినట్లు వ్యాప్తమగు నంతవరకు, షాహుకార్లు గ్రామములయందలి కృషికళకు తోడ్పడక తీరదు. వీరు వసూలుచేయువడ్డీ విపరీతమయ్యును, తరుణమునందు వలయు మూలధనమును సరఫరా చేయుచుండుటవలన ప్రయోజనకారులే యగుచున్నారు.

### పట్టణమునందలి బ్యాంకులు.

ఇక పట్టణములయందు బ్యాంకు లేతీరుగ పనిచేయుచున్నవియును మనము తెలిసికొనవలసియున్నది. నూతనముగ



ఐరోపీయను పద్ధతులపై బొంబాయి, మదరాసు, పంజాబు రాష్ట్రముల యందు స్థాపితమైన బ్యాంకులు జాయంటు స్టాకుకంపెనీ పద్ధతిపైని నెలకొల్పబడినవి. జాయంటు స్టాకు కంపెనీలనగా, వలయు మూలధనమును పలువురుచేరి ప్రోగుచేసి స్థాపించబడినవి. ఈ స్వదేశ బ్యాంకులు ముఖ్యముగా కళలను మూలధనము నొసంగి సముద్ధరించుచున్నవి. కళలకు సహాయములగుటయేగాక, స్వదేశ-వర్తకము విరివియగుటకు గూడ తోడ్పడుచున్నవి. తరచుగా జమీందారులకును పెద్దనేల ఖామందులకును ఋణములొసంగుచు, సేటులవలె వడ్డీవ్యాపారమునుకూడ చేయుచున్నవి. రాజధాని బ్యాంకులవలె ఇండియను బ్యాంకులకు దొరతనమువారు సానుభూతిని గనబరచుట లేదనియును, నిలవయున్న ధనమును నిష్ప్రయోజనముగ సర్కారు కోశాగారములందు పాతర వేయుచుండుటవలనను, బంగారు ప్రమాణనిధి ఇంగ్లాండు నందుంచబడుట వలనను ఇండియను బ్యాంకులకు అభివృద్ధికి ఆటంకకరమగుచున్నది.

### జగత్ సెట్ ఉమచందులు.

మారువాడీలును, సెట్‌లును స్వదేశ పద్ధతులపై బ్యాంకుల వ్యవహారమును నిర్వర్తించుచున్నారు. స్వదేశ ప్రభువుల ఏలుబడి యందు ఈ బ్యాంకర్లకు విశేష పలుకుబడిగలదు. జగత్ సెట్ ఉమచందులు వంగదేశమున సురాజ డౌలా ఏలుబడి యందు ఎంత ప్రతిభను కలిగియున్నదియును చరిత్రాత్మకమైయున్నది. ప్లాసీయుద్ధమున సురాజ డౌలానోడించి, ఆంగ్లేయ పరిపాలనమునకు శంకుస్థాపనముచేసిన క్లైవుప్రభువు తాను

చేసిన కుట్ర నవాబునకు తెలియునేమోయని గ్రహించి ఉమచందు అను బ్యాంకరునకు తెల్లకాగితముపై సంతకము లేకుండను, ఎర్రకాగితముపై క్రమముగను నోటువ్రాసి వాట్సను యొక్క సంతకమును సైతము ఫోర్జరీచేసిన సంగతి చరిత్రాత్మకమే. బ్రిటిషు ప్రభుత్వము స్థాపితమైన తరువాత, స్వదేశ బ్యాంకర్లు ప్రభుసన్మానమునకు వెలియై ఇతర వ్యాపారములయందు తమధనమును వెచ్చించ నారంభించిరి. మధురానగరవాసులగు సెత్ లనుబ్యాంకరులు ఉత్తరహిందూస్థానమున, రాత్ చైల్డు బేరింగ్సు అను ఐరోపా బ్యాంకర్లవలె, విఖ్యాత యశమును గడించిరని ఒక చరిత్రకారుడు వ్రాయుచున్నాడు. ఇప్పటికిని ఉత్తరహిందూస్థానమునందు ఈబ్యాంకరులు విశేష ప్రతిభను కలిగియున్నవారు.

## స్వదేశపద్ధతుల విశేషము.

స్వదేశ పద్ధతి యందలి విశేషమేమనిన, మూలధనమునంతయు, ఒకే కుటుంబమువారు జాగ్రతపరచి వ్యవహరించుట. నూతన పద్ధతులవలె ఈ బ్యాంకులు జాయంటుస్టాకు కంపెనీలుకావు. వ్యాపారము వంశానుక్రమణికగ సాగుచుండునుగాని కొంతకాలముండి రూపుమాయుటలేదు. దగాయననెట్టిదియో ఈ బ్యాంకరు లెన్నడును ఎరుగరు. ఋజుమార్గవర్తనులు. నూతన పద్ధతులపై నెలకొల్పబడిన ఎన్నియో బ్యాంకులు దివాలా తీయుటను చూచుచుంటిమిగాని ఒక్క మార్వాడీ బ్యాంకిగాని సెత్ బ్యాంకిగాని దివాలా తీసెనన్న మాట పేరునకైన లేదు.



వీరు చేయువ్యాపారము మూడువిధములు. భూములమీదను, గొప్పగొప్ప జమీనులమీదను ఋణము నిచ్చుట యొకటి. ఇందువీరుపల్లెటి గ్రామములయందలి షాహుకార్లను బోలియున్నారు. ఋణమీయబడిన ద్రవ్యసంచయము అధికముగనుండుటతప్ప, వేరువిశేషమేమియు లేదు. స్వదేశమునందు వర్తకముచేయు వ్యాపారస్తులకు ఈబ్యాంకరులు ధనమునొసంగుటగూడ కలదు. అందువలన దేశమునందుత్పన్నమగు పదార్థసంచయమును, ఒకతావునుండి మరియొకతావునకు గొనిపోయి దేశమునందంతటను వ్యాప్తముచేయుటకు సహకారు లగుచున్నారు. కొన్ని సమయములయందు, ఆప్రాంతములయందలి కళాదక్షులకు (Manufacturers) మూలధనము నొసంగుటనుగాని, ఋణము నిచ్చుటనుగాని చేయుచున్నారు. ఈరెండు విషయములయందును స్వదేశపురోభివృద్ధికి స్వదేశ బ్యాంకరులు తోడ్పడుచున్నారు. ముఖ్యముగా స్వదేశమునందలి వర్తకమునకు అనువగు సాధనాంతరములను, మారకపు బ్యాంకులవలె, అలవడునట్లు వీరు చేయుచున్నారు. బేర సారములయందు తరచుగ ద్రవ్యమును ఒకతావునుండి మరియొకతావునకు పంపనవసరము లేకుండ, హుండీల ద్వారా వ్యాపారమును సాగించుచున్నారు.

## హుండీలు.

హుండీలనగా, ఒకవర్తకుడు మరియొక వర్తకునకు సొమ్ము చెల్లించవలసినట్లుగా ఇవ్వబడిన ఆజ్ఞాపత్రము లనుట. ప్రతి పట్టణరాజమునందును బ్యాంకర్ల ఏజంట్లు ఉండియుందురు. ఈఏజంట్లు హుండీలురాగానే, సొమ్మును చెలామణిని

చేయుచుందురు. హుండీలకు సొమ్ము సరఫరా చేసినందులకై నూటికి 3 పైసలుమొదలు ఆరుపైసలవరకును సుంకము వసూలు చేయబడును. పూర్వము హుండీలలో కొన్నిటికి నలుబదియొక్క రోజులు, కొన్నిటికి 51 రోజులు, 61,121 రోజులు వాయిదా యుండెడిది. ప్రస్తుతము హుండీలయొక్క వాయిదా 11,21,41,51 రోజులై యున్నది. ఎన్ని రోజులలో సొమ్ము చెల్లించవలసినదియును, ఆహుండీయందు లిఖించబడియుండును. వెంటనే సొమ్ము చెలామణి చేయవలసిన హుండీలుకూడగలవు. ఈహుండీలకు దర్శనహుండీలని పేరు. హుండీలను లిఖించుట, గుమాస్తాలపై విడిచిపెట్ట బడుచుండును. ఈగుమాస్తాల కొసంగు జీతములు బహుస్వల్పము. లక్షలకొలది మూల్యము నుగల హుండీలను గుమాస్తాలు వ్రాయుచుందురు. ఎవరిపేరను హుండీపంపబడెనో వారు, ఆహుండీని సొమ్ము చెలామణి చేయక నిరాదరించినయెడల యజమానియొక్క వ్యాపారము తయు కట్టుబడిపోయి అవమానము తటస్థించును. అంత పూచీగల వ్యాపారము స్వల్పజీతముగల గుమాస్తాలపై విడిచిపెట్టబడినను తేడావచ్చుచుండుట చాల అరుదు. "హిందూదేశ వర్తకపద్ధతియందు విఖ్యాత యశముసువడసిన హుండీల యొక్క వ్యాప్తి దేశమునందమితముగనున్నది. లక్షలకొలది రూప్యములు ఇందు పెట్టుబడి పెట్టబడియున్నను, వాయిదా కాలము పూర్తిఅయిన తరువాత నిరాదరించబడి నందువలన నష్టము కలుగుటలేద" ని ఒక లేఖకుడు వ్రాసియున్నాడు. హుండీలనుమార్చి సొమ్ము చెలామణి చేయుటకును వట్టముల క్రిందను, మధ్యస్థులు, లక్షలకొలది ద్రవ్యమునార్జించుచున్నారు.

---

# ఇండియా రాజస్వము.

# INDIAN FINANCE.

---

## ఇండియా ఋణముయొక్క చరిత్రము.

| | |
|---|---|
| ప్రథమ భాగము | 1837-1858 |
| ద్వితీయ భాగము | 1858-1877 |
| తృతీయ భాగము | 1877-1902 |

1837 సంవత్సరమున విక్టోరియా మహారాజ్ఞి ఇంగ్లాండు సింహాసనము నధిష్టించెను. సింహాసనా సీనురాలైన 21 సంవత్సరములవరకును హిందూదేశము ఈస్టిండియా కంపెనీవారి పరిపాలము నందుండెను. 1858 సం॥న సిపాయి ముట్టడిని అణచివైచిన తరువాత కంపెనీవారి పాలనమునుండి తొలగించి బ్రిటిషు ప్రభుత్వమువారే ఈదేశమును స్వాయముగ పరిపాలించ నారంభించిరి.

కంపెనీ యాజమాన్యముక్రింద నుండిన 21 సంవత్సరములలోను హిందూదేశము యొక్క ఆదాయ వ్యయములు ఈక్రింద గనబర్చబడిన పట్టీవలన తెలియనగును. ఆపట్టీని పరిశీలించుటవలన మొత్తపు ఆదాయములో భూమిపన్ను ఎన్నవవంతగునో ఆసంగతియుచు, వ్యయములో సీమఖర్చులు (Home charges) ఎన్నవ వంతగునో ఆసంగతియును స్పష్టమగును.

పౌను=సవరను లేక పెద్దకాసు. మిలియను=10 లక్షలు.

1

| సంవత్సరము | ల్యాండు రివిన్యూ నేలపన్ను | మొత్తపు ఆదాయము | సీమఖర్చులు ఇంగ్లాండునందలి ఖర్చులు | మొత్తపు వ్యయము |
|---|---|---|---|---|
| | పౌనులు. | పౌనులు. | పౌనులు. | పౌనులు. |
| 1837-38 | 11,853,975 | 20,858,820 | 2,304,445 | 19,857,970 |
| 1843-44 | 13,228,850 | 23,586,573 | 2,944,073 | 24,925,371 |
| 1848-49 | 14,274,270 | 25,396,386 | 3,012,908 | 26,766,848 |
| 1849-50 | 15,248,694 | 27,522,344 | 2,750,937 | 26,960,988 |
| 1853-54 | 15,838,649 | 28,277,530 | 3,262,289 | 30,240,435 |
| 1854-55 | 16,419,031 | 29,133,050 | 3,011,735 | 30,753,456 |
| 1855-56 | 17,109,971 | 30,817,528 | 3,264,629 | 31,637,530 |
| 1857-58 | 15,317,911 | 31,706,076 | 6,162,043 | 41,240,571 |

పైపట్టీవలన మనము గమనించవలసిన ముఖ్యవిషయము, 1837 సం॥నందు రెండుమిలియన్ల పౌనులకు పైగా సీమఖర్చుల క్రింద చెల్లించినప్పటికిని ఆదాయమునుండి వ్యయమును తీసివేయగా నిలవ కానవచ్చెను. విల్లియం బెంటింకు ప్రభువు యొక్క జాగ్రతగలపరిపాలనమును, బెంటింకు ప్రభువును, సర్ ఛార్లెసు మెట్కాఫుగారును పాలమునందు మార్పుల నొనర్చి వ్యయము చాలవరకు తగ్గించుటవలనను, నిలవ చేకూరుటకు సాధ్యమైనది. 1838 సం॥ న ఆక్లండు ప్రభువు ఇండియాకు వచ్చినది మొదలు నిలవ సున్నయై ఏటేటవ్యయము అధికమగుటచే ద్రవ్యము చాలమికూడ తటస్థించెను. ఆక్లండు ప్రభువు పాల్మరుస్టను మంత్రియొక్క అధికాశతో కూడికొనిన రాజ్య



నీతిని అవలంబించినవాడు. ఆక్లండు ప్రభువు తరువాత గవర్నరు జనరలుగావచ్చిన ఎలెంబరో ప్రభువు పాలనయందు సైతము రాజస్వముయొక్క స్థితి ఇటులనే యుండెను.

హార్డింజి, డల్‌హౌసీ ప్రభువులయొక్క సిక్కుయుద్ధములతో రాజస్వముయొక్క స్థితి మరింత పాడయ్యెను. 1849-50 సంవత్సరమున పంజాబు దేశము నాక్రమించుకొనిన తరువాత తిరిగి నిలవ కానవచ్చెను. అయినను డల్‌హౌసీ ప్రభువు పరిపాలనమునందు వ్యయము అధికమై 1853-54 సం॥ సరికి ముప్పది మిలియన్లకుపై దాటెను. నాగపూరు మొదలగు గొప్పరాజ్యములను సర్కారువారు ఆక్రమించుకొన్నను 1854-56 సం॥న డల్‌హౌసీ ఇండియాను వదలి వెళ్ళువరకు నష్టమే కానవచ్చెను.

కానింగు ప్రభువుయొక్క ఏలుబడి యందు ప్రథమ సంవత్సరమున మాత్రము నిలవ కాన్పించినది. ఇందులకు కారణము, డల్హౌసీ ప్రభువు అయోధ్యరాజ్యమును ప్రభుత్వము వారి వశమును జేయుటవలన కలిగినదియే. అయిన ఈనిలవ సిపాయి ముట్టడి సంవత్సరమగు 1857-58 సం॥న సున్నయై, పదిమిలియన్ల పౌనులు వ్యయమే అధికమయ్యెను.

## సీమ ఖర్చులు.

సీమఖర్చులు ఏటేట వృద్ధి యగుచుండుట గూడ మన మాపట్టీని పరిశీలించినందువలన తెలియవచ్చుచున్నది. బ్రిటిషు సామ్రాజ్యమును ఇండియాయందు నెలకొల్పుటవలన లాభము రెండు దేశములకును కలదు. హిందూదేశమునకు మాత్రమే కలుగుటలేదు. బ్రిటిషు సామ్రాజ్యమునందు ఇండియా శిరో

మణివలె ప్రకాశించుచున్నదని సుప్రసిద్ధ ఆంగ్లేయ రాజ్యతంత్రజ్ఞులు అభిప్రాయము నిచ్చుచున్నారు. అందువలన సామ్రాజ్యమునకగు ఖర్చులు రెండు దేశములవారును భరించుట సమంజసము. అధమము 10 వంతులలో 9 వంతుల ఖర్చు ఇండియావహించి మిగిలిన ఒక వంతగు సీమఖర్చులనైనను (ఇంగ్లాండునందలి ఖర్చునైనను) ఇంగ్లాండు వహించుటన్యాయము.

సీమఖర్చుల నిమిత్తమై ప్రతి సంవత్సరమును హిందూదేశమునుండి పరదేశయాత్ర వెడలుచున్న ధనముయొక్క ఆర్థిక ఫలితములనుగూర్చి మేజరు విన్గేటుగారిట్లు వ్రాసియున్నారు:—

"గ్రేటు బ్రిటనుకు చెల్లించబడుచున్న కప్పము ఆంగ్లేయ రాజనీతియందు కేవలము అసంగతము. పన్నులు ఏదేశమునుండి విధించబడినవైగా ఆదేశమునందే ఖర్చగుట ఒకతీరు; ఒక దేశమునుండి వసూలుచేయబడి మరియొక దేశమున ఖర్చగువాని తీరువేరు. మొదటి విషయములో ప్రజలనుండి సేకరింపబడిన ద్రవ్యము ప్రభుత్వోద్యోగీయులక్రింద వెచ్చింపబడి, ఆ ధనము తిరిగి వారిద్వారా పరిశ్రామికవృత్తి యందున్న వారికే చేరును. ఆ పన్నులవలన విభజనయే మారునుకాని, దేశముయొక్క మొత్తపు రాబడి యందెవ్విధమైన నష్టమును కలుగనేరదు. ఒకదేశమునుండి సేకరింపబడిన ద్రవ్యము వేరొకదేశమున ఖర్చయ్యెనేని, దేశాదాయములో కొంతభాగము ఒక తెగ ప్రజలనుండి మరియొక తెగ ప్రజలకు మారుటలేదు సరిగదా, ఏదేశమునుండి ఆద్రవ్యము సేకరింపబడుచున్నదో ఆదేశమునకు ఆ ద్రవ్యమంతయు సంపూర్ణముగ నష్టమే. ఇందువలన దేశముయొక్క ఉత్పాదకశక్తియందు ఎట్టిఫలము కలుగుననిన, ఆ ధనమునంతయు సముద్రములోవైచిన ఎంత లాభముండునో, పై దేశములకంపిన, నంతియ లాభము."

"ఇండియా దేశమునుండి సీమఖర్చులనియెడి కప్పమును గ్రహించుట న్యాయబుద్ధితో ఆలోచించినను, నిజమైన మనస్వలాభమునుబట్టి చూచినను, ప్రపంచజ్ఞానము ననుసరించి చూచినను, లోకమునకును ఆర్థిక శాస్త్రములయందలి ముఖ్య సూత్రములకును కేవల విరుద్ధముగానున్నది. కాబట్టి ఇకనైన సీమఖర్చులను ఇంగ్లీషు కోశాగారమునుండి మనము చెల్లించుట సమంజసమైనదియు విశేషజ్ఞానముతో కూడుకొనినపనియునైయున్నది. సీమఖర్చులనగా 1. ఈస్టిండియా కంపెనీ భాగములపైని ప్రతిసాలునను చెల్లించవలసిన లాభమును, 2. ఇంగ్లాండునందుచేసిన ఋణముయొక్క వడ్డియును, 3. ఇండియా ప్రభుత్వమునకు సంబంధించిన ఇంగ్లాండునందలి ఉద్యోగస్తులయొక్క జీతములును, యస్టాబ్లిషుమెంటు ఖర్చులును, కచ్చేరీలనుంచుటకై కట్టబడిన ఇండ్లయొక్క మూల్యమును, 4. పురసంబంధమైనవియు, సేనాసంబంధమైనవియునగు ఉద్యోగస్తులయొక్క ఫర్లో (సగము జీతముపైనిచ్చు శలవు) ముజరాలు ఫించనులును 5. హిందూదేశమున పనిచేయు నిమిత్తమై సేకరించబడిన బ్రిటిషు సైన్యమునకు ఇంగ్లాండులో అయిన ఎల్లఖర్చులును, 6. ఇంగ్లండునుండి ఇండియాకును ఇండియానుండి ఇంగ్లండు

నకును సైన్యముల గొంపోవుటకగు పొగయోడ ఖర్చులలో కొంతభాగమును, అయియున్నవి.

బ్రిటిషు ఉద్యోగస్థులకు హెచ్చు జీతములను ఈయవలసి వచ్చినను, యుద్ధముల నిమిత్తమై అపారముగ ధనమును ఖర్చుపెట్టినను 1837-వ సంవత్సరమువరకు వ్యయముకన్న ఆదాయమే హెచ్చుగుచు వచ్చెను. విక్టోరియా ప్రభ్విణి రాజ్యమునకు వచ్చినతరువాత 21 సంవత్సరములలో సైతము, ఇండియాయందలి ఖర్చును మన మాలోచించినయెడల వ్యయముకన్న ఆదాయమే అధికము. సీమఖర్చులను ఇండియా వహించనక్కర లేకుండునట్లు చేసియున్నచో, ఇండియా ఋణము లేకనే పోవును సరిగదా, 1858 సం॥న ఇంగ్లీషు ప్రభుత్వమువారు దేశమును స్వాధీనము చేసికొనుతఱికి, ఇండియాదేశము నిలవనే కలిగియుండెడిది. కంపెనీవారు తమ యాజమాన్యముక్రింద నున్న నూరు సంవత్సరములలోను వృద్ధిచేసిన ఇండియా ఋణము, సీమఖర్చులను ఇండియాకు కట్టిపెట్టుటవలననే, సంప్రాప్తమైనది. న్యాయబుద్ధితో ఆలోచించితిమేని ఆ ఖర్చులను ఇంగ్లాండు భరించవలసియున్నది. గ్రేటుబ్రిటనుకు (ఇంగ్లండు, స్కాట్లండు, ఐర్లాండు) ఇండియాను వశముచేసికొని నందువలన, ప్రతిసాలునను చెల్లించెడి సీమ ఖర్చులకంటె అదనముగా లబ్ధిగలిగినది. కనుక ఆ ఖర్చులను గ్రేటుబ్రిటను భరించుట న్యాయము. మరియు 1858 సం॥ సరికి ఇండియాకు న్యాయముగా జాతీయ ఋణము లేనేలేదు సరికదా! తాను చెల్లించిన అదనపు సొమ్మును ముజరా కోరుటకుగూడ ఇండియాకు అవకాశమున్నది."



ఈ సందర్భమున గమనించవలసిన ముఖ్య విషయము మరియొకటి కలదు. కంపెనీ పరిపాలమునందు సీమ ఖర్చులు బహుస్వల్పము. మొత్తపు రాబడియందు పదియవ వంతున కెన్నడును హెచ్చలేదు. సిపాయి ముట్టడికి పూర్వము 20 సంవత్సరములలోను ఇండియాయొక్క ఆదాయము 20 మిలియన్ల పౌనులనుండి 31 మిలియన్లవరకును పెరిగెను. సీమ ఖర్చులన్ననో $2\frac{1}{2}$ మిలియన్లనుండి $3\frac{1}{2}$ మిలియన్లవరకు పెరిగినవి. బ్రిటిషు ప్రభుత్వమువారు స్వయముగా ఇండియాను ఏలుట కారంభించినది మొదలు సీమఖర్చులు విపరీతముగా పెరిగిపోయినవి. "ఇంగ్లీషు ప్రభుత్వమువారు తగినంత శ్రద్ధను తీసికొనని హేతువుచే, ఆదాయముకంటె వ్యయము అనేకరెట్లు పెరుగుచువచ్చెను."

1792-వ సంవత్సరమునకు నిలిచియున్న ఇండియాఋణము 7 మిలియన్ల పౌనులుమాత్రమే? 1799 సరికి 10 మిలియన్లయినది. వెల్లస్లీ ప్రభువుయొక్క యుద్ధము లారంభమగుటవలన 1805 సం॥నకు 21 మిలియన్లయి 1807 సరికి 27 మిలియన్లవరకు పెరిగిపోయినది. కొంతకాలమువరకు అటులనేయుండి బెంటింకు ప్రభువు గవర్నరుజనరలుగావచ్చిన రెండవసంవత్సరమగు 1829 సం॥న ఇండియా ఋణము 30 మిలియన్ల వరకును వృద్ధిగాంచినది. ఈస్టిండియా కంపెనీ తరపున వ్యవహరించిన ఉద్యోగస్తులలో ఈ మహామహుడొక్కడే, ఇండియా ఋణమును తగ్గించుటకు విశేష ప్రయత్నములు చేసినవాడు. 1836 సంవత్సరము 30 ఏప్రియలు సరికి నిలిచియున్న ఇండియా ఋణము 26,947,434 పౌనులు.

కంపెనీ యాజమాన్యముక్రింద ఇండియా దేశము ఉన్న 21 సంవత్సరములలోను పెరిగిన ఇండియా ఋణము ఈ క్రింద పొందుపర్చబడిన పట్టీవలన తెలియనగును.

2

| సంవత్సరము | ఇండియా ఋణము | ఇంగ్లండునందు చేసిన ఋణము | మొత్తము |
|---|---|---|---|
| 1837-38 | 30,249,803 | 3,552,825 | 33,772,718 |
| 1838-39 | 30,231,162 | 1,734,300 | 31,965,462 |
| 1839-40 | 32,750,69 | 1,734,300 | 34,484,997 |
| 1840-41 | 34,187,727 | 1,734,300 | 35,992,127 |
| 1844-45 | 41,203,150 | 2,299,600 | 43,502,750 |
| 1845-46 | 41,592,249 | 2,299,600 | 43,891,849 |
| 1846-47 | 44,584,625 | 2,299,600 | 46,884,625 |
| 1850-51 | 51,199,815 | 3,899,500 | 55,099,315 |
| 1855-56 | 53,848,922 | 3,915,317 | 57,764,239 |
| 1856-57 | 55,546,652 | 3,915,317 | 59,461,969 |
| 1857-58 | 60,704,084 | 8,769,400 | 69,473,484 |

1839-40 సం॥ లలో పెరిగిన 2½ మిలియన్ల పౌనుల ఇండియాఋణము సరియైనదికాదు. లెక్కలను వ్రాయుటయందు గలిగినమార్పులచే అధికముగా కానవచ్చెను. ఆక్లండు ప్రభు నారంభించిన ఆఫ్గనుయుద్ధమువలన 1840-41 మొదలు 1844-45 వరకు 34½ మిలియన్లనుండి 43½ మిలియనుల వరకు ఋణముపెరిగినది. ఒక్క ఈస్టిండియా కంపెనీవారు మాత్రమే కాక జాన్ బ్రైటు అను నొక ఆంగ్లేయశాస్త్రజ్ఞుడు



సైతము ఆఫ్గనుయుద్ధముయొక్క ఖర్చులను ఇండియాకు కట్టిపెట్టుట అన్యాయమని తీవ్రముగా వాదించెను. 'ఇంగ్లీషు రాజ్యాంగ మంత్రులవలన ఇంగ్లీషుసామ్రాజ్యలాభము నిమిత్తమై చేయబడిన ఈ ఆఫ్గను యుద్ధముయొక్క ఖర్చు-15 మిలియన్ల పౌనులు-ఇంగ్లీషుప్రజలే భరించవలసియున్నది.' సిక్కుయుద్ధములవలన 1850-51 సరికి ఇండియాఋణము 55 మిలియనులైనది. డల్‌హౌసీ ప్రభువుయొక్క ఏలుబడియందు, తక్కువ చేయుటకు ఎన్నిప్రయత్నములు సల్పబడినను ఇండియాఋణము 59½ మిలియనులైనది. 1857-వ సం॥న జరిగిన సిపాయిముట్టడివలన సంవత్సరాంతమునకు నిలిచియున్న ఇండియా ఋణము 69½ మిలియనులు. ఈస్టిండియా కంపెనీనుండి ఇంగ్లీషు ప్రభుత్వమువారి ఏలుబడి క్రిందకు ఇండియాదేశము వచ్చుసరికి 69½ మిలియన్ల సవరనులుగ ఇండియాఋణము నిలిచియుండెను.

'ప్రపంచమునందేదైన న్యాయమగు తిరుగబాటున్నచో అది ఈస్టిండియాకంపెనీపై హిందూముసల్మాను సిపాయిలయొక్క తిరుగబాటే అయియున్నది. ఆవుయొక్కయు పందియొక్కయు కొవ్వును అంటించిన తూటాలను సిపాయిలను ఉపయోగింపుడని వీరు కోరుటవలన వారు ఎదిరించుట న్యాయమని' ఒక నిష్పక్షపాత బుద్ధిగల చరిత్రకారుడు వ్రాసియున్నాడు. బ్రిటిషు పాలనాధికారులు ఈపొరపాట్లను గావించిరి. అయిన ఖర్చునుమాత్రము ఇండియావహించినది. ఇంతకుముందు ఇండియాసైన్యము చీనా ఆఫ్గను స్థానములయందు ఉపయోగింపబడినది. ఇండియా సరిహద్దులుదాటి ఇండియాసైన్యములు పనిచేసినందుకుగాను ఏవిధమైన ముజరాను ఇచ్చి

యుండలేదు. కాని, సిపాయిముట్టడిని అణచుటకై ఇంగ్లాండు నుండి పంపబడిన బ్రిటిషు సైన్యముయొక్క ఖర్చుమాత్రము ఇండియాదేశమునుండి వసూలుచేయబడినది.

ఆశ్రయదేశములయొక్కయు, అధినివేశనముల యొక్కయు పరిపాలన విషయమై ఇంగ్లాండునందు నెలకొల్పబడిన కచేరీలయొక్క ఎల్లఖర్చులును సైనిక నావికాదళసంబంధమగు ఖర్చులును, ఇంగ్లాండుదేశమే భరించుచున్నది. ఈతీరుగనే ఇండియాసంబంధమగు ఖర్చులను సైతము ఇంగ్లాండు భరించుట న్యాయము. ఇండియా సామ్రాజ్యమును శత్రువులనుండి కాపాడుటకై నియోగింపబడియున్న సైనికవ్రాతమునకగు ఖర్చులలో ఒక్కషిల్లింగు (12 అణాలు) నైన బ్రిటనుదేశము భరించుట లేదు.

అధినివేశనములకేమి, ఇతర విదేశప్రభుత్వములకేమి అవసరము వచ్చినపుడు ఎంతద్రవ్యము ఖర్చుఅయినను వెనుదీయక సహాయమొనరించు ఇంగ్లాండు దేశము, ఇండియా సామ్రాజ్యము అఖండమైన ధనక్షోభచే పీడింపబడుచున్నతరి, సహాయమునొసంగక వెనుదీయుట చాల ఆశ్చర్యకరముగను విపరీతముగను ఉన్నది.

సహాయము నొసంగుటలేదు సరికదా, ఇండియాకు పంపిన బ్రిటిషుసైన్యములయొక్క ఎల్లఖర్చులను గ్రేటుబ్రిటను వసూలు చేయుటయేకాక, ఆసైన్యములు ఇంగ్లండునుండి ఇండియాకు బయలుదేరుటకు పూర్వము, ఇంగ్లండులోనున్న ఆరు



మాస ములకైన ఖర్చులనుకూడ ఖచితముగ వసూలు చేసినది.

ప్రజాప్రతినిధి సభయును, ఇంగ్లీషుప్రజలును సరిగా వ్యవహరించని లోపముచే ఈయుపద్రవము సంభవించినది. గనుక ఇంగ్లీషుప్రజలే ఈభారమును వహించుట న్యాయమని జాన్ బ్రైటుగారు నొక్కివక్కాణించిరి.

ఇండియాదేశమును యుద్ధములుచేసి జయించిస్వాధీనపరచుకొనుటకును, పరిపాలించుటకును, ఇండియాయందలి ద్రవ్యసాధనములను వాడుకలోనికి తెచ్చుటకును, బ్రిటిషుప్రజలచే పెట్టుబడి పెట్టబడినమూలధనమే, ఇండియా ఋణమునకు కారణమని కొందరియభిప్రాయము. అట్టి యభిప్రాయము సరికాదు. 1858 సం॥ వరకు తనను జయించుటకును పరిపాలించుటకును కావలసిన ధనమును ఇండియాదేశమే వహించినది. 1858వరకు విన్గేటుగారి లెక్కప్రకారము 19-వ శతాబ్దమునుండి, వడ్డీనిగాక, నూరుమిలియన్లవరకు ఇండియాకప్పమును చెల్లించినదని తేలుచున్నది. 18-వ శతాబ్దమునందు గ్రహించిన సొమ్మును లెక్కించనేలేదు.

"సీమఖర్చులనుపేర వసూలు చేయబడిన ఈకప్పమే ఇండియాఋణమునకు కారణము" తనపరిపాలనకు కావలసిన యావత్తుఖర్చును, దేశమునందు తరచుగ జరగుచువచ్చిన సంగ్రామములకును, కొన్నికొన్ని ప్రదేశములను ఆక్రమించుకొనుటకునై కావలసిన ద్రవ్యమును, ఇండియాదేశమే భరించినది. స్వదేశమునందలి ఖర్చులకు అదనముగా సీమఖర్చులకువలయు

1856-57 సంవత్సరమునకు నిలిచియున్న ఇండియా ఋణము 59½ మిలియన్లు. ఆ మరుచటి సంవత్సరము 69 మిలియన్లయినది. సిపాయి ముట్టడిని అణచు నిమిత్తము చేయబడిన యుద్ధములయొక్క ఖర్చును ఇండియాకు కట్టిపెట్టుటచేత 1860 సం॥ న ఇండియా ఋణము నూరుమిలియన్లకు పైబడినది. గారంటిపద్ధతిని మానివేసి సర్కారువారే, ఋణము చేసి తెచ్చిన ధనముతో రైల్వేలు 1870 సం॥ నుండి నిర్మించ నారంభించిరి. జాగ్రత యనునది గమనించక ఇచ్చవచ్చినచోట్ల నెల్ల ఇనుపదారులు నిర్మింపబడుటచేత ఇండియా ఋణము 1870 సం॥ నుండి విశేషముగా వృద్ధి కాదొడంగినది.

| సంవత్సరము | ఇండియా ఋణమును ఇతర బాకీలును | ఇంగ్లాండునందలి ఋణము | మొత్తము |
|---|---|---|---|
| | పౌనులు | పౌనులు | పౌనులు |
| 1858-59 | 66,682,031 | 15,69 ,277 | 81,171,308 |
| 1869-70 | 72,999,633 | 35,196,700 | 108,186,338 |
| 1870-71 | 31,371,859 | 54,627,617 | 118,000,476 |
| 1874-75 | 81,738,594 | 43,597,038 | 130,835,597 |
| 1875-76 | 84,759,779 | 49,797,633 | 134,556,809 |
| 1876-78 | 83,537,922 | 55,897,033 | 138,935,025 |

1876-77 సంవత్సరాంతమున నిలిచియున్న 139 మిలియన్ల ఇండియాఋణమునందును, ప్రభుత్వమువారు సర్కారు రైల్వేలపైనను నీటిపారుదల పనులపైనను ఖర్చు పెట్టబడిన ద్రవ్యము మాత్రము ఇమిడియున్నది. 1876-77సం॥సరికి సర్కారువారు, సర్కారు-ఇనుపదారులక్రిందను, నీటిపారుదల



పనుల నిమిత్తమును 24 మిలియన్ల పౌనులు వినియోగించిరి. అందు, ఇనుపదారులకైన వ్యయము 141,651,353 పౌనులు. నీటిపారుదల పనులకు వెచ్చించినది 9,651,618 పౌనులు.

ఈఋణమునందు న్యాయముగా బ్రిటిషు ప్రభుత్వమువారిచే, తమ కోశాగారమునుండి చెల్లించవలసినదియు ఇండియాకు అన్యాయముగా కట్టిపెట్టబడినదియు నగు ఈస్టిండియా కంపెనీ భాగస్వాముల మూలధనము 12 మిలియన్ల పౌనులును చూపబడలేదు. ఇండియా దేశముమాత్రము ఇప్పటికిని ఈ ద్రవ్యమునకు వడ్డీని చెల్లించుచునే యున్నది.

ఈస్టిండియా కంపెనీవారు పెంచిన 69½ మిలియన్ల ఋణమును గురించి ఇదివరకే ముచ్చటించితిమి. కాని బ్రిటిషు ప్రభుత్వమువారి ఏలుబడి క్రిందకువచ్చిన 19 సంవత్సరముల లోను, ఇండియాఋణము—ఈస్టిండియా కంపెనీవారి మూలధనము గాక—రెండింతలయినదని వ్రాయుటకు చాలవిచారకరముగా నున్నది.

విశేషముగ పెరిగిపోయిన ఇండియా ఋణమును గురించి నిష్పక్షపాత బుద్ధితో తీర్పునొసంగెడి ఇతర న్యాయస్థానమువారెవరైన ఇండియాదేశమునకు సంబంధించిన ఎల్ల రాజస్వ విషయములను పరిశీలించి తీర్పునొసంగెదరను కొందము.

అట్టి న్యాయస్థానముయొక్క తీర్పెటులనుండునని మన మాలోచించవలసిన అగత్యములేదు. కంపెనీవారు పెంచిన 69½ మిలియన్ల పౌనులను ఒక్కసారిగా తీసి వేసియుందురు. ప్రాయశః వారు సిపాయి ముట్టడిని అణచు నిమిత్తము

1856-57 సంవత్సరమునకు నిలిచియున్న ఇండియా ఋణము 59½ మిలియన్లు. ఆ మరుచటి సంవత్సరము 69 మిలియన్లయినది. సిపాయి ముట్టడిని అణచు నిమిత్తము చేయబడిన యుద్ధములయొక్క ఖర్చును ఇండియాకు కట్టిపెట్టుటచేత 1860 సం॥ న ఇండియా ఋణము నూరుమిలియన్లకు పైబడినది. గారంటిపద్ధతిని మానివేసి సర్కారువారే, ఋణము చేసి తెచ్చిన ధనముతో రైల్వేలు 1870 సం॥ నుండి నిర్మించ నారంభించిరి. జాగ్రత యనునది గమనించక ఇచ్చవచ్చినచోట్ల నెల్ల ఇనుపదారులు నిర్మింపబడుటచేత ఇండియా ఋణము 1870 సం॥ నుండి విశేషముగా వృద్ధి కాదొడంగినది.

| సంవత్సరము | ఇండియా ఋణమును ఇతర బాకీలును | ఇంగ్లాండునందలి ఋణము | మొత్తము |
|---|---|---|---|
| | పౌనులు | పౌనులు | పౌనులు |
| 1858-59 | 66,682,031 | 15,69 ,277 | 81,171,308 |
| 1869-70 | 72,999,633 | 35,196,700 | 108,186,338 |
| 1870-71 | 31,371,859 | 54,627,617 | 118,000,476 |
| 1874-75 | 81,738,594 | 43,597,038 | 130,835,597 |
| 1875-76 | 84,759,779 | 49,797,633 | 134,556,809 |
| 1876-78 | 88,537,922 | 55,897,033 | 138,935,025 |

1876-77 సంవత్సరాంతమున నిలిచియున్న 139 మిలియన్ల ఇండియాఋణమునందును, ప్రభుత్వమువారు సర్కారు రైల్వేలపైనను నీటిపారుదల పనులపైనను ఖర్చు పెట్టబడిన ద్రవ్యము మాత్రము ఇమిడియున్నది. 1876-77సం॥సరికి సర్కారువారు, సర్కారు-ఇనుపదారులక్రిందను, నీటిపారుదల



పనుల నిమిత్తమును 24 మిలియన్ల పౌనులు వినియోగించిరి. అందు, ఇనుపదారులకైన వ్యయము 141,651,353 పౌనులు. నీటిపారుదల పనులకు వెచ్చించినది 9,651,618 పౌనులు.

ఈఋణమునందు న్యాయముగా బ్రిటిషు ప్రభుత్వమువారిచే, తమ కోశాగారమునుండి చెల్లించవలసినదియు ఇండియాకు అన్యాయముగా కట్టిపెట్టబడినదియు నగు ఈస్టిండియా కంపెనీ భాగస్వాముల మూలధనము 12 మిలియన్ల పౌనులును చూపబడలేదు. ఇండియా దేశముమాత్రము ఇప్పటికిని ఈ ద్రవ్యమునకు వడ్డీని చెల్లించుచునే యున్నది.

ఈస్టిండియా కంపెనీవారు పెంచిన 69½ మిలియన్ల ఋణమును గురించి ఇదివరకే ముచ్చటించితిమి. కాని బ్రిటిషు ప్రభుత్వమువారి ఏలుబడి క్రిందకువచ్చిన 19 సంవత్సరముల లోను, ఇండియాఋణము—ఈస్టిండియా కంపెనీవారి మూలధనము గాక—రెండింతలయినదని వ్రాయుటకు చాలవిచారకరముగా నున్నది.

విశేషముగ పెరిగిపోయిన ఇండియా ఋణమును గురించి నిష్పక్షపాత బుద్ధితో తీర్పునొసంగెడి ఇతర న్యాయస్థానము వారెవరైన ఇండియాదేశమునకు సంబంధించిన ఎల్ల రాజస్వ విషయములను పరిశీలించి తీర్పునొసంగెదరను కొందము.

అట్టి న్యాయస్థానముయొక్క తీర్పెటులనుండునని మన మాలోచించవలసిన అగత్యములేదు. కంపెనీవారు పెంచిన 69½ మిలియన్ల పౌనులను ఒక్కసారిగా తీసి వేసియుందురు. ప్రాయశః వారు సిపాయి ముట్టడిని అణచు నిమిత్తము

ఇండియాకుపంపిన బ్రిటిషు సైన్యముల యొక్క ఖర్చు 40 మిలియన్ల పౌనులును ఇండియా చెల్లించుట యుక్తమని తీర్పుచేసియుందురు. అయిన వారు సామ్రాజ్య సంబంధమయిన యుద్ధములలో అఫ్ఘనిస్థానమునందును, చీనా, పెరిషియా, అబిసీనియా దేశములయందు నియోగించబడిన ఇండియా సైన్యముల యొక్క ఖర్చును ఇండియాకు ముజరానిచ్చియే యుందురు. అటులజేసినచో ఇండియా చెల్లించవలసిన శేషమేమైనఉన్నను బహు స్వల్పముగా నుండును. సర్కారువారు ఇండియా యొక్కక్షేమమునిమిత్తమై వ్యయముచేసిన 24 మిలియన్ల పౌనులను ఉంచియుందురు. వారు దాని కొరకు యేర్పాటును మాత్రముచేసి యుందురు. అట్టి పనులకు అప్పు చేయుటను మాత్రము కట్టిపెట్టుమని వ్రాసియుందురు. ఏలననగా, ఇనుపదారులు ఇతర కంపెనీలేవైన పూనుకొనువరకు ఆపుచేయ వచ్చును; నీటిపారుదల పనులు మాత్రము సర్కారువారికి ప్రతిసాలునను వచ్చెడి రాబడినుండి ఖర్చుపరచి, వృద్ధిచేయ వలసినదని తీర్పు నొసంగియుందురు. ఈతీరున నూరుమిలియన్ల ఋణము తుడిచి వేయబడియుండును. శేషము ఇండియా రాజస్వమువలననే, ఈనూరు మిలియన్లకును వడ్డీ చెల్లించ నక్కరలేకుండ పోవుట వలన, అలతికాలములో తీరిపోగలదు. దేశీయ ఋణమన్న మాటయే ఉండకపోవును. ఇండియాయందు దేశీయ ఋణముండవలసిన అగత్యము లేదు.

దేశీయ ఋణమనునది ఇండియా దేశమున పూర్వపు రాజుల పరిపాలనమునం దెచ్చటను కానరాదు. కొన్నిసమయములయందు, హిందూ ముసల్మానురాజులు సొమ్మును అప్పు



తీయవలసి వచ్చినను వారిపూచీమీదనే అప్పు తెచ్చుచుండిరి. ఇంగ్లాండునందలి రాజులు సైతము పూర్వకాలమున రాజద్రవ్య సంబంధమైన నగలను తాకట్టుపెట్టిగాని, ఆఋణ తీర్మానము నిమిత్తమై కొన్ని బాబతుల ఆదాయమును కేటాయింపు చేసిగాని, బ్యాంకరుల (Bankers) వద్ద అప్పు తెచ్చుచుండిరి. 1688 సం॥ వరకు ఇంగ్లండు దేశమున దేశీయ ఋణమన్న మాటయే లేదు. ఒక మిలియను పౌనులకు తక్కువగా (664, 268 పౌనులు) ఉండెను. పూర్వము ఇండియాను ఏలిన రాజుల పద్ధతినిగాని లేదా 17-వ శతాబ్దమునందలి ఇంగ్లీషు నీతినిగాని బ్రిటిషు పాలకులు ఇండియాయందు అవలంబించి యుండిన యడల ఎంతయో లాభకరముగ నుండి యుండును; అటుల జేయక నూతనముగా ఐరోపాఖండమునం దవలంబింపబడిన దేశీయ ఋణమును, ఇండియాయందుకూడ తెచ్చిపెట్టిరి.

అన్యదేశములను జయించుటకును, అధినివేశములను వృద్ధిచేయుటకును, ఇతర దేశస్థులతో పాటు తమగౌరవ మర్యాదలను నిలబెట్టుకొనుటకును ఐరోపా దేశస్థులు నవీనముగా దేశీయ ఋణమును (National debt) కల్పించిరి. ఏ ఇతర దేశములను ఇండియా జయించ నపేక్షించుటలేదు. ఆసియాఖండమున దానికి పోటీ దేశము లెవ్వియును లేవు. బలవత్తరమైనదియు న్యాయమైనదియు నగు ప్రభుత్వమునుకలిగి యున్నపుడు ఈదేశమునకు ఎవ్విధమైన భయమును లేదు. ప్రతి సాలునను వచ్చెడి ఆదాయమునుండియే ఇంగ్లీషువారు ఈదేశమును స్వాధీనపరచుకొనుటకు వెచ్చించిన ఖర్చులను హిందూదేశము చెల్లించగలిగినది. దేశక్షేమకరములగు పనులనుసర్కా

రువారు పూనికొనినప్పుడు, దేశముయొక్క ఆదాయమునుండియే వెచ్చించుట సమంజసము. ఇట్టిదేశములో శాశ్వతమైన దేశీయ ఋణమును కల్పించుటకు అగత్యములేదు. సిపాయిముట్టడి యుద్ధములైనతరువాత దేశమందెల్లెడల శాంతి నెలకొనియున్నప్పుడును, బ్రిటిషుప్రభుత్వమువారు స్వయముగ పాలించనారంభించినపుడును, దేశీయఋణమును వృద్ధిచేయ నగత్యములేదు. లారెన్సుప్రభువు ఖర్చునంతయు ఆదాయమునుండి భరించుటకు ఎన్నియో ప్రయత్నములు సల్పెను. మేయో (Mayo) ప్రభువు ఋణముచేసి తెచ్చిన ధనముతో ప్రజోప యోగమగు పనులను ప్రారంభించుట పొరపాటు. ధనముసులభముగా అప్పుపుట్టినపుడు ఖర్చుకూడ శీఘ్రముగా అగుచునే యుండును. అందువలననే ఋణము వృద్ధిగాంచు చుండెను.

19-వ శతాబ్దమునందెల్ల గొప్ప కోశాగారమంత్రి (Financier) యనిపేరొందినగ్లాడుస్టను (Gladstone) మంత్రి, ఇండియాయొక్క ఋణమును, వ్యయమును, విపరీతముగా హెచ్చుటను కనిపెట్టినవాడై దానిని తగ్గించుటకుగాను 1871 సం॥ న ఒకకమిటీని నియోగించెను. గ్రేటుబ్రిటను దేశమునకు ముఖ్యరాజ్యాంగ మంత్రియగుటచే, ఈసభయందీతడు కార్యభారమును వహించుటకు వీలుచిక్కలేదు. ఈమహానుభావు డందుండియుండిన, ఎంతయో లాభకరముగ నుండెడిది. హెన్రీఫాసెట్టను ఒకఇండియా దేశమిత్రుని తనస్థానే అసభయందీయన ప్రవేశపెట్టెను. 3, 4 సం॥ లవరకు ఈసభవారు పనిచేసి చాలసాక్ష్యమును గ్రహించిరి. కాని స్వతంత్ర ప్రభుత్వము (Liberal Government) 1874 సం॥ నందు మారి



పోవుటవలన ఈసభవారియొక్క శ్రమ వృథయయ్యెను. అయినను ఈసభవారు విచారణచేసిన సాక్షులుచెప్పిన సంగతులు మాత్రము సర్వ జనాదరణీయంబులై యున్నవి.

అందలి సాక్ష్యములను మూడునాల్గింటిని, ఇందు పొందుపరచుచున్నాము.

1865 మొదలు 68 సంవత్సరములవరకు ఇండియాకోశాగారమంత్రిగ పనిచేసిన, మాసీ దొరగారొక ముఖ్యసాక్షి. సభవారియెదుట నీతడు సోత్కంఠముగా ఆదాయమునుబట్టి, వ్యయమును తగ్గించవలెనని సహేతుకముగా చర్చించెను.

"వ్యయమునకు సరిపోవునట్లుగా ఆదాయమును వృద్ధిజేయ వలయుననియెడినీతి, ఇంగ్లీషు రాజస్వమునకు చెందియున్నది. నా యభిప్రాయమున ఇండియా రాజస్వమునందు దీనికి వ్యతిరేకపునీతిని అవలంబించవలసి యున్నది. ఇందులకుగల ముఖ్యకారణము దేశమునందలి ద్రవ్యసాధనములు బహుస్వల్పము. ఏమాత్రమయినను అధికముగ చేసితిమేని నష్టము (Deficit) సంప్రాప్తించును. ఏపన్నును విస్తరింప జేయుటకు వీలులేదు. రాబడిపన్నుదక్క ఏక్రొత్తపన్నును ఇపుడుకల్పింప వీలులేదు. నాకు తెలిసినంతవరకు క్రొత్తపన్నులువేయుటకు ఎవ్విధమైన ఆధారములునులేవు. కాబట్టి ఇండియాదేశపు రాజస్వవ్యవహార కర్తలందరు (Financiers) వ్యయము, ఆదాయమునకు సరిపోవునట్లుగా తగిన ఏర్పాటులనుజేసికొనుట విధియైయున్నదని నొక్కి వక్కాణించగలను."

1834 సం॥ న ఈస్టిండియా కంపెనీ డైరక్టరులకు వెల్లింగ్టను ప్రభువువారు, వ్యయమును ఆదాయముకంటె హెచ్చించకుండ చేయవలెనని జవాబు నిచ్చియున్నారు. "డ్యూకు ఆఫ్ వెల్లింగ్టను వారిచ్చిన జవాబుయొక్క సారమును గ్రహించినవారై, ఆతీరుగనే హిందూదేశమునం దంతటను అమలు జరపిన చాల బాగుండునని" మాసీదొరవారు నుడివిరి.

సర్ ఛార్లెసు ట్రివిలియను గారిచ్చిన సాక్ష్యము ఇంతకంటెను బలవత్తరమైనదియును నిర్దిష్టమైనదియు నైయున్నది. ఈమహానుభావుడు కూడ ఇండియాదేశమున కోశాగారమంత్రి పదవిని వహించినవాడే. ఈతడు మదరాసు గవర్నరుగ నున్నపుడు నాలుగుసార్లు వ్యయమును, పన్నులును, అధికము చేయ గూడదని నిర్భయముగా పోరాడెను. 1859 సం॥ న పొగాకుపై పన్ను విధించరాదని అభ్యంతర పెట్టెను. "నాటినుండియు ఇండియాలో రాజస్వవిషయమున రెండు పరస్పర విరుద్ధములగు రాజ్యనీతులు ఉండుట తటస్థించినది; వ్యయమును తగ్గించవలయునని యెడి రాజ్యనీతిని బలము చేయవలెనని నావాదము; కలకత్తాకును ఇంగ్లండునకును సమ్మతిమైన రాజ్యనీతి, పన్నులను హెచ్చించ వలసినదనియే." ఆసంవత్సరముననే రెండు మూడు సారులు గవర్నరు జనరలువారికి ఖర్చులను తగ్గించవలసినదని అభ్యంతర పెట్టుచు వ్రాసెను. 1860 సం॥ మార్చి 20 తేదీని, నాల్గవసారి ఈయన-తిరిగిఆటంక పెట్టుటవలన ఉద్యోగమునకు సైతము రాజీనామా సీయవలసివచ్చెను. ఆదాయమును బట్టివ్యయమును నిర్ణయించుకొన వలయునని ఈమహామహుడు ఘోరముగాపోరాడెను. రాజస్వ విషయములయందును, అన్ని



ఇతరవిషయములయందును ప్రజాప్రతినిధుల సలహానుతీసికొని వ్యవహరించుటయే క్షేమకరమని ట్రివిలియనుగారు నొక్కి వక్కాణించిరి.

"ఇండియాదేశ పరిపాలనమునందు ప్రజల కెవ్విధమైన ప్రమేయమును లేకుండ జేసి, వెలిజేసినట్లు వేరుగా నుంచుచున్నాము; మనము ఏదైన ఒకదానిని ఆలోచించి, దానిని గురించి విశేషముగా వారిని అడుగకయే ఆప్రకారము ఆచరించుట మంచిదని మాత్రము చెప్పి అమలులోనుంచు చుందుమని" సర్ రాబర్టు మాంట్గోమరీగారు నుడివిరి. ప్రతిస్థానిక ప్రభుత్వాధిపతియును (Local Governor) దేశీయప్రతినిధులు గల యొక ఆలోచనసభను (Consultative body) కలిగియున్న పక్షమున పన్నులను విధించు విషయమునను, న్యాయశాస్త్రమునందు మార్పులొనర్చు విషయమునను ప్రజల అభిప్రాయములను, ప్రభుత్వోద్యోగుల అభిప్రాయములను తెలిసికొనినవాడై, ఋజుపథమున దేశమును పాలించుటకు వీలలపడునని, ఈమహాను భావుని యుద్దేశ్యము.

గే (Gay) యనునొక ప్రముఖుడు రాజస్వ సభవారి యెదుట ఒక నివేదనాపత్రమును (స్టేటుమెంటు) దాఖలుచేసెను. ఈపత్రమునందు సిపాయి ముట్టడికి పూర్వము 1856-57 సం॥యొక్క పన్నులును, ప్రభుత్వమువారు పరిపాలించనారంభించిన పండ్రెండవ వత్సరమగు 1870-71 సం॥ యొక్క పన్నులను చూపబడినవి. ఇక్కాలమున ఇండియా సామ్రాజ్యము ఉన్నది ఉన్నయట్టులనే యున్నది కాని వృద్ధి కాలేదు; ద్రవ్య

సాధనములుగాని కళలుగాని అభివృద్ధిలోనికి రాలేదు; దేశమునందు పన్ను వేయుదగిన సంపద యందుగాని ప్రజలయొక్కస్థితిగతులయందుగాని ఏవిధమైన వృద్ధియు కానరాదు; అయినను పన్నులు మాత్రము అపరిమితముగా వృద్ధియైనవి. అందు ముఖ్యముగా ఉప్పు పన్నును, మరికొన్ని ఇతర పన్నులును అద్భుతముగా పెరిగినవి.

వానిలో కొన్నిటిని ఈదిగువను పొందుపరచుచున్నాము.

| బాబతు వారీ రివిన్యూ | 1856-57 | 1870-71 |
|---|---|---|
| | పౌనులు. | పౌనులు. |
| భూమిపన్ను | 20,046,748 | 24,170,151 |
| ఇతరపన్నులు (Assessed taxes) | 108,833 | 2,072,025 |
| కస్టమ్సుపన్నులు (సముద్రముపై ఎగుమతి దిగుమతులు కాబడు వస్తుసంచయము పై వసూలు చేయబడు సుంకము) | 1,191,985 | 2,610,789 |
| ఉప్పుపన్ను | 3,610,223 | 6,106,280 |
| నల్లమందు | 4,988,434 | 8,045,459 |
| ఇతరబాబతుల రివిన్యూ | 1,974,687 | 6,371,521 |
| మొత్తము... | 31,920,910 | 49,376,225 |

బ్రిటిషు ప్రభుత్వమువారు ఇండియాను స్వాయముగ పాలించనారంభించిన పంద్రెండు సంవత్సరములలోను పన్నులు నూటికి యేబదివంతున హెచ్చయినవి. పన్నులు అధికమైనవనియును, సర్కారువారు పన్నులను తగ్గించునిమిత్తమై ఎవ్విధ



మైన ప్రయత్నములును సల్పలేదనియును, 1856-57 సం॥ నకంటె 19 మిలియన్లు పెరిగెననియు, బొంబాయి ప్రజాసంఘము వారు 1871 సం॥ రం మార్చి 29 తేదీని పార్లమెంటువారికొక మహజ రర్జీని పంపుకొనిరి.

దేశభక్తుడగు మన దాదాభాయి నౌరోజీ ఇండియా పక్షమున సాక్ష్యము నొసంగుచు బ్రిటిషుపరిపాలనమునందు ఏటేట పన్నులు అధికముగా పెరుగుచుండెననియును, సంపదయు ద్రవ్యసాధనములును క్షీణించుచున్నవనియును, దేశమునందెల్లెడల దరిద్రదేవత మూర్తీభవించియుండెననియును, అతి గంభీర వాక్కులతో సభవారి యెదుట సహేతుకముగ జర్చించెను.

"ఇంగ్లాండుదేశము తనద్రవ్యసాధనములనుండి (మేయో ప్రభువుగారు చెప్పినప్రకారము) సాలునకు డెబ్బది మిలియన్ల పౌనులు ఆదాయమును సంపాదించుచున్నది. అందు సర్కారు ఋణమునకు చెల్లించవలసిన వడ్డీక్రింద 27 మిలియన్ల పౌనులను తీసివేయగా, గవర్నమెంటువారి ఇతరఖర్చులకుగాను 43 మిలియన్ల పౌనులు మిగులుచున్నవి. ఇంగ్లీషు ప్రజలయొక్క ఆదాయములో ఖర్చు నూటికి అయిదున్నర వంతగుచున్నది. బ్రిటిషు ఇండియా ప్రభుత్వమువారికి సాలునకు ఏబదిమిలియన్ల సవరనుల ఆదాయము వచ్చుచున్నది. అందు 8 మిలియన్ల సవరనులు, ఇండియా ఋణముయొక్క వడ్డీక్రిందను, ఇనుపదారుల క్రిందను తీసివేయగా, 42 మిలియన్ల సవరనులు ప్రభుత్వము వారి ఇతర ఖర్చులకు మిగులుచున్నది. ఇది 300 మిలియన్ల

ప్రజలయొక్క ఆదాయములో నూటికి 14-వ వంతు అగు చున్నది. ఇండియాగవర్నమెంటువారు బ్రిటిషు గవర్నమెంటు కన్న, రెండున్నరరెట్లు అధికముగా వ్యయము చేయుచున్నారు."

ఇండియా ప్రజలెంత సహేతుకముగా ఖర్చుతగ్గించ వలయునని మొఱలిడినను నిష్ప్రయోజనములైనవి. పన్నుల యందుగాని, వ్యయమునందుగాని అణుమాత్రమైనను తగ్గించ బడలేదు. మేయోప్రభువుగారి క్రొత్త ఏర్పాటులవలన స్థానిక ప్రభుత్వములవారు మరికొన్ని క్రొత్తపన్నులను విధించుట గూడతటస్థించినది. ప్రజాప్రతినిధులసలహాను వడయుట అవసర మని సర్ ఛార్లెసు ట్రెవిలియనువంటి అనుభవశాలులగు పాలకు లెందరు సలహానిచ్చినను అంగీకరించరైరి.

ఇండియాదేశము నందలి వ్యయము చాలనట్లు చీనా, అబిసీనియాల యుద్ధములయొక్క ఖర్చులను, తంతిమార్గముల కైన ఖర్చులును, సేనాసంబంధములైన ఖర్చులును న్యాయ ముగా ఇంగ్లీషు రాజస్వమునుండి చెల్లించబడ వలసియున్నను, ఇండియాదేశముననే కట్టిపెట్టబడుచు వచ్చినవి.

1858 సం॥ వరకు ఇట్టివిషయములయందు ఈస్టిండియా కంపెనీ డైరక్టరులు ఆటంకపెట్టుచునే యుండెడివారు. కంపెనీ తీసివేసిన తరువాత ప్రజాప్రతినిధులకు పాలనమునందు ప్రమే యము కలిగించుకొనుటకు వీలులేదయ్యెను. బ్రిటిషు ఆంత రంగిక సభయందు ఇండియాకార్యదర్శి ఒకసభ్యుడు. ఆంత రంగిక సభవారందరు ఎద్దేని ఒకమార్గము నవలంబించుదమన్న, వారియూహలకు ఈయన అడ్డుచెప్పజాలడు. ఇక కార్యదర్శి



గారి సభ్యులన్నను ఇద్దరుదక్క మిగిలినవారు ఇండియా ప్రతి నిధులు గాకపోవుటచేత బ్రిటిషుప్రజలయొక్క ఆశయములకు ప్రాముఖ్యతనీయక వీలులేదు. ఇండియా దొరతనమువారును వారికార్య నిర్వాహకసభయందును రాజస్వవిషయమున ప్రజా ప్రతినిధుల కెవ్విధమైన జోక్యమును కలిగించక పోవుటవలన, ఇంగ్లండునుండివచ్చెడి ఆజ్ఞాపత్రముల ప్రకారము అమలు జరుపవలసి వచ్చుచున్నది.

ఇండియాయొక్క ఆశయములు ఎట్లణగద్రొక్క బడు చున్నదియును 'శాలిస్బరీ' ప్రభువుయొక్క సాక్ష్యమువలన స్పష్టమగుచున్నది.

అన్యాయముగా ఇండియాకు ఖర్చులను తగిలించుట అసమంజసమైన పనియని తెలిసి ఇండియాకార్యదర్శి "అటులచేసి నచో నేనంగీకరించువాడనుకాను. ఉద్యోగమునకు రాజీనా మానిచ్చెదనని" యనగూడదాయని ఫాసెట్టుగారు ప్రశ్నించిరి.

శాలిస్బరీప్రభువు—"ఏమంత్రియును అటుల జేయుటకు జడియును. ఏలననగా అట్లుచేయుటవలన గవర్నమెంటే ఆగి పోవుట తటస్థించును."

ఫాసెట్టు—"మీరూరకుండ వలసినదేనా"?

శాలిస్బరీప్రభువు—"ఎట్టి అన్యాయమునకైనను ఘట్టిగా అడ్డుచెప్పుచు చివరకు అంగీకరించవలసియే యున్నది."

రాజ్యతంత్రమునందు ప్రజాప్రతినిధులకు చోటివ్వని హేతువువలన, ఇట్టిఅన్యాయము ఇండియాకు జరగుట తట స్థించుచున్నది.

వ్యయము నధికముచేయవలయుననియెడి రాజ్యనీతి యొకటియును, పన్నులనధికము చేయవలయుననియెడి రాజ్యనీతి యొకటియును, ఇండియా రాజస్వమునందు ప్రబలుచు వచ్చెనని 1873-వ సంవత్సరమున సర్ ఛార్లెసు ట్రెవిలియను గారు ఇండియా రాజస్వ విచారణసభవారి ఎదుట నుడివిరి. ట్రెవిలియనుగారి పద్ధతిఖర్చును తగ్గించవలయుననునది. తద్వ్యతిరేకపద్ధతి కలకత్తాకును ఇంగ్లండునకును ప్రీతికరమైనది. కలకత్తాకుమారుగా ప్రస్తుతము ఢిల్లీపట్టణము గవర్నరు జనరలు గారి ముఖ్యపట్టణము.

గవర్నరుజనరలు నార్తుబ్రూకు (North Brook) ప్రభువును, కోశాధ్యక్షుడగు సర్ విల్లియము ముయిరును, పనిని చాలించుకొని ఇండియాను విడిచినతరువాత (1876సం॥ నుండి) పన్నులను వృద్ధిచేయవలయుననియెడి రాజ్యనీతియే, నిరంకుశాధికారముతో దేశమునందు చెలాయించెను. 1877 సం॥న చెన్నరాజధానియందు కఠినతరమగు గొప్పక్షామము తటస్థించినను, లిట్టనుప్రభువు వ్యయమును పన్నులను, తగ్గించుటకు ప్రయత్నించలేదు. అందుకు విరుద్ధముగా సర్ జానుస్ట్రాచీ యనునూతన కోశాగారమంత్రి సలహాపైని, కఱవులచే అల్లాడుచున్న ప్రజలకు సదుపాయము జేయునిమిత్తమై ఒకనిధిని (Famine Relief & Insurance Fund) స్థాపించుటకై క్రొత్త పన్నులను విధించెను.

సాధ్యమైనంతవరకు ఆదాయములో ప్రతిసంవత్సరమును ఒకకోటిన్నర రూప్యములు కఱవులచే తపించుచున్న



ప్రజలకు కొంత తరుణోపాయ మొనర్చుటకును, వారి సదుపాయము నిమిత్తము కొంతపనిని కల్పించుటకును, వీలలనడుటకునై నిలవ కనబరచుట ఈనిధియొక్క ముఖ్యోద్దేశము. ఒకవేళ క్షామపీడితుల నిమిత్తమై వినియోగింప బడకుండ ఏసంవత్సరమైన కొంతసొమ్ము మిగిలిన యెడల ఆద్రవ్యమును, ఋణమును తగ్గించుటకును పూర్తిగా తీర్చివేయుటకును వినియోగపర్చుట ఈనిధియొక్క ముఖ్యోద్దేశ్యము. దేని నిమిత్తమై ఈక్రొత్తపన్నులు విధింపబడినవో, ఆవిషయమునకే అవి వెచ్చింపబడునని సర్కారువారు ప్రజలకొక వాగ్దానమును కూడ చేసియున్నారు.

ఈవాగ్దానము ఇచ్చినతోడనే రద్దు చేయబడెను. 1878-79 సం॥ పు ఆదాయవ్యయ పట్టికయందు ఈనిధికిగాను సొమ్మునిర్దేశింపబడినది. ఆమరుచటి సంవత్సరముననే ఈనిధికై వెచ్చించ నిశ్చయించినసొమ్ము ఆదాయవ్యయపట్టిక యందు కానరాలేదు. క్షామపీడితుల నుద్ధరించుటకునై ఏర్పరచబడిన పన్నులు మాత్రము మామూలు ప్రకారము వసూలు చేయబడుచు వచ్చినవి. అందులకై హిందూదేశ ప్రజలు ఈ అన్యాయమును గూర్చి ఎంతయో మొఱపెట్టిరి. ఆదాయవ్యయపట్టికలో నిలవయున్నను లేకపోయినను నష్టము సంభవించినను, ఈక్రొత్త పన్నులవలని ఆదాయమును మాత్రము క్రొత్తగా ఋణము చేయ నవసరము లేకుండ చేయుటకు ఉపయోగించెద మని స్ట్రాచీగారు సమాధానమిచ్చిరి.

ఈజవాబు సహేతుకముగ నున్నట్లు ఇండియా ప్రజలకు తోచలేదు. తమ కొసంగిన వాగ్దానమును తప్పించుకొను నుద్దేశ్యముతో స్ట్రాచీగారు ఈచిత్రవాదమును గావించిరని ప్రజలభిప్రాయపడిరి. ఇండియా కార్యదర్శిగారికి సైతము స్ట్రాచీగారి వాదము సంతుష్టికరముగ నున్నట్లు పొడకట్టలేదు. 1881 సం॥ న క్రొత్త పనులయొక్క ఆదాయము ఒకటిన్నర కోట్ల రూప్యములును ఆదాయ వ్యయపట్టికలో ఇకముందు క్షామ నిధి నిమిత్తమని కనబరచి, అందు (1) సహాయము నిమిత్తము (2) సార్థక పనుల నిమిత్తము, (3) ఋణము తగ్గించునిమిత్తము, అను మూడు బాపతులక్రింద ఆసొమ్ము నమోదుచేయ వలసినదని తీర్మానించ బడినది.

క్షామనివారణ నిధియందు హెచ్చుభాగము ప్రజోపయోగకరమగు సార్థకపనులకు బదులు, కఱవు రోజులలో చేయుటకు ఏర్పరుపబడిన సార్థక పనుల నిమిత్తమై వినియోగించ వచ్చుననియెడి నీతి అంగీకరింప బడినది.*

క్షామనిధి మొదట ఏర్పరచిన నియమముల ప్రకారము వినియోగము జరుగక పోవుట సరికదా, తరువాత మార్పుదలచేసిన నియమముల ప్రకారమైనను వినియోగము జరుగలేదు. 1895-96 సంవత్సరాంతమునకు క్షామనివారణనిధి 15 మిలియన్ల పౌనులయినది. ఈక్రింద కనబరచబడిన పట్టీవలన 10 మిలియన్ల పౌనులు మాత్రమే ఖర్చయినట్లు తేలుచున్నది.

* 1898 సం॥ కఱవుల విచారణ సంఘమువారి నివేదన పత్రము; 325 పుట.



1881-82 మొదలు 1896-97 వరకు

| | పౌనులు. |
|---|---|
| క్షామపీడితుల క్షుద్బాధనివారణార్థము | 21[illegible],571 |
| సార్థక అయోమార్గములు (రయిల్లు) | 4,367,287 |
| సార్థకనీటిపారుదల (ఇరిగేషను) పనులు | 1,200,207 |
| ఋణము తగ్గించుటకుగాని లేకుండ జేయుటకుగాని | 3,551,533 |
| మొత్తము... | 9,341,598 |

"అప్పులేకుండ చేయుట" అనుపదము చాల గూఢమైనది. అనేక విధములుగ ఈపదమునకు వ్యాఖ్యానము చేయ వచ్చును. ఆఖరు కలములో "అప్పును తగ్గించుట" అని తప్ప మరి దేనిని చూపకూడదు. ఆవిషయమటుండగా, క్షామనివారణనిమిత్తము ఏర్పరచబడిన మొత్తపుఖర్చులో $5\frac{1}{2}$ మిలియన్ల పౌనులు ఖర్చు చేయబడలేదు. ఇండియా ఋణమునందు ఈ సొమ్ము తగ్గించి తీరవలసినది. ఋణమును తగ్గించుటకు బదులుగా ఈపదునైదు సంవత్సరములలోను బెంగాల్ - నాగపూరు, మిడ్లండు అయోమార్గములకు కలిగిన నష్టము 2,389,397 పౌనులు, క్షామనివారణ నిధియొక్క ఖర్చుక్రింద చూపబడినవి.

అటుపిమ్మట ఆరుసంవత్సరములు ఘోరమైన కాటకములు హిందూదేశమును పీడించెను. ఆహేతువువలన క్షామనివారణార్థమగు ఖర్చు విస్తారముగా అధికమయ్యెను. 1881-

82 మొదలు 1901-02 వరకు అయిన 21 సంవత్సరములకును నియామకమైన సొమ్ముకన్న ఒక మిలియను పౌనులు అధికముగా ఖర్చయ్యెను.

1881-82 మొదలు 1901-02 వరకు

| | పౌనులు. |
|---|---|
| కఱవులబాధ చల్లార్చునిమిత్తము | 11,906,358 |
| సార్థక ఇనుపదారులు | 4,827,522 |
| నీటిపారుదల పనులు | 1,398,955 |
| ఋణమును తగ్గించుటకు గాని లేకుండజేయుటకు గాని | 4,132,996 |
| మొత్తము... | 22,265,831 |

బెంగాల్-నాగపూరు, మిడ్లండు రైల్వేలకు ఇరువదియొక్క సంవత్సరములలోను సంభవించిన నష్టము 3,280,334 పౌనులను ఈనిధినుండియే ఖర్చుపెట్టబడినది. ఇటీవల కఱవుల నివారణార్థము వెచ్చింపబడిన ద్రవ్యము ఇండియాఋణమును హెచ్చించినది. కఱవులులేని సంవత్సరములలో క్షామనిధి నిమిత్తము వసూలుచేయబడిన పన్నులు, ఆఋణమును తగ్గించుటయందు వెచ్చించ బడుటలేదు.

1877-78 మొదలు 1901-02 వరకు ఇండియాదేశముయొక్క ఆదాయవ్యయములు ఈక్రింది పట్టీలయందు చూపబడినవి.



| సంవత్సరము | నేలపన్ను | మొత్తపు ఆదాయము | సీమఖర్చులు | మొత్తపు ఖర్చు |
|---|---|---|---|---|
| | రూప్యములు | రూప్యములు | రూప్యములు | రూప్యములు |
| 1887-78 | 19,891,1,450 | 61,972,4,810 | 16,202,0,160 | 66,234,5,210 |
| 1884-85 | 21,832,2,110 | 70,690,6,810 | 17,527,4,060 | 71,077,1,270 |
| 1885-86 | 22,592,3,710 | 74,464,1,970 | 18,426,1,700 | 77,265,9,230 |
| 1891-92 | 23,965,7,740 | 89,143,2,830 | 22,911,9,120 | 98,675,7,480 |
| 1896-97 | 23,974,4,890 | 94,129,7,410 | 26,234,2,550 | 95,834,7,630 |
| 1897-98 | 25,683,6,420 | 96,442,0,040 | 25,319,8,240 | 101,801,2,150 |
| 1900-01 | 26,254,5,460 | 112,908,4,360 | 25,801,4,350 | 110,403,1,300 |
| 1901-02 | 27,432,0,270 | 114,516,7,880 | 26,052,9,830 | 107,091,4,230 |

రూప్యముయొక్క విలువ నధికముచేయుటవలన కలిగిన ఫలితముల నిచ్చటపొందుపరచు నిమిత్తము గత ఐదుసంవత్సరములయొక్క లెక్కలను పరిశీలించి చూతము. 1897-98 సం॥ న రూప్యముయొక్కవిలువ 15 పెన్సులకన్న కొంచెము అధికము చేయబడినది. 1899-00 సం॥లో 16 పెన్సులు చేయబడి ఇప్పటికిని అదేరీతిని నిలచియున్నది.

| | 1897-98 | 1898-99 | 1899-1900 | 1900-01 | 1901-02 |
|---|---|---|---|---|---|
| | పౌనులు. | పౌనులు. | పౌనులు. | పౌనులు. | పౌనులు. |
| మొత్తపు ఆదాయము | 64,257,207 | 67,595,815 | 68,637,164 | 75,272,291 | 76,344,525 |
| ఖర్చు | 67,830,014 | 64,954,942 | 65,862,541 | 73,602,087 | 71,894,282 |

ఈలెక్కవలన ఇండియాదేశమునందు ఈ అయిదుసంవత్సరములలోను రూప్యముయొక్క విలువను హెచ్చించుటవలన

12 మిలియన్ల పౌనుల పన్నులు అధికమైనవని స్పష్టమగుచున్నది. 1879 సం॥న రూప్యముయొక్క విలువను హెచ్చించినచో ఈవిధముగనే పరిణమించునని ఇంగ్లాండునందలి కోశాగారప్రభువు లభిప్రాయపడి అటులచేయ వలనుపడదని స్పష్టముగా ఖండించిరి. ఇండియా గవర్నమెంటువారి యుద్దేశ్యము రూప్యముయొక్కవిలువ నధికము చేయుటవలన 'తమకువచ్చు ఆదాయము నధికముచేయుటయని' తేల్చినవారై ఆనీతిక్రమమైనదికాదని నిర్దేశించిరి.

ఆనీతిని అవలంబించుటవలన ఇండియాదేశపు ప్రజలకు నష్టము కలిగి, ఇండియాలో పనిచేయుచున్న ఇంగ్లీషు ఉద్యోగస్థులకు లాభమును కలుగజేయునని కనిపెట్టినవారై 1886 సం॥ న తిరిగి వారుఖండించిరి. 1899 సం॥ న నాణెముల చెలామణీ విచారణసభవారియెదుట కీర్తిశేషులైన రమేశచంద్రదత్తు మొదలగు ప్రముఖులవలన, రూప్యముయొక్క విలువను అధికముచేయుటయనగా "పన్ను నధికము జేయుటయని" స్పష్టముగా నుడువబడెను. 1902 సం॥ ము మార్చి నెలయందు సామ్రాజ్య శాసన నిర్మాణసభలో కీర్తిశేషులైన గోపాలకృష్ణ గోఖలే దేశబాంధవునివలనగూడ ఈవిషయము కడుశోచనీయముగ ప్రశంసించబడినది.

1871 సం॥ నుండి నేలపన్ను గాక భూములపైని అనేకమగు ఇతర శెస్సులు వసూలు చేయబడుచున్నవి. ఈపన్నుల వలన వ్యవసాయమునే ఆధారముగా కలిగియున్న ప్రజలకు విపరీతమైన బాధ కలుగుచున్నది. వానిని తీసివేసి ప్రజలకు సౌకర్యమును కలిగించుటన్యాయము. 'ఈ శెస్సులను తీసివేయుటయేగాక, నేలపన్నునుసైతము 1855 సం॥న డల్‌హౌసీ ప్రభువును, 1864 సం॥ న సర్ ఛార్లెసువుడ్డుగారును ఆర్థికశిస్తునందు (Economic Rent) సగమునకు పైబడనీయరాదని నిర్ణయించిన ఏర్పాటును, అతిక్రమించరాదు.



క్షామ నివారణార్థము విధించబడిన పన్నులు సైతము క్షేత్రమునకు భారముకలిగించుచునే యున్నవి. ఈపన్నుల నుంచుట ప్రజలయొక్క దారిద్ర్యమును, కఱవులయొక్క కాఠిన్యతను అధికముచేయునేగాని వేరొండుగాదు. వీనిని తీసివేయుటవలన వ్యవసాయదారులకు కొంతసహాయమగును. కృషికులయొక్క స్థితిగతులను అభివృద్ధిచేయుటయును, భూమిపై అధికమగు పన్నులు లేకుండ జేయుటయును కఱవులబాధ లేకుండ జేయుటకు తగునేర్పాటు లయియున్నవి. ఉప్పుపన్ను నింకను తగ్గించవలసియే యున్నది. నూలుయంత్రకళాశాలలపై విధించిన యక్సైజు పన్నులను తీసివేయవలసియున్నది.

ఈదేశమునందు ఆదాయవ్యయపట్టికలో నిలవకాన్పించినపుడెల్ల ఏదియో అనవసరమును వ్యయకరమునగు యుద్ధము తరచుగా సరిహద్దులయందు తటస్థించుచునే వచ్చినది. సైనిక ఏర్పాటుల నిమిత్తము బ్రిటిషు కోశాగారమువారికి ఇవ్వవలసి వచ్చుచుండెడి హెచ్చు మొత్తములవలన సైతము ఆనిలవ ఖర్చయిపోవుట గలదు. బ్రిటిషుసైన్యమును సమకూర్చుటకునై హెచ్చు సొమ్మునకుగాను కర్జనుప్రభువెంత ఆటంకపెట్టినను 786,000 పౌనులు బ్రిటిషు కోశాగారమునకు పంపబడినవి. మరి 400,000 పౌనులు దక్షిణ ఆఫ్రికాయందలి ఖర్చునిమిత్తమై కోరబడినవి. ఈకోరిక మాత్రము, ఇండియా దేశము

నందును ఇంగ్లండు నందును, ఉద్యోగస్థులును ప్రజలును ఏక గ్రీవముగా ఖండించుటవలన, నెరవేరలేదు. ఇండియాదేశపు ఆదాయవ్యయ పట్టికయందు నిలవను జూపుచు, లంకషైరు వ్యాపారస్తులు తమ నూలు సరకులపై విధించబడిన దిగుమతి పన్నులను తీసివేయ వలసినదని ఒకటి రెండు సారులుకోరిరి.

ఇటుల జరగుచువచ్చుటకు ఇండియా రాజ్యాంగపద్ధతియే కారణము. భారతీయులు దక్క ఎల్ల బ్రిటిషు ప్రజలును ఏదో ఒకవిధముగ దొరతనమువారి వలన తమ కోరికల నీడేర్చుకొనుటకు గాను ప్రయత్నములు సల్ప వీలున్నది. బ్రిటిషు ఆంతరింగిక సభవారు, ఆసభయొక్క సభ్యుడగు ఇండియాకార్య దర్శిగారి ద్వారా వారి కోర్కెలను కొనసాగించు కొనగలరు. బ్రిటిషు వ్యాపారస్తులన్నను ప్రజాప్రతినిధి సభయందలి తమసభ్యులద్వారా తమకోర్కెల నీడేర్చుకొన గలరు. సైనిక వ్రాతమునకు సంబంధించువారు, గవర్నరు జనరలుగారి కార్యనిర్వాహక సభయందుగల సైనిక సభ్యుని ద్వారా సాధించు కొనగలరు. దురదృష్టమువలన ఇండియా దేశముయొక్క పరిపాలనమునందు వాక్కు లేనిది ఒక్క ఇండియా దేశస్థులే! ఆకారణము వలన పన్నులను అధికము చేయుట వలన కలిగిన నిలవ, ప్రజలకేవిధమైన సౌకర్యమును కలిగించకనే అంతరించుచున్నది. ఇకముందట్టి నిలవ విశేషముగ కానవచ్చునని తోచదు.

1877-78 మొదలు 1901-02 వరకు అయిన ఇరువదియైదు సంవత్సరముల తాలూకు మొత్తపు ఋణమును ఈక్రింద రెండు పట్టీలయందును చూపబడినది.



| సంవత్సరము | శాశ్వతమైనదియును, నిధిరాహిత్యమైనదియునగు ఇండియాయందలి ఋణము | ఇంగ్లాండునందు ఇండియా ఋణము |
|---|---|---|
| | రూప్యములు | పౌనులు |
| 1877_78 | 82,783,2,770 | 59,677,033 |
| 1878_79 | 86,877,8,210 | 59,029,117 |
| 1879_80 | 91,506,8,460 | 68,855,556 |
| 1880-81 | 95,782,3,570 | 71,429,133 |
| 1881-82 | 98,784,4,140 | 68,141,947 |
| 1882-83 | 100,651,8,620 | 68,585,694 |
| 1883-84 | 103,503,4,560 | 68,108,837 |
| 1884-85 | 104,450,4,060 | 69,271,088 |
| 1886-87 | 100,717,4,800 | 73,806,621 |
| 1887_88 | 107,806,7,950 | 84,140,148 |
| 1888-89 | 111,585,9,490 | 95,033,610 |
| 1889_90 | 113,437,0,520 | 98,192,391 |

| సంవత్సరము | ఇండియా ఋణము | ఇంగ్లండునందు చేసిన ఋణము | మొత్తము |
|---|---|---|---|
| | పౌనులు. | పౌనులు | పౌనులు. |
| 1890-91 | 78,416,801 | 104,408,208 | 182,825,900 |
| 1891-92 | 79,229,246 | 107,404,143 | 186,633,389 |
| 1893-94 | 82,545,516 | 114,113,792 | 196,659,308 |
| 1896-97 | 85,158,840 | 114,883,233 | 200,042,073 |
| 1897-98 | 86,766,193 | 123,274,680 | 210,040,873 |
| 1900-01 | 90,407,865 | 133,435,379 | 223,843,244 |
| 1901-02 | 91,925,015 | 134,307,090 | 226,232,105 |

## ప్రస్తుతపు ఇండియా ఋణము.

| సంవత్సరము | ఇండియాయందలి ఋణము | ఇంగ్లాండునందలి ఋణము | ప్రతిసంవత్సరము చెల్లించవలసినవడ్డి |
|---|---|---|---|
| | రూప్యములు | రూప్యములు | రూప్యములు |
| 1912-13 | 1,42,83,64,79 | 26,87.687,895 | 8,63,23,275 |
| 1915-16 | 1,53,89,36,400 | 27,39,858,855 | 151,784,500 |

యుద్ధములును కఱవులును లేని సంవత్సరములయందు ఋణతీర్మాన నిధికినై ప్రతిసాలునను ఆదాయమునుండి కొంత సొమ్ము ఏర్పాటుచేయుట అవసరము. ఋణమును, వ్యయమును, తగ్గించు నిమిత్తమై ప్రజాప్రతి నిధుల సలహానుబడయుటకూడ చాల ఆవశ్యకము. ఇండియా రాజస్వ వ్యవహారమునందు ప్రజాప్రతి నిధులకు ప్రమేయము నొసంగుట సైతము అగత్యము. గవర్నరు జనరలుగారి కార్య నిర్వాహక సభయందు మిక్కిలి అనుభవనీయులును, సామర్థ్యము గలవారును, ఋజుమార్గ వర్తనులును అగు గౌరవనీయ సభ్యులెందరో గలరు. అయినను వీరిలో చాలవరకు వ్యయశాఖలకే (Spending departments) అధ్యక్షులై యున్నారు. వీరలు సహజముగా తమ శాఖలయొక్క అవసరములనే తిలకించెదరు గాన వ్యయాధికముచే వీరు కాంక్షించుచుందురు. వ్యయమును తగ్గించవలయునని చెప్పు ప్రతినిధులు లేనిలోపముచే, వీరికడ్డు చెప్పువారు ఎవ్వరును లేరు. హిందూదేశమునగాని, మరియే ఇతర దేశమున గాని దేశముయొక్క వ్యయమునందు ప్రజలకు కొంత వాకున్నగాని, వ్యయమును తగ్గించ సాధ్యముకాదు.



హిందూదేశ పరిపాలనమున రాజస్వ శాఖయందు కార్యభారమును వహించి కీర్తి నడయుటకు భారతీయులకు అవకాశము లేదు. నేలపన్నును గాని ఏయితర శుల్కమునుగాని విధించుటవలని కష్టసుఖములను వీరు బాగుగ గుర్తించగలరు. కృషికుల చెంత మసలుచుండుటం జేసి వారి కష్టసుఖములను ఎఱింగినవారలై, వారియుద్దేశ్యములను కోరికలను స్పష్టముగా నొక్కి చెప్పగలరు. ఖర్చును తగ్గించుటయందు వీరు విశేష శ్రమతీసికొని రాజ్యతంత్రమును నిర్వహించుదురు.

### రివిన్యూయొక్క ఆధారములు.

(1) బ్రిటిషు ఇండియా దొరతనమువారు భూమికిని, అడవులకును ఖామందులై యున్నారు. ఇంతేగాక ఎన్నియో స్వతంత్ర సంస్థానములు వీరిని ఆశ్రయించుకొనియున్నవి. రయితువారీ భూములనుండి రయితులవల్ల నేలపన్నును జమీందారీ భూములనుండి జమీందారులవల్ల శిస్తును, సర్కారువారు గ్రహించుచున్నారు. ఇదిగాక సర్కారు అడవుల యందు పశువులను మేపుకొనుటవలన వసూలు చేయబడిన మేతకూలియును, అటవీ సంపదను విక్రయించుటవలన కలిగెడి లాభమును, ఖనిజములను త్రవ్వుటవలన దొరతనము వారికి లభించెడి నఫా (Royalty) యును, సర్కారు రాబడికి ఆధారములై యున్నవి. స్వదేశ సంస్థానములు చెల్లించెడి కప్పముకూడ నేలపన్ను క్రిందనే సమోదగుచున్నది. హిందూదేశమున సర్కారువారి రివిన్యూయందు నేలపన్నే ఉత్తమమైనది. విశేషధనము నేలపన్నునుండియే సేకరించబడుచున్నది. ఇండియా దేశమునందలి నేలపన్ను నందొక విశేషమున్నది.

భూముల పైసలాలు అంతటను శాశ్వతములుకావు. బ్రిటిషు ఇండియాయందు మొత్తపు వైశాల్యములో అయిదవ వంతుభూమి శాశ్వతముగ పైసలు చేయబడినది. రైతువారీ పైసలాపద్ధతి బొంబాయి, సింధు, మదరాసు రాష్ట్రములయందు నెలకొల్పబడియున్నది. రైతువారీ పైసలా శాశ్వతమైనదికాదు. తరచుగా ముప్పది సంవత్సరముల కొకమారు సర్వేచేయబడి పైసలు చేయబడుచుండును. తరచుగా పైసలు చేయబడుచుండుటవలన దొరతనమువారి రాబడి 30 సంవత్సరముల కొకసారి వృద్ధియగుచుండును. ఈపద్ధతి దొరతనమువారి రాజస్వమునకు లాభకారిగనే యున్నది. కాని రైతుస్థితి ఆలోచించినపుడు నష్టదాయకమగుచున్నది. దీని బాగునకై విశేష వ్యయముచేసిన పైసలాకాలమున శిస్తును పెంపుచేయుటకు తోడ్పడునని రైతుశ్రద్ధతీసికొని భూమిని వృద్ధిచేయడు. ఇందువలన దేశముయొక్క ఆర్థికసంపద చక్కగా విరివిగాంచుటకు వీలు చిక్కకున్నది. శాశ్వతముగ పైసలా అయిన వంగదేశపు ప్రజలు ఎట్టి మంచిస్థితిలో నున్నదియును పాఠకు లెరింగియే యుందురు. శాశ్వత పైసలానుండియు, (మహల్వారీ) గ్రామ పైసలాపద్ధతినుండియు సర్కారుకు నూటికి 53-వ వంతును రైతువారీ పైసలానుండి 47-వ వంతును, రెవిన్యూ ఆదాయమగుచున్నది.

| సంవత్సరము | | నేలపన్ను |
|---|---|---|
| 1915-16 | పౌనులు | 22,031,161 |
| 1916-17 | ,, | 22,063,500 |
| 1917-18 కి రానున్నది. | ,, | 22,261,500 |



(2) నేలపన్ను తరువాత నల్లమందునుండి వచ్చెడి ఆదాయము అధికమైనది. ఇండియాలో చిల్లరగా అమ్ముటయందును, విదేశముల కెగుమతి చేయుటయందును సర్కారువారికి గుత్తకలదు. గుత్తను కలిగియుండుటచే సర్కారువారు నిర్ణయింపబడి వెలకే విక్రయమగుచుండుట వలన విశేషలాభము వచ్చుచున్నది. ఆదాయవ్యయములను సరిపెట్టుటకు కష్టముగానున్నపుడు, ఈరెవిన్యూ వరప్రసాదినివలె కోశాగారమంత్రులకు తోడుపడుచుండెడిది. కాని చీనాదేశముతో బ్రిటిషు ప్రభుత్వమువారు చేసికొనిన ఒడంబడిక వలన ఈ రెవిన్యూ మనలను బాసిపోవుచున్నది. స్వల్పకాలములో అంతరించగలదు. బ్రిటిషుప్రభుత్వమువారి ధర్మబుద్ధివలన ఇండియా రాజస్వమునకు చాలతొట్రుపాటు కలిగినది. ఏటేట మిలియన్ల కొలది పౌనులురాబడి వచ్చుచుండెడిది. 1910-వ సంవత్సరమున నల్లమందునుండివచ్చిన నికరాదాయము 9.4 మిలియన్ల పౌనులు.

| | | | |
|---|---|---|---|
| 1915-16 సం॥ | వచ్చిన స్థూలమైన ఆదాయము | 1,913,514 | పౌనులు. |
| 1916-17 | ,, ,, | 3,153,100 | ,, |
| 1917-18 | రానున్నది | 3,389,300 | ,, |

(3) జనోపయోగము నిమిత్తమై సర్కారువారు కొన్ని వ్యాపార సంబంధములగు ఉద్యమములను కొనసాగించుచున్నారు. ఇనుపదారులు, నీటి పారుదల విధానములు, (పోస్టు టెలిగ్రాఫు) తపాలా, తంతి పద్ధతులు. వీనినుండి దొరతనమువారికి కలిగెడి లాభము ఆర్థికవిషయములను బట్టి గమనించిన, వ్యాపారస్తునికి తన వ్యాపారమునందు సంప్రాప్తించిన ప్రతిఫలముగ తేలుచున్నది.

| | ఇనుపదారులు | నీటిపారుదల విధానములు | తపాలా తంతిమార్గములు |
|---|---|---|---|
| 1915-16 | 17,977,103 | 4,799,079 | 3,787,478 |
| 1916-17 | 20,981,600 | 4,979,500 | 4,176,700 |

(4) న్యాయస్థానములయందు అర్జీలు మొదలైనవి దాఖలు చేయుటకును, వాణిజ్య వ్యాపార సంబంధములగు వ్యవహారములను క్రమపద్ధతి ప్రకారము నమోదు చేయుటకును, దొరతనమువారు శుల్కమును వసూలు చేయుచుందురు. ఇదిగాక రిజిస్ట్రేషను శాఖనుండికూడ దస్తావేజులు వగైరాలు రిజస్టరు చేయుటవలన సర్కారునకు కొంతఆదాయము వచ్చుచున్నది.

| | పౌనులు. | పౌనులు. |
|---|---|---|
| 1915-16 | 1,579,904 | 1,694,400 |
| 1917-18 సంవత్సరము రానున్నది. | | 1,706,300 |

(5) సర్కారుయొక్క పరిపాలనమునకగు ఖర్చులనిమిత్తమై పలువిధములగు శుల్కములను దొరతనము వారు వసూలు చేయుచున్నారు. యక్సైజుపన్ను కస్టమ్సుపన్ను స్టాంపులు, ఉప్పుపన్ను, రాబడిపన్ను మొదలగునవి.

(6) ఈశుల్కములుగాక, కొన్ని సమయములయందు రూప్యములను ముద్రణము చేయుటవలన కొంతలాభమును గ్రహించుచున్నారు. ఔన్సువెండికి కొన్నిరూప్యములు ముద్రణముచేయ వలయునని నిర్ణయము. వెండిచౌక యగుటచేత టంకశాలలనుండి దొరతనము వారికి లాభముకలుగుచున్నది.



ఈ లాభమునంతయు అనుపయోగముగ ఇంగ్లాండు నందు బంగారు ప్రమాణనిధికై నియోగించుచున్నారు.

సీమఖర్చులను ఏటేట ఇండియా దొరతనమువారు ఇంగ్లాండునకు పంపవలసి యుండుటవలన, మారకము ఇండియాకు అనుకూలముగా నున్నపుడు రూప్యమునకు ఒకషిల్లింగు 4 పెన్సులకన్న అదనమగు విలువచిక్కుట వలనకూడ కొంత లాభము కలుగుచుండును. మారకము ప్రతికూలముగ నున్నపుడు కొంతనష్టము కూడ తటస్థించుచుండును. కాని ఈ బాపతు ఆదాయము అంతహెచ్చయినదికాదు. టంకశాలల నుండి 1916-1917 సం॥ న సర్కారుకు వచ్చిన ఆదాయము 624,600 పౌనులు.

## ఉప్పుపన్ను.

విదేశములనుండి దిగుమతి కాబడుచున్న ఉప్పుపైని రేవుపట్టణములయందును, సరిహద్దు ప్రాంతముల యందును సుంకము (Customs) విధించ బడుచున్నది. ఇండియాలో తయారుచేయబడిన ఉప్పుమీదనైతము ఆసుంకమునకు సమతుల్యమగు శుల్కము వసూలు చేయబడుచున్నది. ఈరెండు బాబతుల వసూళ్ళను యక్సైజు, కస్టమ్సు పన్నులక్రింద నమోదుచేయబడక ప్రత్యేకముగా "సాల్టురివిన్యూ" క్రింద నమోదు చేయబడుచున్నది. 1910 సంవత్సరమున దేశమున తయారైనఉప్పు నూటికి 70 పాళ్ళును దిగుమతికాబడిన ఉప్పు 30 పాళ్ళును ఇండియాయందు ఖర్చయినది. సర్కారువారు స్వయముగనే చాలభాగము ఉప్పును పండించుచున్నారు.

డేరా ఇస్మాయిలుఖాను రాతిగనులును, సంభారు సరస్సునుండి తయారుచేయబడిన ఉప్పును, బొంబాయి చెన్న రాజధానులయందలి కొన్ని ఉప్పుమళ్ళను దొరతనమువారి వలననే పనిచేయబడుచున్నవి.

### ఉప్పుపన్ను నుండివచ్చిన ఆదాయము.

1915-6 సం॥ న 5,433,632 పౌనులు. 1916-17 సం॥ 5,820,900 పౌనులు.
1917-18 సం॥ కు రానున్నది. 5,965,400 పౌనులు.

1910 సం॥ న సర్కారుకు వచ్చిన నికరమైనరాబడి 4 కోట్ల 75 లక్షలు మాత్రమే. ఇప్పుడధిక మగుటకు కారణము, ఉప్పు పన్నును ఇటీవల అధికముచేయుటవలన కలిగినది.

### స్టాంపు రివిన్యూ.

న్యాయస్థానములయందు ప్లయంట్లు పిటిషనులు మొదలగునవి దాఖలు చేయుటకు అంటించబడు కోర్టు-ఫీజు స్టాంపుల నుండియు, ఆస్తులను ఒకరినుండి మరియొకరికి మార్చినపుడును, పత్రములు వ్రాసినపుడును, బ్యాంకులకు ఇచ్చు చెక్కులకును, హుండీలకును, రశీదులకును అంటించబడు రివిన్యూ స్టాంపులనుండియు, ఈ ఆదాయము వచ్చుచున్నది.

| | | |
|---|---|---|
| 1915-16 సం॥న ఆదాయము | 5,433,632 | పౌనులు. |
| 1916-17 ,, ,, | 5,820,100 | ,, |

### యక్సైజు రివిన్యూ.

(1) కల్లు, గంజాయి, భంగు, సారా నల్లమందు మొదలగు నిషాద్రవ్యములను ఇండియాదేశమున తయారు చేయునప్పుడును, చిల్లరగా అమ్ముకొనుటకు లైసెన్సుల నిచ్చుట వలనను సర్కారువారికి ఈఆదాయము వచ్చుచున్నది. స్వదేశ సారాయములను తయారు చేయునపుడు ఒకశుల్కమును దొరతనమువారు వసూలు చేయుదురు. (2) ఇండియాయందు ఖర్చగు నల్లమందు గంజాయి మొదలగు వానినుండికూడ శుల్కము వసూలు చేయబడుచున్నది. విదేశ సారాయముల నుండి వసూలు చేయబడిన సుంకములును, మన నూలుకళలను పీడించుచున్న యక్సైజు పన్నులును, ఈ రివిన్యూయందు చూపబడుట లేదు. అవిప్రత్యేకముగా కష్టమ్సుపన్నుల క్రింద నమోదు చేయబడుచున్నవి.

| | | |
|---|---|---|
| 1915-16 సం॥ న ఆదాయము | 8,632,209 | పౌనులు |
| 1916-17 ,, ,, | 9,152,500 | ,, |

### రాబడి పన్ను.

ఈపన్ను 1000 రూపాయిలకు పైబడి ఆదాయము వచ్చు ఆసామీలనుండి వసూలు చేయబడుచున్నది. పూర్వము వెయ్యిరూపాయిలలోగా ఆదాయము వచ్చువారినుండి కూడ రాబడి పన్ను వసూలు చేయబడుచు వచ్చినది. శ్రీజార్జి సార్వభౌముని పట్టాభిషేక సమయమున ఒసంగబడిన వరములలో రాబడిపన్నును, తగ్గించుట ఒక వరమయియున్నది. ఇపుడు వేయిరూప్యములుపైగా రాబడి గలవారినుండియే వారిరాబడి యందు రూపాయకు 5 పైసలువంతున రాబడి పన్నుక్రింద వసూలు చేయబడుచున్నది. 1917-18 సం॥ న "సూపరు-టాక్సు" అని మరొక పన్నుకూడ విధించ బడినది. ఇంగ్లాండు

నకు యుద్ధపుఖర్చు నిమిత్తమై ఇండియా కోశాగారమునుండి 150 కోట్లు రూప్యములు ఒసంగబడెను. అందుల వడ్డీ నిమిత్తమై ఆరు మిలియన్ల పౌనులు ఏటేట అవసరమగుటచే, ఈ "సూపరు-టాక్సు" అనెడి క్రొత్త పన్నుకూడ విధించబడెను. ఏబదివేల రూప్యముల రాబడిగల వారినుండియు, అంతకంటె ఎక్కువగా రాబడి గలవారినుండియు ఈశుల్కము వసూలు చేయబడును. ఈ శుల్కమువలన వచ్చెడి రాబడి 1,350,000 పౌనులుగ 1917-18 సం॥ న బడ్జెటు చేయబడినది.

ఈపన్నులుగాక అనేకములగు శెస్సులురోడ్ల నిమిత్తమును, పాఠశాలలనిమిత్తము, వైద్యశాలల నిమిత్తము వసూలు చేయబడుచున్నవి.

### కస్టమ్సు పన్నులు.

అన్యదేశములనుండి ఈదేశమునకు దిగుమతి కాబడుచున్న సకల వస్తుసామగ్రిపైనను, రేవుపట్టణములయందును, సరిహద్దు ప్రాంతములయందును ఈసుంకము వసూలు చేయబడుచున్నది. ఈసుంకములయందే, నూలుయంత్ర కళలనుండి వసూలు చేయుచున్న యక్సైజు పన్నులును, విదేశ సారాయములనుండి వసూలు చేయబడిన పన్నులును చేర్చబడియున్నవి.

| | | | |
|---|---|---|---|
| 1915-16 సం॥ న | సర్కారు | ఆదాయము. | 5,873,886 పౌనులు |
| 1916-17 | ,, | ,, | 8,569,100 పౌనులు |
| 1917-18 రానున్నది | ,, | ,, | 9,894,800 ,, |



### సర్కారువారి మొత్తపు రాబడి.

| | |
|---|---|
| 1915-16 సం॥ | 84,413,537 పౌనులు. |
| 1916-17 ,, | 96,834,500 ,, |
| 1917-18 రానున్నది | 98,850,900 ,, |

ఇదియంతయు స్థూలాదాయముకాని, నికరాదాయముకాదు.

## వ్యయము.

ఈదేశమున సైన్యములకును ఇనుపదారులకును హెచ్చుగా ఖర్చగుచున్నది. సీమఖర్చు లనుపేర ఇంగ్లాండు గ్రహించుచున్న కప్పము కూడ ఇండియాకు అమితమగు వ్యయమును కలిగించుచున్నది. నీటిపారుదలకును, ఇతర ప్రజోపయోగ కరమగు పనులకును గూడ కొంతద్రవ్యము ఖర్చుపెట్టబడుచున్నది. ఇనుపదారులతో సరిపోల్చి చూచినప్పుడు ఈ శాఖలకగు ఖర్చు అంతగా కానరాదు. ఆదాయము వసూలు చేయుటకును, రాజకీయ వ్యావహారిక శాఖ (Civil dept.) యందలి ఉద్యోగస్తులయొక్క జీతభత్యముల క్రిందను కూడ కొంతధనము వ్యయమగుచున్నది. తపాలా, తంతిమార్గములకగు ఖర్చుగాక, క్షామనివారణనిధి నిమిత్తమైకూడ ఏటేట ఇండియా రాజస్వమునుండి కొంతధనము ప్రత్యేకింప బడుచున్నది.

### నీటిపారుదల విధానములు.

సైనిక వ్యయమునుగూర్చియు, రైల్వే రాజస్వమునుగూర్చియు, విపులముగా వేరొకచోట చర్చించబడును. సీమఖర్చులనుగూర్చి జాతీయ ఋణముయొక్క పూర్వోత్తరమును

తెలియజేయు సందర్భమున విపులముగ చర్చించియున్నాము. నీటిపారుదల విధానములకగు ఖర్చునుగూర్చి మాత్రము ఒక్కించుక చెప్పవలసియున్నది. ఇనుపదారులు ఆర్థిక సంపదను ఒకతావునుండి మఱియొక తావునకు మార్చుటదక్క వేరొండు ప్రయోజనకారులుగావు. సంపదను ఉత్పత్తిచేయునవి, నీటికాలువలుగాని రైల్వేలుకావు. నీటికాలువలగుండ పడవలపై గొనిపోబడుసరకులకు రైల్వేలకు చెల్లించవలసినంత హెచ్చురేటున శుల్కములను చెల్లించ నక్కరలేదు. చాలచౌకగా సామానులను కాలువలపై పడవలుగొనిపోవును. ఇనుపదారులకంటె నీటికాలువలు సస్యములకుచాల సమీపముగ నుండును. గనుక ధాన్యాదులను పణ్యచక్రములకు గొనిపోవుటకు నీటి కాలువలే హెచ్చు సదుపాయములను కలిగియున్నవి. దేశమునందలి వర్తకమునకు నీటికాలువలు హెచ్చు సహాయభూతములుగ నుండును. వ్యాపార సౌకర్యముమాట యటుండ కృషికళకు నీటి పారుదల విధానములుచేయు సహాయ మింతింతయని చెప్పరాదు. జలశూన్యమగు భూమి ఎల్లపుడును సస్యముల కాటపట్టగుటకు నీటిపారుదల అవసరము. ఏ మొక్కజొన్నలో, గంటెలో, రాగులో దక్క వరిపంట యనునది కనులకు గానరాదు. చాలకాలము క్రిందవరకును గోదావరీ, కృష్ణా, కావేరీ డెల్టా భూములు ఈ తీరుననే యుండుచు వచ్చినవి. అందలి ప్రజ జొన్న అన్నమును తినుట దక్క వరి అన్నమునుతినుట నెరుగరైరి. ఇపుడు నిర్జలప్రదేశములు ఈమహానదుల యుదకమువలన తామర తంపరలుగ సాలునకు మూడు పంటలుపండి, అందలి కృషికులనెంతో ఐశ్వర్యవంతులుగచేయ



దొడంగినవి. ఈ కాలువలవలన భరతవర్షముయొక్క ఆర్థిక సంపద ఎంతయో విరివినిగాంచినది. ప్రభుత్వమువారిచే, చాల తక్కువధనము ఈ యుద్యమములకై వెచ్చించబడుచున్నది. ఆంగ్లప్రజలు స్వేచ్ఛావర్తకము తమకు లాభకారిగనుండుట వలన భారతీయులకుగూడ లాభకరముగ నుండునని నమ్మినటులనే, నీటి కాలువలకంటె, ఇనుపదారులే దేశముయొక్క సంపదను ఇనుమడింప జేయునని నమ్మియున్నట్లు తోచుచున్నది. స్వేచ్ఛావర్తకము దేశాభివృద్ధికి ఎంత నష్టదాయకమో ఈ పద్ధతియును అంత నష్టదాయకమని దృఢముగా చెప్పగలము. వెనుక కావేరీ, గోదావరీ నదులకు ఆనకట్టలనుగట్టి భరతవర్షమునకు మహోపకార మొనరించిన సర్ ఆర్థరుకాటనుగారు, హిందూదేశమున ఇనుపదారులకు మారుగా నీటి పారుదల విధానములను విరివిచేయవలయునని ప్రబలవాదము సల్పుచుండ అప్పటి ఇండియా కార్యదర్శియగు హామిల్టనుప్రభువు, "మీతల ఎప్పుడును నీరూరుచుండును"ని కాటను దొరగారిని పరిహాసము చేసెను. ఇండియాయందు పెక్కువత్సరములు ఉద్యోగము చేసి, భారతీయుల కష్టసుఖములను బాగుగ గుర్తించి వీరి యాశయములను వృద్ధిచేయుటకునై యావజ్జీవమును నిష్పక్షపాతబుద్ధితో కృషిచేసిన ఆంగ్లశిఖామణియగు కాటను దొరవారు అట్లు పరాభవింపబడిరి. కాటనుదొరవారి సిఫారసులను అంగీకరించియున్నయెడల హిందూదేశము నందెల్లెడలను, నీటి పారుదల విధానములు ప్రబలములై వర్షాపేక్ష లేకనే సస్యములు అనుకూలముగ ఫలించుట కిరవైయుండి యుండును. క్షామమనునది భరతవర్షమున పేరునకైన లేకుండ ఉండియుండును.

ఇపుడన్ననో వర్షములు ఏమాత్రము ఎటామటే అయినను కఱవులును కాటకములును ప్రజలను పీడించుచునే యున్నవి.

వీని అన్నిటికంటెను ప్రబలమైన కారణము మరియొకటి గలదు. నీటి పారుదల విధానములు ఆరంభించినది మొదలు నేటివరకును నూటికి అయిదురూపాయిల చొప్పున పెట్టుబడి మీద లాభము నొసంగుచునే యున్నవి. ఇనుపదారులన్ననో జాతీయ ఋణమును అమితముగ విరివిజేయుటయేగాక 1900 సంవత్సరమువరకును నష్టమునే కలిగించుచువచ్చినవి. 400-కోట్ల రూప్యముల పెట్టుబడిమీదను నూటికి ఒకవంతైనను నికర లాభము వచ్చుటలేదు. ఇదిగాక క్షామనివారణ పంచాయతీవారును, ఇరిగేషను పంచాయతీవారునుకూడ కఱవులనుండియు కాటకములనుండియు దేశమును సముద్ధరించుటకునై నీటిపారుదల విధానములను శీఘ్రకాలములో విరివి చేయవలయునని తీర్మాన మొసంగియున్నారు. కాన దొరతనమువారు ఈ పంచాయతీల తీర్పును మన్నించి, ఇనుపదారులకగు వ్యయమును తగ్గించి, దేశమునందెల్లెడలను నదీప్రవాహములను పెంపుచేసి సంపదను విరివి చేయవలసియున్నది. వీటియొక్క అగత్యమునుగూర్చి, ఇంతకన్న అదనముగా వ్రాయబనిలేదు. క్షామనివారణార్థమై చేయించు సార్థకపు పనులకుగాను ఏటేట ఒకకోటిన్నర రూప్యములు బడ్జెటు చేయబడుచున్నవి. అందు 75 లక్షలు ఇనుపదారులకును, 75 లక్షలు నీటిపారుదల విధానములకును వెచ్చించబడుచున్నవి. ఇనుపదారులకు ప్రత్యేకముగా నీయబడు 12 మిలియన్ల పౌనులును చాలనట్లు, ఈ ద్రవ్యమునుండికూడ 75 లక్షల రూప్యములు ఖర్చుపెట్టుట



చాల అన్యాయము. ఈ కోటిన్నర రూప్యములును నీటిపారుదల పనుల నిమిత్తమును ఖర్చుపెట్టవలసియున్నది. కఱవుల బాధను శాశ్వతముగ తొలగించునవి జలాశయములుగాని అయోమార్గములుకావు. కాన క్షామనివారణనిధికై నిర్దేశింపబడిన ధనమునంతటిని నీటికాలువల క్రిందనే ఖర్చుపరచుటవిధి.

## విద్యావిధానములు.

విద్యాశాఖకుగూడ విశేషధనమును వెచ్చించవలసిన ఆవశ్యకత చాలగలదు. నాగరికతను గాంచిన ఐరోపా, అమెరికా, ఆసియాఖండముల దేశములు తమ ప్రజలను విద్యావంతులుగ జేయుటకునై విశేష ధనసంచయమును ఖర్చుపెట్టుచున్నారు. హిందూదేశమునందలి స్వదేశ సంస్థానములెన్నియో ప్రారంభవిద్యను ఉచితముగ నొసంగుచున్నవి. కొన్ని సంవత్సరముల ప్రాయము వచ్చువరకును బాలురను పాఠశాలల కంపుట బలవంతము చేయబడినది. విద్యావిషయమై స్వదేశసంస్థానములకు గూడ వెనుకబడియుండుట చాల శోచనీయము. సామ్రాజ్యశాసన నిర్మాణసభయందు గోపాలకృష్ణ గోఖలే దేశబాంధవుడు ప్రారంభ విద్యనుగూర్చి రెండుసార్లు తీర్మానముల నుపపాదింపగా సర్కారువారిచే నిరాకరించబడినవి. దొరతనమువారు ద్రవ్యలోపముచే, ఈ యుద్యమమునకు పూనుకొనకున్న, విద్యావిషయికమగు ఒకపన్నును విధించినను భరించెదమని గోఖలేగారెంత సహేతుకముగ చర్చించినను ఈ మహాశయుని వాక్యములకు దొరతనమువారు చెవినొగ్గలేదు. శ్రీయుత బయ్యా నరసింహేశ్వర శర్మగారుకూడ సామ్రాజ్య

శాసన నిర్మాణసభయందు ప్రారంభవిద్యనుగూర్చి ఒకతీర్మానము నుపపాదించిరి. ఈ తీర్మానమునకు సర్కారువారు సమ్మతి నొసంగ నందువలన తీర్మానము రద్దుపరచబడెను. విద్యయొక్క ప్రభావమును ఆవశ్యకతను చక్కగ గుర్తించిన ఆంగ్లేయ ప్రభుత్వము వారే భారతీయులకు జ్ఞానోదయమును ప్రసాదించకుండుట కడుం గడుశోచనీయము.

247-వ పేజిలో కనబరచబడిన పట్టీవలన 1915-16, 1916-17 సంవత్సరముల యొక్క ఖర్చు విశదము కాగలదు. ఈలెక్క, సామ్రాజ్య శాసన నిర్మాణసభయందు, కోశాగార మంత్రిచే మార్చినెలయందు దాఖలుచేయబడిన ఆదాయ వ్యయ పట్టికనుండి ఇట పొందుపరచబడినది.

పైన వివరించిన పట్టీనుండి మనము గ్రహించవలసిన విషయములు రెండు. 1916-17 సం॥ తాలూకు సీమఖర్చులును, 1917-18 సం॥న ఐరోపాయుద్ధమునకగు ఖర్చులలో నూట ఏబది కోట్ల రూప్యములు ఇండియా ఇంగ్లండునకు దానము చేయుట వలన ఆబాబతు వడ్డీనిమిత్తము ఆరుమిలియన్ల పౌనులు ఖర్చు హెచ్చుగా బడ్జెటు చేయబడుటను, మనము గమనించవలసి యున్నది. ఆరుమిలియన్ల పౌనుల రాబడి నిమిత్తమై క్రొత్త పన్నులు విధింపబడెను.

| | పౌనులు. |
|---|---|
| గోగునారపై అధికము చేసిన పన్నునుండి | 500,000 |
| "సూపరు-టాక్సు" (రాబడిపన్ను) | 1,350,000 |
| నూలుసరకుల దిగుమతిపై నూటికి 4-వ వంతు పన్నును అధికము చేయుటవలన వచ్చెడిఆదాయము | 1,000,000 |
| ఇనుపదారులపై విధించబడిన అధికమగుభారము | 500,000 |



| బాపతు వారీఖర్చు | 1915-16 సం॥ తాలూకు. | 1916-17 సం॥ తాలూకు. | 1917-18 సం॥ బడ్జెటు చేయబడినది. |
|---|---|---|---|
| | పౌనులు | పౌనులు. | పౌనులు. |
| రివిన్యూ మొత్తము నుండి ఖర్చు చేయబడినది | 9,467,370 | 9,483,700 | 10,026,100 |
| వడ్డీ | 1,190,364 | 791,800 | 6,832,800 |
| తపాలా, తంతి మార్గములకు | 3,149,680 | 3,555,600 | 3,601,900 |
| టంకశాలలకు | 89,873 | 172,500 | 115,800 |
| సివిలుడిపార్టుమెంట్లయొక్క జీతములు, ఖర్చులు | 18,868,215 | 19,640,100 | 20,920,400 |
| అనేక బాబతుల సివిలుఛార్జీలు | 5,128,675 | 5,393,300 | 5,257,200 |
| క్షామనివారణమునకును, భీమాకును | 1,000,000 | 1,000,000 | 1,000,000 |
| ఇనుపదారులు వడ్డియును ఇతర ఖర్చులు సహా | 13,901,665 | 14,185,300 | 14,147,400 |
| సైనికఖర్చులు | 28,503,093 | 26,819,800 | 27,227,100 |
| నీటిపారుదల ఏర్పాటులకు | 3,721,096 | 3,687,000 | 3,884,000 |
| జనోపయోగమగు ఇతరపనులకు | 5,451,727 | 4,726,400 | 5,536,500 |
| | 85,471,258 | 89,455,500 | 98,819,300 |

## 1916-17 సం॥ సీమఖర్చులను తెలియజేయుపట్టీ.

### సీమఖర్చుల మొత్తము 26 మిలియన్ల పౌనులు= 39 కోట్ల రూప్యములు.

| | | | మిలియన్ల పౌనులు. |
|---|---|---|---|
| సైన్యములకగు ఖర్చు | | | 5.6 |
| ఇనుపదారుల నిర్మాణమునకై తెచ్చిన ఋణముయొక్క వడ్డీ | | | 3.6 |
| ఇనుపదారులనుకొనునిమిత్తము ప్రతి సం॥ చెల్లించబడు వాయిదాలు | | | 8.3 |
| కంపెనీలు పెట్టిన పెట్టుబడియొక్క వడ్డీనిమిత్తము | | | 2 2 |
| ఇతర ఖర్చులు | | | .3 |
| ఇతరఋణములకు చెల్లించవలసిన వడ్డీ | | | 7.4 |
| సివిలుఖర్చులు ఫర్లోముజారా మొదలగునవి. | .26 | | |
| ఉద్యోగము చేయుటకు శక్తిచాలకుండుట వలనఇచ్చెడి పింఛనులు మొదలగువానికి ముజరాలక్రిందను, ఉపకార వేతనములనిమిత్తము. | 2.02 | 2.4 | |
| ఇతరఖర్చులు. | .14 | | |
| ఋణతీర్మాననిధి నిమిత్తము. | | | 1.0 |

మొత్తము 26 మిలియన్లపౌనులు=39 కోట్లరూప్యములు.

సీమఖర్చులు 1917-18 సం॥ న ఇంకను అధికముకాగలవు. యుద్ధమునకిచ్చిన నూరుమిలియన్ల పౌనులును ఈదేశములో అప్పుదొరకనందున దొరతనమువారు ఇంగ్లండునందు ఋణము చేయవలసి వచ్చును. అందుచే సీమఖర్చులలో వడ్డీ బాబతు ఇంకను పెరుగగలదు.

1916-17 సం॥న వ్యయముపోను ఆదాయమునుండి 5,817,500 పౌనులు, నిలవవచ్చెను. 1917-18 సం॥ న 129,800 పౌనులు నిలవ వచ్చునటుల బడ్జెటు చేయబడెను.



## పన్నులయొక్క భారము.

నల్లమందు ఎగుమతినుండియు, నేలపన్ను నుండియు వచ్చిన ఆదాయమును విడిచిపెట్టగా 1910 సం॥ న పన్నుల వలన సర్కారుకువచ్చిన నికరాదాయము 35.53 కోట్లరూప్యములు. నల్లమందు ఎగుమతివలన వచ్చిన ఆదాయము విదేశస్థులవలన చెల్లించబడుచుండుటచేత, పన్నులయొక్క భారము విషయమును చర్చించునపుడు ఈ ఆదాయమును సరకుచేయ బనిలేదు. ఇక నేలపన్నునుండి వచ్చిన ఆదాయమును కూడ ఈసందర్భమున ఆలోచించక పోవుటకు గలకారణము, అధికార వర్గమునకుజెందిన చాలమంది నేల పన్నును ఒకపన్నుగ భావించుటలేదు. వీరిమతమున నేలపన్ను దొరతనము వారియొక్క ద్రవ్యసాధనములను, ప్రజలు ఉపయోగించినందులకై సర్కారుకు చెల్లించవలసిన, వెలగా భావింప బడుచున్నది. దీనినిగురించి ముందు విపులముగా చర్చించుచున్నాము. 1910 సంవత్సరమున పన్నులవలన ప్రజలకు కలిగినభారము మనిషి ఒక్కంటికి సుమారు ఒకటిన్నర రూప్యములు. నేలపన్నును గూడ (మనిషి ఒక్కంటికి 1 షిల్లింగు 8 పెన్సులు) జేర్చితిమేని 1910 సం॥ న మనిషి ఒక్కంటికి సుమారు రెండురూపాయల పదకొండుఅణాల నాలుగుపైసలు. భారతీయులయొక్క ఆదాయముసాలుకు ముప్పది రూప్యములకు పైబడుటలేదు. ఆంగ్లేయులయొక్క ఆదాయమును సరిపోల్చి చూచినయెడల, ఈదేశస్థులకు పన్నులవలని భారము అధికమని స్పష్టము కాగలదు.

## నేలపన్నుయొక్క స్వభావము.

అధికారవర్గమునకు జెందినవారు, హిందూదేశమునందలి క్షేత్రమునకు దొరతనమువారు ఖామందులగుటచే ప్రజలనుండి సేకరించునది శిస్తుగాని పన్ను కాదని వాదించుచున్నారు. భారతీయు లన్ననో, నేలపన్ను పేర సర్కారువారు వసూలు చేయుచున్నది ఆర్థిక శిస్తుకాదనియును, ఇదికూడ ఒకవిధమగు పన్నే యనియును అభిప్రాయ పడుచున్నారు. ఇట్టి అభిప్రాయమును కీర్తి శేషులగు మహాదేవ గోవిందరనడే, రమేశ చంద్ర దత్తు, గోపాలకృష్ణ గోఖలే మొదలగు దేశబాంధవులు అనేక సభాముఖములను గ్రంథరాజముల మూలమునను వెలిబుచ్చిరి.

ఇండియా దొరతనమువారికిని, దేశీయులకును నేలపన్నును గూర్చి గల భేదభావము, అమలులోనున్న నిజస్థితిని గూర్చిగాని, రాజనీతి విషయకమై కాదు. శాశ్వత పైసలా చేయబడని భూములనుండి సర్కారువారు సేకరించుచున్న నేలపన్ను, రైతు భూమిని బాగు చేయుటకై వెచ్చించిన సొమ్మునకు వడ్డీయును, రైతుయొక్క కష్టమునకు ప్రతి ఫలమును, మినహాయించిన ఆదాపైన నిర్ణయించబడినదా, లేక ఈఖర్చులను మినహాయించక మొత్తము ఫలితముపైన నిర్ణయించ బడినదా యను హంశమును యోచించవలసి యున్నది. అధికారవర్గమునకు జెందినవారు, నికరాదాయమునందు సగమునకు తక్కువగా దొరతనమువారు సేకరించి రైతునకుకూలి పనులు వగైరాలను విడిచిపెట్టుటయేగాక తగినంత లాభమును



కూడ వదిలివేయు చుండిరనియును, రైతునకు విడిచిపెట్టబడిన లాభము దొరతనమువారు గ్రహించుచున్న శుల్కమునకు సమముగగాని, అధికముగగాని ఉండుట కలదని వాదించుచున్నారు. భూములు పైసలాలుచేయునపుడు ఇట్టినీతినిపాటించవలయునని దొరతనము వారిమతము. కాని ఈమతము మాత్రము ఆచరణములోనికి గొనిరాబడుట లేదు. ఈనీతిని పంజాబు సంయుక్తరాష్ట్రములయందు దొరతనమువారు అవలంబించుచున్నట్లు కానవచ్చుచున్నది. (ఈరాష్ట్రములయందలి కృషికళ నీటిపారుదల విధానములచే సంరక్షింపబడి, రైతులు మంచి స్థితిలోనున్నారు) మదరాసు రాజధానియందలి కొన్ని భాగములయందు సైతము ఇట్టినీతియే ఆచరణములోనున్నది. కాని అయోధ్య, బుండల్-ఖండు, నీటిపారుదల విధానములచే సంరక్షింపబడని మధ్యపరగణాలు, మదరాసు రాజధానియందలి కొన్ని జిల్లాలును, ముఖ్యముగా బొంబాయి, దక్కను, గుజరాతు దేశములయందు, నిజస్థితిని చక్కగా గుర్తించ గలిగిన మహామహులవలన నేలపన్ను పద్ధతి నిందార్హమైనదిగ ప్రశంసించబడెను. ఇట్టి అభిప్రాయముల నొసంగినది, ప్రజలతో కలసిమెలసి తిరిగి వారికష్టసుఖములను బాగుగా కనుగొన్నిన మహాశయులేగాని మిడిమిడి జ్ఞానమును కలిగి వాదమునే ప్రాధాన్యముగా గలిగిన వారిచే నొసంగ బడుటలేదు. "ఈభాగములయందు వసూలు చేయబడుచున్న భూముల ఆదాయము ఆర్థిక శిస్తునకు పైదాటి, వ్యవసాయమున కగు ఖర్చునుగూడ ఆకర్షించుచున్నదని" వీరుఖండనగా చెప్పుచున్నారు.

దక్కను రైతులనుగూర్చి మహాదేవ గోవిందరనడేగారు 1892 సంవత్సరమున ఇట్లు ప్రసంగించిరి:—నేలపన్నును పేర పశ్చిమహిందూదేశమున వసూలుచేయబడుచున్న శుల్కము సరియైన శిస్తులనుండి సేకరించబడుచున్న పన్నుకాదు. తరచుగా పేదరైతుయొక్క కూలిపనులను లాభమునుకూడ కొంతవరకు ఆకర్షించుచున్నది. భారమధికమగుచున్న కొలదిని, పేదరైతు నీచజీవన మవలంబించవలసిన అవస్థ తటస్థమగుచున్నది. గోపాలకృష్ణగోఖలే మహాశయుడు బొంబాయి రాజధానియందలి భూముల పైసలాలను గూర్చి 'శాస్త్ర విరుద్ధమయ్యును ప్రతికాలమునను (30 సంవత్సరములకొకతూరి తటస్థమగుచుండును) రైతువలన క్షేత్రములకు చేయబడిన అభివృద్ధిమీదనుకూడ శుల్కము విధించబడుచున్నదనియును, అదివరకు ఉన్నశిస్తు చెల్లించుటకు ఆస్కారములేని భూములమీద నైతము మిగతభూములతోపాటు శిస్తు పెంపు చేయబడుచున్నదనియును, ముఖ్యముగా సంయుక్తపరగణాలు బొంబాయి, చెన్నపురి రాజధానులయందు అధికముచేయబడిన నేలపన్నుయొక్క భారమువలన క్షేత్రము క్రుంగుచున్నదనియును ఖండితముగావక్కాణించిరి. ఇటులజేయుటవలన భూమిని అభివృద్ధిలోనికి తెచ్చుటకై మూలధనమును రైతువెచ్చించుటకు వెనుదీయుచుండుననియును అందువలన కృషికళ లభివృద్ధి గాంచదనియును గోఖలేమహాశయుని అభిప్రాయము.

ఈసందర్భమున రమేశచంద్రదత్తుగారివలన నేలపన్నును గూర్చి జూపబడిన హేత్వాభాసముల నిటపొందుపరచుట



యుక్తము. దత్తుగారు కాటకము లధికముగా నుండుటచేత భూములయొక్క పైసలాపద్ధతులయందు మార్పొనరించ వలయునని బహిరంగముగా కర్జనుప్రభువుగారికి పత్రికాముఖముగ లేఖలు ప్రకటించెను. 1900 సం॥మార్చినెల 28తేదిని సామ్రాజ్యశాసన నిర్మాణసభయందు సర్ ఫిరోజిషా మెహాతాగారు, ఆనందాచార్యులుగారు, సర్ బిపిన్ క్రిష్ణబోసు మొదలగు ప్రముఖులయొక్క ప్రసంగములు చదివిచూచిన పైసలాపద్ధతుల యొక్క కాఠిన్యత యెల్లరకును విశదమగును. తొలుతభూమి పన్ను మొత్తపు పంటలో ఎన్నవ వంతగుచున్నదో నిశ్చయించుదము.

| | నూటికగువంతులు. |
|---|---|
| బంగాళరాష్ట్రము. బీహారు ఒరిస్సా రాష్ట్రములుకూడ అపుడు ఇందే ఇమిడి యుండెను. | 5 మొదలు 6 వరకు |
| పశ్చిమోత్తరపరగణాలు | 8 |
| పంజాబు | 10 |
| చెన్నరాజధాని | 10 మొదలు 31 వరకు |
| బొంబాయిరాజధాని | 20 మొదలు 33 వరకు |

పై పట్టీవలన భూమియొక్క భారము ఏరాష్ట్రమునందెంత యగుచున్నదియును గమనించగలము. శాశ్వత పైసలాకాబడిన బంగాళ దేశమున నేలపన్ను తేలికగానున్నది. ఈ పద్ధతి పూర్వము హిందూరాజుల ప్రభుత్వమున నున్న యటులనే అమలగుచున్నది. అందువలన వంగదేశప్రజలు ఐశ్వర్య

వంతులై ఆర్థిక రాజకీయ విషయములయందు ఇతర రాష్ట్రములకన్న మిక్కిలి అభివృద్ధిలోనుండుటను మనము కండ్లార జూచుచునేయున్నాము. నేలపన్ను హెచ్చగుటచే క్షేత్రము, భారము మిక్కుటమై క్రుంగుచుండునుగాని వృద్ధికాజాలదు. మదరాసు, బొంబాయి, రాజధానులయందలిస్థితి చాల విచారకరముగనున్నది. 31-33-వ వంతువరకు భూమిపన్ను వసూలు చేయబడుచుండుటవలన కృషికులు కడు బీదస్థితిలో నుండుట మనము చూచుచునేయున్నాము. హిందూదేశమున కంతకును శాశ్వతపైసలా జరిగి యుండినయెడల సర్కారుకు రావలసిన రాజస్వములో కొంతవరకు నష్టమువచ్చినను ప్రజలందరును సౌఖ్యముగా ఉండునట్లు చేయుటవలన, వారు కళాప్రపంచమును సముద్ధరించ గలుగుటచే, దేశముయొక్క ఆర్థికసంపద ఇనుమడించక మానదు. అందువలన సర్కారుకు కలిగెడి లాభము అపరిమితముగ నుండును.

## నేల పన్నునకు సంబంధించిన హేత్వాభాసములు.

హిందూదేశ మిత్రులలో నొకనిగ పేర్కొనదగిన హెన్రీ ఫాసెట్టుగారు నేలపన్నునుగురించి తమ ఆర్థిక శాస్త్రమున ఇటుల వ్రాసిరి:—"ఇంగ్లీషు నేలఖామందు తన ఆస్తిపై ఎట్టి హక్కులను కలిగియున్నాడో ఆతీరుగనే హిందూదేశమునందలి క్షేత్రముపై చాలభాగము ఇండియా దొరతనమువారు అట్టిహక్కును కలిగియున్నారు. దొరతనమువారు ప్రత్యేక నేలఖామందులవలె వ్యవహరించుచున్నారు. రైతులు కృషికి



కావలసిన భూమిని ఇతర నేల ఖామందులనుండి గ్రహించుటకు బదులు సర్కారువారి నుండియే గ్రహించుచున్నారు".

ఫాసెట్టుగారు స్పష్టముగా 'నేలపన్నని' వ్రాసినను అధికార వర్గమునకు జెందిన పెక్కు లేఖకులును, ఉపన్యాసకులును భూములనుండి గ్రహించుచున్న ఆదాయము శిస్తేకాని పన్నుకాదని వాదించుచున్నారు! ఇదే మొదటి హేత్వాభాసము. ఈ విషయమునుగూర్చి జరిగిన వాదానువాదముల వలన తేలిన విషయము, గొప్ప అనుభవశాలురగు ప్రభుత్వోద్యోగియులవలననే క్షేత్రముల ఆదాయము పన్నుకాని శిస్తు కాదని స్పష్టమును చేయబడినది. ఇట్టి అభిప్రాయమును వెలిబుచ్చినది, సాధారణ ఉద్యోగస్తులు కారు. సర్ లూయియా మాలెట్, లార్డు శాలిస్బరీ, సర్ జాన్ షోర్, సర్ బార్టల్ ఫ్రియరు, సల్లివను మొదలగు ఎందరో ప్రముఖులు ఇట్లభిప్రాయపడిరి. ఈస్టిండియా కంపెనీ డైరక్టరులవలన ఈ విషయము మిక్కిలి స్పష్టముగా నేలపన్ను శిస్తుకాదనియును పన్నేయనియును 1856-వ సంవత్సరమునందు తెలియజేసిరి.

1864-సం॥న అప్పటి కార్యదర్శియగు సర్ ఛార్లెసు వుడ్డుగారివలనకూడ ఈ సంగతి విస్పష్టము చేయబడినది. సాధారణముగా శిస్తునందు సగముభాగము నేలపన్నుగ సేకరించుటకు తమకుగల యుద్దేశ్యమును వెల్లడిచేసిరి. 1875-వ సం॥మున ఈవిషయము సర్ లూయీమాలెటు, సర్ బార్టలు ఫ్రియరు, శాలిస్బరీప్రభువు (అప్పటి ఇండియాకార్యదర్శి)లచే తిరిగి విమర్శింపబడి, హిందూదేశమున సేకరించబడుచున్న

నేలపన్ను శిస్తుకాదనియును, ఆ ఆదాయము పన్నుగనే భావింపబడుచున్నదనియును మర్మము లేక చెప్పిరి. బొంబాయిరాజధానియందు వసూలు చేయబడుచున్న నేలపన్ను ఆర్థికశిస్తుపై విధించబడుచున్న శుల్కముకాని శిస్తుకాదని ఖండనగా ఏ. రాజర్సు అను నాతడు తెలియజేసెను.

కాబట్టి నేలపన్ను శిస్తుకాదనియును పన్నేయనియును గ్రహించుటకు ఆక్షేపణలేదు. హిందూదేశమునందలి ప్రజలలో చాలమంది కృషికళనే జీవనాధారముగ గలిగియున్నారు. అట్టిస్థితిలో చెన్నరాష్ట్రమునందును బొంబాయి రాజధానియందును, కొన్ని ప్రాంతములలో నూటికి ముప్పదియవవంతును అంతకుపైబడి కూడ నేల పన్నును వసూలుచేయుట ఎంతయుశోచనీయము.

## రెండవ హేత్వాభాసము.

నేలపన్నుయొక్క కరభారమును (Incidence of taxation) నిర్ణయించు సందర్భమున ఈ హేత్వాభాసము కలుగుచున్నది. ఒక్కొక్క రాజధానియొక్క మొత్తపుపంట ఇంత యుండునని ఊహించుట ఇందలి హేత్వాభాసము. ఇందుకు తార్కాణముగా 1878 సం॥ కఱవుల పంచాయితీవారి నివేదనపత్రము రెండవసంపుటము 111-వ పేజీయందలి అంకెలను ఇట పొందుపరచుచున్నాము.



| రాష్ట్రము | జనసంఖ్య | సేద్యమునందున్న భూమి: అనావృష్టి ములు ఎకరములు | సేద్యమునందున్న భూమి: అనావృష్టి ములుకానట్టి ఎకరములు | మొత్తపు పంట యొక్క విలువ | భూమిపన్ను | పంటయొక్క విలువయందు భూమిపన్ను నూటికి ఎన్ని వంతు |
|---|---|---|---|---|---|---|
| పంజాబు | 17,600,000 | 18,500,000 | 2,500,000 | 34,150,000 | 1,910,000 | 5.6 |
| పశ్చిమోత్తర పరగణాలు అయోధ్యసంస్థానము | 41,000,000 | 31,450,000 | 5,200,000 | 71,750,000 | 5,365,000 | 7.8 |
| బంగాళము | 60,000,000 | 48,000,000 | 6,000,000 | 103,500,000 | 4,050,000 | 3.9 |
| మధ్యపరగణాలు | 8,200,000 | 12,000,000 | 2,500,000 | 21,250,000 | 600,000 | 3.8 |
| బేరారు | 2,250,000 | 3,700,000 | 2,800,000 | 11,500,000 | 525,000 | 4.6 |
| బొంబాయి | 16,000,000 | 21,500,000 | 5,500,000 | 39,000,000 | 2,970,000 | 7.6 |
| చెన్నరాజధాని | 31,000,000 | 26,000,000 | 2,500,000 | 50,000,000 | 3,160,000 | 6.3 |

ఆహారపదార్థములనుండి ఎకరమునకు అయిదుపౌనుల విలువగల పంట పండుచుండుననియును ఇతర పంటలనుండి ఎకరమునకు 3 పౌనులు పంట పండుచుండుననియును మదింపు చేయబడినది. ఈలెక్కయందలి లోపములెవ్వియనిన—వ్యవసాయమునందున్న క్షేత్రమంతయు ప్రతిసాలునను పండుచుండదు. హిందూదేశము నందంతటను ప్రతి సంవత్సరమునను ఈవిలువగల పంటయే పండుననియూహించుట పొరబాటు. 'సేవ్యభూమి' యని లిఖింపబడిన ప్రదేశమంతయు వ్యవసాయము నందుంచుటకూడ తటస్థించని సంగతియటుండ, తూచినట్లు ఈవిధముగ ఫలించుచున్నదని వ్రాయసాహసించుట పొరబాటు. ఇక పంటలవిషయమున సైతము సరియైనలెక్క చిక్కుటకు వీలులేదు. సేవ్యము నందున్నభూమి ఎంతవరకు ఫలవంతమగుచున్నదియును తెలిసికొనుటకు ఆధారములు లేనప్పుడు, పంటలయొక్క మదింపుచుకట్టుట సాధ్యముకాదు. మొత్తపుపంటలో నేలపన్ను నూటికి ఇన్నవ వంతగుచున్నదని వ్రాసినవ్రాతలకు ఏవిధమైన ఆధారములును లేవు. ఊహింపబడిన వగుటచే వీనిని సరకుచేయబనిలేదు. కలువులపంచాయితీవారి యెదుట అనుభవశీలురగు అధికారులు నేలపన్ను 5 మొదలు 31వరకు యున్నదని చెప్పినసంగతులను గమనించక పైన కనబరచబడిన పట్టీయందలి అంకెలనే ఆధారముచేసికొని, సర్కారువారు వ్యవహరించుట న్యాయముకాదు.

మూడవ హేత్వాభాసము.

ఇండియా దొరతనమువారు సేకరించుచున్న నేలపన్ను మొగలాయిప్రభువుల వలన విధించబడిన ఆదాయముతో సరిపోల్చిచూచిన తక్కువగనేయున్నదని భావించుట. మొగలాయిప్రభువులవలనవిధించబడిననేలపన్ను లెక్కలుమాత్రము బ్రిటిషు దొరతనమువారు విధించిన శుల్కము కంటె అధికముగనే యుండెను. అందు ఏమాత్రము వసూలుచేయబడుచుండెడిదియను సంగతి విచారణీయము. సర్ జాన్ స్ట్రాచీగారు 'ఇండియా'' యను పుస్తకమునందు ఔరంగజీబునాటి నేలపన్నుయొక్క లెక్కలనుగూర్చి 105-వ పేజీయందిట్లువ్రాసిరి. "ఈఅంకెలు, వసూలుచేయబడిన ఆదాయమునుగురించి వ్రాయబడినవో లేక ఇంతద్రవ్యము వసూలుచేయబడవలసి యున్నదనియో స్పష్టముగా ఎచ్చటను వ్రాయబడలేదు. కాని వసూలుచేయవలసియున్న ఆదాయమును నిరూపించునని యనియెనిస్సందేహముగా చెప్పవచ్చును. నామతమున మొగలాయిప్రభువులయొక్క రివిన్యూను తెలుపు ఈ అంకెలునమ్మ నర్హములైనవికావు."

బ్రిటిషుపాలకులు అయోధ్య నవాబువలన విధింపబడిన హెచ్చురేట్లప్రకారమే రివిన్యూను విధించుచు, వసూలు చేయుటలోమాత్రము అప్పటిరీతిని కాపుమాపులు చేయుట లేదని, బేడెను పవలుగారు బ్రిటిషు ఇండియాయందలి క్షేత్రపద్ధతినిగూర్చివ్రాసిన రెండవ సంపుటముయొక్క 14-వ పేజీయందువ్రాసిరి.

మొగలాయిప్రభువులు ఒకవేళ హెచ్చురేట్లను నేలపన్ను వసూలుచేసిరనియే ఊహింతము. ఆద్రవ్యము నేవిధముగ వారు వ్యయము చేయుచుండిరి? ఈ ప్రపంచమునందెల్ల శిల్పకళయందు ఇండియాదేశమునకు వన్నెదెచ్చునటుల తాజి-

మహాల్, మయూరాసనము, జమ్మా-మసీదు మొదలగు కట్టడములకును, చిత్రపుపనులక్రిందను వినియోగించుటయే గాక ప్రజోపయోగకరమగు ఎన్నియో ఉద్యమములకు వారు ఆసొమ్మును ఖర్చు పెట్టుచుండిరి. నీటికాలువలకును రోడ్లకు కూడ విశేషద్రవ్యము వెచ్చింపబడుచుండెడిది. అందువలన పన్నులరూపమున ప్రజలనుండి సేకరించబడిన ద్రవ్యముతిరుగా ఆప్రజలకే ఏదో ఒకవిధమున చెందుచుండుట తటస్థించుచుండెడిది. ఏదేశముననైనను వసూలుచేయబడిన ద్రవ్యము తిరిగి ఆ దేశముననే వెచ్చింపబడుచో పన్నులయొక్క భారమధికమైనను ప్రజభరించగలరు. కళాచక్రము మొగలాయిప్రభువుల కాలమునందెంత యౌన్నత్యస్థితి యందున్నదియును, బ్రిటిషుప్రభుత్వమున ఎట్టినీచదశయందున్నదనియును గమనించిచూచిన మొగలాయి ప్రభువుల రివిన్యూయొక్క కరభారము అంతకష్టతరముగ నుండియుండదని విశదము కాకమానదు. ఇపుడన్ననో సీమఖర్చులక్రింద ఎన్నియోకోట్ల రూప్యములు పరదేశయాత్ర వెడలుచున్నవి. 1916-17 సం॥ న ఇండియాను బాసిపోయిన ధనము 39 కోట్లరూప్యములు. ఇందణుమాత్రమైనను మన దేశమునకు తిరిగిరాదు. మేజరువిగ్నేటుగారు వ్రాసిన ప్రకారము ఈధనమునంతయు సముద్రములో పారవైచిన దేశమునకెంత లాభమో అంతియ చేకూరును.

నేలపన్ను ఆర్థికశిస్తుకాదనియును, ఇదికూడ ఒకతీరు పన్నేయనియును తేలినది. కావున దొరతనమువారు ముప్పది సంవత్సరముల కొకసారి తిరిగీ పైసలా చేయునప్పుడు, రైతు చేసిన అభివృద్ధిని విడిచిపెట్టి ధరలుపెరిగి నప్పుడును, సర్కారు



వలన నీటిపారుదలకు విశేషద్రవ్యము వ్యయముచేసి సదుపాయములు చేయబడినప్పుడును, రివిన్యూను అధికముచేయుట న్యాయముగాని, పైసలాకాబడి నపుడెల్ల శిస్తును పెంపు చేయుట పాడిగాదు. ఇటీవల పంజాబు శాసననిర్మాణసభ యందు, లాలాసోహన్ లాలుగారు భూముల పైసలాలు ముప్పది సంవత్సరముల కొకసారి జరుపుచుండవలయునేగాని అంతకులోపుగా జరుపరాదని ప్రభుత్వమువారిని కోరుచు ఒక తీర్మానము నుపపాదించిరి. ఆతీర్మానము అధికార సభ్యుల వలన నిరసించబడినది. తీర్మానమునకు సమ్మతులను లెక్కించమని సోహనలాలుగారు కోరగా అధికార సభ్యులందరు వ్యతిరేకముగను, అనధికారసభ్యులందరు తీర్మానము పక్షమునను సమ్మతులనిచ్చిరి. 13గురు వ్యతిరేకముగను 13గురు తీర్మానమునకనుకూలముగను తమ సమ్మతులనిచ్చిరి. అప్పుడు గవర్నరు గారు తమకు ఇతరసభ్యులకంటె అదనముగానున్న రెండవ సమ్మతిని అధికారసభ్యుల పక్షముగ నొసంగిరి. అందువలన సోహనలాలుగారి తీర్మానము రద్దుకాబడినది. పాఠకులు, డిసెంట్రలైజేషను పంచాయితీవారియెదుట పంజాబు దొరతనమువారు, భూములపైసలాలను ముప్పది సంవత్సరములకులోపుగ మార్చమనిచేసిన వాగ్దానమును, శాసననిర్మాణ సభయందలిచర్చను, సమగ్రముగా ఆలోచించిచూచితేని, ఇదిఎంతశోచనీయమైన సంగతియును చక్కగ గ్రహించగలరు. శాశ్వతపైసలా నొసంగకపోయిన మానిరిగాని, ముప్పదిసంవత్సరములకు లోపుగా పైసలాలను మార్చరాదని అనధికారసభ్యులుకోరగా నిరసించుట ధర్మముకాదు.

## ఇండియాదేశపు ఇనుపదారులు.

“ఇండియాదేశముయొక్క సదుపాయము నిమిత్తము ఇనుపదారులు నిర్మింపబడినవి కాని ఇనుపదారుల నిమిత్తమై ఇండియా సృష్టించబడలేదు” సర్ జార్జిక్లార్కు (ఇపుడు సిడ్న్‌హాము ప్రభువని పిలువ బడుచున్నాడు).

బొంబాయి రాజధానియందు బ్రోచియను పట్టణరాజమొండుగలదు. ఆనగరమును బొంబాయి, బరోడా సెంట్రలు ఇండియా రైల్వే, ఇతరప్రదేశములతో కలుపుచున్నది. ఈ రైల్వే నూటికి రెండువందలరెట్లు రేట్లను అధికముచేయుట వలన (అనగా ఇదివరలో ఒక రూపాయయున్న రేటు మూడు రూపాయలు చేసిరి) తమ వ్యాపారములకు చాల నష్టము వచ్చెనని 1910 సం॥ బొంబాయి గవర్నరు గారికి బ్రోచి పట్టణమునందలి యంత్రశాలాధికారులును వర్తకులును మహజరు నంపుకొనిరి. ఈమహజరును ఇండియా దొరతనము వారికి పంపు సందర్భమున సిడ్న్‌హాము ప్రభువు, పైనీతిని గంభీరముగా వ్రాక్రుచ్చెను. ప్రజలయొక్క కష్టసుఖములను బాగుగ గుర్తించిన వాడగుటచే, దేశమునందలి కళల యొక్క పురోభివృద్ధికిని ప్రజలయొక్క సదుపాయముల కొరకును, ఇనుపదారులు నిర్మింపబడినవికాని కేవలము వర్తక విషయమగు లాభమునిమిత్తమే, ఇండియాదేశమున రైల్వేలు నెలకొల్పబడలేదని స్పష్టముగా నొక్కి వక్కాణించెను. దేశక్షేమమును ప్రజాక్షేమమును కేవల ఐశ్వర్యోపార్జనము కన్న నెక్కుడుగ పరిగణింప బడవలయుననెడి నీతి ఎల్లరకు తెలిసినదే. దొరతనమువారి ప్రయత్నములన్నియు ఇందులకే కదా! ఈరాజ



నీతిని ఇండియా దొరతనమువారు పూర్తిగ గమనించినట్లు తోచదు. ఒకవేళ మన దొరతనమువారు తల యూచినను, ఇండియా కార్యదర్శిగారు ఇంగ్లాండు నందలి కంపెనీ భాగస్వాములయొక్క ఆశయములకు హెచ్చు ప్రాముఖ్యత నిచ్చుచు, ఇండియా దేశముయొక్క పురోభివృద్ధికి పెక్కు విషయముల అనుకూలు డగుటకు బదులు ప్రతికూలు డగుచున్నాడు. ఇది ఈదేశమునకు చాలనష్టదాయకముగ నున్నది.

ఇనుపదారులను నిర్మింప మొదలిడి డెబ్బది సంవత్సరములు కావచ్చినను ఈసరికి రైల్వే రాజస్వము (ఆదాయము) ను కూర్చి సరియైన గ్రంథమొకటియును వెలువడకుండుట చాల సంతాప కరము. మొత్తముపైని రాజస్వ విషయమున ఎంతవరకు లాభకరముగ నున్నదియు మాత్రము మేమిచట పొందుపరచగలము. కొన్ని ఇనుపదారులు నష్టదాయకముగను కొన్ని లాభకారిగను ఈదేశమున కలవు. ఏటేట కంపెనీల వలన ప్రచురింపబడు రిపోర్టుల యందు ఈసంగతి వ్యక్తీకరింప బడుచుండును. మొత్తపు ఫలితము నాలోచించి చూచిన సంతృప్తి కరముగ లేదని చెప్పక తీరదు. 1910-వ సంవత్సరముసరికి సర్కారు రాజస్వమునకు నలుబది కోట్ల రూప్యముల నష్టము సంప్రాప్త మయ్యెను!

| | | | | | కోట్లరూప్యములు. |
|---|---|---|---|---|---|
| నష్టము | 1849-50 | నుండి | 1858-69 | వరకు | 2.10 |
| ,, | 1859-60 | నుండి | 1874-75 | ,, | 24.39 |
| ,, | 1875-76 | ,, | 1894-96 | ,, | 25.35 |
| | | | | మొత్తము నష్టము. | 51.84 |

| | కోట్లరూప్యములు. |
|---|---|
| నికరపు నష్టము 1895-96 నుండి 1898-99 వరకు | 3.85 |
| ,, లాభము 1899-00 నుండి 1907-08 రకు | 15.47 |
| ,, నష్టము 1908-09 ,, ... ... | 1.86 |
| ,, లాభము 1909-10 ,, ... ... | 1.24 |
| మొత్తముమీద నికరపు నష్టము ,, | 51.84 |
| ,, ,, లాభము ,, | 11.00 |
| 1909-10 సంవత్సరమునకు నిలిచియున్న నష్టము | 40.84 |

మనరైల్వేలనుండి 1900 సంవత్సరమునుండియే సర్కారుకు లాభము వచ్చుచున్నది. ఇంకను పైని చూపిన నలుబది కోట్లరూప్యముల నష్టమును భర్తీ చేయవలసియున్నది. 1925 సంవత్సరము సరికి ఈనష్టము భర్తియయ్యేనేని చాలఅదృష్టవంతులమే.

రైల్వే రాజనీతియొక్క విమర్శనము ఏల నందురేమో? 1910 సంవత్సరముసరికి రైల్వేలమీద 439 కోట్లరూప్యములు వెచ్చించ బడెను. ఏటేట ఆదాయమునుండి వడ్డీలక్రింద ఎంత ధనమును ఈయవలసి వచ్చుచున్నదియును గమనించినచో, రైల్వే రాజస్వ విమర్శన మత్యావశ్యకమని చదువరులు చక్కగ గుర్తించగలరు. ఇటీవల ఇనుపదారుల నిర్మాణమునకై సాలునకు 12 మిలియన్ల సవరనులు (పదునెనిమిది కోట్ల అరువది లక్షల రూప్యములు) వెచ్చించబడుచున్నవి. దేశముయొక్క ఆర్థికస్థితిని చక్కగ విచారించక బ్రిటను దేశమునందలి భాగ్యవంతులయొక్క ఆశయములను సఫలీ కృతములు చేయునిమిత్తమై ఇండియా దొరతనమువారు, విశేష ద్రవ్య



ముము ఇనుపదారుల నిర్మాణమునకునై వ్యయము చేయుచున్నారు. రైల్వేలవలన ప్రజలకును దేశమునకును కలుగబోవు, లాభము మాట అటుండనిచ్చి, కోట్ల కొలది రూప్యములను వెచ్చించగల స్థితిలో దేశమున్నదో లేదో చర్చించుట ముఖ్య ఆవశ్యకము. ప్రయోజనత్వమును దేశముయొక్క ఆర్థికస్థితి గతులననుసరించి చర్చించి నిశ్చయించుట ధర్మము. నీటికాలువలకును, నీటిపారుదల కట్టడములకును ప్రభుత్వమువారు చాల తక్కువగా సొమ్ముఖర్చు చేయుచున్న సంగతి ఎల్లరెరింగినదే. సాలునకు ఒకకోటి యేబది లక్షలుమాత్రమే నీటిపారుదల కట్టడముల విషయమై ఖర్చు చేయబడుచున్నది. హిందూదేశమునకు నీటిపారుదల విధానములు ప్రాముఖ్యములుకాని, ఇనుపదారులుకావు. ఇనుపదారులు ఆర్థికసంపదను ఒకతావునుండి మరియొక తావునకు మార్చుచుండునేగాని ఉత్పత్తిచేయజాలవు. నీటిపారుదల విధానములన్ననో ప్రాణాధారములు. కృషికళయే ఈదేశమున పెక్కు ప్రజలకు జీవనాధారమైయున్నది. నీటిపారుదల విధానములను విరివిచేసినచో, అనావృష్టి బాధలంతగా నష్టపరచ జాలవు. ఒక్క వ్యవసాయశాఖకే (Irrigation Department) యననేల విద్యాశాఖకును ఆరోగ్యశాఖకును కూడ చాలతక్కువ సొమ్ము ఖర్చుచేయబడుచున్నది. ఇండియా దొరతనమువారు ఇనుపదారుల నిర్మాణమునందు చాల పక్షపాతబుద్ధితో రాజ్యతంత్రమును నిర్వహించుచున్నారని యొప్పుకొనక తీరదు. ఇది సరియైన రాజ్యాంగపద్ధతి కాదని నిరూపించక వీలులేదు.

1910-వ సంవత్సము సరికి రైల్వేలమీద పెట్టుబడి 439 కోట్లు. 1900-వ సంవత్సరమున 339 కోట్లుమాత్రమే. అనగా పదిసంవత్సరములలో నూరుకోట్ల రూప్యములు హెచ్చు వ్యయము చేయబడెను. నూటికి ముప్పదిరెట్లు అధికము కాబడెను. ఆపది సంవత్సరములలోను రైల్వేలనుండి వచ్చిన ఆదాయము యొక్క లాభనష్టములను విచారింతము. మొత్తపు ఆదాయములో నూటికి 36 పాళ్లు వృద్ధి అయినది. మొత్తపు ఖర్చులన్ననో (Woking charges) నూటికి అరువదిరెట్లు పెరిగినవి! 1901 సంవత్సరమున వడ్డీ బాబతు 4.37 కోట్ల రూప్యములును, 1910 సంవత్సరముకు 6.127 కోట్లరూప్యములవరకు పెరిగినది. 263, 264 పేజీలలో పొందు పరచిన పట్టీవలన ఈఅంకెలయొక్క వివరము తెల్లమగును. రైల్వేరాజస్వమును, మొత్తపు రివిన్యూకలమునుండి తొలగించి, ప్రత్యేకముగా కనబరచుచుండిన, అందలి తంత్రమును మనము బాగుగగుర్తించుటకు అవకాశములుండును. మన నాయకులు ఈవిషయమును పట్టుదలతో సర్కారువారికి నివేదించికృతార్థులుకావలసిన యావశ్యకత, చాలగలదు.

రైల్వేరాజస్వ విషయమును విపులముగా చర్చించుచో ఎన్నియో పుస్తకములను వ్రాయవలసియుండును. స్థలసంకోచముచేత నిప్పటున సంక్షేపముగా ప్రధానాంశములను మాత్రమే పొందుపరచ దలంచితిమి. చదువరుల, మనంబులందు ఈవిషయమునుగూర్చి విస్తారముగా తెలిసికొన వలయున నెడి ఇచ్ఛజనించెనేని మాప్రయత్నములు సఫలములైనవని నమ్ముచున్నాము.



అసంఖ్యాకులగు రైల్వే ఉద్యోగస్థుల అభివృద్ధినిమిత్తమును, ఈదేశమునందలి ఆర్థికసంపదను వాణిజ్యద్రవ్య సాధనములను కొల్లగొనుచున్న అన్యదేశీయుల సౌకర్యముల కొరకును మనదేశమున ఇనుపదారులు నిర్మించినట్లున్నది. స్వదేశసంపదను కొల్లగొనుచున్న ఈ విజాతీయుల ఆశయములే ప్రాధాన్యముగ నెంచబడుచున్నవి. ఇండియా దేశముయొక్క రైల్వేచారిత్రమంతయు దీనికి ప్రబలనిదర్శనము. దొరలయొక్క ఆశయములు మరి ఏ ఇతరశాఖలయందును ఇంతగా అభినందించ బడుటలేదు. క్రొత్తక్రొత్త ఇనుపదారుల నిర్మాణమునకేమి, లేదా ఇంజనులు, వాగనులు, సామానునుతీసికొనిపోవు (పెట్టెలు) బండ్లు మొదలగు సామగ్రిని అధికముచేయు విషయమునకేమి ఆంగ్లేయవర్తకులు తమ వాణిజ్యసంఘముల మూలముగ ఆందోళనము చేసినచాలును. ఒకవేళ ఈ ఆందోళనము ఫలింపదేని ఇంగ్లీషు ప్రజాప్రతినిధి సభయందలి సభ్యులు ఇండియాకార్యదర్శిగారిని నిర్బంధముచేసి చివరకు ఇంగ్లీషువర్తకుల కోరికలు నెరవేర్చు కొందురు. క్రొత్త ఇనుపదారులను నిర్మించుటవలన వీరి కేమియు బాధకలుగదు. వీరు వడ్డీలక్రింద ఏమియు నీయనక్కరలేదు. భారమంతయు భారతీయులే వహించుచుండ, లాభమును మాత్రము తాము గ్రహించుచుందురు. తాము కొంచెమైనను నష్టపోకుండ, ఇండియా దేశమునందలి ద్రవ్యసాధనముల నన్నిటిని కొల్లగొనుటయే ఆంగ్లేయవర్తకుల ఆశయము. రైల్వే విషయములయందు, ఈ దేశస్థుల ఆశయములు కొంచమైనను గమనింపబడుటలేదు. ఏవిధమున అన్య

దేశీయుల వ్యాపారములు వృద్ధిని గాంచునో అద్దానినే పరిగణించుచున్నారు.

ఇందులకెన్నియో నిదర్శనములు గలవు. గారంటీ చేయబడిన ఇనుపదారుల సంగతిని యోచింతము. తొలుత 1848 సం॥ న ఇండియాయందు ఇనుపదారులు నిర్మించుటయందు ఇంగ్లాండునకునవలెనే కంపెనీలు, మొదట పెట్టుబడి పెట్టుట కారంభించినవి. రైల్వేలవలన లాభము వచ్చునో నష్టము వచ్చునో ప్రథమమున తెలియదు. గనుక సర్కారువారు నూటికి అయిదువంతున వడ్డీగిట్టునట్లుగా అంగీకరించినగాని కంపెనీలు మూలధనమును వెచ్చించ నీయకొనలేదు. అపుడు నూటికి అయిదువంతున వడ్డీ గిట్టునట్లు మేము పూచీపడెదమని ఇండియా దొరతనమువారు పూనుకొనిరి. తమ సొమ్మునకు వడ్డీ ఎటులనైన గిట్టునుగదా యను ధైర్యముతో కంపెనీలు ఎన్నియో లక్షలరూప్యములను కొన్నివిషయములలో అనవసరముగకూడ, పెట్టుబడిపెట్టెను. సర్కారువారు పూచీపడుటనే గారంటీయనెదరు. మొదట గారంటి చేయబడిన ఇనుపదారులన్నియు ఇండియా దొరతనమువారిచేతిరుగాకొనబడినవి. కొన్ని సంవత్సరములు పోయిన తరువాత కంపెనీలు వెచ్చించిన మూలధనమునకు అప్పటి మార్కెట్టు రేటుప్రకారము యావత్తు భాగములను కొనుటకు ప్రభుత్వమువారు తమకుఅధికారమును ఉంచుకొనిరి. గారంటీ చేయబడిన రైల్వేలయందలి భాగస్వాము లెటుల ఐశ్వర్యవంతులైనదియు చూతము. నూటికి అయిదువంతు వడ్డీకి సర్కారువారు పూచీ పడియున్నారు. రైల్వేలనుండి వచ్చెడి నష్టమును, పన్నులను చెల్లించు ఈ



దేశస్తులు భర్తీచేయవలసి యున్నది. వెల్బీ పంచాయితీ వారి ఎదుట నీయబడిన సాక్ష్యమువలన 1896 సం॥ సరికి 51.84 కోట్ల రూప్యముల నష్టము సంప్రాప్తించెను అనగా సాలునకు సుమారు కోటి రూప్యములు నష్టము. ఇంతటితో సరిపోలేదు. కంపెనీలకు లాభము వచ్చునట్లుగను, సర్కారుకు నష్టము వచ్చెడిరీతిని ప్రభుత్వమువారు, గారంటీ చేయబడిన కంపెనీలతో తిరిగి ఒడంబడికలు చేసికొనిరి. కంపెనీలయొక్క భాగములు ప్రభుత్వమువారిచే కొనబడినవి. కంపెనీలయొక్క కంట్రాక్టు (లైసెన్సు) ఆఖరు అయేకాలమునకు అట్టి భాగములను కొనుటకు కావలసిన ధనమును సమకూర్చుటకునై, ఏటేట రాజస్వమునుండి కొంత ధనమును కేటాయింపుచేసి ఒకనిధిని ఏర్పాటుచేయలేదు. అటులచేయక యుండుటవలన, సర్కారువారు కంపెనీలయొక్క కరుణాకటాక్షములకు పాత్రులు కావలసినచ్చెను. గవర్నమెంటువారు కొనబోవు నాటికి ఉండెడి మార్కెట్టు ధర ప్రకారము కంపెనీలయొక్క మూలధనమంతయు చెల్లించవలసి వచ్చెను. రైల్వే కంపెనీభాగములన్నియు బజారు ధరప్రకారము హెచ్చు మూల్యమునకుగాని లభింపవయ్యెను. ఏటేట నష్టము వచ్చుచున్నది గదా, ఈ భాగములకు ధర ఎటుల అధికమయ్యెనని ప్రశ్నించవచ్చును. నూటికి అయిదువంతు వడ్డీ గిట్టునట్లుగా మన ప్రభుత్వమువారు పూచీ పడియుండుటచే భాగములయొక్క ధరలు పెరిగినవి. ఆఋణ తీర్మానమునకై ప్రత్యేకనిధిని నెలకొల్పకపోవుట చేత వీరి మూలధనమును చెల్లించుటకుగాను, ప్రభుత్వమువారు తిరిగి ఋణము చేయవలసివచ్చెను. అందుచేత పూర్వపుకంపెనీలే

తిరుగానచ్చుట తటస్థించెను. ఇంతటితో పూర్తియైన బాగుగనే యుండును. మరియొక షరతుకూడ విధించబడెను. రైల్వేలను కంపెనీల యాజమాన్యము నందుంచుటకును, తమశ్రమకు ప్రతిఫలముగా, లాభమునందు కొంత భాగము కంపెనీలకు చెందునట్లుగను నిశ్చయించ బడెను. దూరదృష్టి లేకపోవుట వలనను సరియైన రాజ్యతంత్ర నిర్వాహణ లోపము వలనను, పూచీ నీయబడిన రైల్వేకంపెనీలు, విస్తారము లాభమును తమ మూలధనమునుండి సంగ్రహించుటయేగాక తిరిగి రైల్వే యాజమాన్యమును వహించి అదనముగా క్రొత్తలాభమును సైతము పొల్గొనుచున్నారు. ఇండియా జాతీయ ఋణమును ఇనుమడింప చేయుటకు ఆఫ్ఘను యుద్ధములకును, సీమఖర్చులకును, రైల్వేలుకూడ సహకారులైనవి.

ఇనుపదారులు నిర్మించినది మొదలు నేటివరకును ఇండియారైల్వే రాజస్వమున ఎన్నియో ఘోరమైన పొరపాటులొనరింప బడినవి. ఇట్టి పొరపాటులు నాగరికతను గాంచిన ఏదేశమునందైన గావింపబడుచో, దేశమునందంతటను కలవరము పుట్టియుండును. 1848 మొదలు 1917 వరకు రైల్వేల విషయమై ఏక్రొత్తమార్గము నవలంబించినను అది హిందూదేశమునకు క్షేమకరముగ నుండుటకు బదులు విప్లవకారిగ నుండునట్లుగనే పరిణమించుచుండెను. డల్హౌసీ ప్రభువుయొక్క వరప్రసాదమే నేటికిని ఇండియాను పీడించుచున్నది.

ఈమహాశయుడు కటాక్షించకయున్న ఇట్టి దురవస్థ సంప్రాప్తించక పోవును. రైల్వేలను ఇండియాయందు నిర్మాణము చేయుటవలన లాభమేమియు కలుగలేదని శాసించుట మామతముకాదు. డల్హౌసీప్రభువు, కంపెనీలకు పూచీనిచ్చి ఇనుపదారులను అపుడు నిర్మింపకున్నచో, రైల్వేలే ఈదేశమునలేకపోయి యుండునని భ్రమించరాదు. నాగరికాగ్రగణ్యాయగు ఇంగ్లాండుతో ఈ దేశమునకు పొత్తుసంభవించినపుడు డల్హౌసీప్రభువు గవర్నరు జనరలుగానుండు కాలమున లభించకపోయినను, దూరదృష్టిగల కానింగు, లారెన్సుప్రభువుల కాలమందైనను రైల్వేలుదేశమున నిర్మించబడియే యుండును. విశేష మేమనెదరేమో? కంపెనీలకు గారంటీనిచ్చి విశేషధనమును గోల్పోవుటకన్న సర్కారువారే ఋణముతెచ్చి ఇనుపదారులను నెలకొల్పియుందురు. 1868-69 సం॥ న ఇండియా దొరతనమువారు స్వయముగనే రైల్వేలను ఋణముచేసితెచ్చిన ద్రవ్యముతో నెలకొల్పనారంభించిరి. దురదృష్టవశమున ఈరాజ్యనీతి యందుకూడ మార్పు లొనరించబడి, పదిసంవత్సరములు కాగానే తిరిగికంపెనీల మూలధనముతో కొన్నిరైల్వేలును, సర్కారువారి మూలధనముతో కొన్నియును నిర్మింపబడినవి. రైల్వేరాజస్వనీతిని తలచినకొలదిని లోపములె కానవచ్చుచుండును. కంపెనీలని పేర్కొనబడినవన్నియును ఇంగ్లాండునందలి ఆంగ్లేయ మూలధనముతో నేర్పడిన కంపెనీలే అయియున్నవి. ఇండియా ప్రజలకు ఏ జోక్యమును లేదు.



ఋణతీర్మానవిధిని (Sinking fund) నెలకొల్పకయుండుట సర్కారురాజస్వనీతియందు ముఖ్యమైనలోపము. సర్కారువారికి వాణిజ్యపరిజ్ఞానము ఏమాత్రమున్నను ఋణతీర్మాన

నిధియొక్క ఆవశ్యకత తెలిసి తీరవలయును. ప్రతికంపెనీ ఒడంబడికయందును 25 సంవత్సరములకో, 50 సంవత్సరములకో సర్కారువారి ఇష్టప్రకారము తీసికొనుటకు ఆటంకములు లేకుండ షరతులుండియే యున్నవి. ఆనిధియున్న యెడల తిరుగా ఋణముచేయ నక్కరలేకయే, కంపెనీలకు క్రయధనమును చెల్లించుటకు వీలుగా నుండియుండును. గారంటీ చేయబడిన వడ్డీని (నష్టమువచ్చినపుడెల్ల) ఇచ్చుకొనుచు, తిరిగిఋణ తీర్మాణ నిధిని నెలకొల్పుటవలన ఇండియా రాజస్వమునకు భారమధికమగుననుమాట సత్యమే. కాని ఆభారము చివరకు లాభకారిగనే పరిణమించి యుండునని మా నమ్మకము. ఏది ఎటులనున్నను క్రయధనమునుతిరిగి ఏదో ఒకవిధముగ ఋణము తెచ్చి చెల్లించుటకంటె అట్టినిధియున్న యెడల చాలతక్కువ ధనము వ్యయమైయుండును. ఒక్క ఈస్టిండియను రైల్వేదక్క గారంటీ చేయబడిన ఇతర రైల్వేకంపెనీ లన్నియు ఏబది సంవత్సరములుదాటిన తరువాతనే కొనబడినవి. ఋణతీర్మాననిధియుండియుండిన తిరుగా ఋణముచేసి చాలసొమ్మును వడ్డీల క్రింద వినియోగించవలసిన అవస్థపట్టియుండక పోవును. అటులగావించినచో ఇండియా దొరతనమువారు ఈసరికి అన్ని రైల్వేలకు ఏకంపెనీయొక్క జోక్యమును లేకుండ ఖామందులై యుండియుందురు. ఇపుడన్ననో ఈస్టు ఇండియను రైల్వే (కలకత్తా నుండి ఢిల్లీ మీదుగా సిమ్లావరకు పోవును). 1919 సంవత్సరము వరకును, గ్రేటు ఇండియను పెనెన్సులారైల్వే (నాగపూరు నుండి బొంబాయివరకును, రాయచూరునుండి బొంబాయివరకును పోవును). 1925 సంవత్సరమువరకును, ఇతరరైల్వేలు



1950 వరకును కంపెనీల యాజమాన్యమునందుండి తీరవలసియున్నది. కంపెనీలు విధించిన షరతులకు దొరతనమువారు లోబడియుండవలసిన అవసరము లేక పోయియుండును. మొదటి 55 సంవత్సరములలోను సాలునకు కోటిరూప్యముల చొప్పున ఇండియా రాజస్వమునకు నష్టమువచ్చినది. మిగిలిన 50 సంవత్సరములలోను, న్యాయముగా సర్కారునకు చెందవలసిన లాభములో చాలతక్కువగా సంప్రాప్తించగలదు. కంపెనీలు తమఖర్చులుపోను ఏటేట కోటిరూప్యములను వారిలాభము నిమిత్తము మొత్తమునందు పాల్గొనుచున్నవి.

## ఇనుపదారులపై వచ్చులాభము.

1907 సం॥ న రైల్వేకమిటీయొకటి, విచారణనిమిత్తమై నిర్దేశించబడెను. ఆకమిటీవారు తమనివేదనము యొక్క నాల్గవపేరాయందు 1906-07 సంవత్సరముతో అంతమగు అయిదుసంవత్సరములయొక్క రైల్వేరాజస్వమును గూర్చియు ప్రకటించిరి. అందు అయిదవ సంవత్సరముయొక్క లెక్కను పరిశీలించి చూతము.

| | 1906-07 | |
|---|---|---|
| మూలధనము | 253,708,169 | సవరనులు. |
| స్థూలాదాయము | 2[illegible],834,000 | ,, |
| స్థూలమైనఖర్చులు | 130,493,522 | ,, |
| ఖర్చుపోగామిగిలిన నికర ఆదాయము | 13,341,338 | ,, |
| మూలధనముపైని నూటికివచ్చిన నికర ఆదాయము | 5·26 | ,, |

పై పట్టీయందలి అంకెలనుబట్టి నూటికి 5.26 వంతున దొరతనమువారికి నికర ఆదాయము వచ్చినదనిగాని, లాభమని గాని పాఠకులు తలంచరాదు!

ఏలననిన స్థూలమైనఖర్చులకు రైల్వేలనిమిత్తమై తెచ్చిన ఋణములయొక్క వడ్డీయును కొన్ని గారంటీ కంపెనీలకు ఏటేట చెల్లించవలసిన వాయిదాలకగు (Annuities) ఖర్చులును, ఋణతీర్మానినిధి నెలకొల్పనందువలన కంపెనీలయొక్క భాగములకు అదనముగా చెల్లించవలసిన ద్రవ్యమును చేర్చవలసియున్నది. నికరాదాయమని పేర్కొనబడిన 13.34 మిలియన్ల సవరనులనుండియు పైన జెప్పబడిన ఖర్చులన్నియు తీసివేయగా శేషము 2,313,541 సవరనులకు దేలుచున్నది. వాణిజ్య విధానమునం దంగీకరింపబడు నీతిప్రకారము, ఇండియా దొరతనమువారికి 253,708,169 సవరనుల పెట్టుబడిపైని వచ్చిన నిజమైన నికరాదాయము 2,313,541 సవరనులు మాత్రమే. నూటికగు లాభము 0.91-వ వంతుమాత్రమే అయియున్నది. కమిటీవారు సూచించినప్రకారము 5.26-వ వంతుకాదు. ఆసంవత్సరమున అన్ని బాబతులక్రిందను వెచ్చించబడిన ధనమును తీసివేసిన నిలచియున్నది నికరాదాయమన జెల్లును. ప్రభుత్వమువారు ఈనిజమైన నికరాదాయమును ప్రకటించకుండ, నామమాత్రమైన 5.26 వ వంతు నికరాదాయమని ప్రకటించుట చాలపొరబాటు. రైల్వేలు నెలకొల్ప మొదలిడి 1908 వ సంవత్సరమునకు 60 సంవత్సరములు కావచ్చినను, సర్కారువారికి రైల్వేలపై వెచ్చింపబడిన కోట్లకొలది మూలధనముపై నూటికి 0.91 వంతుకంటె అదనముగా (ఆదాయము) లాభము నొసంగకుండుట కడువిషాదకరము. నూటికి ఒకవంతైనను లేదు! ఇదియైనను 1899-1900 సం॥ నుండిమాత్రమే లభించుచున్నది. రైల్వే కమిటీవారివలన తెలియజేయబడిన ఇండియా దేశముయొక్క రైల్వేరాజస్వపునిజస్థితి ఇటుల నున్నది. కమిటీవారు కొన్ని రైల్వేలకుచెల్లించుచున్న సంవత్సరవాయిదాలో కొంతవరకు క్రయధనమును చెల్లించుట యగుచున్నదికాన, సర్కారువారి నికరాదాయమునందు చేర్చవలసియుండునని వ్రాసియున్నారు. సత్యమే. 1906-07 సరికిమూలధనమునందు తీర్చబడినద్రవ్యము 752,135 సవరనులు. కమిటీవారువ్రాసినట్లుగనే ఈద్రవ్యమును కూడ నికరాదాయమునందు చేర్చుదము. అపుడు మొత్తము 3,065,676 సవరనులగుచున్నది. ఈ మొత్తమునుండి నూటికి వచ్చెడిరాబడి 1.20-వ వంతు అగుచున్నది. రైల్వేరాజస్వము యొక్క ఉదంతమంతయు ఇందులో నిమిడియున్నది. దేశమునందు అరువదియేండ్లు రైల్వేలు నెలకొల్పబడియుండ 253 మిలియన్ల సవరనులమీదను సర్కారుకువచ్చిన నికరాదాయము నూటికి 1.20-వ వంతుమాత్రమే! రైల్వేరాజస్వమెంత నీచ దశయందున్నదియు ఈ అంకెలే చెప్పక చెప్పుచున్నవి.



## ఇనుపదారులకగు ఖర్చు.

నూతన ఇనుపదారులను నిర్మించుటయందే గాక, వాగనులను (Rolling stock) ఏటేట అధికము చేయవలసినదని ఆంగ్లేయవర్తక సంఘములు ఆందోళనము చేసినవెంటనే ఇండియాదొరతనమువారు క్రొత్త సామానులకొరకు అనుజ్ఞనిచ్చుచున్నారు. ఈవిషయమై 1900-01—1906-07 సంవత్సరములమధ్య ఎంతఖర్చు అయినదియును ఈదిగువ చూపబడినది.

| | సవరనులు. |
|---|---|
| 1. క్రొత్త అయోమార్గములను సృష్టించుటకు | 22,886,510 |
| 2. వాగనులు మొదలగువాని నిమిత్తము | 27,411,120 |
| మొత్తము. | 50,247,630 |

1900-01 సరికి నిలిచియున్న ఖర్చు 5,317,768 సవరనులనుండి 1905-06 సరికి 8,999,430 సవరనుల వరకు పెరిగినది. 1906-07 సరికి 9,741,000 సవరనులయినది. ఆరు సంవత్సరములలో మూలధనముక్రింద 4,423,232 సవరనులు ఖర్చయినది. అనగా నూటికి 83-వ వంతు అధికము కాబడినది.

## ఆంగ్లేయవర్తకుల ఆందోళనము.

ఖర్చు రెండింతలు అధికము కాబడినను, రైల్వేకంపెనీల వారును, ఆంగ్లేయవర్తక సంఘములును తృప్తిని గాంచుట లేదు. కోరినకోరికలు నెరవేరుచున్న కొలదిని ఇంకను అదనముగా కావలయు ననియే ఆందోళనము చేయుచుందురు. ఆంగ్లేయ వర్తక సంఘములన్నిటియందును బంగాళమునందలి సంఘమునకు హెచ్చు ప్రాముఖ్యతయున్నది. ఈవర్తకులలో చాలమంది, గోగునార యంత్రశాలలకును, రాక్షసి బొగ్గు గనులకును అధికారులై యున్నారు. తమ వ్యాపారము హెచ్చుగా సాగుటకొరకు రయిలుకూలిని(Railway Freight) తగ్గించుట అవసరమని గుర్తించినవారై, అందు నిమిత్తమై మొదట ఆందోళనము చేసిరి. ఆ ఆందోళనమునందు కృతార్థులైనవెంటనే, రయిలుకూలి తక్కువగుటచేత బంగాళారాష్ట్ర



మునందలి రాక్షసిబొగ్గు చాల చౌకధరకు దొరకుచుండుట వలన దేశమునందలి చాల భాగములయందు ఈ బొగ్గునకు గిరాకి అతిశయించెను. లాభమునంతయు ఒక్కసారిగా గ్రహింపగోరి, సామానుబండ్లు చాలనందున వానిని అధికము చేయవలసినదని ఆందోళన ఆరంభముచేసిరి. తొలుత రయిలుకూలిని తగ్గించవలసినదనియు అది లభించినవెంటనే సామానుబండ్ల సంఖ్యను అధికము చేయవలసినదనియు ఆందోళనము చేసిరి. ఈ ఆందోళనమునందు వీరు కృతార్థులైరని వ్రాయుటయందు ఆశ్చర్య మేమున్నది! రాక్షసిబొగ్గు వ్యాపారమునకేగాక మేంగనీసునకుకూడ గిరాకి అతిశయించెను. ఇంగ్లాండునకు రషియా దేశపు సరఫరా తగ్గిపోవుటవలన ఇండియా దేశమునందలి మేంగనీసుకు గిరాకి అతిశయించెను. ఇందలి విశేష మేమనగా, మేంగనీసు ఇసుకవలె నుండుటవలన దీనిని రేవు పట్టణములకు గొనిపోవుటకై సామానుబండ్లు విశేషముగా కావలసివచ్చెను. రాక్షసిబొగ్గు వ్యాపారమునకును, మేంగనీసు వ్యాపారమునకును ఎన్నియోవేగనులును ఇంజనులును అవసరమయ్యెను. వీనిని అధికముచేయుటయనగా, మూలధనమును అధికముగా వెచ్చించుటయును వడ్డీలకు విస్తారముగా ధనమును విదేశములకు చెల్లించుటయును తటస్థమగుచుండును. ఇది ఈదేశమునకుచాల నష్టదాయకము. పైదేశములకు వడ్డీల నిమిత్తమైగాని ఉద్యోగస్తుల జీతముల నిమిత్తమైగాని పోవు సొమ్మునందు ఒకపైసాయైనను ఈదేశమునకు తిరిగిరాదు. ఏటేట సీమఖర్చులక్రింద ఈ దేశమునుండి కోట్లకొలది రూప్యములు విదేశయాత్ర వెడలుచున్నవి. కుబేరుని నవనిధులు సైతము ప్రతిదినమును

వ్యయముచేయుచు పైరాబడిని అందు చేర్చుచో హరించక మానవు.

## అందువలని నష్టములు.

వేగనులను, ఇంజనులను అధికము చేయుటవలన ఒక గొప్పనష్టముకలదు. ఈబండ్లుసంవత్సరముపొడుగునను వాడుక చేయబడవు. సంవత్సరమునకు నాలుగుమాసములు మాత్రమే వర్తకసమయము. మిగిలిన 8 నెలలును ఈవేగనులు త్రుప్పుపట్టి పాడగుచుండవలసినదే! ఇందువలన ఎంతనష్టము సంభవించుచున్నదియు ఊహించ వలసియున్నది. 1906 వ సం॥ కు నిలువయున్న వేగనులు 115,686. 1908 సంవత్సరము సరికి 13,000 జాస్తి అయ్యెను. అనగా రెండు సంవత్సరములలో నూటికి సుమారు 11 వంతున అధికమైనది. వేగనుల సంఖ్య ఆంగ్లేయవర్తక సంఘముల ఆందోళనమువలన విస్తారముగా పెరిగినది.

## మూడవతరగతి ప్రయాణీకుల దుస్థితి.

కాని, మనుష్యులు ప్రయాణము చేయుటకై మూడవ తరగతిబండ్ల సంఖ్యఎంత అధికము చేయబడినదియును రైల్వే కమిటీవారు పేర్కొనలేదు. జగన్నాధము, సింహాచలము, తిరుపతి, శ్రీరంగం మొదలగు పుణ్యక్షేత్రములకు యాత్రదివసములయందు. లక్షలకొలది ప్రయాణీకులుపోవుచున్న సంగతి ఎల్లరెరింగినదే! ఒక్కొక్క బండిలో వందలకొలది జనమును బస్తాబందీ చేసినను, ప్రయాణీకులబండ్లు చాలక సామాను బండ్లయందుసైతము యాత్రికులను కూరుటచేత ఊపిరి పీల్చు



టకు గాలియైననురాక పడుచున్న కడగండ్లను మనము కండ్లార జూచుచునే యున్నాము. మన ప్రయాణీకుల దుస్థితి మార్చవలయునని దేశీయ మహాజనసభవారు ఎన్ని పర్యాయములు మనవి చేసికొన్నను నిష్ప్రయోజనములగుచున్నవి. ఆంగ్లేయ వర్తక సంఘములకుగల పటిమ మన దేశీయమహాజనసభకు లేనిహేతువువలననే ఇట్టిరాజ్యనీతికి వీలుకలుగుచున్నది. ఇండియాదొరతనమువారు తమ ఆందోళనమును పెడచెవిని బెట్టినచో, పార్లమెంటు సభయందలిసభికులు ఇండియా కార్యదర్శిగారిని ఎట్టకేలకు ఒప్పించగల సామర్థ్యమును కలిగియున్నారు.

## రైల్వేబోర్డునందలి ప్రాతినిధ్యము.

ఇండియా దేశమునకు పార్లమెంటు సభయందు ప్రాతినిధ్యములేదని విచారించ పనిలేదు. రైల్వేబోర్డునందే మనకు ప్రాతినిధ్యము నొసంగనపుడు, పార్లమెంటు విషయమై మనము వగవ పనిలేదు. సామ్రాజ్య, స్థానిక, కార్యనిర్వాహక సభలయందును, ప్రధాన న్యాయస్థానములయందును, ఇండియా కార్యదర్శిగారి సభయందును గౌరవముతో స్థానముల నలంకరించుటకు తగిన భారతీయులు దొరకుచుండ, రైల్వేబోర్డునందు ప్రాతినిధ్యమును వహించుటకు తగినవారొక్కరును లేరనుట చాల సంతాపకరము. ఒకవేళను ఈయుత్తమ పదవిని అభిలషించుటకు తగిన భారతీయులే లేనిచో సక్ విఠల్‌దాసు థేకర్సేగారు సెలవిచ్చినట్లు, బ్రిటిషు ప్రభుత్వమునకు గౌరవమయిన సంగతికాదని వక్కాణించక తప్పదు. నవనాగరిక శిఖామణులనబడు ఆంగ్లేయులచే నూటవబడి సంవ

త్సరములనుండి పరిపాలింపబడుచున్నను, రైల్వేబోర్డు సభ్యత్వ పదవికి అర్హుడగు భారతీయుడొక్కడును ఉద్భవించక పోవుట నిజమే అయినచో బ్రిటిషు ప్రభుత్వముయొక్క కీర్తి కళంక రహితముకాదని వేరుగ చెప్ప నక్కరలేదు. ఈరైల్వే కమిటీ వారు వేగనులను ప్రత్యేకముగా నిర్మించవలసిన అగత్యము లేదని తీర్మానించినందుకు మనకు వందనీయులు. ఏరైల్వే కంపెనీవారు, ఆ రైల్వేకంపెనీ వ్యాపారముయొక్క అవసరములకు వలయునన్ని బండ్లను వారే జాగ్రత పరచుకోవలసిన దనియును, వేగనులను విధి విరామము లేకుండ అధికము చేయుటకు బదులు ఉన్నవానితోనే జాగ్రత్తగా పనిజరిగించుకోవలసినదనియును తీర్మానించిరి. ఈతీర్మానమును ఆచరణములోనికి దెచ్చిన, ఎంతయో బాగుగనుండును.

## ఇంకను ఇనుపదారులు అభివృద్ధికావలయునా?

రైల్వేకమిటీవారు ప్రస్తుతము ఉండియున్న ముప్పది వేలమైళ్ళ ఇనుపదారులతోను తృప్తినొందక, ఒకలక్షమైళ్ళ వరకు ఇనుపదారులను నిర్మించుట సమంజసమని తీర్మానించిరి. అందులకు సాలునకు 12½ మిలియనుల సవరనులు ఇండియా దొరతనమువారు ఖర్చుపెట్టుట యుక్తమనిరి. వలయుమూల ధనమును సేకరించుటకు ఉపాయాంతరములను చర్చించుచు 7½ మిలియనులు దొరతనమువారు ఇంగ్లాండునుండి ప్రత్యేకముగ ఋణముచేయవలసినదిగను, మిగిలిన 5 మిలియన్ల సవరనులును హిందూదేశమునుండి సంగ్రహించుటయును పాడియనిరి.



| | లక్షలు |
|---|---|
| ఇండియా దేశముయొక్క ఆదాయమునుండి | 100 |
| ఋణమును తగ్గించుటకుగాని లేకుండజేయుటకుగాని ఆదాయమునుండి ఏటేట గ్రహించునది. | 75 |
| సేవింగ్సుబ్యాంకి డిపాజిట్లనుండి | 100 |
| రూపాయిఋణము (Rupee loan) | 325 |
| నాణెములు చేయుటవలన వచ్చిన లాభమునుండి | 150 |
| మొత్తము, రూప్యములు. | 750 |

750 లక్షలు=5 మిలియన్ల సవరనులు.

రైల్వేకమిటీవారి యోచన మాకంత తృప్తికరముగ లేదు. బ్రిటిషువ్యాపారస్తులయొక్కయు బ్యాంకర్లయొక్కయు క్షేమము నభిలషించి ఈ తీర్మానము గావింపబడెను గాని, భారతీయులయొక్క కష్టసుఖములను లాభనష్టములను గమనించలేదు. ఏలననగా ఈ దేశముయొక్క ఆర్థికస్థితిని నిష్పక్షపాతబుద్ధితో గమనించినయెడల ఎట్టివారికిని ఇనుపదారులయొక్కవృద్ధి ప్రస్తుతము అవసరముకాదని తోచకమానదు. నీటిపారుదల పనులయొక్క ఆవశ్యకత మనదేశమున మెండు. రైల్వేనిర్మాణము అవసరము లేదు. ఇనుపదారులు మన దేశమునకు చాల అభివృద్ధిని కలుగజేసినమాట సత్యమేకాని, వీనిని ఇంకను అధికము చేయకపోయినయెడల ప్రాణోపద్రవము ఏమియు కలుగదని మానమ్మకము. దేశముయొక్క ఆదాయ వ్యయములను చక్కగా గుర్తించి, జాగ్రత్తగా రాజ్యతంత్రమును నిర్వహించవలసిన ఆవశ్యకత ఈదేశమున కడుమెండు.

ఏలననగా జాతీయఋణము ఇదివరకే అపరిమితముగ పెరిగినది. వడ్డీలక్రింద విదేశములకు అపారముగ ధనమునుపంపుచుండుట చేత స్వదేశమునందలి ఆర్థికసంపదకు విశేషనష్టము కలుగుచున్నది.

## రైల్వేలు, నీటిపారుదల పనులు.

రైల్వేలకన్న నీటిపారుదల విధానములయొక్క ఆవశ్యకత ఇండియాదేశమున విశేషముగ కలదు. కఱవులచేత బాధపడుచున్న భారతీయుల ఇక్కట్టులను బాపునిమిత్తమై 'ఇర్రిగేషను' కమిషనువారు 44 మిలియన్ల సవరనులను నీటిపారుదలపనులకు ఖర్చుపరచవలసినదని అభిప్రాయమునిచ్చిరి. గోదావరి, నేరా (Nera) ప్రాజక్టులు గాక ఇర్రిగేషను కమిటీవారు సిఫారసుచేసిన ప్రాజక్టులన్నియు మూలబడియున్నవి. సంవత్సరమునకు 5 మిలియన్లచొప్పున సర్కారువారు వ్యయముచేసినచో 8, 9 సంవత్సరములలో ఆప్రాజక్టులన్నియును పూర్తి కాగలవు. ఈ నీటిపారుదల విధానములనన్నిటిని పూర్తిచేయుట వలన అనావృష్టిదోషము సంభవించినను దేశమునందు పంటలు పుష్కలముగ పండుట కవకాశము కలుగుచున్నది. ఈతిబాధలు లేకుండిన దేశమునందలి ప్రజలు సంతుష్టు లగుటయేగాక ఆర్థికసంపదకూడ వృద్ధిగాంచును.

ఈసందర్భమున ఇండియా దొరతనమువారు ఒకముఖ్యసూత్రమును గ్రహించవలసి యున్నది. ఒకదేశమునకు లాభించు రాజ్యనీతి మరియొక దేశమునకుకూడ లాభించుననుట వెర్రియని సర్కారువారు గ్రహించవలసి యున్నది. స్థితిగతులను



బట్టి అమృతమును సేవించినను కొన్నితత్వములకు, ఒకానొకసమయమందు విషముగ పరిణమించకమానదు. స్వేచ్ఛావర్తకము ఇంగ్లండునకు లాభకారియగుటచే ఇండియాకు కూడ లాభము నిచ్చుననెడుమాట వట్టిభ్రమయనియు ప్రతిదేశమునకు ప్రత్యేక ఆర్థిక వ్యవస్థలలవడియుండుననియు ప్రథమ అధ్యాయమునందు విపులముగాచర్చించి నిర్ధారణచేసి యున్నాము.

కాబట్టి ఆర్థికస్థితిననుసరించి ప్రస్తుతము నూతన రైల్వేనిర్మాణమును పూర్తిగ ఆపుచేసి, సంవత్సరమునకు పదిమిలియన్ల పౌనులు మాత్రమే ఇనుపదారులక్రిందను నీటిపారుదల విధానములకును ఖర్చుచేయవలసియున్నది. అందు 5 మిలియన్ల పౌనులు ఇరిగేషను కమిషనువారి సిఫారసుప్రకారము ప్రాజక్టులను నిర్మించుటయందును, 5 మిలియన్లపౌనులు రయిల్వేలయొక్క లోటుపాట్లను భర్తీచేయుచుండుటకును వినియోగించవలసి యున్నది. నీటిపారుదలపనులు పూర్తి అయిన తరువాత ఇనుపదారులను నూతనముగా నిర్మించుసంగతి ఆలోచించవచ్చును. స్వదేశమున ఎవ్వియేని కంపెనీలు బయలువెడలి, దేశమునందలి మూలధనముతో రైల్వేనిర్మాణమును చేయబూనిన, ఆంగ్లేయ వర్తక సంఘముల ఆందోళనకు జడియక సర్కారువారు అనుజ్ఞ నిచ్చుచుండవలెను.

## ఇనుపదారులకు ధనము ఇండియాయందు దొరకదా ?

ఇనుపదారులకొరకు వలయు ద్రవ్యమును ఋణముచేసి తెచ్చుటవలని లాభనష్టములను చర్చించనగును. వలయు ధనమును స్వదేశమునుండి గ్రహించుటయే లెస్స. ఈదేశమున

రైల్వేనిర్మాణమునకు అవసరమగు ధన సంచయము లభించక పోవునాయను ప్రశ్న. బొంబాయినూలుయంత్రశాలలకు కావలసిన మూలధనము 10,14 కోట్ల రూప్యములును ఇండియా దేశమే సరఫరాచేసినది. వీరిచ్చువడ్డీ నూటికి $4\frac{1}{2}$ లేక $4\frac{3}{4}$ రూప్యములు మాత్రమే. నూలుయంత్రశాలలసంగతి యటుండనిండు. పట్టణపారిశుద్ధ్య సంఘములును, నగరములను విశాలము చేయుటకును ఆరోగ్యవంతములుగ చేయుటకును ఏర్పడిన ట్రస్టులును రేవుల సంఘములును (Harbour trusts) వారికి వలయు ధనమునంతయు నూటికి 4 రూప్యముల వడ్డీకి దేశమునుండియే గ్రహించుచున్నారు. గవర్నమెంటువారి సంబంధములేని, ఇట్టి సంఘములే తమ వాంఛాపూర్తికి వలయు ధనమును స్వదేశమునుండి సేకరించ గలిగినప్పుడు, గవర్నమెంటువారికి అప్పుకావలయుననిన అందులో ఇనుపదారుల నిమిత్తమని తెలియుచో ధనము చేకురకపోవునా? నూటికి $3\frac{1}{2}$ కంటె వడ్డీని అధికముగ చెల్లించమనెడి పట్టును పట్టక, సర్కారువారు నూటికి 4 రూప్యములు వడ్డీ నిచ్చుటకు అంగీకరించవలెను. ఆ వడ్డీకి స్వదేశమున ఇనుపదారుల నిమిత్తమై వలయుధనము తప్పక దొరకగలదు. వడ్డీ కొంత అధికము అయినప్పటికిని, ఈ పద్ధతివలన దేశమునకు కలిగెడి లాభము విస్తారము గనుక దొరతనమువారు సంకోచించక ఈ నీతిని పాలించుట అత్యావశ్యకము. స్వదేశముననే ఋణమును గ్రహించుటవలన, వడ్డీల క్రింద మన రాజస్వము నుండి ఏటేట చెల్లించవలసిన ద్రవ్యము విదేశములకేగక ఈ దేశమునందే నిలిచియుండును. పరదేశయాత్ర వెడలు ధనము అన్యదేశీయుల నైశ్వర్యవంతులను జేయుటయందే వినియోగపడుచుండును. స్వదేశమునందే ఇమిడి యుండుట వలన దేశముయొక్క మూలధనము అధికముకాగలదు. ఏటేట చెల్లించెడి వడ్డీ తిరుగా మూలధనముక్రింద లభించుచుండును. ఇందువలన దేశమునకు కలిగెడి లాభము అపారము. స్వదేశమునందలి ధనసంపదను నగలక్రిందనో నాణెముల క్రిందనో భారతీయులు పాతర వైచుచున్నారనియెడి ఒక అపవాదము మనమీద కలదు. ఈ అపవాదను ఆధారముగ గైకొనియే, ఇండియా దేశమునందలి మూలధనము క్రొత్తయుద్యమములయందు జొచ్చుటకు శంకించుచుండునని మన ప్రతికక్షులు నిర్భయముగా సాటుచున్నారు. అది నిజమైనను రైల్వేలకు కావలసిన మూలధనమంతయు నూటికి 4 రూప్యముల వడ్డీ నిచ్చెదమని సర్కారువారు ప్రకటించినచో సంగ్రహించగలుగుదురు! సర్కారువారు కలకత్తా బొంబాయి చెన్నపురి మార్కెట్టులయందు నూటికి ఎంత వడ్డీ గిట్టుచుండునో, ఆ రేటునే తాముకూడ ఇచ్చుటకు అంగీకరించుట న్యాయము. తగుమాత్రముగా వడ్డీ అధికమగుటవలన రాజస్వమునకు ఏమియు చేటుమూడదు.



## రైల్వేలక్రింద వెచ్చించతగిన ద్రవ్యము.

దొరతనమువారి ఆదాయమునుండి రైల్వే కమిటీవారు తీర్మానించినట్లుగా సాలుసాలుకింత ధనము రైల్వేల నిమిత్తమని కేటాయింపుచేయు వీలులేదు. ప్రస్తుత రాజస్వస్థితిని విమర్శించుచో విద్యాశాఖకును ఆరోగ్యశాఖకును ఎంతయో ధనము

అగత్యమైయుండియు, ద్రవ్యలోపముచే దొరతనమువారుమిన్నకుండుట ఎల్లరెరింగినదే. క్రొత్తపన్నులను విధింతమన్న ఇదివరకే నేలపన్ను అధికముగా నున్నది. ఎగుమతి, దిగుమతి పన్నులను వృద్ధిచేయుదమంటిమా, ఆర్థిక స్వాతంత్రములేని లోపము మనలను పీడించుచున్నది. లంకషైరు వ్యాపారస్థులొకవంకను బ్రిటిషు పార్లమెంటునందలి స్వేచ్ఛావర్తక వాదులొకవంకను ముఖ్యముగా ఇండియా కార్యదర్శియు అభ్యంతరపరచుచునే యుందురు. ఈ కారణములచేత, ఇండియా రాజస్వమునుండి కొంతద్రవ్యమును ఏటేట రైల్వేనిర్మాణమునకై మినహాయించరాదు.

రైల్వే కమిటీవారు తీర్మానించినట్లు నాణెములను ముద్రించుటవలన సర్కారునకు లాభించుచున్న లాభములో 150 లక్షల రూప్యములను రైల్వే నిర్మాణమునకై వెచ్చించనగును. నాణెములను ముద్రించి అందలిలాభములో సర్కారువారు బంగారు-ప్రమాణ-నిధి నొకదానిని ఇంగ్లాండునందు నెలకొల్పియున్నారు. నాణెములవలన వచ్చెడి లాభమంతయు ఈ నిధియందు పాతరబడి యున్నది. ఈనిధిని ఇంగ్లాండునందు నెలకొల్పుటవలన భారతీయులకు రవ్వంతయైనను ప్రయోజనకారికాదు. ఈనిధి ప్రయోజనత్వము సంగతి యటుండనిచ్చి, నాణెముల ముద్రణము వలని లాభము ప్రజలకు చెందవలసియున్నదని మేము ఖండితముగా చెప్పగలము. 1893 సంవత్సరమున ఇండియా యందలి టంకశాలలు మూసివేయకపూర్వము, నాణెములను ముద్రించుటవలని లాభములను ప్రజలే అనుభవించుచుండెడివారు. ఇపుడన్ననో ఈలాభమును ప్రభు



త్వమువారు గ్రహించుచున్నారు. ముద్రణము వలని లాభము ప్రజలయొక్క క్షేమలాభముల నిమిత్తమే ఉపయోగించుట అవసరము కాబట్టి ఈలాభమును నిరుపయోగముగా ఇంగ్లాండునందలి బంగారు-ప్రమాణ-నిధియందు పాతరవేయక, దేశక్షేమకరమగు పనులయందు వినియోగించవలసియున్నది. ఇనుపదారులు జనసామాన్యముయొక్క ఉపయోగము నిమిత్తమే నిర్మింపబడుచుండును గాన రైల్వే కమిటీవారు సిఫారసు చేసినట్లు ఆలాభమునంతయు ఇనుపదారుల నిర్మాణమునందు ఖర్చుపరచుచుండవలెను.

## బడ్జెటునందు రైల్వే ఆదాయవ్యయములు ప్రత్యేకించవలెను.

ఇండియా దేశముయొక్క ఆదాయవ్యయ పట్టికయందు (బడ్జెటు), మొత్తపు రెవిన్యూ లెక్కల నుండి, రైల్వే రాజస్వమును ప్రత్యేకముగా తెలియజేయుట చాల అవసరము. రైల్వే లెక్కలుకూడ మొత్తపు ఆదాయపుకలములో నమోదు అగుచుండుటవలన రైల్వే రాజస్వముయొక్క నిజస్థితి విశేష పరిశ్రమ చేసినవారికి దక్క, ఇతరులకు తెలియుటలేదు. మన ఇనుపదారులన్నియు సర్కారునకు లాభకారులుగ నుండుటలేదు. కొన్నిటికి మంచిలాభము వచ్చుచున్నది. కొన్ని నష్టపోవుచున్నవి. పంజాబునుండి కలకత్తాకు పోవు నార్తు-వెస్టరను రైల్వేసంగతి ఆలోచింతము. ఈఇనుపదారికి 62 కోట్ల రూప్యములు 1908 సం॥ సరికి వెచ్చింపబడినవి. ఇదిగాక 25 కోట్ల రూప్యములు రాజస్వమునకీవరకు నష్టము కలిగినది. లాభము ఏమాత్రము వచ్చినదాయని

ప్రశ్నింప 1904 మొదలు 1908 వరకు నాలుగు సంవత్సరములలోను 2¼ కోట్ల రూప్యముల నికరలాభము చేకూరినది. 87 కోట్ల రూప్యములకును 1904 సం॥ నుండి 50 లక్షలరూప్యములకు సుమారుగా నికరలాభము వచ్చుచున్నది. రైల్వేరాజస్వమును ప్రత్యేకముగ తెలియచేయుటవలన ఏ ఇనుపదారి లాభకారిగనున్నదియు, ప్రజలకు తెలియుట కవకాశమున్నది. మూలధనమును క్రొత్తగా వినియోగము చేయవలయునన్న ఏ ఇనుపదారి నిమిత్తమై ఉపయోగించిన బాగుగ నుండునో, రాజస్వమును ప్రత్యేకముగ లిఖించుటవలన ఎల్లరకును తెలియుట కవకాశముండును. నిజము తెలిసిన పిమ్మట లాభము నొసంగు ఇనుపదారులకు వలయు మూలధనము విశేషముగ దేశమున లభించును. నష్టమువచ్చుచున్న ఇనుపదారులపై నిష్కారణముగ అధికవ్యయముచేసి దేశముయొక్క జాతీయఋణమును పెంచవలసిన అవసరముకానరాదు. జాతీయఋణమును అధికముచేయుటవలనకలిగెడి నష్టములను ఇదివరకు మేమువిపులముగా చర్చించియే యున్నాము. ఇండియా దొరతనమువారి ఆదాయవ్యయ పట్టికయందు రైల్వే రాజస్వము ప్రత్యేకముగ లిఖింపబడుచో, ఇంకొక లాభము కూడ గలదు. మనకోశాగారమంత్రులు బడ్జెటులను తయారు చేయునప్పుడు ఖర్చునకుతగిన ఆదాయమును సాధ్యమైనంతవరకు కనబరచుటయేగాక కొంతనిలవనుకూడ కనబరచుచున్నారు. ఆదాయమునుబట్టి ఏదేశమునకైనను, వ్యయమును నిర్ణయించుకొనుటయుక్తము. చాలకాలము క్రిందవరకును నల్లమందునుండి వచ్చెడి ఆదాయము కోశాగార మంత్రులపాలిట కామధేను



వుగ పరిణమించుచుండెడిది. ఖర్చునుతగ్గించ నక్కరలేకయే నల్లమందు నుండి వచ్చెడి ఆదాయమువలన బడ్జెటులయందు ఖర్చుపోను ఆదాయమే, అధికముగనున్నట్లు కనబరచుటకు వీలుకలుగుచుండెడిది. చీనాదేశముతో బ్రిటిషు దొరతనము వారు చేసికొనిన ఒడంబడికవలన ఈ కామధేనువు చాలవరకు నట్టిపోయినది. కొలదికాలములో రూపుకూడ మాయగలదు. అట్టిస్థితిలో రైల్వే ఆదాయము కోశాగార మంత్రులకు పూర్వమువలెనే లభించినది. కాబట్టి ఈ ఆదాయమును ప్రత్యేకముగా లిఖించినగాని మన ఆదాయముయొక్క నిజస్వరూపము ఆదాయవ్యయపట్టికలయందు విశదీకరింపబడదు. రైల్వేరాజస్వమును వేరుచేయగనే, నూతనమార్గములను నిర్మించుటకును, వేగనులు, యంత్రములు (ఇంజనులు,) వగైరాసామగ్రిని ఆంగ్లేయ వర్తకసంఘములయొక్క ఆందోళనకుజడిసి వృద్ధిచేయుటకును వీలుచిక్కదు. దేశమునందలిప్రజలకు రైల్వే రాజస్వముయొక్క స్థితినిపూర్తిగ గమనించుటకు వీలలవడును. ఎంతవరకు నూతన ఇనుపదారు లావశ్యకములో చక్కగ గుర్తించుటకు వీలుండును. యుద్ధనీతిననుసరించి నార్తువెస్టరను రైల్వే ఎంతవరకు వృద్ధిచేయబడు చున్నదియును మనము గ్రహించగలము. ఎన్నియో వందలమైళ్లు ప్రదేశమున ఈ ఇనుపదారి యుద్ధవిషయమై పెంచబడినది. రానురాను అఫ్గనుస్థానమును చేరునట్లుతోచెడిని ! యుద్ధసంబంధమగు ఇనుపదారులు అవసరము కలిగినప్పుడు సైన్యమును గొనిపోవుటకు తప్ప ఎందుకును పనికిరావు. వాటివలన ఆదాయమురాదు. ఈ యినుపదారు లెంతద్రవ్యమును మ్రింగుచున్నదియు మనము

కనుగొనగలము. నార్తు-వెస్టరను రైల్వే చాలవరకు ఈపద్ధతి మీదనే విరివి చేయబడినది.

## డఫ్రిను ప్రభువు ఏర్పాటు.

ఆంగ్లేయ వర్తకసంఘముల ఆందోళనమునకు ఇండియా దొరతనమువారు గాని బ్రిటిషు ప్రభుత్వమువారు గాని ఏల చెవినొగ్గవలయునని పాఠక మహాశయులకు సందియము కలుగవచ్చును. ఇందాశ్చర్యమేమున్నది? ముప్పదిరెండు సంవత్సరములనుండి దేశీయమహాజన సభవారు మూడవ తరగతి ప్రయాణీకుల కడగండ్లను తొలగింపుడని ఆందోళనము చేయుచున్నను వృథాగా పరిణమించుచున్న సంగతి చదువరు లెరింగియే యున్నారు. ఇట్టి రాజ్యనీతికి డఫ్రిను ప్రభువు కారణము. ఈతడు గవర్నరు జనరలుగా దేశమును పరిపాలించు కాలము వరకును భారతీయుల కష్టసుఖములను గూర్చి చేయు ఆందోళమునందు ఆంగ్లేయవర్తక సంఘములు కూడ తమ సానుభూతిని కనబరచుచు వచ్చినవి. ఈసంఘములుకూడ ప్రజలతో ఏకీభవించు చుండుటవలన భారతీయుల కోర్కెలను చెల్లించక తప్పకుండెడిది. ఆంగ్లేయవర్తక సంఘములు దేశీయులతో సమముగ వాదించుచుండుట డఫ్రిను ప్రభువునకు కష్టముగా తోచెను. ఇండియా దేశ పురోభివృద్ధిని మాత్రమే ఏకాగ్ర దృష్టితో కాంక్షించకుండు, మహానుభావులకు, ఇట్టి కూడిక అసంగతముగనే కానవచ్చును! డఫ్రిను ప్రభువు చేసిన మహోపకారమేమనగా, ఆంగ్లేయ వర్తకసంఘములను భారతీయులనుండి విడదీయుటయే. అది మొదలుగా భారతీయుల కష్టసుఖములనుగూర్చి చేయు ఆందోళనమునందు వారు పాల్గొనుటలేదు. ఆంగ్లేయవర్తకసంఘముల యాందోళనమునకు ఇండియా దొరతనము వారు తప్పక చెవియొగ్గి తగిన ఏర్పాటులను చేయుటకు అంగీకరించుటయే డఫ్రిను ప్రభువు గావించిన మేలు! డఫ్రిను ప్రభువు చేసిన ఒడంబడిక ఇప్పటికిని ఇండియా దేశమునకు వచ్చెడి గవర్నరు జనరలు లందరును పాటించుచున్నారు. ఈ ప్రభువువారి ఏర్పాటు ఈదేశమును పీడించుచున్నది.



రైల్వేలన్నియు ఇండియా ఆదాయమునుండియే నిర్మింపబడినవి. మనప్రజలయొక్క క్షేమమును కోరియే ఇండియా దేశము పరిపాలించబడుచున్నది గాన ప్రస్తుతము క్రొత్త ఇనుపదారుల నిర్మాణమును కట్టిపెట్టి "ఇర్రిగేషను" కమిషను వారు ఒసంగిన అభిప్రాయ ప్రకారము నీటిపారుదలా విధానములను నిర్మించవలసి యున్నది.

## ఇండియా దేశముయొక్క సైనికరాజస్వము

రైల్వే రాజనీతివలెనే, సైనిక నీతియందు సైతము హిందూదేశముయొక్క ఆశయములు గుర్తింపబడకనే పరిపాలనము జరిగెనని వ్రాయుటకు చాల విచారకరముగ నున్నది. ఆదాయమునకు తగినట్లు ఖర్చును నిశ్చయించుట రాజస్వ విషయమున అమోఘమగు నీతి. ఈనీతిని మనపాలకులు ఆచరణములోనికి తెచ్చినట్లు కానరాదు. ఏటేట సైన్యపుఖర్చులు అధికమగుచునే యున్నవి. హిందూదేశ రాజస్వమునందు, నేలపన్ను ముఖ్య ఆధారమని ఆంగ్లేయ రాజ్యతంత్రజ్ఞులు విస్పు

జెందక ప్రకటించుచున్నారు. అట్టి మూలాధారమగు రాజస్వమంతయు సైనిక ఖర్చుల నోటబడుచున్నది. నేలపన్ను ఈసరికి విపరీతముగా పెరిగిన దగుటచే ఇకముందు విస్తారముగా వృద్ధి కాగలదను చిహ్నములెవ్వియును పొడగట్టుటలేదు. 1909-10 సం॥ పార్లమెంటు లెక్కల ప్రకారము నేలపన్ను 20.55 మిలియన్లపౌనులు అనగా 30.82 కోట్లరూప్యములు. ఈఆదాయము అటవీసంపదను చేర్చకయే లభించినది. ఇక సైన్యపుఖర్చు లెట్లున్నవనగా (సైన్యపుఖర్చులు=సైన్యమునకును నావికాదళమునకును, సైనికకట్టడములకును, దేశరక్షణమునకై నిర్మింబడిన కట్టడములకును అయినఖర్చులు) 19.11 మిలియన్లపౌనులు. అనగా 28.66 కోట్లరూప్యములు. దీనినిబట్టి చూడగా నేలపన్నంతయు సైన్యముక్రిందనే వ్యయమగుచున్నదని తేలుచున్నది.

## సైన్యమునకగు వ్యయాధికము.

పదునారు సంవత్సరముల క్రిందట (1900-01) భూమిపన్నునుండి సర్కారుకు వచ్చిన నికర ఆదాయము 16.73 మిలియన్లపౌనులు. నికరమైన సైన్యపు ఖర్చు 15.47 మిలియన్ల పౌనులు. పదిసంవత్సరములలో భూమిపన్ను నూటికి 22.8-వ వంతు పెరిగినది. సైన్యపుఖర్చులన్ననో నూటికి 23.53-వ వంతు అధికమయ్యెను. కాబట్టి భూమిపన్నుకన్న సైన్యపుఖర్చులే త్వరితముగ పెరుగుచు వచ్చినవని వ్రాయుటయందు ఎవ్విధమైన అతిశయోక్తియును లేదు.

దేశమునందు శాంతి నెలకొని యున్నపుడు, సైన్యమును రణమున కాయతముచేయు స్థితిలో నుంచుట ఆర్థిక విషయ



మున చాల నష్టదాయకమని చెప్పక వీలులేదు. ఏదేశమునకైనను ఇట్టి రాజ్యనీతి విప్లవకారి. బీదదేశమగు ఇండియాదేశమునకు విశేష నష్టము కలిగించును. సైన్యముల కగుఖర్చు సార్థకమగునది కాక నిరర్థకమగుచున్నది. ఆర్థిక సంపదను విరివిచేయుటకు తోడ్పడదు. అయిన దీనికొక సమాధానమొసంగబడుచున్నది. శత్రువుల దాడినుండి స్వదేశము ఎవ్విధమైన బాధలేకుండ శాంత భూయిష్టమైయుండుటకు వీలలవడునని సమాధానము. సమాధానము సమంజసముగనే యున్నది. కాని ఒక్కవిషయమును మాత్రము గమనించవలసి యున్నది. దేశముయొక్క శక్తినిబట్టి రాజ్యనీతిని నిర్ణయించుట న్యాయము. ఎప్పుడో శత్రువులు దేశమును కొల్లగొనెదరేమోయను భీతిచే, అమితమైన ధనమును సైనిక నికాయమునకై వెచ్చించుట పాడిగాదు. ఐరోపా ఖండమునందలి బీద దేశములకన్నను ఇండియాదేశము కడు బీదస్థితియందున్నది. ఇట్టిస్థితిలో రాజస్వ విషయమున పాలకులు విశేష జాగ్రతతో వ్యవహరించవలసిన ఆవశ్యకత మెండు.

ఆరోగ్య విద్యాశాఖలకును, కళావాణిజ్య వ్యాప్తికిని అవసరమగు ధనము కరవగుచున్నను, సైనిక వ్యయము నిమిత్తము వలయునంతధనము దొరతనము వారికి చిక్కుచునే యున్నది. 1885 సం॥ నుండియు సైనిక రాజస్వ చారిత్రమును గమనించితిమేని ఈసంగతి విస్పష్టమగుచున్నది. కీర్తిశేషులైన సర్ ఆక్లెండు కాల్వినుగారును, సర్ కోర్టునే ఇల్బర్టుగారును తమ అసమ్మతిని దెలుపుచు 1885 సం॥ ఆగష్టు 14 తేదీని ఇటుల వ్రాసిరి:—

"దేశముయొక్క పరిస్థితుల కదనమైన, సైనిక నికాయ ముందుచో, సరిహద్దులను దాటి దండయాత్రలు వెడలుటకు సాధారణముగా పురికొల్పుచునే యుండును."

అట్టి స్థితిలో సేనలను తగ్గించవలసిన ఆవశ్యకత స్పష్టముగా విశదీకరింపబడుచున్నది. "కృషికులు తమ కష్టార్జితము వలన సంపాదించి సర్కారునకు దాఖలుచేసిన ముప్పదికోట్ల రూప్యముల ఆదాయమును 2 లక్షల 25 వేల సైన్యముయొక్క ఖర్చునిమిత్తమే వెచ్చించబడుచున్నది."

1885-సం॥న అన్యదేశ నీతియందు (Foreign policy) మార్పు కలుగుటచే సైన్యపుఖర్చులు విపరీతముగా పెరుగనారంభించెను. సర్ జాన్ లారెన్సు, మేయో, నార్తుబ్రూకు, రిప్పను ప్రభువుల పాలనమునందు సైనికవ్యయమును హెచ్చుకానీయకుండ చాలవరకు తగ్గించుటకై ప్రయత్నములుచేయబడెను. 1871-72 సంవత్సరముసరికి ఇండియా దొరతనము స్వాధీనము చేసికొనిన రాష్ట్రములయందు పాలనమును స్థిరతగాంచుటకు తగిన ఏర్పాటులు పూర్తిచేసిరి. 1871-72 నుండి 1876-77 సరికి సైనిక వ్యయము 14½ కోట్ల రూప్యములకు నిలిచినది. దురదృష్టవశమున ఆఫ్గను యుద్ధములు కలుగుటచేత సంవత్సరమునకు సుమారు 15.41 కోట్ల రూప్యములగుచు వచ్చినది. 1880-81 సంవత్సరమునకు 21 కోట్లకు పై దాటినది. 1882 సంవత్సరమున ఆఫ్గను యుద్ధములకైన వ్యయమును కొంతవరకు బ్రిటిషు కోశాగారమునుండి 'గ్లాడుస్టను' మహాశయుండొసంగుటచే రిప్పను ప్రభువు పాలనమునందు,



క్రోమరు ప్రభువు కోశాగార మంత్రిగ వ్యవహరించి సైనిక ఖర్చును తిరిగి 16¼ కోట్ల రూప్యములవరకు తగ్గించగలిగెను. క్రోమరు ప్రభువు మణుగునకు 8 అణాలు ఉప్పుపన్నును తగ్గించుటయేగాక, సారాయములమీదదక్క ఇతర దిగుమతి పన్నుల నన్నిటిని తీసివేసియు సైన్యపుఖర్చులను తగ్గించగలిగెను.

1884-85 సం॥ నుండి సైనికవ్యయాధికమును ఈక్రింద పట్టీయందు పొందుపరచుచున్నాము:—

| | | | కోట్లరూప్యములు. |
|---|---|---|---|
| 1884-85 | ... | ... | 17·05 |
| 1885-86 | ... | ... | 20·06 |
| 1890-91 | ... | ... | 21·09 |
| 1891-92 | ... | ... | 22·66 |
| 1893-94 | ... | ... | 23·53 |
| 1894-95 | ... | ... | 24·31 |
| 1898-99 | ... | ... | 23·05 |
| 1899-1900 | ... | ... | 26·44 |

1885-86 సం॥నందు తొలుత విపరీతముగా 3 కోట్ల రూప్యములు వ్యయమధికమగుటను పైపట్టీవలన తెలిసికొనదగును. ఈ సంవత్సరమునందే పెంజడే అల్లరి (Penjdeh "Incident") తటస్థించుటయు, బర్మాయుద్ధమారంభమగుటయు తటస్థించినది. బర్మాయుద్ధముయొక్క చరిత్రము కడు విషాదకరము. ఈ అన్యాయ యుద్ధమునుగురించి సవిస్తరముగా సర్కారువారివలన ప్రచురించబడిన చరిత్రములనుండి

గ్రహించనగును. ఈ 3 కోట్ల రూప్యముల వ్యయాధికమును చాలనట్లు 1899-1900 సరికి మరింత విపరీతముగా అధికము చేయబడి 26.44 కోట్ల రూప్యములకు నిలిచినది. అనగా పదమూడు వత్సరములలో 6.38 కోట్ల రూప్యములు అధికముగా ఖర్చు చేయబడెను.

1900-1901 నుండి 1909-10 సం॥ సరికి అయిన నికర ఖర్చు:—

| | | | కోట్లరూప్యములు. |
|---|---|---|---|
| 1900-1901 | ... | ... | 23·20 |
| 1901-1902 | ... | ... | 24·24 |
| 1902-1903 | ... | ... | 26·44 |
| 1903-1904 | ... | ... | 27·21 |
| 1904-1905 | ... | ... | 31·03 |
| 1905-1906 | ... | ... | 29 50 |
| 1906-1907 | ... | ... | 30·2[illegible] |
| 1907-1908 | ... | ... | 28.85 |
| 1908-1909 | ... | ... | 29·40 |
| 1909-1910 | ... | ... | 28·66 |

ఈ పదిసంవత్సరములలోను సంవత్సరమునకు సుమారు 27.87 కోట్లరూప్యములు వ్యయమగుచువచ్చినది. 1899-1900 సం॥కంటె సాలునకు 1.43 కోట్ల రూప్యములు వ్యయాధికమగుచువచ్చెను. ఇరువదియవ శతాబ్దారంభమున నిలిచియున్న వ్యయము 23.20 కోట్లు. ఈ లెక్క ప్రకారము చూచిన పది సంవత్సరములలోను 5.46 కోట్ల రూప్యముల ఖర్చు పెరిగెను.



ఈవరుసను చూచినయెడల సాలునకు 54.60 లక్షల రూప్యములు అధికమయ్యెను. ఈ లెక్కలనుబట్టి సైనికవ్యయము ఎంత తీవ్రముగ పెరుగుచున్నదియును గ్రహించవచ్చును. 1884-85 సంవత్సరమునకు నిలిచియున్న 17.05 కోట్లవ్యయము' 1909-10 సరికి 28.66 కోట్లవరకు పెరిగిపోయినది. అనగా 11.61 కోట్ల రూప్యములు అధికము కాబడెను. నిరంకుశముగా పెరిగిపోవుచున్న సైనిక వ్యయమును తగ్గించుట యుక్తమని ఖండితముగా చెప్పగలము. ఆవ్యయమును తగ్గించి ద్రవ్యలోపముచే విడిచిపెట్టబడుచున్న ఎన్నియో ఉద్యమములను కొనసాగించుట అవసరము. నేలపన్నంతయు సైనికవ్రాతము నోటను బడుచుండుట ప్రశస్తమైన రాజ్యనీతికాదు. ఆర్థిక సంపదను ఇనుమడింప జేయవలసిన ఆవశ్యకత హిందూదేశమున విస్తారముగకలదు. నాగరికతను గాంచిన ఇతర రాష్ట్రములతోపాటు సమానగౌరవ మర్యాదలం జెందుటకు, సైనికనికాయమునకగు ఖర్చును తగ్గించి, ఆరోగ్య విద్యాశాఖలయందు ధనమును అమితముగ వెచ్చించవలసిన అవసరము విశేషముగా కలదు.

## వ్యయాధికమునకుగల కారణములు.

వ్యయాధికమునకుగల ముఖ్యకారణములు రెండు:-(1) సైనిక మిశ్రమపద్ధతి. (army amalgamation scheme). (2) అన్యదేశములకు సంబంధించిన రాజ్యనీతియందలి మార్పు. ఈరెంటియందును సైనిక మిశ్రమ పద్ధతి 1859 సం॥ నుండియు హిందూదేశమును బాధించుచున్నది. సిపాయిలముట్టడిని అణచి

వేసిన వెంటనే ఈమిశ్రమ పద్ధతిని దొరతనమువారు అవలంబించిరి. ఈపద్ధతి నవలంబించుట వలన లక్షలకొలది రూప్యములు అన్యాయముగా బ్రిటిషు రణోద్యోగీయులచే (British war office) ఇండియానుండి వసూలు చేయబడెను. ఇట్టి దుఃఖ భాజనమగు రాజ్యనీతిని ఇండియాదొరతనమువారికి కట్టిపెట్టబడెను. ఒక్క ఇండియా దొరతనమువారి ఆమోదమును వడయలేదను కేల, హిందూదేశమునందు పనిచేసిన సైనిక శిఖామణుల సమ్మతిని సైతము ఈరాజ్యాంగనీతి వడయలేదు. ఈస్టిండియా రాజస్వ సభవారి యెదుట సాక్ష్యమిచ్చు సందర్భమున జనరలు సర్. జి. బాల్ఫరు గారివలన ఈపద్ధతి అతి కఠినవాక్కులతో గర్హింపబడినది. వలదు వలదని ఇండియా కార్యదర్శులును అక్కాలపు ఇండియా దొరతనములును ఘొఱలిడుచున్నను లక్షలకొలది రూప్యములు ఇండియాకు కట్టిపెట్టబడినవి. ఆభారముచే గత ఏబది అరువది సంవత్సరముల నుండియు హిందూదేశ రాజస్వము ఇంతింతయని చెప్పనలవి గాకుండ చీకాకు పడినది.

1858 సం॥ న బ్రిటిషు ప్రభుత్వమువారు స్వయముగ ఇండియా దేశమును పాలింపనారంభించు వరకు సైన్యమునకు వలయు ఐరోపా సైనికులను కొంతవరకు ఇండియాయందును, కొంతవరకు ఇంగ్లాండునందును సేకరించుట ఆచారముగ నుండెడిది. సిపాయిల తిరుగు బాటుతరికి ఇండియా సైన్యము యొక్క సంఖ్య:—39,375 బ్రిటిషు సైనికులును **214,985** ఇండియను సిపాయిలును కలరు. సిపాయి ముట్టడిని అణచి వేసిన తరువాత, ఇద్దరు ఇండియను సిపాయిలకు ఒక్కొక్క



బ్రిటిషు సిపాయివంతున ఉండునట్లు నిశ్చయించబడినది. హిందూదేశమునందలి సైనిక సంబంధమైన ఏర్పాటులన్నియు ఇంగ్లాండునందలి బ్రిటిషు యుద్ధ-శాఖ వారివలననే నిర్ణయింపబడుచువచ్చెను. ఆంగ్లేయ సైనిక వ్రాతమునందు ఏయేమార్పు లొనర్పింప బడినను ఆపద్ధతులనే ఇండియా దొరతనమువారు బదులుచెప్పక అవలంభించవలసి యున్నది. ఈమిశ్రమపద్ధతిని అమలులోనికి తెచ్చిననాటనుండియు, హిందూదేశమున పని చేసిన సైనిక శిఖామణులచే పూర్తిగ గర్హింపబడెను. బ్రిటిషు యుద్ధ శాఖవారు ఇంగ్లాండునందలి సైన్యమునకు ఎట్టి ఏర్పాటులు గావించిరో వానిని ఇండియా దొరతనమువారు ఆచరించి తీరవలసినదే. వేరు గత్యంతరమేమియు లేదు. ఐశ్వర్య వంతమైన ఇంగ్లాండు దేశము ఎంతవ్యయమునకైన ఓర్చునుగాని కడుపేద తనముచే క్రుంగుచున్న హిందూదేశము ఇట్టి భారమును వహించజాలదు. చాలకున్న మొఱయాలించి రక్షించువారెవరు? ఈసందర్భమున మొసలిచే పీడింపబడుచున్న గజేంద్రుని యవస్థ స్ఫురణకు వచ్చుచున్నది.

'లావొక్కింతయులేదు ధైర్యమువిలోలంబయ్యె ప్రాణంబుల్
ఠావుల్దప్పెను మూర్ఛవచ్చె శ్రమంబయ్యెడిన్
నీవేతప్ప నితఃపరంబెరుగ మన్నింపన్దగున్ దీనునిన్
గావే ఈశ్వర కావవే వరదసంరక్షించు భద్రాత్మకా'

మహాభాగవతము.

భద్రాత్మకా యనుటకు బదులు 'జార్జీశ్వరా' యని చదివిన నెంతయో సమంజసముగా నుండును.

## మిశ్రమపద్ధతి.

మిశ్రమపద్ధతివలన ఇండియాదేశమునకు సంభవించిన నష్టము ఈస్టిండియా రాజస్వ సభవారివలన 1871-72 సం॥ నందు సమగ్రముగా వ్యక్తీకరింపబడెను. హెన్రీఫాసెట్టుగారి అభిప్రాయమును మాత్రము ఇచట పొందుపరచుచున్నాము. ఈమహాశయునిచే మిశ్రమపద్ధతి ఖండితముగా గర్హింపబడెను. "ఈస్టిండియావర్తక సంఘము ముగింపబడిన కొలది సంవత్సరములలోనే, సైనికమిశ్రమపద్ధతి అనుభవనీయులగు సుప్రసిద్ధ హైందవరాజ్య తంత్రజ్ఞుల సలహాకు వ్యతిరేకముగా అమలులోనికిగొని తేబడినది. ఐశ్వర్యవంతమగు ఇంగ్లాండుదేశమునకు ఉపచరించుసైనిక నిర్మాణపద్ధతులు, దరిద్రముతో తాండవమాడుచున్న ఇండియాదేశముయొక్క స్థితిగతుల నాలోచించి చూచిన, ఆచరణములోనికి కొనిరాగల స్థితియందు లేకున్నను, బలవంతముగా, వ్యయాధికమగు మనఆంగ్లేయ సైనికపద్ధతులనే కట్టిపెట్టుచున్నాము. అతి భాగ్యవంతమగు ఇంగ్లాండు దేశమునకును అతిబీదదేశమగు ఇండియాకును కూడిక తటస్థించినది. భాగస్వాము లిద్దరును సమాన హోదాయందు లేనివారగుటచే, సంవత్సరమునకు 20 వేల పౌనులరాబడిగల ఆసామీయును, సాలునకు ఒక వెయ్యిపౌనుల ఆదాయము మాత్రమే వచ్చెడి ఆసామీయును కలసి సమముగ గృహకృత్యమును నిర్వర్తించుటవలన ఎట్టిచిక్కులు తటస్థించుచుండునో అట్టి అసంగతమే ఇండియాకు మిశ్రమపద్ధతి నవలంబించుటవలన యలవడెను. ఇరువదివేల పౌనులురాబడిగలవానికి ఉచితమైనఖర్చు, సాలుకు వేయిపౌనుల రాబడిగలవానికి కష్టతరమై



అప్పులపాలు చేయునుగాని వేరొండుకాదు. చేయబడుచున్న ఖర్చంతయు ఉచితమైనదనియే అనుకొందము. అయినను తక్కువరాబడి వచ్చుచున్నవానికి తనతలకు మిగిలినవ్యయము చేయుటవలన ఋణగ్రస్తుడై బాధపడుచుండ, నీకు మరి యేఅన్యాయమును. చేయబడుట లేదనియును, నీవంతుఖర్చే నిన్నుకోరుచుంటిమనియును చెప్పిన ఏమిలాభము ? వానిదుఖము ఉపశమించునా? హిందూదేశమువలెనే బలవంతముగా భాగస్వామిని జేసి, చేయువ్యాపారమునందు ఇష్టమున్నను లేకపోయినను వదిలిపెట్టకుండ యుండవలసివచ్చుచో వానిగతి చెప్పతరము కాదు."

1859 సం॥నుండి ఇండియాకు ఇట్టి దుర్గతియే తటస్థించినది. 58 సంవత్సరములనుండి ఈపద్ధతి అమలులోనున్నది. ఈ 58 సంవత్సరములలోను ఎన్నియోసారులు ఇండియా కార్యదర్శి బ్రిటిషుయుద్ధ శాఖవారి కోరికలకు అభ్యంతరము చెప్పుచునేవచ్చెను. కాని ఎల్లప్పుడును బ్రిటిషు యుద్ధశాఖవారే జయమును గాంచుచుండిరి.

వానిలో ముఖ్యమైన కొన్ని విషయముల నీక్రిందపొందుపరచుచున్నాము:—

(1) కేపిటేషను భత్యము. (Capitation allowance) (2)డిపోఖర్చులు (3) సైనికులను పంపుటకగు ఖర్చులు(4) గిడ్డంగి ఖర్చులు (5) ఉద్యోగస్థులయొక్కయు, సిపాయిల యొక్కయు జీతములును, భత్యములును (6) సగము జీతముపైని సెలవు తీసికొనిన వారి ఖర్చులు (7) మందుగుండు సామానులకును

శతఘ్నులు వగైరాల కగు ఖర్చులు (8) ఇతర బాబతు ఖర్చులును, పింఛను తీసికొనిన సైనికాధికారులయొక్కయు సిపాయిల యొక్కయు ఉపకారవేతనములు. 1908-09 సరికి ఈ ఖర్చులమొత్తము 4.67 మిలియన్ల పౌనులు అనగా 7 కోట్ల రూప్యములు. ముప్పదిసంవత్సరముల క్రిందట ఇందుసగమైనను లేకపోయినను, అక్కాలపు ఇండియా దొరతనమువారు, తమకు చాల అన్యాయము జరుగుచున్నదని మొఱపెట్టుచునే యుండెడివారు. 1873-వ సంవత్సరము ఫిబ్రవరి 8 తేదీని పంపబడిన ఉత్తరమునందు నాగరికతయందుగాని ఐశ్వర్యమునందుగాని ఇంగ్లాండుకంటె చాల వెనుకబడియున్న ఆశ్రయ దేశమగు ఇండియాయందు కరుణించి ఇండియా చెల్లించవలసిన భాగమును దయార్ద్రదృష్టితో నిర్ణయించుట పాడియని ఇండియా దొరతనమువారు విన్నవించిరి. 1908-09 సరికి నిలిచియున్న 4.67 మిలియన్ల పౌనులును 1916-17 సరికి 5.6 మిలియన్ల పౌనుల వరకు పెరిగినవి. రమారమి ఒకకోటినలభై లక్షలరూప్యములు ఎనిమిది సంవత్సరములలో అధికమైనది. సైనికమిశ్రమ పద్ధతియే ఈ వ్యయాధికమునకు మూలాధారము. ఈపద్ధతిని త్యజించనంతకాలము, ఇండియా దేశము వ్యయాధికముచే పీడింపబడుచునే యుండును.

1879-వ సంవత్సరమున ఇండియా దొరతనమువారి వలన సమావేశము చేయబడిన సైనిక పంచాయతీవారు ఈ తీరుగ అభిప్రాయము నొసంగిరి:—"ఇంగ్లాండు దేశముయొక్క రక్షణమునందలి లోటుపాట్లను సవరించెడి ఉద్దేశ్యముతో, ఇండియా దేశమునందు సైనికనిర్మాణమును, ఏర్పాట్లునుజరిగింప



రాదు. హిందూదేశపు ప్రజలయొక్క క్షేమలాభములను గమనించి సైనిక తంత్రమును నిర్వహించవలసి యున్నది; ముఖ్యముగా ఇండియాదేశపు ఖర్చుపైని ఆదేశమునకు ఎవ్విధమైన సంబంధములేనిదే, ఇంగ్లాండుయొక్క లాభమునిమిత్తమై ఇండియా సైన్యతంత్రము నిర్వహింపబడరాదు." ఈసైనిక పంచాయతీయందు ఫీల్డుమార్షలు రాబర్ట్సు ప్రభువుకూడ సభ్యుడే. 1884 సంవత్సరము నవంబరు 21-తేదిని రిపన్ప్రభువు గవర్నరుజనరలుగానుండు కాలమున ఒక ఉత్తరము (Depatch) పంపబడెను. 1864-65 నుండి 1884-సరికి సీమసైనికఖర్చులు ఎనిమిలక్షల పౌనులయ్యెను. ఆ ఉత్తరమునందు సంవత్సరమునకు ఎనిమిదిలక్షల పౌనులు క్రొత్తఖర్చువలన తగులుబడి అగుచున్నదనియును ఖర్చులలో కొంతవరకు మాత్రమే అభివృద్ధి నిమిత్తమై అగత్యములైనవనియును, ఇతరములగునవి హిందూదేశ వాంఛల సంబంధము లేకుండగనే విధింపబడినవనియును పెక్కువిషయములయందు ఇండియా దొరతనమువారి ప్రమేయము లేకనే ఈఖర్చులు కట్టిపెట్టబడుచున్నవనియును తెలియజేయబడినది.

బ్రిటిషు సైన్యముయొక్కయు ఇండియా సైన్యముయొక్కయు జీతముల పట్టీని, రెండు దేశములయందుగల భేదమును తెలియజేయు నిమిత్తమై ఈక్రింద ప్రకటించుచున్నాము. రిపన్ ప్రభువు తెలియచేసినట్లు జీతములయందు ఏస్వల్ప మార్పుచేసినను, ఇండియా రాజస్వమునకు విశేషభారమును కలిగించుచువచ్చును. ఈ విషయమును సామ్రాజ్యప్రభుత్వమువారు గమనించినట్లు కానరాదు.

ఫిరంగులను కాల్చుదండు.

| | | నెలజీతము. | |
|---|---|---|---|
| | | ఇంగ్లాండునందలి జీతము. | ఇండియాలో జీతము. |
| కల్నలు | రూ. | 883 | 910 |
| ,, | ,, | 568 | 1665 |
| లెప్టినెంటు కల్నలు | ,, | 589 | 1002 |
| మేజరు | ,, | 316 | 789 |
| కెప్టెను పెద్దతరగతి | ,, | 263 | 417 |
| ,, తరగతిలేనిది | ,, | 231 | 417 |
| పదిసంవత్సరములైన తరువాత లెప్టినెంటు | ,, | 175 | 265 |
| 3 సం॥లు పనిచేసిన | ,, | 159 | 265 |
| ఉద్యోగమున ప్రవేశించుతోడనే లెప్టినెంటుకు | ,, | 130 | 213 |

గుఱ్ఱపుదళము.

| | | | |
|---|---|---|---|
| కల్నలు | రూ | 950 | 1033 |
| లెప్టినెంటు కల్నలు | ,, | 519 | 1437 |
| మేజరు | ,, | 398 | 809 |
| కెప్టెను పెద్దతరగతి | ,, | 289 | 503 |
| ,, తరగతిలేనిది | ,, | 289 | 503 |
| లెప్టినెంటు పది సం॥ తరువాత | ,, | 196 | 305 |
| ,, మూడు సం॥ ,, | ,, | 196 | 305 |
| ,, ఉద్యోగము నిచ్చునపుడు | ,, | 178 | 250 |
| సబు లెప్టినెంటు | ,, | 132 | 250 |



కాల్బలము.

| | | నెలజీతము. | |
|---|---|---|---|
| | | ఇంగ్లాండునందలి జీతము. | ఇండియాయందలి జీతము. |
| కల్నలు | రూ. | 888 | 918 |
| లెప్టినెంటు కల్నలు | ,, | 422 | 1402 |
| మేజరు | ,, | 340 | 759 |
| కెప్టెను పెద్దతరగతి | ,, | 273 | 445 |
| ,, తరగతిలేనిది | ,, | 240 | 445 |
| లెప్టినెంటు పదిసం॥ తరువాత | ,, | 170 | 256 |
| ,, మూడు సం॥ ,, | ,, | 153 | 256 |
| ,, ఉద్యోగము నిచ్చునపుడు | ,, | 133 | 202 |
| సబు లెప్టినెంటు | ,, | 136 | 202 |

1895-96 సం॥నందు ఇంగ్లాండునందలి సైనికాధికారుల కన్న హిందూ దేశమునందలి సైనికాధికారులెంత హెచ్చుజీతములను గ్రహించుచున్నదియు విశదమగుచున్నది. జీతములు వృద్ధి చేయుటవలనను మారకమునందు రూప్యమునకు 22 పెన్సులకు బదులుగా 16 పెన్సులనే గ్రహించుచుండుటవలనను హిందూదేశమందలి సైనికాధికారులకు ప్రస్తుతము విశేషముగా ఖర్చగుచున్నదని చెప్పనక్కరలేదు. ఒక్క సైనికాధికారులే కాదు. ఇండియాలో పనిచేయు ఐరోపియను సిపాయి సైతము 20-సం॥ క్రిందకంటె ఇపుడు అధికముగా జీతమును గ్రహించుచున్నాడు.

సైనిక నికాయమునకగు ఖర్చుకుతోడు మందుగుండు సామానుల నిమిత్తము 1895-సంవత్సరమునందు రమారమి ఒకకోటి రూపాయిలు ఖర్చుచేయబడెను. ఏటేట ఐరోపాదేశ

వాస్తవ్యుల బుద్ధివైశద్యమును వెదజల్లుటకోయన శాస్త్రము విరివిని గాంచుచున్నది.

శాస్త్రప్రభావమువలన క్రొత్తలగు మానవ నాశకరమగు యంత్రములు నిర్మింపబడుచునేయున్నవి. క్రొత్త ఆయుధములు వెలువడిన తోడనే ఇండియాదేశమున కూడ అవిప్రవేశించు చుండును. వీనికై ఎంతయో ధనము వ్యయము చేయబడుచుండును. ఇప్పటికి ఈయంత్రముకన్న మించిన మానవ నాశకరమగు యంత్రము మరొకటి లేదని సంతసించుచుండ, మరియొకటి సృష్టించ బడుచుండును. వెనుకటివానిని త్రుప్పు పట్టునట్లుగ విడిచిపెట్టి క్రొత్తవానిని సంగ్రహించుటకు ప్రయత్నములు గావింపబడు చుండును. అందువలన విశేషవ్యయమగుచుండును.

ఇంగ్లీషు సిపాయిలను స్వల్పకాలము పనిచేయు పద్ధతిపైని ఇండియా సైన్యమున చేర్చుచున్నారు. ఈపద్ధతి ఇంగ్లాండునకు లాభకారి యయ్యును, ఇండియాదేశమునకు నష్టభాజనమగుచున్నది. సిపాయిలను ఇండియాకు గొనివచ్చుటకును తిరిగి ఇంగ్లాండునకు పంపుటకును పొగయోడలకగు ఖర్చులు విస్తారము. పూర్వమువలెనే ఇండియాకు కావలసిన యూరపియను సిపాయిలను ఇండియాయందే సేకరించ వీలగుచో, మనకంత ఖర్చుకాదు. ప్రస్తుతపు ఖర్చునందు నూటికి 50-వ వంతు తగ్గియుండునని మామతము.

## అన్యదేశనీతి.

మిశ్రమపద్ధతి ఇండియా రాజస్వమునకు చాల విప్లవకారిగ పరిణమించెనని పై చర్చవలన విస్పష్టమగుచున్నది. ఇక



రెండవకారణమగు అన్యదేశనీతిని గూర్చి కొంతవరకు ముచ్చటించుచున్నాము. సర్ జాన్ లారెన్సు, నార్తుబ్రూకు, రిపన్ ప్రభువుల పరిపాలనమునందు దేశము శాంతభూయిష్టమై అన్యదేశనీతియం దెవ్విధమైన మార్పులం జెందక దండయాత్రలను మాటి కలలోని వార్తయై సైనికఖర్చులు చాలవరకు తగ్గించబడుచు వచ్చినవి. 1875-76 సం॥రమున బీకన్సుఫీల్డు ప్రభువు ఇంగ్లాండునకు ముఖ్యమంత్రియయ్యెను. ఈతడు సామ్రాజ్యమును ఎల్లవిధముల అధికము చేయవలయుననియే పాటుపడెడివాడు. ఇతనికి సహాయముగా ఇండియాకు వచ్చిన గవర్నరు జనరలు కూడ సామ్రాజ్యాభిలాషియే. సిమ్లాసైనిక పంచాయితీవారు ఆంగ్లేయ సైనికులు అరువదివేలును ఇండియనుసైనికులు 1,20,000 కంటెను అధికము చేయబడకూడదని చేసిన తీర్పును గమనించక, సైన్యవృద్ధికి ఆజ్ఞయిచ్చెను. అందువలన ఆంగ్లేయ సైనికులు పదివేలును ఇండియా సైనికులు ఇరువదివేలును అధికము చేయబడిరి. ఈమార్పు డఫ్రిన్ ప్రభువు ఏలుబడియందు మనకు లభించెను. అది మొదలుగా లాండ్సుడౌను, ఎల్జిను, కర్జను ప్రభువుల పాలనమునందు సైతము దండయాత్రలు ఏసరిహద్దు ప్రాంత ప్రదేశములనో బయలు వెడలుచునే యుండెను. గవర్నరు జనరలు పటిమతక్కుగలవాడును, సేనాధిపతి బలీయుడైనను, లేదా ఇరువురును బలీయులే యైనను, సరిహద్దు ప్రాంతములయందు యుద్ధములకు కొదువలేదు. వెల్బీప్రభువుచేత ప్రశ్నింపబడి నప్పుడు సర్ యడ్వర్డు కాలెను చెప్పినట్లు, ఇండియాసైనికనీతి యంతయు (ముఖ్యముగా దండయాత్రలు వెడలుట) మితవ్యయమునం దిష్టముగల గవర్నరు

జనరలును బట్టియుండును. ఈదండయాత్రల వలన రాజస్వమునకు కలుగు కీడు సర్ ఆక్లెండు కాల్విను గారిచే బాగుగ గమనింపబడినది. "హిందూదేశ రాజస్వమును తరుచుగా చీకాకు పరచునది సరిహద్దు ప్రాంతములయందలి అల్లరులే."

ఎల్జిను, లాండ్సు డౌను ప్రభువులయొక్క పాలనమునందు రణకౌతుకము విపరీతముగ నుండెడిది. కాశ్మీరు దేశమునందలి అల్లరియు తరువాత గిల్జిటు, హున్జా, నాగ్యారు ప్రదేశములను ఆక్రమించుకొనుటయును జరిగెను. దీని అనంతరము చిత్రాలు దండయాత్రయు తరువాత టిరా దండ యాత్రయు నడచెను. టిరాదండ యాత్ర జయకరముగ జరుగలేదు. కర్జను ప్రభువు కాలమున దేశములను జయించి ఆంగ్లేయ సామ్రాజ్యమును ఇంకను విరివి చేయవలయుననెడి నీతిపెచ్చు పెరిగెను. ఈ యొక్క ఫలితమే టిబెటు దేశముపైకి వెడలిన దండయాత్ర. అయిన ఈదండయాత్ర పైకి గోముఖ వ్యాఘ్రమువలె, శాంత రసప్రధానముగనే గన్పట్టెను. కాని లోపలి యుద్దేశ్యము టిబెటుదేశమున ఆంగ్లేయ పతాకను నాటుటయే. ఇంతటితో తనివి జెందక పారశీక జలసంధియందు కూడ కొంతవరకు అల్లరి చేయుటకే ఈమహాశయుడు ప్రయత్నించెను. దురదృష్ట వశమున ఈమువ్వురు ప్రభువుల కాలమునందును ఇండియా ప్రధాన కార్యదర్శులు దుర్బలులే తటస్థించుచు వచ్చినందువలన ఈప్రభువులయొక్క రణనీతి నిరంకుశముగా చెలరేగెను. డఫ్రిను ప్రభువుకాలము మొదలు మింటో ప్రభువు కాలమువరకును రణనీతి స్వచ్ఛంద విహారియై రాజస్వమును చీకాకు పరచుచునే వచ్చినది.



## సైనికవ్యయమును తగ్గించుట ఎట్లు.

ఇక సైనికఖర్చులు ఏవిధముగ తగ్గించ గలుగునదియు మనము చర్చించవలసి యున్నది. 1885-వ సంవత్సరమునకు నిలిచియున్న సైనికఖర్చులు 17.05 మిలియన్ల పౌనులు. అమితముగా పెరిగియున్న ఖర్చును తగ్గించుదమన్న, ఖర్చులు వృద్ధియగుటకు ఏకారణములు సహకారియయ్యెనో, వానిని తొలగించినగాని లాభములేదు. సైనిక మిశ్రమపద్ధతిని, అన్యదేశనీతియందు కలిగింపబడిన మార్పును పూర్తిగా తీసివేయవలసియున్నది. హిందూదేశమునకు సహజముగా ప్రకృతివలన ఒసంగబడిన సరిహద్దులను రక్షించుకొనుట యందు తృప్తి చెందవలయునేగాని ఆఫ్ఘనిస్థానమును, పారశీక జలసంధియు, దక్షిణ పారశీకమువరకును మన సరిహద్దుగనే భావించి విశేషధనమును సైనికనికాయమునకై వెచ్చించుట పాడిగాదు. డిస్‌రాలీ గారు సూచించిన "శాస్త్రీయపు సరిహద్దు" మృగతృష్ణ వలె ముందున కేగుచున్న కొలదిని దవ్వగుచునే యుండును. కాన అట్టినీతిని త్యజించుట అవసరము.

ఈరెండు పద్ధతులను విడిచిపెట్టిన తరువాత సైనిక నివహమునందుకూడ కొన్ని మార్పులు జరిగించవలసి యున్నది. సిమ్లా సైనిక పంచాయితీవారు 60 వేల ఆంగ్లేయ సైనికులను 1,20,000 ఇండియను సైనికులను హిందూదేశ రక్షణమునకై ఉంచిన జాలునని తీర్మానము చేసిరి. ఆతీరుగ సైన్యమును తగ్గించుట అవసరము. సైనికులను తగ్గించుటలో ఒక విశేషము కలదు. ఇండియను సైనికునికన్న ఆంగ్లేయసైనికుడు మనరాజ

స్వమునకు హెచ్చు ఖర్చును కలుగజేయుచున్న సంగతి జగద్విదితమే. ఇండియను సైనికులు పరాక్రమవంతులు కారని భీతి జెంద నవసరములేదు. ఐరోపా ఖండమును పీల్చి పిప్పిచేయుచున్న ప్రస్తుతపు మహాసంగ్రామమున మిత్రమండలి పక్షమున ఫరాసు రంగమున జర్మను శత్రుఘ్నుల వేడిమికి ఎదిరి నిలిచిన వారిలో భారత యోధులునుగలరు. వీరి బలపరాక్రమములు శత్రువులవలన సైతము ఉగ్గడింపబడియెను. స్వదేశసంరక్షణమునకును, ఇతరసైన్యములకు, భారతయోధులు వెనుదీయరు. వీర రక్తమింకను హిందూదేశీయులరక్తనాళములయందు ప్రవహించుచునే యున్నది. భారతయోధులు భీరువులుకారని జగత్తునకంతయు సాటినది. ఆంగ్లేయ సైనికులసంఖ్యయే సిమ్లాపంచాయితీవారు తీర్మానించిన అరువదివేలకంటెను తగ్గించుట యుక్తము. ఇయ్యది రాజకీయ వ్యవహారమునకు సంబంధించినదగుటచే విస్తారముగా ఈవిషయమును చర్చించుటకు వీలులేదు. ఇండియా సైనికునకు సంవత్సరమున కగుఖర్చు 392 రూప్యములు. ఆంగ్లేయ సైనికుని కన్ననో సాలునకు 1142 రూప్యములు ఖర్చగుచున్నది.

## సైన్యమును తగ్గించుటకు కారణములు.

ఇంగ్లండునకును రషియాకును ఆంగ్లో-రషియను ఒడంబడికవలన మైత్రి పొసగినదగుటచే రషియాదేశము ఇండియాను ఎప్పుడైనను జయించు నను భీతి అవసరములేదు. ఇదివరకు ఇండియా ప్రతినిధులు సైనిక ఖర్చులను తగ్గించవలసినదని కోరినపుడెల్ల రషియాదేశము దండెత్తి వచ్చునేమోయని సమాధానము నిడుచుండిరి. ఇపుడా భీతి యంతరించెను.



వాయువ్య దిశనుండి గాని నైఋతి మూలనుండిగాని, ఐరోపా, ఆసియాఖండములయందలి ఏదేశముగాని ఇండియా పైకి దండెత్తి వచ్చుననెడి భీతిలేదు. స్వచ్ఛంద సైనికవ్రాతము వలనను, ఆయుధపాణులగు పోలీసు సంఖ్య నధికము చేయుట వలనను, విశేషించి స్వతంత్ర సంస్థానములయందు సైనికతంత్రమును పూర్తిగ అభ్యసించిన సైన్యములుండుటవలనను, దేశమునందు చేయవలసిన పనులు సైనికవ్రాతమునకు చాల సులకన చేయబడెను. ఇది రెండవ కారణము. మూడవ ముఖ్య కారణ మేమనగా పూర్వమువలె గాకదేశమునం దెల్లభాగములకును సరిహద్దు ప్రాంతములతో యాన సౌకర్యములు విశేషముగా అలవడినవి. యుద్ధసమయములందు సైన్యమును గొనిపోవుటకు ఎన్నియో వందలమైళ్లు ఇనుపదారులు ప్రత్యేకముగా ఆపని నిమిత్తమే నిర్మించబడెను. ఇంతేకాక ఎన్నియో కోటలును రక్షణత్వమున కనువగు కట్టడములును నిర్మింపబడెను. సైన్యనివహమునకు పూర్వముకంటె మంచి మందుగుండు సామానులును ఆయుధములును సరఫరాచేయబడినవి. ఈకారణములన్నియు మిక్కిలి బలీయములైనవి. మరొక కారణము కూడగలదు. వాలంటీయరులుగ భారతీయులను అపరిమితముగ సైన్యమునందు చేర్చుకొని తగినశిక్షను ఒసంగుచో సమయము తటస్థించినప్పుడు స్వదేశసంరక్షణమునకై ఎన్నియో మిలియన్ల మంచి సైనికులు లభించుదురు. వాలంటియరు పద్ధతిని, యూరేషియనులకును,ఆంగ్లోఇండియనులకును ఒసంగుచుండగా భారతీయులకు ప్రసాదించకుండుట ధర్మము

కాదు. అటుల జేయుటవలన సైనిక ఖర్చులను విశేషముగా తగ్గించుటకు వీలేర్పడును.

### సర్కారువారు పరిశ్రమలు.

'లై సెజ్జీ ఫెయిరు' మతముయొక్క ప్రధానాంశమును మాచదువరు లీవరకే గ్రహించియుందురు. దేశమునందు అరాజకము లేకుండ క్రమమైన పరిపాలనా పద్ధతుల నేర్పరచుటయే దొరతనమువారికి విధిగాని వాణిజ్య పరిశ్రమలువారి అధికారములోనివి కావని ఈ మతముయొక్క వాదము. ఈ మతము ఉపయోగానర్హమని కొంతవరకు ప్రధమ ప్రకరణమున సూచించియున్నాము.

దొరతనమువారు ఈ న్యాయమును పాటించుచుండుట చేతనే మనకళాప్రపంచము వికసించుటకు మారు ముకుళించుచున్నది. ఈ పద్ధతి మనదేశమునదక్క ఇతర రాష్ట్రములయందెచ్చటను పాటింపబడుటలేదు. గవర్నమెంటువారు ఈ నీతిని విడిచిపెట్టినగాని మన దేశమునందలి కళలకు మోక్షము లేదు.

ఈసంగతినిగూర్చి దేశీయ మహాజనసభలయందు కళాసభలయందు మన నాయకులు ఏటేట చర్చించి తీర్మానములు చేయుచున్నారు. కాని ఆచరణములోనికి మాత్ర మాతీర్మానములు తేబడుటలేదు. అధినివేశనములకువలెనే ఇండియాదేశమునకుకూడ వాణిజ్య పరిశ్రమల విషయమున సంపూర్ణ స్వాతంత్ర్యమున్నగాని కళలు విజృంభింపజాలవు. బొంబాయి నగరమున జరిగిన పదునొకండవ కళాసభయందు ఈ సమస్య



చర్చించబడి, దొరతనమువారు భారతీయుల యాశయములను గుర్తించుటలేదని నిష్కర్షగా ఉపన్యాసములు చేయబడినవి. ఇందులకు ఉదాహరణముగా, యక్సైజుపన్నులు త్రోపుడు చేయబడవలసి యున్నదని దేశీయమహాజనసభ ప్రారంభమైనది మొదలు 32 సంవత్సరములుగా ఘోషించుచుండ లంకషైరు వ్యాపారస్థుల అభ్యంతరములవలన స్తంభించి యున్నవి. ఇండియా దొరతనమువారు కూడ కోశాగార మంత్రి ద్వారా తమ అశక్తిత్వమును వెల్లడిచేసిరి. "ఈ పన్నులను త్రోపుడుచేయుట యుక్తమని మేము సిఫారసుచేయగా పై అధికారుల (ఇండియా కార్యదర్శి) వలన మంజూరు చేయబడలేదు." ఇండియాకార్యదర్శి దొరతనమువారి సిఫారసును మంజూరుచేయక పోవుటకు కారణము మ్యాంచెష్టరు నూలు వర్తకులే! మ్యాంచెష్టరు వర్తకులు ఇండియా ఆర్థిక న్యాయములను నిర్ణయించుచున్నంతకాలము, ఇండియా దొరతనము వారు గాని ప్రజలుగాని న్యాయము దొరకునని ఎంచుటకు వీలులేదు. సర్ విఠల్ దాసు థేకర్సే, రహీంబాయి కరీంబాయి మొదలగు ప్రముఖులెల్ల, ఈ పన్నులను తీసివేయకుండ ఉంచుటవలన సంభవించిన నష్టములను విశదముగా తెలియపరచిరి. స్వదేశమున నూలు యంత్రములు వృద్ధియై వ్యాపారము అభివృద్ధి యగుటకు వీలయిన పరిస్థితులు సహజముగాకలవు. ఈ పన్నులున్నంతకాలము మన నూలు పరిశ్రమకు ముక్తిలేదు.

### ఇండియాదేశ పరిశ్రమల స్థితి.

మరియొక విషయమునుకూడ గమనించవలసియున్నది. ఇండియా దొరతనమువారికి స్వతంత్రత యటుండగా బ్రిటిషు

వర్తకులు ఇంకొక తంత్రమునుపన్నిరి. ఆంగ్లేయపరాసు ఒడంబడికప్రకారము ఫ్రెంచిరేవులయందు మ్యాంచెష్టరు నూలుసరకులు నూటికి అయిదవవంతు దిగుమతిపన్నును చెల్లించుటకును, ఇండియాదేశపుసరకులు నూటికి 22-వ వంతుపన్నును చెల్లించుటకును ఏర్పాటు చేయబడినది. ఈపన్నును ఇచ్చి ఇండియాదేశపు సరకులు పరాసుమార్కెట్లు చొరజాలవు! ఈవిధముగా ఫ్రెంచిమార్కెట్టునందుకూడ ఇండియాసరకుల పోటీలేకుండ మ్యాంచెష్టరు జాగ్రతపడినది. ఇట్టి సవతితల్లి ప్రాపు ఒక్క ఆంగ్లేయ-పరాసు ఒడంబడికయందేగాక, 1898 సం॥న జరిగిన జపాను ఒడంబడిక యందుకూడ కాననయ్యెడిని. ఆ ఒడంబడికయందు ఏయేదేశములకు విస్తారము హితకరమగు పద్ధతులనవలంబింపబడవలెనో పేర్కొనబడినవి. ఆ పేర్కొనబడిన దేశములలో ఇండియాదేశము కానరాదు. ఇది ఏటిన్యాయమని తాతాగారు ప్రశ్నించిరి. మనప్రశ్నలకు సమాధానము నిచ్చువారెవరు? యుద్ధానంతరమున ఈసమస్య తిరుగరాగలదు గాన, ఇండియాయొక్క వాణిజ్యపరిశ్రమలనుగూర్చి నిర్ణయించవలసి వచ్చినపుడు, అంతర్జాతీయ సమావేశముల యందు దేశప్రతునిధులే స్వయముగపోయి సంగతి సందర్భముల గమనించి దేశపరిస్థితుల కనుకూలమగు నియమములను శాసించుటకు వలయు హక్కులను బ్రిటిషు ప్రభుత్వమువారు మనకు ప్రసాదించవలసియున్నది.

వర్తకవ్యాపార విషయములయందు మనదేశమునకు సంపూర్ణస్వాతంత్ర్యము నొసంగుటవిధియని ఇండియా కళాసభయందేగాక, బొంబాయినగరమునజరిగిన ప్రథమవాణిజ్యమహా



సభయందు సర్ ఫజుల్ భాయి కరింబాయిగారుకూడ వాణిజ్య విషయమునంగాను పారిశ్రామికవిషయ మందును మనకు స్వారాజ్యముకావలెనని నిర్దేశించిరి. ఈవిషయములందు స్వారాజ్యముండినగాని దేశము ఉన్నత స్థితికిరాజాలదని వాక్రుచ్చియున్నారు. బ్రాహ్మణేతర సంఘమున కృషిచేయుచున్న రాయబహదూరు పిట్టిత్యాగరాయ శెట్టిగారుకూడ ఇటీవలమదరాసునందు దక్షిణ ఇండియావర్తక సమావేశ సభయెదుట, దేశమునకు స్వారాజ్యమవసరము లేదని వాదించుచున్నను, పారిశ్రామిక విషయములయందు సంపూర్ణస్వాతంత్ర్యముండి తీరవలయునని గంభీరముగా ఉపన్యసించిరి. దీనినిబట్టి దేశమునందలి అన్ని తెగలవారును యీవిషయమున ఏకాభిప్రాయమును కలిగియున్నారని బ్రిటిషు ప్రభుత్వమువారు గమనించి, మనకోరిక చెల్లించవలసియున్నది.

## జపాను అభివృద్ధికి కారణము.

ఏబది సంవత్సరములక్రింద పేరు ప్రతిష్ఠలులేని జపాను దేశము ఇపుడెంత యుత్కృష్టదశయందున్నదో చదువరులెరింగియే యున్నారు. కళావాణిజ్యములపట్ల దొరతనమువారు తమ సానుభూతిని కనబరచుటచేతనే ఇంతే మహోన్నతపదవిని గాంచ గలిగినది. వాణిజ్య పరిశ్రమలపట్ల జపాను ఏనీతిని పాలించినదో కొంతవరకు ముచ్చటించుట ప్రయోజనకారియని తోచెడిని.

1867-68 సంవత్సరములయందు "మెజ్జి" శకము ప్రారంభమయినది. ఈరాజులు బహుచక్కగా దేశమును పరి

పాలింపనారంభించిరి. కళావిషయములయందు పాశ్చాత్యదేశ పద్ధతులు సక్రమముగా ఆమోదింపబడుచు వచ్చినవి. నూతనాదర్శములను దేశమునందు వ్యాపకము చేయుటకు సర్కారువారు మార్గదర్శకులైరి. ఒక పట్టువడుకు యంత్రము, ఉన్ని ఫ్యాక్టరీ, గాజుఫ్యాక్టరీ, కాగితములను తయారుచేయు యంత్రాలయము, కొన్ని వర్కుషాపులు ప్రభుత్వమువారివలననే స్థాపింపబడినవి. ఇంతేగాక ఫ్యాక్టరీలకు కావలసిన యంత్రసామగ్రిని కొనుటకై సర్కారువారు అప్పులనుకూడ ప్రసాదించిరి. గనులన్నుత్రవ్వి ఖనిజసంపదను వాడుకలోనికి గొనివచ్చుటకు విదేశములనుండి ఎందరో నిపుణులు రప్పింపబడిరి. ఇతర పరిశ్రమలయందుకూడ వీరే మార్గదర్శకులైరి. "మెజ్జి" శకమునకు పూర్వము చాలకొద్దిగా పనిచేయబడుచున్న గనులను సముద్ధరించుటకునై, ఎనుబదిమంది వరకు అన్యదేశములనుండి నిపుణులు విచ్చేసిరి. 1890 సం॥ ప్రాంతమున పారిశ్రామిక విద్యను నేర్చుటకు పాఠశాలలు స్థాపింపబడెను. చీనాకును జపానునకును వచ్చిన యుద్ధమువలన దేశమునందు ఉత్సాహము మరింత అధికమైనది. ఎన్నియోక్రొత్త శిల్పకళాశాలలు స్థాపించబడెను. 12 సంవత్సరములనాటికి అనగా 1902 సం॥ సరికి ఎగుమతులు 25 మిలియన్ల పౌనులవరకును పెరిగినవి. రషియాకును జపానునకును జరిగిన యుద్ధమటుండ, యూరపు, అమెరికా, ఆసియా, ఆఫ్రికాఖండములను చీకాకు పరచుచున్న ప్రస్తుత మహాసంగ్రామము జపాను దేశముయొక్క అభ్యున్నతికి మరింత తోడ్పడినది.



దేశీయౌన్నత్యమునకు ముఖ్యములయిన కొన్ని కళలకు సర్కారు ధనసహాయము నొసంగుచున్నారు. ఇతరవిషయములయందు జపాను దొరతనమువారొసంగుచున్న సహాయము విద్యకును, శోధనలకును అయియున్నది. పరిశ్రామిక పాఠశాలలకన్నిటికిని ధనసహాయము నొసర్చుటయేగాక కొన్ని మాదిరి ఫ్యాక్టరీలను, పారిశ్రామిక రసాయన శాస్త్రాలయములను పోషించుచున్నది. ఇదియేగాక యంత్రములను అద్దెకీయుటయు నిపుణులను దేశమునందలి ఎల్లభాగములకును పంపి ఉపన్యాసముల నిప్పించుటయును అనుభవసిద్ధములగు శోధనలనుగావించుచుండుటయు లోనుగాగల ఎన్నియో విధములచే ప్రజలకు ఉత్సాహ సాహసములను గలిగించుచున్నవారు. వందలకొలది విద్యార్థులను విదేశములకు పంపుటయేగాక, వర్తకులనుకూడ అన్యదేశ పరిస్థితుల గమనించుటకుగాను పంపుచున్నారు. విదేశములనుండి వందలకొలది నిపుణులు కూడరావింపబడిరి.

మఱియు అన్యదేశవర్తకమును వృద్ధిచేసి లాభమును వడయుటకు, వర్తకపుటోడలుఅత్యావశ్యకమని గ్రహించినదై బొంబాయికిని కలకత్తాకును నేరుగ ప్రయాణముచేయుటకు ఎన్నియో ఓడలు నియోగింపబడెను. ఈస్టీమరులకు జపాను దొరతనమువారు రేట్లనుతగ్గించి విస్తారము ద్రవ్యసహాయముచేయుచున్నారు. ఆసాహాయ్యపుబలిమివలననే మనదేశమునందలి జపానువ్యాపారమును. ఏటేట అధికముచేయ గలుగుచున్నది. జపానుస్టీమరుల రాకపోకలు, ఏటేట అభివృద్ధిగాంచుచున్నవి. జపానుస్టీమరులు మన కోస్తావ్యాపారమును హెచ్చుగా ఆకర్షించుచున్నవనుటకు ఒక నిదర్శనము. 1914 సంవత్సరమున

నిప్పన్-యోషన్ కెయిషా కంపెనీ స్టీమరులకును బ్రిటిషు ఇండియా-స్టీము-నావిగేషను కంపెనీ ఓడలకును కేవునుగూర్చి విశేషపోటీ ఆరంభమయినది. బ్రిటిషు కంపెనీ భరించరానంత స్వల్పపు కేవును జపాను కంపెనీ ప్రసాదించగలిగినది. దీనిని బట్టి జపాను దొరతనము వారు తమవాణిజ్య పరిశ్రమలను విజృంభింప జేయుటకు ఎట్టిసహాయము నొసంగుచున్నారో మనము గ్రహించవలసి యున్నది. మనకన్న, మనదొరతనము వారు ఈవిషయమును హెచ్చుగా గమనించవలసి యున్నది. హాలెండు పారిశ్రామిక పంచాయితీ సభవారు ఈమార్గములను అనుసరించవలయునని మన దొరతనము వారికి సిఫారసు చేయుదురో లేదో మనమూహింపజాలము. పబ్లికుసర్వీసు కమిషనువారివలె వారెట్టి తీర్మానములను జారీచేసినను వానిని సగకు గొనక ఇండియాదొరతనమువారు సాధ్యమైనంతవరకు ఇండియా దేశస్థుల ఆశయములనే మనసునందిడుకొని జపానుదేశపు పుంతనే పోవలయును. అటుల జేయ రేని ఇండియా దేశపు భావిదశ కళాచక్రమున సన్నగిలుచుండునేగాని, వికసించి విజృంభింప జాలదు.

## స్వదేశసంస్థానముల అభివృద్ధి.

జపానుదేశపు సంగతి యటుండనిచ్చి స్వదేశ సంస్థానము లేనీతిని పాటించుచున్నవో పరిశీలించెదము. శ్రీశాయాజీ గైక్వారు ప్రభువు బరోడాంసంస్థానమున ఎన్ని విధముల, కళావ్యాప్తిని గావించినదియు ఎల్ల రెరింగిన విషయమే. స్వయముగ కొన్ని ఫ్యాక్టరీలను ప్రభుత్వమువారే స్థాపించి, అందుల లాభనష్టములను ప్రజలకు ప్రకటించుచుండెడివారు. లాభమువచ్చు



చున్నదని తెలియగానే, ఎందరో ధనాధికులు సర్కారువారిని అప్పటికయిన ఖర్చును తామిచ్చివేయుదుమనికోరుటయు వారందులకంగీకరించుటయు జరగుచు వచ్చినది. ఈవిధమున బరోడా ప్రభుత్వమువారు ప్రజలకు మార్గదర్శకులైరి. కొన్ని కళలకు ధనసహాయము నొసంగుచు, విదేశములకు సర్కారు ఖర్చుపైని పారిశ్రామిక విద్యనభ్యసించుటకు యువకుల నంపుచు, నిపుణులగువారిని పైదేశములనుండి రావించి స్వస్థానమునందలి, బుద్ధి కుశలులగు యువజనులకు అనుభవసిద్ధముగ విద్యను నేర్పుచు, ఎన్నియో విధముల కళలను పోషించిరి. మైసూరు సంస్థానముకూడ ఈ మార్గము నిప్పుడిప్పుడే అవలంబించుచున్నది. బాబా బూడన్ పర్వతపంక్తియందలి ఇనుపగనులను వాడుకలోనికి తెచ్చుటకునై తాతా అండుసన్సు వారితో ఒడంబడిక చేయబడినది. ఈగనులనుండి సాలుకు 20 వేల టన్నుల బీడు-ఇనుము (Pig-iron) ఉత్పత్తియగును.

## ఆస్ట్రేలియా పరిశ్రమల అభివృద్ధి.

గవర్నమెంటువారు వర్తకవ్యాపారములయందు ప్రమేయమును గలిగించుకొనుటయనిన, పులియో భూతమోయని దిగులుజెందువారు. 1916 సం॥ జూనునెలయందు ఆస్ట్రేలియా దేశపు ముఖ్యమంత్రియగు హ్యూజెస్ బ్రిటనుదేశమునందు గావించిన గంభీరోపన్యాసములను జదివినవారు ఈభ్రమ వదిలిపోయి జాగ్రదావస్తయందుండగలరు. వ్యవసాయకళను పరిశ్రమలను ఆస్ట్రేలియాదేశము ఏతీరున పోషించి రక్షించినదో, స్కాట్లండునందలి రెండువందల వ్యవసాయవాణిజ్య సంఘముల

యెదుట విపులముగా వాక్రుచ్చియున్నాడు. యుద్ధారంభమునకు పూర్వము స్థాపింపబడిన కళలెచ్చటను ఆస్ట్రేలియాయందు కానరావు. ఇపుడన్ననో గోధుమ, శర్కర, లోహకళలను చక్కగా స్థాపించి, అభివృద్ధిలోనికి గొనివచ్చినది. మనదేశమున కూడ కృషికళకు సర్కారువారు కొంత సాహాయ్యమును చేయుచున్నారు కాని ఆస్ట్రేలియా దొరతనమువారు చేసిన పోషణ చాల సంతృప్తికరముగాను పూర్ణమయినదిగను ఉన్నట్లు తోచెడిని. క్రొత్తస్థలములయందు గోధుమలను పైరుచేసిన రైతులకు ఆస్ట్రేలియాయందలి కొన్ని రాష్ట్రముల దొరతనములు, పండిన సరకునంతటిని, అమ్మకమైనను లేకున్నను నష్టము లేకుండ, దొరతనమువారు నిర్ణీతమైన ధరలకు రైతులనుండి కొనుటకు అంగీకరించిరి. ఈనీతిని అవలంబించుటవలన సేవ్యమునందలి భూమియొక్క పరిమాణము అధికమగుటయేగాక పండిన గోధుమలుకూడ పూర్వముకన్న రెండున్నరరెట్లు అధికముగా జొచ్చినవని హ్యూజెస్ మంత్రి వక్కాణించెను. ఈప్రత్యేక కళయందు, ఆస్ట్రేలియాదేశపు పద్ధతుల నవలంబించుట మనదేశ పరిస్థితులు ఒప్పకున్నను, ఇట్టివిధములగు ప్రేరేపణలను గలిగించిన-చో వికసించి విజృంభించు కళలెన్నియోగలవు. ఆస్ట్రేలియా దేశము తనకు వలయుచక్కెరకునై విదేశములపైని ఆధారపడియుండుటకు ఇష్టపడలేదు. కావున ఆప్రభుత్వమువారు పంచదార వ్యాపారమునకు తగిన ప్రోత్సాహము నొసంగి వృద్ధికి తేదలచినవారై, ఆయుద్దేశ్యముతో చెఱకును పైరుచేయువారికిని, రసము తీయువారికిని, శుభ్రపరిచి పంచదార చేయువారికిని, తయారైన పంచదారను వినియోగించు ప్రజలకుకూడ



రాబోవు మూడుసంవత్సరముల వరకును ధరలు గ్యారంటీ చేసిరి. ఇందుల ఫలితము, పంచదార అధికముగ ఉత్పత్తి యగుటయే. పాఠకులు మన చెఱకు పంచదార స్థితిని తలచుకొనిన విచారించక మానరు. ఆదేశపులోహకళలుకూడ ఇదే విధమున ప్రోత్సాహము వడసి మంచిదశయందున్నవి. ఆదేశమునకు అత్యావశ్యకములగు లోహపు సరకులన్నియు అచ్చటనే తయారగుటకు తగినస్థితియందున్నవి. గోధుమ, శర్కర, లోహకళలయందు ఆస్ట్రేలియా దేశము సంపూర్ణ స్వాతంత్ర్యమును గాంచెను.

దేశమునందలి ద్రవ్యసాధనములనెల్ల తమ ఆధీనమునందుంచుకొని, కళాప్రపంచమునకు వలయునంత అపక్వపదార్థ సంచయమును క్రమముగా సరఫరా యగుచుండునటుల ఏర్పాటులు చేయుటయందును, తయారగు సరకునకు పణ్యాచక్రమును నిరూపించుటయందును, మూలధనమును శ్రమనుసమకూర్చుటయందును, సర్కారువారు ప్రమేయమును గలిగించుకొని కళలను స్థాపించుట ఆవశ్యకమని హ్యూజెస్ మహాశయుడు విరామములేకుండ నొక్కి వక్కాణించెను.

## ఇండియా దొరతనమువారి అశ్రద్ధ.

ఇండియా దొరతనమువారు ఆస్ట్రేలియా దేశమునుండి ఈనీతిని గ్రహించిరని మేము నమ్మజాలము. ఏలననగా పారిశ్రామిక విషయములయందు ప్రమేయము గలిగించుకొనవలెనని దేశస్థులు మొఱబెట్టుచుండ, దొరతనమువారు ఆయాలాపములనెల్ల పెడచెవిని పెట్టుచున్నారని వ్రాయుటకు ఎంతయు సంతాప

కరముగ నున్నది. ముందంజవేసి, తగినసాహాయ్యము నొసరించుటలేని సంగతియటుండ, మీదు మిక్కిలి దేశమునందలి ద్రవ్యసాధనములు పాడుపడుచుండుట కూడ నిర్విచారముగ చూచుచున్నారు. హిందూదేశ కళాపురోభివృద్ధికి, సాహసము మిక్కిలి అవసరమనియు, ఆసాహసము, సర్కారువారి సాహాయ్యమున్ననేగాని, ప్రజలయందు కలుగుట దుర్లభమనియు, వెనుక మన వాణిజ్య పరిశ్రామిక శాఖకు అధ్యక్షుడుగానున్న సర్ విల్లియమ్ క్లార్కు "ఇండియామార్క్" అనునొక పత్రికకు వ్రాసియుండెను. ఇంతేగాక సర్కారువారు ఏకళకునైన సహాయ్యముగా నున్నారని తోచిన యెడల, ప్రజయందు గాఢమైన విశ్వాసము అంకురించి ఆకళనుస్థాపించుటకు వారి నుద్యుక్తులుగ జేయునని క్లార్కుగారు వాక్రుచ్చిరి. ఏకళలు, స్వతస్సిద్ధములుగ విజృంభించుటకు తగిన పరిస్థితులు దేశమునం దలవడియున్నవో, అట్టికళలను పోషించు నిమిత్తమైనను ఇండియా దొరతనమువారు క్లార్కు మహాశయుని సలహాను ఆమోదించవలసి యున్నది.

ఈసందర్భమున "ఇండియను టెక్స్టైలుజర్నలను" నొక పత్రికయందు ఒక వర్తకుడు వ్రాసిన వ్రాతల నిచ్చుట పొందుపరచుట సామంజసముగ నుండునని తోచెడిని.

"ఐరోపా మహాసంగ్రామము, మనకు బోధించిన గొప్ప నీతి ఏమన, భుజబల పరాక్రమములేని ఏదేశమును నిలచుటకు ఆధారము లేకపోవుట. ఆర్థిక విషయములపట్ల పరరాష్ట్రములనుండి సంపూర్ణ స్వాతంత్ర్యమును సంపాదించినగాని



ఏదేశమును నిలువవీలులేదు. అంతర్జాతీయ స్నేహ బాంధవ్యములు ఎంత ఆవశ్యకములో, ఏదేశమున కాదేశము ద్రవ్యోత్పత్తియందును, ద్రవ్యసాధనముల పట్లను శాస్త్రవిషయముల యందును పారిశ్రామిక విషయముల యందును అన్యరాష్ట్రములపై కొంచెమైనను ఆధారపడియుండక స్వదేశమునే నమ్ముకొనియుండుట కూడ, అంత ఆవశ్యకమయిన సంగతియే. హిందూదేశము యొక్క గోగునార, ప్రత్తి, పట్టుసంపదను దేశమునందింకను విరివిచేసి, ఆపదార్థ సంచయము పరదేశయాత్ర వెడలునపుడు ఎగుమతిపన్నులను విధించి రెవిన్యూను అభివృద్ధి చేయువలసి యున్నది. నూలుసరకులపై విధించబడిన పన్నులను ఇకనైనను కాలహరణము చేయక తీసివేయవలసి యున్నది. రబ్బరు, చెఱకు, ధాన్యాదులు మొదలగునవి దేశమునందలి వినియోగమునకు వలయునంత పైరుచేయుట అగత్యము. హిందూదేశపు వర్తకనౌకలను నిర్మించి ధనసాహాయ్యము నొసంగి పోషించవలసి యున్నది. భూగర్భశాస్త్రమునందు శిక్షితులైన విద్యాధికులకు వృత్తులను గల్పించుట చేతను, విదేశములకేగి గనులయందు విద్యనభ్యసించుటకు సర్కారు వేతనము లొసంగుటవలనను, ఖనిజసంపద నాకర్షించుటకు తగినఏర్పాటులు చేయుటఅవసరము. స్వదేశమునందలి స్వతంత్ర సంస్థానములలోను, పట్టణములలోను రాష్ట్రములలోను శాస్త్రాలయములును శోధనాలయములును ప్రభుత్వము వారివలన నెలకొల్ప బడవలసి యున్నవి. పట్టణపారిశుద్ధ సంఘములు, ఉచితముగ చదువుకొనుటకు వీలగు గ్రంథాలయములను వాణిజ్యప్రదర్శక శాలలనుకలిగి యుండవలెను. ప్రతిరెండవ

సంవత్సరమునను సర్కారువారి రెవిన్యూనుండి రైతులకు శుభ్రమైన విత్తనములు, సత్తువ చేయుటకుతగిన పరికరములు ఎముకలపొడి సరఫరా చేయబడుచుండవలెను. గవర్నమెంటు వారు క్షామ దినములలో సర్కారు ఆదాయమునుండి చాల సొమ్మును ఖర్చుపెట్టుటయేగాక, ఎంతయో రెవిన్యూనుకూడ మాపుచేయుచుండగా, సాధారణ సంవత్సరముల యందు సైతము సర్కారు రాజస్వమునుండి రైతులకుకొంత సహాయమునొసంగి, భూమిని ఏల విస్తారము సస్యాఢ్యయగునట్లు చేయరాదు ? అమెరికాసంయుక్త రాష్ట్రములు జపానుమున్నగు ప్రభుత్వములు అనేకవిధముల తమదేశములయందలి భూమిని హెచ్చు ఫలవంతముగా నొనర్చు చున్నారు. అందువలననే అక్కడిరైతులు చదువుకొనిన వారును భాగ్యవంతులుగను కూడ నున్నారు. హిందూదేశమునందలి బీదరైతులనుకూడ పట్టుదలతో విద్యనభ్యసింపజేయుట లెస్సగాని, వారినిజడులుగనే విడిచిపెట్టుట సమంజసముకాదు. వారలను విధ్యాధికులను చేసినయెడల రాజస్వము వృద్ధియగునుగాని తగ్గిపోదు.

ప్రారంభవిద్య దేశమునందెల్ల యెడలను రాబోవు పది సంవత్సరములలోను నిర్బంధము చేయబడవలసి యున్నది. అందులకుగాను ఒకప్రత్యేకనిధిని తక్షణము ఏర్పాటుచేయుట చాల అవసరము.

జపాను ప్రభుత్వమువారు ఏకళలకును సాహాయ్యమునొసంగుటలేదని కొందరు వాదించుచున్నను, వారు అన్ని పరిశ్రమలకును అన్నివ్యాపారములకును ధనసాహాయ్యము చేయుచున్నారని ధైర్యముగా చెప్పగలము. వివిధములగు



వ్యాపారములకు, కళలకు, ఫ్యాక్టరీలకు ప్రత్యేకసంఘములు కలవు. ఆసంఘములు ప్రభుత్వమువారి సన్మానమును వడయుచున్నవి. వాటికివచ్చెడి నష్టముపూర్తిగ దొరతనమువారివలన ముదరానీయబడుచున్నది. ప్రత్యేకించి ఏఫ్యాక్టరీకిని దొరతనమువారు సహాయము నొసంగుటలేదుగాని, నూతనకళలకు మూలధనమును అప్పునొసంగుటయు, సర్కారుకు చెల్లవలసిన పన్నులను తగ్గించుటయు మొదలుగాగల సహాయములను చేయుచున్నది.''

తేజోవిహీనమైయున్న భారతీయ కళాప్రపంచమునకు తిరిగి వికాసమును కలిగించవలెనన్న ప్రభుత్వమువారి సాహాయ్యము అత్యావశ్యకమని పైచర్చవలన తేలినది. జపాను, అమెరికా, జర్మని మున్నగు దేశముల ప్రభుత్వములవారును, విశేషించి బ్రిటిషు అధినివేశములలోనిదగు ఆస్ట్రేలియా దొరతనమువారును ఇండియా దేశమునందలి స్వతంత్రసంస్థానాధీశులును, వాణిజ్య పరిశ్రమలయందు ఏసహాయమును చేయుచున్నారో, ఇండియా దొరతనమువారుకూడ ఆరీతినే ప్రవర్తించవలసిన ఆవశ్యకత చాల హెచ్చుగా నున్నదని నిర్దేశింపబడినది. ఇండియాకార్యదర్శి ఈవిషయములయందు స్థానిక ప్రభుత్వములకు సంపూర్ణస్వాతంత్ర్యము నొసంగితీరవలయును. ఇప్పటికే చాలకాలహరణమయినది. ఒకనిమిషమైనను జాగు చేయుట పాడిగాదు.

### సర్కారు సహాయ మెంతవరకు.

ఏవిషయములలో ఎంతవరకు సర్కారువారు కలుగజేసికొనవలయునో యనువిషయమున పలువురు భిన్నాభిప్రా

యుతై యున్నారు. కొందరు తగిన సలహానిచ్చుటతోడనే సర్కారుపని పూర్తిఅయినదని అనుకొనువారలు. మరికొందరు అన్ని విషయములయందును కలుగజేసికొని తీరవలయునందురు. ప్రస్తుతము ఈసందర్భమున సర్కారు ప్రోత్సాహము నీయవలసిన విషయములను కొంతవరకు చర్చించెదము.

పారిశ్రామికాభివృద్ధికి అవసరములగు వానిని నాలుగు తెగలుగ భాగింపనగును. ద్రవ్యసాధనములు, శ్రమ, మూలధనము, శిల్పసంబంధమైన నిపుణత. ఈనాలుగు విషయములు కూడ ముఖ్యములేకాని, అందులో ఎంచిచూచినపుడు శిల్పులయందలి నిపుణతకును, శాస్త్రమునకును నేను అగ్రస్థానము నొసంగుటకు వెనుదీయనని సర్ దోరబుతాతాగారు, పదునొకండవ పారిశ్రామిక మహాసభయందు నొక్కివక్కాణించిరి. గొప్పరాజ్యతంత్రజ్ఞుడు, సేనాధిపతి, వ్యవహారనిర్మాత వీరు మువ్వురు స్వయంభువులు కావలసినదేకాని, తరిబీతువలన పెద్దవారుకాజాలరు. అయినను తగినఆశ్రమముదొరకి, సాంకేతిక విద్యాశిక్షణము బాగుగా అలవడినచో సాధారణ మానవునకు సైతము కొంతబుద్ధికుశలత కలుగకపోదు. దేశమునందు ఎల్లడలను విరివిగా శాస్త్రవిద్యయు పరిశ్రామిక విద్యయు వెదజల్లినగాని వ్యవహారనిర్మాతలు బయలుదేరుటకు అవకాశముండదు. ముందుగా గొప్ప విద్యాలయములు దేశమున స్థాపింపబడవలెను.



## ముందుకళాస్థాపనమా లేక శాస్త్రవిద్యా ప్రవేశమా.

దేశమునందు గొప్పకళలు స్థాపింపబడినతరువాత పారిశ్రామిక, శాస్త్రవిద్యాలయములు స్థాపించబడవలెనని కొందరిమతము. వీరిముఖ్యాభిప్రాయము, కళాస్థాపనమునకుముందు పూనుకొనవలెననుట. కళలు నెలకొల్పబడిన వెనుక కళాశాలలు (టెక్నికలు ఇన్‌స్టిట్యూటు) ప్రతిష్ఠింపబడవలెనుగాని, సాంకేతిక విద్యాలయములను ముందుస్థాపించరాదందురు. ఈ అభిప్రాయము కేవలము దురభిప్రాయమని సర్ హార్కోర్టుబట్లరుగారు సంయుక్త రాష్ట్రములకు పారిశ్రామికవిద్య అవసరమని తెలియపరచుచు పదిసంవత్సరములక్రిందట ఒక రిపోర్టును ఇండియా దొరతనము వారికి పంపిరి. నాగరికతనుగలిగిన ప్రతిదేశమునందును సాంకేతిక విద్యాలయము లనేకములున్నవి. ఒక్క ఇంగ్లాండు దేశమునందుగాక తక్కిన అన్ని దేశములయందును పారిశ్రామిక విద్యయొక్క ప్రారంభదశయందే సాంకేతిక విద్యాలయములు స్థాపనచేయబడినవి. అమెరికా దేశమున 1824 సం॥న రెన్‌సిలారు ఇనిస్టిట్యూటును, 1855 సం॥న మేసాచూసెట్సు ఇనిస్టిట్యూటును, 1868-66-71 సంవత్సరములయందు వార్‌స్టెష్టరు, లై యూనివర్సిటి, స్టీవెను ఇనిస్టిట్యూటులును, స్థాపింపబడినవి. అట్టివిద్యాలయములే ప్యారిసు నగరమున 1795 సం॥ నను వియన్నాయందు (ఆస్ట్రియాయొక్క ముఖ్యపట్టణము) 1815 సం॥ నను నెలకొల్పబడినవి. జర్మను సాంకేతిక విద్యాలయములన్నియు పదునెనిమిదవ శతాబ్దాంతమునుండి పందొమ్మిదవ శతాబ్దారంభమునకు స్థాపింపబడినవి. జపాను, పెద్దపరిశ్రామిక విద్యాశాలలతో ఆరంభించినది.

ప్రప్రథమమున ఈ విద్యాలయము లన్నియు చిన్నవే. కాని కళాపరిపూర్తి గాంచనెంచు దేశములయందు పారిశ్రామిక విద్య చాలవరకు ప్రారంభదశయందే ఆరంభము కాజొచ్చినది. సాధారణవిద్య దేశమునందు వ్యాపించిన వెంటనే తప్పక దానివెనుక పరిశ్రామిక విద్యకూడ వ్యాపించుచు వచ్చినది.

సర్ హార్‌కోర్టుబట్లరుగారు సెలవిచ్చినసంగతినిబట్టి ఇంగ్లాండునందు మాత్రము పారిశ్రామికవిద్య ముందుగా ఆరంభముకాలేదని మనముగ్రహించి యుంటిమి. యంత్రకళలు హస్తకళలు, దేశమునముందుగా స్థాపితములైనవి. ఆనీతిని పాలించుటవలని నష్టములను ఈమహాసంగ్రామము దేశమును చీకాకు పరచుచున్నపుడుగాని ఆంగ్లప్రజలు గుర్తింపజాలరైరి. ఆదేశమునందలి ప్రజ్ఞావంతులెల్లరును, పరిశ్రమలకును శాస్త్రమునకును అన్యోన్యసంబంధము అమితముగా నుండునట్లు చేయవలెనని ఇప్పుడు చక్కగా గ్రహించి యున్నారు. ఇంగ్లాండునందలి విద్యాశాఖవారు ఇటీవల శాస్త్రీయ, పరిశ్రామిక శోధనలను నిపుణులగువారి యాజమాన్యముక్రింద జరగునటుల ఏర్పాటులుచేసి వృద్ధిజేయుటకుగాను, ఒకగొప్ప యుద్యమమును తలపెట్టిరి. ఆయుద్యమమును మనదేశమునకు గూడ వ్యాపింపజేసిన నెంతయో బాగుగనుండును. ఈసందర్భమున శ్రీయుతజగదీశ చంద్రబోసుగారికి హార్డింజి ప్రభువరేణ్యుడు ఒక రసాయన శాస్త్రాలయమును నిర్మించి పరిశోధనలు చేయుటకుగాను ఏర్పాటులుగావించెను. ఇది ఎంతయో శుభసూచకము.



సర్ దోరబుతాతాగారు సెలవిచ్చినట్లుశాస్త్రాలయముల దేశమునందు నెలకొల్పి పరిశోధనలను గావించుటకు ఏర్పాటులను చేయుట సర్కారు వారి పూచీగాని ప్రజలవలన కాదు. శాస్త్రాలయముల నెలకొల్పుటయనిన మాటలతో పనిగాదు. ఎన్నియో లక్షలరూప్యములను ఖర్చుపెట్ట వలసి యున్నది. అందులకు కావలసిన ధనము సర్కారు వెచ్చించవలెనే గాని సామాన్య ప్రజల కలవిగాదు.

### శాస్త్రవిద్య కొందరికి మాత్రముకాదు.

పరిశ్రామిక విద్యయనిన మా అభిప్రాయము ఏదో కొందరు నిపుణులను మాత్రము దేశమునం దుత్పత్తిచేయుట కాదు. శాస్త్రీయవిద్య దేశము నందంతటను వెల్లి విరిసినట్లు వ్యాపింపజేయవలయును. జర్మనీదేశముయొక్క ప్రాముఖ్యత దేశమునందు సుప్రసిద్ధ రసాయన, భౌతిక శాస్త్రవేత్తలను కొందరినిమాత్రము కలిగియుండుటగాదని సర్ నార్మన్ లాకియరుగారొకప్పుడు సూచించిరి. ఇతరదేశములయందు కూడ కొందరు సుప్రసిద్ధ శాస్త్రవేత్తలు లేకపోలేదు. జర్మనుదేశము నందలి విశేషమేమనిన శాస్త్రజ్ఞానము దేశమునందంతటను వెదజల్లబడినది. ఇండియాదేశమునందుకూడా జర్మను పద్ధతి ప్రకారము శాస్త్రవిద్య వెల్లివిరియునట్లేర్పాటులు చేయబడవలసియున్నది. తరువాత పరిశ్రామిక విద్యాశాలలు మన పనివాండ్రయొక్క కళాకౌశలమును ఇనుమడింప జేయుటకునై నెలకొలుపబడవలెను. చిత్రవస్తుప్రదర్శనశాలల వలన ప్రజలకు జ్ఞానోదయము నొసంగవలసి యున్నది. వస్తుప్రదర్శన శాలల మూలమున ప్రజలకెంతయో సూక్ష్మముగ బోధింపనగును. కర్మ

కరులయొక్క శక్తియుక్తులను అధికము చేయుటకునై దేశము నందు సర్వత్ర సామాన్యవిద్య గరపబడవలెను. ప్రజలందరును వ్రాయను చదువను నేర్చిరేని కళాపుర్గోభివృద్ధికి పెక్కువిధముల సహాయభూతులు కాగలరు.

### ఇండియా దొరతనమువారు మేల్కొను సూచనలు.

పైచర్చవలన తేలిన ప్రధానాంశము 'లైసెజీఫెయిరు' మతము మనదేశ పరిస్థితులకు ఇసుమంతయైనను ప్రయోజన కారికాదనియును, ప్రభుత్వావలంబన మిక్కిలి అవసరమని యునుకదా! ఈవిషయమును కొంతవరకు ఇండియా దొరతనమువారుకూడ గ్రహించుట శుభప్రదమని చెప్పక వీలు లేదు. ఇండియాదేశ ఆదాయము చాలవరకు సర్కారుఉద్యమములవలననే యలవడుచున్నది. తపాలాతంతిమార్గములు నల్లమందు, కల్లుసారాయి ఇజారాలు, అడవులు, చాలభాగము రెవిన్యూ నిచ్చుచున్నవి. 1900 సంవత్సరములనుంచి రైల్వేలు కూడ లాభజనకములుగనే యున్నవి. ప్రస్తుతము దొరతనమువారు ఇండియా యందలి రైల్వేలనన్నిటిని కంపెనీల యాజమాన్యమున నుండనీయనగునా, లేక ప్రభుత్వము వారే స్వీకరించవలయునా యను అంశమును విచారణ చేయుచున్నారు. ఈస్టిండియా రైల్వేకంపెనీ కలకత్తానుండి సిమ్లావరకు వ్యాపారమును నడపుచున్నది. ఆకంపెనీకి ఒసంగబడిన ఒడంబడిక 1918 తో ఆఖరయిపోవుచున్నది. తిరిగికంపెనీకి ఒసంగుట లాభమా లేక సర్కారు ఆధీనమునకు గొనివచ్చుట లాభమా అనువిషయము ఆలోచనీయము. ఈవిషయమును గూర్చి మరియొక సందర్భమున విపులముగా చర్చించబడును.



గాన సర్కారువారే రైల్వేలన్నిటియందును యాజమాన్యమును వహించి, కార్యక్రమమును నిర్వర్తించుట యుచితమనిమాత్రమిచట చెప్పవలసియున్నది.

ఈమధ్య సామ్రాజ్యశాసన నిర్మాణ సభయందు, సుప్రసిద్ధ భారతీయ అర్థశాస్త్రవేత్తయగు సర్ దిన్షా ఎడల్జీ వాచాగారు అడవుల పరిపాలనమును గూర్చి ప్రశ్నింపగా గౌరవనీయులగు సర్ క్లాడు హిల్ గారు తామీవిషయమును గూర్చి ఆలోచించుచున్నామనియు, వర్తకరీత్యాలాభము వచ్చు విధమున అడవులను ఉపయోగించెదమని ప్రత్యుత్తరమిచ్చిరి. అండమాను దీవులయందలి దుర్గమారణ్యములను లాభజనకములుగజేసి సర్కారురాజస్వము అధికమగునట్లు ఏర్పాటులు గావింపబడెననియు, యుద్ధానంతరమున ఈయుద్యమమును కొనసాగించ గలుగుదుమనియుకూడ చెప్పిరి. ఇటీవల పబ్లికుసర్వీసు కమిషనుకు అగ్రాసనాధిపతిగా ఇండియాకువిచ్చేసిన ఐలింగ్టను (Lord Islington) ప్రభుపు ఒకవార్తాపత్రికా విలేఖకునికొసంగిన సమావేశములో, సర్కారువారే కొన్నికళలను వృద్ధిచేయు భారమును వహించ నిశ్చయించినట్లు తెలియజేసిరి. ఇతరదేశముల ప్రభుత్వములవారు వాణిజ్య పరిశ్రమలయందు జోక్యమును గలిగించుకొనుటవలన నష్టములేవియేని సంభవించినను ఇండియా దేశమునందు మాత్రము ఏకళలను విస్తరింపజేయుటకు ప్రజల ఉద్యమములు సఫలీకృతములుకాలేదో, వాటియందు సర్కారువారు ప్రమేయమును కలిగించుకొని, కొన్ని మాదిరి ఫ్యాక్టరీలనుగాని కర్మాగారములనుగాని స్థాపనముచేసి ప్రజలకు మార్గదర్శకులు కావలసిన ఆవశ్యకతమెండుగాగలదు.

ప్రత్తిపన్నులను గూర్చి ప్రభువుల సభయందు 1917 సం॥ మార్చి నెలలో ప్రసంగించుచు ఐలింగ్టను ప్రభువు మనదేశ పరిస్థితులను కొంతవరకు గ్రహించినవాడై ఇటుల ముచ్చటించెను. "హిందూదేశము యొక్క భావియౌన్నత్యము కళాపురోభివృద్ధిని ఆశించియున్నది. కళలభివృద్ధిజెందుచున్న కొలదిని 'రాను రాను ఇంగ్లాండునకును, ఇండియాకును విశేషమైన పోటీకూడ ప్రబలును. వాణిజ్య పరిశ్రమలయందు మసలుచున్న ఆంగ్లప్రజలెల్లరు, ఈవిషయమును గుర్తించవలసియున్నది." అసహాయస్థితియందుండెడి చిన్నరాష్ట్రములకు అభయహస్తము నిచ్చెదమని కంకణముగట్టుకొన్న బ్రిటిషు దొరతనమువారు, కళాప్రపంచమున, బెల్జియము, సర్వియా మాంటినిగ్రో, రుమేనియా దేశముల ప్రస్తుతస్థితికంటె హీనదశయందున్న ఇండియాదేశమునకుకూడ అభయహస్తమొసంగి రక్షించెదరుగాక! ఇండియా దొరతనమువారికి వాణిజ్య వ్యాపారములయందు ఇండియా కార్యదర్శియొక్క ఆటంకములు లేకుండ సంపూర్ణ స్వాతంత్ర్యము నొసంగుటయే మనకోరిక!

కర్జనుప్రభువు సైతము మనయెడల సానుభూతిని గనబరచుట చాలసుకరము. "లంకషైరు నూలుసరకులపై ప్రత్తిపన్నును అధికముచేయుట ఇండియాదేశమునకు చాలకాలమునకు న్యాయమును ప్రసాదించుటయని నామతము. ఇదివరకు అన్యాయముచేయబడిన దేశమునకు ఈప్రస్తుతపద్ధతి మనఃపూర్వకముగా నష్టపూర్తిని చేయుటయైయున్నది." ఆంగ్లప్రజలు కర్జను, ఐలింగ్టను ప్రభువులవాక్యములను, బాగుగ గ్రహించినవారై మనదేశమునకు న్యాయమునొసంగి నిస్తంద్రకీర్తియుతులు కావలసియున్నది.



వాణిజ్యనీతియందు బ్రిటిషుప్రజలు ఉదారభావమును గలవారై ఇండియాదేశముయొక్క అభివృద్ధిని గమనించినవారలై, ఇండియాదేశ పురోభివృద్ధికి అభ్యంతరములను కలిగించు ఇండియా దొరతనమువారికి ఆర్థికస్వాతంత్ర్యము నొసంగుట విధియైయున్నది. హిందూదేశము పేదవడి యున్నంతవరకు సామ్రాజ్యమునకు సహజమైనబలము అలవడదు.

*

## స్వేచ్ఛా వ్యాపారము ; రక్షణ.

మన భరతఖండము పాశ్చాత్యదేశము లన్నిటికంటెను ముందుగా సకలైశ్వర్యముల తులదూగి సమస్త కళాప్రావీణ్యతం జెంది విజృంభించెనన్న సంగతి నిర్వివాదాంశము. ఆంగ్లేయులు కట్టుటకు వస్త్రములు లేక తోళ్ళనో చెట్లయొక్క పట్టలనో మానసంరక్షణార్థము ధరించి థేమ్సునదియందు చేపలను వేటాడు కాలమునకు మన డాకామజ్లినులు ప్రపంచ విఖ్యాతిగాంచినవి. ఆమజ్లినుల యొక్క ప్రావీణ్యత ఈక్రింది యితిహాసమువలన తెల్లమగును. ఔరంగజేబు మన దేశమేలు కాలమున ఒకానొక మొగలాయి స్త్రీ చక్రవర్తి దర్శనమునకు వచ్చెను. ఆమెను చూచిన తోడనే ఔరంగజేబు దుస్తుల ధరించి రావలె నని యాజ్ఞాపించెను. ఈచక్రవర్తికి ఇతర దుర్గుణము లెన్నియున్నను త్రాగుటయును పరస్త్రీగమనమును మొదలగు వ్యసనములకు మాత్రమెన్నడు చోటిచ్చినవాడు కాడు. చక్రవర్తియాజ్ఞ కాశ్చర్యపడి ఆమొగలాయి స్త్రీ "ఓనాయేలికా! నీదర్శనమునకు దుస్తుల ధరింపకుండ వచ్చుటకు నేనంత వెర్రినే! ప్రభుదర్శనార్థము నేను ప్రశస్తమైన యేడు డాకా మజ్లినుల ధరించివచ్చితినని నుడివెను." ఆహా! యేడుమజ్లినుల ధరించినను దేహముపై వస్త్రము లేనట్లు కన్పట్టినదే! ఏమి వీటిని నేసిన పనివాని నేర్పరితనమని చక్రవర్తి తనలో చాల సంతోషించి, ఆమొగలాయి స్త్రీతో "నీవు ధరించిన డాకామజ్లినులు చాల సన్నముగ నున్నవి గనుక మరొక దుస్తు ధరించి రావలెనని కోరెను." అట్టి డాకామజ్లినుల సంగతి ఇప్పుడు తలచుకొనిన యే భారతీయునకు విచా



రము రాకమానదు? మనకళా ప్రపంచమంతయు నేడు కళావిహీనమై మనము ప్రతివస్తువునకును పరరాష్ట్రముల వారిని ప్రార్థించవలసి వచ్చెనను సంగతి కడుం గడుశోచనీయము.

ఈస్టిండియా కంపెనీవారి అసూయా పరిపాలనమువలన మన కళలన్నియు శోభావిహీనములై యడుగంటినవి. * దేశీయ ప్రభుత్వమున్న యడల మనకట్టి దుస్థితి వచ్చియుండదేమో? తిరిగి వాటియందు వికాసము కలుగజేసివిజృంభింప జేయవలెనన్న మనవాణిజ్య చక్రమును యథేచ్ఛగావిహరింప నీయవచ్చునా లేక ఏమైన నిర్బంధమును కలుగజేయవలెనా యనుమహాంశము మనము విచారింపవలసి యున్నది. మన వర్తకమునకు రక్షణ కావలయునా అక్కరలేదా యనువిషయమున పలువురు భిన్నాభిప్రాయులై యున్నారు.

### రక్షణ యననేమి.

రక్షణ యనగా విదేశవస్తువుల పై పన్నులను విధించి స్వదేశవస్తువులకు వృద్ధినొందుటకు సదుపాయములు చేయుట. పన్నులను విధించుటయేగాక ప్రభుత్వమువారు అనేకవిధముల సహాయము చేయవచ్చును. క్రొత్తక్రొత్త కళలను స్థాపింప జేయుటకు గవర్నమెంటు వారు విస్తారము ద్రవ్యసహాయము చేయుటయు, వాటిని పై దేశముల కెగుమతి చేయుటకు ఎగుమతి పన్నులు వగైరాలను వేయకుండుటయు మొదలగు అనేక విధముల సహాయము. చేయవచ్చును. జర్మనీ, అమెరికా సంయుక్త రాష్ట్రములు మొదలగు దేశీయ ప్రభుత్వముల వారు, వారివాణిజ్య చక్రము నీతీరుగనే విజృంభింప జేసినారు.

* R. C. Dutt.

బీటు-చక్కెర (ఒక తరహా కందమూలమునుండి తయారు చేసిన పంచదార) మన చెరకు పంచదారను నిలుచుట కాస్కారము లేకుండ మన మార్కెట్టునుండి సైతము పారదోలె నన్న సంగతి ఎల్లరకు తెలిసిన విషయమే.

### స్వేచ్ఛావర్తక మనసేమి.

స్వేచ్ఛావర్తకమనగా పన్నులేని వర్తకము. విదేశవస్తువులపై శుల్కమును విధించకుండుటయే పన్నులేని వర్తకమనబడును. మనదేశమునుండి ఎగుమతిచేయబడు వస్తువులపై పరరాష్ట్రములవారు శుల్కమును వసూలుచేసినను మనము మాత్రము వారివస్తువులపై పన్నువేయరాదని దీనియభిప్రాయము. ప్రపంచమునందలి ఎల్లదేశములలోను ఒక్క ఇంగ్లండు దేశముమాత్రము స్వేచ్ఛావర్తకమును కలిగియున్నది. ప్రపంచమునందెల్ల దేశములవారును స్వేచ్ఛావర్తకము నామోదించవలయుననియే, ఇంగ్లాండుదేశస్థుల యాశయము. కాని వీరి ప్రయత్నము లీసందర్భమున వృథాయయ్యెను. ఇంగ్లీషు అర్థశాస్త్రజ్ఞుల వాదములు జర్మనీ, సంయుక్తరాష్ట్రములు, జపాను మున్నగు దేశస్థులకు రుచింపవయ్యె. ఆంగ్లేయ అర్థశాస్త్రజ్ఞుల వాదములను మెచ్చుకొనుచు ఆయాదేశములవారు వారిదేశస్థితిగతులనుమాత్ర మాలోచించుకొని రక్షణత్వమునే అవలంబించియున్నారు.

ఒక్క ఇంగ్లండు దేశము మాత్రమిప్పటికిని స్వేచ్ఛావాదము ననుసరించియున్నది. కాని ఇటీవల రక్షణత్వసూచనలు పొడకట్టుచున్నవి. ఈ యుద్ధానంతరమున స్వేచ్ఛావాదము



నిలుచునో ఇంగ్లండుదేశము సైతము అన్నిదేశములతో పాటు రక్షణ నవలంబించునో మనము నిష్కర్షగా చెప్పజాలము.

### స్వేచ్ఛావర్తకమువలని లాభములు.

స్వేచ్ఛావర్తకము నవలంబించుటవలన మనము ప్రతి వస్తువును చౌకగాకొనుటకు వీలున్నది. ఏలననగా ప్రతిదేశము వారును పోటీకివచ్చి మనకు కావలసిన వస్తువులను సమకూర్చెదరు. అన్నిదేశములవారును పోటీకివచ్చినపుడు ధరలు చౌకగా నుండక మానవు. మనకెవరు తక్కువ వెలకిచ్చెదరో వారివద్దనే మనము గ్రహించుటకు వీలున్నది. రక్షణనిమిత్తము విధించబడిన శుల్కము సరకులయొక్క ఖరీదును హెచ్చుచేయును. అట్లుచేయుటవలన వినియోజకునకు (అనుభవించెడు వానికి) కొంచెము నష్టము కలుగును. ఇంతేగాక మనము కలిగించిన కల్పిత ప్రోత్సాహమువలన మూలధనమును, శ్రమయును స్వాభావికముగా తక్కువ ఉపయోగకరమైన కార్యములలో వినియోగించిన వారమగుటయేగాక వాటియొక్క ఫలోత్పాదక శక్తిని సైతము తగ్గించిన వారమగుచున్నాము. కాబట్టి రక్షణ నవలంబించుటవలన తాత్కాలిక నష్టము కలుగక మానదు.

### రక్షణవలని లాభములు.

అయిన ప్రస్తుతనష్టమునకు మించిన ఫలము తుదకు దేశమునకు లభించునని కొందరు రాజ్యతంత్రజ్ఞుల యభిప్రాయము. వారిలో లిస్టుఅను జర్మనురాజ్యతంత్రజ్ఞు డీవిషయమును గూర్చి ఎక్కువ శ్రమతీసికొని ప్రపంచమునకు తెలియజేసెను. రక్షణ నవలంబించుటవలన తుదకు దేశమునకుగలిగెడి హెచ్చు

లాభములేవన స్వదేశకళ లభివృద్ధిజెందుట, దేశనుందలి కర్మకరులందరు ఒకే వృత్తిలో యాజన్మాంతము కృషిచేయకుండ పలువిధములైన వృత్తులనవలంబించుటకు వలనుపడుట, బుద్ధికుశలత వృద్ధియగుట, క్రొత్తక్రొత్త వ్యాపారములను స్థాపనచేసి అవిచెడిపోకుండ తగునేర్పాటులజేయుట, దేశమందలి ఖనిజములను సేకరించి ఉపయోగింపగలుగుట, యానసౌకర్యములను వృద్ధిచేయుట మొదలగునవి. ఇంతయేల! రక్షణ నవలంబించుటవలన వ్యవసాయ దశయందుండెడి దేశము పరిశ్రామిక కళలయందు త్తీర్ణత గాంచగలుగును. కాబట్టి మనము దేశముయొక్క మొత్తపులాభము నాలోచించునప్పుడు, ఒక సామాన్యసంసారికి సంభవించెడు నష్టమును పరిగణించక, దేశమున కేమార్గము నవలంబించుటవలన ఐశ్వర్యము చేకూరునో దానినే, మనమాలోచించవలసి యున్నది. "కేవల ధనసంపాదనకన్న సంఘముయొక్క ఉత్పాదకశక్తులను వృద్ధినొందించుటకు తగిన ఏర్పాటులనుచేయుట హెచ్చులాభకరమగుపని. దేశముయొక్క ఉత్పాదకశక్తిని మనసునందిడుకొని మనమాలోచించినచో ప్రస్తుతము కొన్ని వస్తువులు చౌకధరలకు దొరకుటవలన గలిగెడు లాభమును, ముందు ముందు ఉత్పాదకశక్తి కేవలమునశించుటవలన మనకురాబోవు గొప్పనష్టము తుడిచివేయుచున్నది.

సంపదను వృద్ధిచేయుటకు మనకుగలశక్తిని వృద్ధిపరచుట, ప్రత్యేకధనసంపాదనముకన్న చాలరెట్లు ముఖ్యమైనది. రక్షణపన్నులవలన, సరకులకు మనము కొంత హెచ్చుధర నీయవలసి వచ్చినను ఈనష్టము, మనకు ఉత్పాదకశక్తి అధికమగుట



వలన గలుగు లాభమువలన, భర్తియగును. ఈ యుత్పాదకశక్తి అధికమగుటవలన దేశమునకు ముఖ్యముగా కావలసిన ఎల్ల వస్తువులను అనేకరెట్లు హెచ్చుసంఖ్యగా మనదేశమునందు తయారుచేయ గలుగుదుము. ఇంతేగాక యుద్ధసమయములయందు అన్నివస్తువులకు అన్యదేశీయులపై ఆశపెట్టుకొని ఇబ్బంది పడకుండ, స్వేచ్ఛగానుండ గలుగుదుము. విస్తారము ఐశ్వర్యమును జాగ్రతపరచుటకన్న స్వకీయరక్షణ వేయిమడుంగులు ఆవశ్యకము.

## 'లిస్టు' అను జర్మను అర్థశాస్త్రజ్ఞుడు.

రాజ్యపరిపాలనా తంత్రమునందు దేశీయ సంప్రదాయము, చారిత్రాత్మక సంప్రదాయము, అను రెండుపద్ధతులు గలవు. దేశీయ సంప్రదాయ పక్షమున వాదించువారలలో 'లిస్టు' అను శాస్త్రజ్ఞుడువిస్తారము ఖ్యాతిగాంచినవాడు. ఈమహానుభావుని యుద్దేశప్రకారము తమవాణిజ్య చక్రముయొక్క అభివృద్ధియందు సకలదేశస్థులును మూడుదశలను గడుపవలసి యున్నది.

1. మొదటిదగు వ్యవసాయదశయందు వారువిస్తారముగా అభీవృద్ధిగాంచిన దేశములవారితో స్వేచ్ఛావర్తకము నవలంబించవలెను. అటులజేసినగాని వీరివ్యవసాయము వృద్ధికి రాదు. వ్యవసాయముబాగుగా వృద్ధిమైనకొలది స్వేచ్ఛావర్తకమంత లాభకరముగ నుండదు.

2. రెండవదియగు శిశూదశయందు పరిశ్రామిక కళలును, యానసౌకర్యములును, అన్యదేశవర్తకమును, వృద్ధి

యగుటకుగాను దేశప్రజలు రక్షణ నవలంబించవలెను. దిగుమతిపన్నులను తొలుదొల్త తక్కువగా విధించి క్రమక్రమముగా హెచ్చించవలెను. ప్రథమమునందు ఏవస్తువులు జనసామాన్యముయొక్క ఉపయోగమున కావశ్యకములో వాటిని తయారుజేయుటయందు తగువేర్పాటులను జేయుటకు ప్రయత్నించవలెను. ఏదేశములు స్వాభావికముగా కళలనువృద్ధినొందింపజేయుటకు తగిన ద్రవ్యసాధనములను కలిగియుండునో ఆదేశస్తులుమాత్రమే రక్షణ నవలంబించుటకు అర్హులైయున్నారు. పరిశ్రామిక కళలయందు తీక్ష్ణత గాంచుటకు తగిన బుద్ధికుశలతను, సాధనసంపత్తిని సకలసామగ్రులను ఆయాకళలస్థాపించి వృద్ధికి తెచ్చుటకు తగిన ఉపాయములను, ఏదేశస్తులు కలిగియుందురో వారుమాత్రమే రక్షణ నవలంబించవలెను.

3. రక్షణ నవలంబించుటవలన ఐశ్వర్యమును శక్తిని, సంపాదించినపిదప, మూడవదశయందు క్రమక్రమముగాతిరిగి స్వేచ్ఛావర్తకమార్గము నధిష్ఠించవలెను. ఈదశయందు అటుల జేయక, ఇంకను రక్షణనే కలిగియుండిరేని, కళలయొక్క పురోభివృద్ధి కాటంకమగుటయేగాక వాటియొక్క క్షీణతకు గూడ కారణమగును. ఇతరదేశస్థులయొక్క పోటీలేనందువలన స్వస్థానమందలి ఉత్పాదకులకు సోమరితనము జాస్తియగును.

కాబట్టి రక్షణ ప్రతిదేశమునను ఒకానొక దశయందు తప్పక యుండితీరవలయును. ప్రస్తుతము మనదేశము, పైన జెప్పబడిన రెండవదశయందున్నది. కాన రక్షణత్వావలంబన మావశ్యకము.



## రక్షణవీలులేని స్థితిగతులు.

ప్రపంచమునందలి దేశములలో విస్తీర్ణతలోను, జనసంఖ్యలోను, ఫలవంతమగు క్షేత్రమును గనులనుకలిగి యుండుటలోను, ప్రజలయొక్క గుణములలోను, వారిసంఘనియమములయొక్క నిపుణతలోను, ఒకదేశమునుండి మరియొకదేశము విస్తారము భేదించుచున్నది. వర్తకమార్గము నెద్దానినవలంబించిన బాగుగ నుండునని యాలోచించునప్పుడు అన్ని పరిస్థితులను జాగ్రతగ పరిశీలించవలసి యున్నది. ఆర్థికవిషయములయందు పరదేశములను, ఏవస్తువుకొఱకును ఆశించ నవసరములేకుండ దేశమునకు కావలసినవన్నియు ఆదేశస్తులే తయారు చేసికొనుటకును, కళాప్రపంచమునందు స్వాతంత్రతకలిగి యుండుటకును, కొన్నిదేశములయొక్క విస్తీర్ణతయును జనసంఖ్యయును వీలుచిక్కనియ్యవు. 8 చదరపుమైళ్లు విస్తీర్ణతగలిగినటువంటియు, 13,000 మంది జనసంఖ్యగలిగినట్టియు, మొనాకోసంస్థానముగాని, వేయి చదరపుమైళ్ళ వైశాల్యమును 2,లక్షల 18 వేలు జన సంఖ్యయును గలిగిన లక్సెంబర్గు రాజ్యముగాని విదేశవర్తకము లేకుండ చేయుటకు ప్రయత్నించెనేని కేవల పరిహాస పాత్రములగుటయేగాక ఆ దేశప్రజలను మిగుల బాధపెట్టినవగును. వీరి సంస్థానములు బహు చిన్నవగుటచే దేశీయవర్గకమునకు తగిన అవకాశములేదు. ఇరువది మొదలు అరువది లక్షలవరకు జనసంఖ్యగల డెన్మార్కు, స్విట్జర్లాండు, బెల్జియము, పోర్చుగలు, గ్రీసు, హాలెండు, నార్వే, స్వీడను దేశములకు సైతము విదేశవర్తకమును లేకుండ జేసికొనినయెడల నష్టమున్నది. ఈదేశములయందు ఉత్పత్తియగు వస్తువులలో వ్యత్యాసమంతగా గావ

రాదు. స్వల్పవిస్తీర్ణతను గలిగియుండుటవలనను, శీతోష్ణస్థితిలోను భూసారమునను, భేదమేమియు లేక ఒకేరీతిగ నుండుట వలన, ఈదేశములలో యంత్రకళలకును హస్తకళలకును ఆవశ్యకమైన పలువిధములగు పచ్చిదినుసులు ఉత్పత్తియగుట లేదు. ఇటువంటిదేశములవారు వారికి కావలసిన యావత్తుసరకులను వారే తయారుచేయుటకు పూనుకొనినగాని వీరిశ్రమ నైసర్గికముగ మిక్కిలి యల్పదశయందుండక మానదు.

భూపరిమాణము నపరిమితముగ గలిగియు జనసామాన్యమును తక్కువగా గలవగుటచే బ్రెజిలు, అర్జెంటయిను రిపబ్లికు దేశములు సైతము విదేశవర్తకమును ఆపుచేసినందువలన నష్టము ననుభవించును. కళాపురోభివృద్ధికి కావలసిన ద్రవ్యసాధనము లనేకములు ఈదేశములయందు గలవు. జనసామాన్యము తక్కువయగుట వలనను, ఆదేశవాస్తవ్యులగు నీగ్రోజాతివారు నాగరికతనుగలిగి యుండకపోవుట వలనను, వీరి శ్రమావిభాగము సైతము కొన్నివస్తువులను తయారు జేయుటయందు దక్క మిగిలిన భాగములయందు నీచదశయందే యున్నది.

బెల్జియము హాలెండు దేశములు దేశీయవర్తకముకంటె విదేశవర్తకమునకు ప్రాముఖ్యత నిచ్చుచున్నవి. డచ్చిదేశస్థులు సరకులయొక్క ఎగుమతి దిగుమతుల వలననే ఐశ్వర్యవంతులైరి. వీరికిసరకులను రవాణాచేయుటయే హెచ్చులాభకరముగా నున్నది. నార్వేదేశస్థులన్ననో వారికికావలసిన పెక్కువస్తువులను పైదేశములనుండియే తెచ్చుకొనవలసి యున్నది. వీరితరదేశముల కమ్ము వస్తువులు చాలతక్కువ. డెన్మార్కు



స్విట్జర్లాండు మొదలగు దేశములు సైతమార్థిక విషయమున నీస్థితియందే యున్నవి.

## రక్షణ అవసరమగు స్థితిగతులు.

వైశాల్యమునందును జనసంఖ్యయందును పైనపేర్కొనబడిన రాజ్యములకన్న వేయిమడంగు లధికముగానున్న రషియా, అమెరికా సంయుక్తరాష్ట్రములు మున్నగుదేశములకు విదేశ వర్తకముకంటె, దేశీయ వర్తకాభివృద్ధియే సకలైశ్వర్య దాయకంబు. ఆర్థికవిషయముల గమనించిన నీరెండు దేశములును శీతోష్ణస్థితియందును, నైసర్గిక స్వభావమందును, సుక్షేత్రములను, కళాకౌశలమునకును వాణిజ్యనైపుణికిని వలయు సకల సాధనములను గలిగి వెవ్వేరు ప్రపంచములవలె గన్పట్టుచున్నవి. ఈదేశస్థులు వారికి గావలసిన సకలవస్తుసముదాయమును వారే సంగ్రహించు నిమిత్తము ప్రయత్నములు సల్పుటకు వలయు నవకాశములు పెక్కులు. కాన నీదేశములకు విదేశవర్తకము ఏమియు లేకపోయినను, స్వదేశవర్తకమే వీరి నైశ్వర్యవంతుల జేయుటకు జాలును.

ముప్పదియొక్కకోట్ల ఏబదిలక్షుల ప్రజలనుగలిగి పదునేడుకోట్ల ఏబదిలక్షుల చదరపుమైళ్ళ విస్తీర్ణతను గలిగియున్న మన ఇండియారాజ్యమును సైతము ఆర్థికవిషయముల పట్ల నొక ప్రత్యేక ప్రపంచముగనే పరిగణించవలసి యున్నది. సుమారెనిమిదికోట్ల ప్రజలను గలిగిన అమెరికా సంయుక్త రాష్ట్రములకే విదేశవర్తకముకన్న, స్వదేశవర్తకము లాభకారిగా నుండునపుడు, మనహిందూదేశమున దేశీయవర్తకమునకెక్కువ ప్రాముఖ్యత నీయవలెనని వేరె నుడువవలయునా!

అమెరికనులు రక్షణ నవలంబించినవారై వారిదేశీయ వర్తకమును విజృంభింప జేసినవారగుటయేగాక పరరాష్ట్రములవారితో సైతము వాణిజ్య వ్యాపారములను నడుపుచునే యున్నారు. కాన మనదేశపురోభివృద్ధికి సైతము రక్షణత్వ మావశ్యకమని కన్పట్టుచున్నది. మనకు పరరాష్ట్రములతో వాణిజ్యవ్యాపారములు లేకపోయినను, మనస్వదేశ వర్తకము నభివృద్ధి చేసికొని మనకుకావలసిన సరకులనన్నిటిని మనమే జాగ్రతపరచుకొనుటకు ప్రయత్నములు చేయవలయును. ప్రప్రథమమున రక్షణత్వావలంబన మున్నగాని మనయుద్యమము నెరవేరదు.

## ఇండియాదేశమునకు రక్షణ సాధ్యమా ?

మన భరతఖండమున కార్థికవిషముల పట్ల పరదేశములనుండి సంపూర్ణ స్వాతంత్ర్యము కలుగునట్లు చేయుటకనకాశములున్నవా లేవా యనుసంగతి మన మాలోచించవలసియున్నది. తగుపరికరముల నన్నిటిని మనము కలిగియుంటిమని ముమ్మాటికిని నొక్కి చెప్పగలము.

ఏలననగా మన భారతరాజ్యరమారమణి అపారమైన సంపదను గలిగియున్నది. ఆశ్చర్య జనకమగు కృషివాణిజ్య లోహాది ద్రవ్యసాధనములు పెక్కులు మనదేశమున స్వయంభువులు. అయిన ప్రస్తుతమవి చాలవరకు ప్రచ్ఛన్నములు. ప్రశస్థమైన బొగ్గుగనులు, నాడెమైన కిరసనాయిలు(Petroleum) అపారమైనకలప, మనదేశమునగలవు. ప్రశస్థమైన ఇనుపగనులు దేశమంతటను వ్యాపించియున్నవి. ఇనుముయొక్క పరిశుద్ధతనాలోచించిన, ఇంగ్లాండునందలి ఇనుపవర్తక యాజ



మానులకుసైతము నోరూరకమానదు. మరియొక విశేషమేమన పెక్కుస్థలములయందు పరిగ్రహణమునకు, విశేషశ్రమయవసరములేకుండ పైభాగమునందే యున్నది. ప్రశస్థమైన డామస్కసు కత్తులను తయారు చేయుటకు సైతము పనికివచ్చెడు ఉక్కును, మేంగనీసు గనులును కుప్పలుగా మనదేశమునం దున్నవి. ఇంతేగాక బంగారు, వెండి, సత్తు, సౌవీరము, సీసము, రాగి, సున్నము, రత్నములు మొదలగు లోహము లీదేశమున పెక్కులుగలవు. ఒక్క లోహాదులేగాక సకలవిధములైన ఆహారపదార్థములను ఈదేశముకలిగియున్నది. మృదువున కాస్ట్రేలియా దేశపుపంటకు సమానమగునవియు మోటుతనమునకు కాబాంకాదేశపు పంటకు సరివచ్చునవియు నగు గోధుమలు ఈదేశమున పైరగుచున్నవి. నూనెగింజలు, పొగాకు, తేయాకు, కాఫీ, పంచదార, వాసనద్రవ్యములు, లక్క, రంగులు, ప్రత్తి, జనుము, గోగు, అవిశనార, కొబ్బరిపీచు మొదలగు అన్నిరకముల సరకు గలవు. వేయేల! వర్ణనాతీతమగు పెక్కుదినుసు లీదేశమునగలవు.

ఇక దేశప్రజలన్ననో మితవ్యయమును పోణిమినిగల వారగుటయేగాక శ్రద్ధగాపాటుపడువారును, ఎంతటి దేహశ్రమకైన నోర్చువారును, వినయవిధేయతలుగల వారును, ఎద్దానినైన బోధపరచిన సులువుగా గ్రహించువారును, సూక్ష్మబుద్ధినుపయోగపరచి నాజూకైన పనులు నెరవేర్చుటయందు సైతము కళాకౌశలము గలవారునై యున్నారు. కర్మకరుల వేతనములా, కారుచౌక! క్షేత్రమా చాలవరకు అద్భుతమైన ఫలోత్పాదక శక్తిని గలిగియున్నది.

ఇండియా దేశపు ఆర్థిక భూగర్భశాస్త్రమున 'బాల్' అను నొక యాంగ్లేయపండితుడిట్లు వ్రాయుచున్నాడు. "ఇండియా దేశము, ప్రపంచమునంతటినుండి ఏసంబంధములేకుండ వేరు చేయబడినప్పటికిని, లేదా ఇతరదేశములయొక్క పోటీనుండి ఆదేశమునందు ఉత్పత్తియగు లోహాదులను గాపాడినచో, ఆదేశమునకు వలయు సర్వఖనిజములను తానే సరఫరాచేసి కొనుటకుతగిన సామర్థ్యమున్నదని నుడువుటకు ఎవ్విధమైన అనుమానమును లేదు."

లోహప్రపంచము నందేగాక సకలవస్తు సముదాయమును ఉత్పత్తిచేయుటకు సైతము ఇండియాదేశము తగియున్నది. అమూల్యమైన బొగ్గుగనులను ఇనుపగనులను గలిగియుండుటయేగాక, యంత్రకళాభివృద్ధి కావశ్యకమైన విద్యుచ్ఛక్తిని జనింపజేయుటకు మనకొండలనుండి ప్రవహించెడు నీరును ఆకట్టుటకు చాల యవకాశమున్నది. టాటా అండు సన్సువారు బొంబాయి రాజధానిలో లోనవ్లాయొద్ద నొకగొప్ప విద్యుచ్ఛక్తి జనితస్థానమును నిర్మించినారు. దీనిచే ఆవిరిశక్తి వలన నడుపబడుచున్న యంత్రములకు నిప్పుడు తక్కువఖర్చునకే ప్రశస్తమైన విద్యుచ్ఛక్తి లభించుచున్నది. ఇది ద్రవ్యవిషయముననే గాక ఆరోగ్యవిషయమున సైతము గొప్పలాభము.

ఇదివరకు మనము దేశాభివృద్ధికి అవసరములైన ప్రకృతినిగురించియు, శ్రమనుగురించియు చర్చించి యున్నాము. ఇకమూలధనము సంగతి నాలోచించవలసియున్నది. మనదేశమున సైతము కావలసినంత మూలధనమున్నది. కోట్లకొలది ధనముపయోగమునకు తీసికొనిరాబడకుండ పాతరబడియున్న



దనుమాట యెంతవరకు నిజమైనప్పటికిని, టాటాఅండు సన్సు వారివలన స్థాపింపబడిన విద్యుచ్ఛక్తియంత్రములకు గావలసిన మూలధనమంతయు మనదేశస్థులే జాగ్రతపరచగలుగుట శుభసూచకము. ఇంతియగాక మనకుగావలసిన ధనమును మనమితరదేశములనుండి అప్పుతీసికొనవచ్చును. మన మేకళాభివృద్ధికి ఆధనమును వెచ్చించనెంచితిమో, రక్షణవలన నది వృద్ధియై లాభకారి యగునని తోచునపుడు మనకప్పు పుట్టకపోదు. ఈవిషయమున ప్రభుత్వమువారి సహాయమావశ్యము.

మూలధనము కళాభివృద్ధికి ఆవశ్యకము. అయిన నేమార్కెట్టులలో దానివ్యాపారమునకు ఆటంకములు గలుగునో, యెచ్చోట పరదేశములయొక్క అపారమైన పోటీవలన వృద్ధిగాంచుటకై పెనగులాడుచున్న కళలు నశించుచుండునో, ఆమార్కెట్లదరికి మూలధనమెన్నడును స్వేచ్ఛగాచొరజాలదు.

సుమారు, నలుబది సంవత్సరములక్రిందట, ఇండియా దేశముయొక్క కళావాణిజ్యముల విస్తరింపజేయుటకును, గవర్నమెంటువారికి కావలసిన రివిన్యూ (రాబడి)నువృద్ధిచేయుటకును, అమితమగు నేలపన్నును కొంతవరకు తగ్గించి కృషిని వృద్ధిచేయుటకును, వీలుగలుగునిమిత్తము, రక్షణశుల్కములవిధించుట చాలసౌకర్యమును, అత్యవసరమునునై యున్నవని సర్ లెపిల్ గ్రిఫిను, గారొక పక్షపత్రికయందు వ్రాసియున్నారు. ఈయుద్దేశము నెరవేరుటకుగాను రక్షణపన్నులు న్యాయముగా ఇండియా దేశమునందు విధింపబడవలెననియు, అందువలన దేశమునకు లాభకరమనియు వీరు అభిప్రాయపడిరి.

"అయిన సీవిషయము, ఇంగ్లాండునందలి ఇంగ్లీషు ప్రజలచేత పరిష్కరింప బడగూడదు. ఇండియా గవర్నమెంటు వారివలన, ఇండియా దేశస్థులయాశయములను మనసునందిడు కొని నిర్ణయింపబడవలెను." సర్ గిల్బర్టు మోల్ స్వర్తు.

## రక్షణపన్నులవలన ఇండియాకు నష్టమా ?

మనదేశమున సరకుల దిగుమతి అధికముగ నున్నది. వాటిపై తగుమాత్రము శుల్కమును వసూలుచేసినచో ప్రజలకంత కష్టతరముగా తోచదు. అటులచేయుట మనకళాభివృద్ధికి అపరిమితమైన సహాయము నొనర్చుటయగును. ఇంతియగాక పన్నులధికమగుటవలన భారము మిక్కుటమై క్రుంగుచున్న క్షేత్రముయొక్క భారమును కొంతవరకు తగ్గించి వాటికి సదుపాయము చేయగలుగుదుము. ఈమార్గము నవలంబించుటవలన తగులుబడి మొదట కొంచము అధికమయినను దేశముయొక్క ఫలోత్పాదకశక్తి రానురాను అధికమై, ఐశ్వర్యము వృద్ధియగును. ఈపన్ను ఆహారపదార్థములయొక్క వెలలను హెచ్చుచేయ జాలదు. ఎందువలన ననగా మనదేశమునందు వినియోగమునకు కావలసిన రాసిసితీసివేయగా, మనమేటేట 78,000,000 ఇంగ్లీషు బారువల ఆహార పదార్థముల నితర దేశముల కెగుమతిచేయుచున్నాము. మఱొక విశేషమేమన, వ్యవసాయవృత్తినే జీవనాధారముగాగల కూలివాండ్రు సదా ఉపయోగించెడు చిన్నచిన్న చిల్లరవస్తువులయం దెవ్విధములైన మార్పులును గలుగనేరవు.



మఱియు రక్షణపన్నులు తగుమాత్రములుగ వేనిపై విధింతుమో ఆవస్తువులయొక్క ఖరీదు విశేషముగ హెచ్చదని అనుభవమువలన తేలుచున్నది.

"సాధారణముగా దేశమునం దుత్పత్తియగుచున్నవియు లేదా ఉత్పత్తిచేయుటకు వీలయినవస్తువులు, టారిఫ్ (దేశములో తయారగు వస్తువులపై విధింపబడుపన్ను) తగుమాత్రమై ఆటంకకరముగా లేనపుడు ఉత్పాదకశక్తి యభివృద్ధిజెందును. అనేకమందికి ఆవస్తువునే తయారుచేయుటయందు ఇచ్ఛజనింపజేసి పోటీని ప్రబలముచేయును. అందువలన పరదేశములయొక్క గుత్తలు నశించక మానవు. ఇంతియగాక కొన్నికొన్ని సందర్భములయందు శుల్కము విధింపబడిన వస్తువులయొక్క వెలలు సైతము తగ్గునని రాజ్యాంగతంత్రమునందొక సిద్ధాంతము కలదు.

ఆవస్తువు దేశమునం దుత్పత్తియగునది కాకపోయినను, దేశమునం దుత్పత్తిచేయుటకు వలనుపడనిది యైనను, లేదా దానిపై విధింపబడిన శుల్కము ఆమదినములయం దాపదార్థమును ఉత్పత్తిచేయుటకు ఆటంకకరమగునంత హెచ్చయినయెడల, ఆపన్నుమాత్రమే వస్తువుయొక్క ఖరీదును అధికము చేయును.

అమెరికా సంయుక్త రాష్ట్రములయందును, యూరపుఖండమునందును గూడ వర్తకపన్ను విధింపబడిన తరువాత ఆవస్తువుల యొక్క ఖరీదులు హెచ్చగుటకు బదులు అనేక సందర్భములయందు తక్కువకూడ అయినవి.

మెక్కిన్లీ టారిఫ్ (నిరకునామా) విధింపబడిన తరువాత సదా ఉపయోగములోనున్న పదునొకండు వస్తువులయొక్క ధరలు పూర్వముకన్న తగ్గెనని 2 వ అక్టోబరు 1891 సంవత్సరపు "అమెరికను ఏకనామిష్టు పత్రిక" ఒకపట్టీని ప్రకటించినది.

"దురదృష్టవశమున, సాధారణముగా స్వేచ్ఛావర్తకామోదమువలన అపారమైన లాభము కలుగుననెడి బ్రిటిషు ప్రజలును ఇంగ్లీషు రాజ్యనీతియును ఇండియా దేశముయొక్క యాశయములను గమనించుటలేదు.''

అనుల్లంఘ్యమైన రక్షణత్వము పూనియే కదా గ్రేటు బ్రిటను, కళావాణిజ్యములయందు ప్రపంచమునందలి యెల్ల దేశములలోను ప్రాముఖ్యత గాంచుటకును, అన్ని దేశములకంటె ముందుగా మూలధనమును విశేషముగా జాగ్రతపరచి ఇతర దేశములకు పెట్టుబడి పెట్టగలుగుటకును వీలలవడినది. 1846 సంవత్సరమున స్వేచ్ఛావర్తకము నామోదించుటకు పూర్వము ప్రపంచమందలి మార్కెట్లన్నియు ఇంగ్లాండుయొక్క స్వాధీనమందుండినవి. ఇంతియగాక తన బొగ్గు వ్యాపారమునందును, నేతకళయందును, ఇనుప కళలయందును రక్షణత్వము నవలంబించి వృద్ధిచేసినదగుటయేగాక ఆకళలయందు పూర్ణముగా, గుత్తనుగూడ సంపాదించగలిగినది.

ఇంగ్లండు దేశ మొక్కటియే స్వేచ్ఛా వర్తకము నామోదించిన దేశమైయున్నది. కళావాణిజ్యముల యందు ఇంగ్లండునకుగల ప్రాధాన్యము రానురాను తగ్గుచున్న దను మాట ఎల్లరకు విదితమే. మూలధనమును సర్వదేశములకు



మొదట పెట్టుబడి పెట్టినదగుటచేత, అందువలన వచ్చెడి అధికమగు వడ్డీవలననే హెచ్చుసంపద ననుభవించుచున్నది.

బ్రిటిషు సామ్రాజ్యమునందలి ఆస్ట్రేలియా, కెనడా న్యూజిలాండు దేశములు సైతము రక్షణనవలంబించి వృద్ధిజెందుచున్నవి.

అమెరికాసంయుక్త రాష్ట్రములయందు రక్షణశుల్కములు విధింపబడిన కాలములయందు కలిమిహెచ్చుగుటయు నవి త్రోపుడుచేసినపుడెల్ల వర్తకము క్షీణించుటయు దుఃఖము హెచ్చుగుటయు తటస్థించుచు వచ్చినది.

ఇంగ్లాండునందు గత నలుబది సంవత్సరములలోను, విధింప బడినపన్ను రెండింతలధిక మగుటయేగాక ఏటేట అపరిమితముగ వృద్ధియగుచున్నది. 1870,88 సంవత్సరముల మధ్య ఇంగ్లాండునందు నూటికిరువదినాలుగు రూపాయల చొప్పున, పన్ను హెచ్చయినది. అయిన, ఈకాలముననే అమెరికా సంయుక్త రాష్ట్రములయందు నూటికి పదిరూపాయల చొప్పున పన్నుతగ్గినదని మెక్కిన్లీగారు నొక్కివక్కాణించిరి.

## బిస్మార్కుప్రభువు దూరదృష్టి.

స్వేచ్ఛావర్తకము నామోదించుటవలన సంభవించెడు నష్టములనుండి, జర్మనుదేశము, బిస్మార్కు ప్రభువుయొక్క దీర్ఘదర్శిత్వమువలనను రాజ్యాంగ తంత్రనిపుణతవలనను రక్షించబడినది.

బిస్మార్కు ప్రభువిట్లు వ్రాసెను:—

"స్వేచ్ఛావర్తకము లాభకారియగుననెడి దృఢమైననమ్మకమునుగలవారమై మేమొక్కరము మాత్రమెల్లపుడు దగాపడుట కంగీకరించము. ఇతరదేశములయొక్క దిగుమతులను స్వేచ్ఛగా మాదేశమునకు రానిచ్చుటవలననే మాదేశము, పరరాష్ట్రములయందు ఉపరిగా ఉత్పత్తిచేయబడుచున్న వస్తువులకెల్ల మార్కెట్టయి (బజారై) మేమువిశేష నష్టముపొందుచున్నాము. అటుల గానిచ్చుటవలననే మాదేశముయొక్క కళాభివృద్ధికి ఆటంకముకలిగెను. ఆర్థికవిషయములపట్ల మేము బలీయులము గాకపోవుటకుగూడ ఈరాజ్యనీతియే కారణమని నానమ్మకము.

మనము కొంతకాలము పైదేశములవారికి మనపణ్యచక్రములయందు చోటివ్వకుండ ఆపుజేసి మనజర్మను కర్మకరులకు, మనజర్మను మార్కెట్టును, జాగ్రతపెట్టుట విధియైయున్నది. శాస్త్రములయందలి కేవలసూత్రములనే పరమావధిగా గ్రహించి వాటికిప్రాముఖ్యత నిచ్చువాడనుకాను; నేనెప్పుడును అనుభవమునే శరణ్యముగాగొని రాజ్యనీతియందు మార్పులొనరించువాడను. రక్షణత్వము నవలంబించియున్న దేశములు ఐశ్వర్యవంతము లగుచుండుటయు, స్వేచ్ఛావర్తకము నామోదించిన దేశములుక్రమముగా క్షీణించు చుండుటయు నేను కండ్లారజూచుచున్నాము.

ఘనతవహించిన ఇంగ్లాండుదేశము సైతముక్రమముగా రక్షణచిహ్నాల పొడచూపు చున్నయది. అలతికాలముననే



ఇంగ్లండు తన స్వంతమార్కెట్టునయినన, తనస్వాధీనముంగుంచుకొనుటకుగాను, రక్షణత్వమునే యవలంబించును. వర్తకపన్నులు తగ్గించినందువలన మన మమితవ్యయమునకు నాహుతియగుచున్నామని నాయభిప్రాయము. (రక్షణలేనిచో) కొలదికాలములో రూపరి నశించెదమేమో యనికూడ నాకు తోచెడిని."

బిస్మార్కు ప్రభువుయొక్క సదుద్యమ మాదేశీయుల యామోదమును వడసెను. జర్మనీదేశము రక్షణ నవలంబించెను. ఇపుడాదేశమెంత యత్యాన్నత్యదశయందున్నదో చూచుచునే యున్నాము.

## కొందరు ఇంగ్లీషు అర్థశాస్త్రజ్ఞుల మతము.

వర్తకమునకు స్వేచ్ఛయుండవలెననియు గవర్నమెంటువారెవ్విధమైన జోక్యమునుగలిగించుకొనగూడదనియు ప్రబలవాదముచేసిన ఏడముస్మిత్తు రాజ్యతంత్రజ్ఞుడు సైతము 'పరరాష్ట్రముల యంత్రకళలను మనదేశమునకు దిగుమతి కానిచ్చితిమేని స్వదేశమందలి కళలకు ప్రాయశః నష్టము గలుగుననియును, వాటిలో కొన్ని పూర్తిగ నశించు ననియును, సూచించి యున్నాడు.

అన్యదేశము లేవియేని తమదేశ సరకులనచ్చటికెగుమతి చేయుటకు సౌకర్యము లేకుండునట్లు విస్తారము వర్తకపన్నులను విధించెనేని, ఆయాదేశములపై వాటికిసమతుల్యమగు పన్నులను వేయనగునని మిల్లుగారును స్మిత్తుగారును అభిప్రాయపడిరి.

ఇండియా దేశముయొక్క కళావాణిజ్యముల విజృంభింపజేసి దేశమును సకలైశ్వర్యముల తులదూగునట్లు జేయుటకు మార్గములజూపుచు **1905** సంవత్సరమున కాశీపట్టణమున జరగిన ప్రథమ 'ఇండియా కళాసభ'యందు సర్ గిల్బర్టు మోలెస్వర్తు కె.సి.ఐ.ఇ. గారు 'ఇండియా దేశమునకు పైదేశములనుండియేగాక ఇంగ్లండునుండి సైతము రక్షణ ఆవశ్యకమని' నొక్కివక్కాణించిరి.

### జపాను ఔన్నత్యము.

గతనలుబది సంవత్సరముల క్రిందటివరకు పేరుప్రతిష్టలు లేని జపానుదేశమిపుడెంత యౌన్నత్య దశయందున్నదో మనమిపుడు కండ్లార జూచుచునే యున్నాము. ప్రపంచమునందలి గొప్పరాజ్యములలో నొకటిగా జపాను శోభిల్లుచున్నయది. ఈపురోభివృద్ధికి ప్రబలకారణము రక్షణ నవలంబించి దేశముయొక్క ఫలోత్పాదకశక్తి నభివృద్ధిచేయుటవలన కలిగినదియే. ఏదేశమున కర్థప్రాబల్యముగలుగునో, ఏదేశము సర్వకళాపరిపూర్తిగాంచి భాగ్యమున కాటపట్టగునో అట్టిదేశము సకలదేశములవలన గౌరవమర్యాదలం జెందుచుండును. ఏదేశమున కళావిజృంభణముండదో, ఏదేశమందలిప్రజలు తమకు కావలసిన సర్వవస్తువులకును పరదేశముల నాశించవలసివచ్చునో, ఆదేశమున దరిద్రదేవత మూర్తీభవించి నిరంకుశాధికారముగ నేలుచుండును. కొంతకాలమునకు ఆదేశము నామమాత్రావశిష్టమగుట చోద్యముగాదు. కాన మనదేశ వాణిజ్యవ్యాపారము లభివృద్ధిగాంచుటకు రక్షణత్వావలంబనమే మనకుశరణ్యము. ఇంతకుదక్క మరివేరుదారి గాన్పించదు.



### రక్షణను మనదొరతనము వారిత్తురా ?

రక్షణత్వమును మనకు గవర్నమెంటువారిత్తురా ఈయరా యనువిషయము నిచ్చోటమనము జర్చించ నగత్యము లేదు. మనదేశక్షేమమునే మనసునందిడుకొని ఇండియా గవర్నమెంటువారు రాజ్యతంత్రము నడిపిరేని మనకు రక్షణనొసగుట వారికి విధియై యున్నది. మన ప్రభుత్వమువారు సైతమిప్పుడిప్పుడు మనకళాభివృద్ధికి వలయు మార్గముల నవలంబించుచున్నారు. ఇటీవల సర్ గైఫ్లీటు వుడ్ విల్సనుగారు గవర్నమెంటువారి రివిన్యూ నిమిత్తము, వెండి, పొగాకు, కిరసనాయలు మొదలగు వస్తువులపై విధించిన శుల్కములు మనకు కొంతవరకు రక్షణనిచ్చునవిగా నున్నవి. రక్షణ పన్నులవలన గవర్నమెంటువారి రివిన్యూకూడ అధికమై, కృషి, విద్యా వ్యాప్తమునకు గావలసిన ధనమునుగూడ సేకరింప నగును.

మన మింతదనుక రక్షణత్వావశ్యకతను గూర్చి ముచ్చటించితిమి. ఇక స్వేచ్ఛావాదుల యాక్షేపణలకు సమాధానముల నీయనగును.

### లీస్మిత్తు గారి వితండవాదములు.

ఇటీవల ప్రొఫెసరు లీస్మిత్తుగారను నొక ఆంగ్లేయ రాజ్యతంత్ర శాస్త్రజ్ఞుడు మనహిందూదేశమునకు విచ్చేసి 'ఇండియా వర్తకప్రశంస' యనునొక గ్రంథమును రచించెను. ఈయన బహుశ్రమ తీసికొని స్వేచ్ఛవలని లాభములను రక్షణవలన గలిగెడి యరిష్టములను విపులముగా జర్చించి, మనదేశపురోభి

వృద్ధికి స్వేచ్ఛయే శరణ్యమని సిద్ధాంతీకరించెను. ఈమహానుభావుని ఆక్షేపణల నొక్కొక్కటిగా విమర్శింతము.

రక్షణ నొసంగుటవలన సరకులయొక్క ఖరీదు హెచ్చయి, వినియోజకునకు నష్టము కలిగించుట తప్ప వేరు ప్రయోజన మేమియు లేదని వీరియుద్దేశము. అన్యదేశవస్తువులపై మనము విధించెడు శుల్కమును, వినియోజకులు భరించవలసి వచ్చునే గాని పరదేశస్థులు అందొక చిల్లిగవ్వయైన ఈయరని వీరిమతము. ఏదేశమైన ఒకానొక వస్తువు నుత్పత్తిచేయుటయందు గుత్తను కలిగియున్నయెడల ఆసరకులు ఖర్చగుటకుగాను పైదేశముల వారు విధించిన రక్షణపన్నును ఇచ్చుకొనవలసి వచ్చును. ఏలయన పన్నునీయనిచో, ఆసరకులు చెల్లుబడి కానేరవు. ఇదివరకు అపరిమితముగ లాభమును సంపాదించిన దగుటచే, ఒక్కసారిగా పైమార్కెట్లయందలి బేరమును విడిచిపెట్టలేదు. ఇపుడు చెల్లించవలసిన పన్నుపోగా శేషించిన లాభమే చాలునని తలచి, వర్తకము మానుకొనుటకన్ననిదియే శ్రేయోదాయకమని ఎంచును. అటుల జేయనినాడు తనకావస్తువుయందు గలగుత్త నశించును. ఒకవేళ మన మన్యదేశములకు పన్ను నేల కట్టవలెనని ఆలోచించినదై వర్తకమునే మానుకొనిన, స్వదేశకళలు ఎవ్విధమైన పోటీలులేక దినదిన ప్రవర్ధమానములగుట కెవ్విధమైన సందియమును లేదు. అందువలన మరియొక లాభముకూడ గలదు. అనేక విధములగు విదేశవస్తువులు కారు చౌకధరలకు మనమార్కెట్లకు వచ్చుచుండుట చూచుచునే యున్నాము. చౌకగా లభించుచున్నవను సంగతి పరిగణించుచున్నాము. కాని సరకులయొక్క నాణ్యమును



మనమాలోచించుటలేదు. అందువలన చాలమంది నష్టపోవుచున్నారు. రక్షణ యున్నచో ఇట్టి నాణ్యము తక్కువగల వస్తువులు మనదేశమునకు రానేరవు.

మనము మరియొక విషయము నాలోచించవలసి యున్నది. లీస్మిత్తుగారు చెప్పినవిషయమే నిజమగుచో, లంకషైరు వ్యాపారస్తులేల మననూలు సరకులపై విధించ బడియున్న యక్సైజుపన్నులను తీసివేయుట కంగీకరించుటలేదు? ఈపన్నువలన గవర్నమెంటువారికి వచ్చురాబడి విశేషమాయనిన, సంవత్సరమునకు నలుబదిలక్షల రూపాయలు మాత్రమే. ఇది ఇండియా గవర్నమెంటువారి మొత్తపు రివిన్యూలో ఎంత స్వల్పమో చెప్పనవసరము లేదు.

### యక్సైజు పన్నులవలని కీడు.

దేశీయ మహాజన సభలయందును, శాసన నిర్మాణ సభలయందును మనప్రతినిధులెంత మొఱ్ఱిడినను, మనప్రభుత్వమువారు లంకషైరు వర్తకుల యాశయములను, మనసున నిడికొని, ఆపన్నులను తీసివేయుటలేదు. లీస్మిత్తు గారికంటె లంకషైరువర్తకులే అనుభవ వేద్యులగుటచే దీర్ఘదర్శులుగా గన్పట్టుచున్నారు. యక్సైజు పన్నులను తీసివేసినయెడల, బొంబాయి నూలు యంత్రకళాశాలలకు రక్షణ కలుగుననియు నేతపనులు విస్తారమై విజృంభించుననియు, అవితల యెత్తుచున్న కొలదితమకు ఇండియా మార్కెట్టునందుగల గుత్తనశించుననియు తెలిసికొనిన వారలై లంకషైరు వర్తకులంగీకరించుట లేదు. సంవత్సరమునకు ముప్పదికోట్ల రూపాయలు విలువగల

నూలుసరకులను మనమింగ్లాండునుండి గ్రహించుచున్నాము. యక్సైజుపన్నులను త్రోసివేసి, దిగుమతి శుల్కములను నూటికైదు రూపాయల చొప్పున విధించితిమేని, అలతికాలమున మనదేశమందలి నేతపనులభివృద్ధి యగును. అందువలన మనదేశమునకు అపారమైన లాభముగలదు. మన బొంబాయి నూలు యంత్రములందు తయారగు సరకులకు చైనాదేశమొక పెద్ద మార్కెట్టు. ఇటీవల రక్షణత్వావలంబన వలన ఐశ్వర్యవంతమై తలయెత్తిన జపానుదేశము, మనకు చైనామార్కెట్టులో పోటీ. యక్సైజు శుల్కములను మన నేతపనులు చెల్లించవలసిన వగుటచే, జపాను క్రమక్రమముగా మనకంటె తక్కువ ధరలకమ్ముటకు ప్రయత్నించుచున్నది. ఈయుద్యమము, చాలవరకప్పుడే జయముగాంచినది. కాబట్టి యక్సైజుపన్నులను తీసివేయని పక్షమున కొలది కాలములో మన వశమున నుండియున్న చైనా మార్కెట్టును, జపాను దేశమునకు సమర్పించి, మీనమేషముల లెక్కపెట్టుకొనుచు కాలము గడుపవలసి వచ్చును.

### దేశక్షేమము ముఖ్యమా ? స్వలాభము ముఖ్యమా ?

దేశక్షేమమునకు హెచ్చుప్రాముఖ్యత నీయవలెనా స్వలాభమునే పరమావధిగా గ్రహించవలెనా యనునంశ మాలోచనీయము. మనమేమార్గము నవలంబించిన మనదేశ మభివృద్ధిగాంచునో, దానినే ప్రతిదేశభక్తుడును శరణ్యముగా గ్రహించి ప్రస్తుత వ్యయ ప్రయాసలకోర్చియైన సఫలీకృత మనోరథుడగుట కర్తవ్యము. శాసననిర్మాణ సభలయందు మన



ప్రతినిధులు ప్రారంభవిద్యను మనదేశమునందెల్లెడల వ్యాపింపజేసి, మనదేశప్రజల నజ్ఞానాంధకారమునుండి విముక్తుల జేయుటకుగాను, ప్రభుత్వమువారికి ద్రవ్యము గావలయుచో, మరియొక పన్నును విధించిన నామోదించెదమని నుడివిన సంగతి యెల్లరెరింగిన విషయమే. కాన రక్షణనిచ్చునెడల, వృద్ధియగునని తోచెడి ఎల్లకళలకును, మనము ప్రస్తుతనష్టమునకునోర్చి రక్షణనీయవలసినదే. ఏలయన మన మెద్దానిని కాంక్షించుచున్నామో, అట్టిదేశీయపురోభివృద్ధికి రక్షణయే దావలము. వినియోజకుడు కొంతవరకు నష్టపోయిన నష్టపోవును గాక! దేశక్షేమమే మనకు శ్రేయోదాయకంబు.

రక్షణత్వము నవలంబించినందువలన దేశమందలి ప్రజలకు పనిని గలుగజేయుననియెడి యాశయమెప్పుడు యుక్తియుక్తము గాదనియును, ఇండియాదేశమున నది కేవలము బుద్ధిహీనతయనియును, లీస్మిత్తుగారి రెండవయాక్షేపణ. కొన్ని కళలు, కర్మకరులే లేక మొఱ్ఱలిడుచుండ, ప్రజలకుపనులు గలిగించవలసిన యవసరమీదేశమున కాన్పించదు. లీస్మిత్తుగారిట్లభిప్రాయపడుటవలన నిజస్థితిని వారు కనిపెట్టినట్టు తోచదు. కొన్నికళలకు కర్మకరులు దొరకుట లేదనినంత మాత్రమున, ఇండియాదేశమునందలి పనులు నిర్వహించుటకుగాను దేశమందలిప్రజలు చాలరనియూహించుట కేవలదురభిప్రాయము.

మనదేశమున ప్రజకు పనిలేక పోవుటచేతనేగదా, ఎట్టియిక్కట్టులనైన బడి, పడరాని బాధలకు సైతమునోర్చి, పైదేశములకు కూలికి పోవుచున్నారు. దేశమునందలి కర్మకరు

లకు కావలసినంతపని మనదేశమున లేదు. అయిన పూర్వాచార పరాయణులగుటచే, పల్లెలనుండి పట్నములకు కర్మకరులు చేరుటకు కొంతకాలము పట్టక మానదు. స్వల్పసంతుష్టులై, ఒకపూటకు త్రాగుటకు గంజియున్న మనప్రజలు ఉన్న యూరినే గనిపెట్టుకొని యుందురు. ఇంగ్లాండునందు వలె పట్నములం బట్టిపోరు. పూర్వము మనదేశమున అధిక యౌన్నత్యముగాంచి, ఇపుడు నశించిపోయిన కళలయందలి పనివాండ్రందరు, ఆవృత్తులను వదలుకొని వ్యవసాయ వృత్తి నవలంబించి యున్నారు. అందువలన కృషినే జీవనాధారముగాగల, కర్మకరులసంఖ్య అధికమయ్యెనన్న సంగతి ఎల్ల రెరింగినదే.

1880 సంవత్సరమున క్షామ బాధల నివృత్తిజేయుటకు నియోగించబడిన సభవారు ఈక్రింది యభిప్రాయము నిచ్చినారు.

"ఈ యీతిబాధలను నివృత్తి జేయుటకునై ఏయేమార్గముల నవలంబించినను, యంత్రకళలను హస్తకళలను స్థాపించుటవలనగాని మరేవిధముననైనగాని, పలువిధములగు వృత్తుల నభివృద్ధిజేసి, ప్రస్తుతము సేద్యవృత్తియం దధికమైన కర్మకరులకు, జీవనాధారముల గల్పించిన తప్ప తృప్తికరముగ నుండజాలదు.

క్రొత్తమార్గముల వేనివేని గనిపెట్టినగాని తగినంత పనిని కలుగ జేయుట కవకాశము లేదు. ఇప్పట్టున నూతన కళల స్థాపించవలెననిన రక్షణ లేనిచో కొనసాగదు. చాల కాలముక్రిందటనే స్థాపించబడి పాతుకొనియున్న కళలతో, ఇప్పుడిప్పుడు తలలెత్తబోవు కళలకు పోటీ, కేవల మసంగతము.



తనతో సమానమైన వానితో పోటీయున్న తగవు లేదు గాని ప్రొఫెసరు రామమూర్తివంటి వస్తాదుతో ఒకమరుగుజ్జువాడు కుస్తీకివచ్చినయెడల గెలచుట కవకాశమున్నదా? కాబట్టి రక్షణలేనిచో క్రొత్తక్రొత్తకళల స్థాపింపవీలులేదు. అటులే స్థాపించినగాని మన కర్మకరులకు తగినంత జీవనోపాధి లేదు, కాన రక్షణ ఆవశ్యకము.

## రక్షణ అవసరము.

రక్షణను అవలంబించుటవలన, వినియోగకులకు కొంతవరకు కష్టతరముగా నుండుననుమాట మేముకాదనము. అందువలన వారు కొంతవరకు వ్యయప్రయాసలకు నోర్చవలెనను మాటగూడ సత్యమే. దేశక్షేమము కొరకు తగుమాత్రము వ్యయప్రయాసలకు నోర్చవలెననిన నెవరు కాదనగలరు? మన ప్రభుత్వమువారు సైతమిటీవల మనకళలకు రక్షణనీయవలెనను యుద్దేశముల గనబరచుచునే యున్నారు. సాధ్యమైనంతవరకు గవర్నమెంటువారి ఉపయోగమునకు కావలసిన సకల వస్తువులను మనదేశమునందే కొనవలసినదని స్థానికప్రభుత్వముల నాజ్ఞాపించినారు. ఇంతియగాక, మనకృషి వాణిజ్యాదులను వృద్ధిచేయుటయందు గవర్నమెంటువారు వెచ్చించుచున్నద్రవ్యము, అనేకమార్గముల ప్రజలనుండియే సేకరించబడుచున్నది. మనము చెల్లించుచున్న పన్నులవలననే ఈద్రవ్యము సమకూర్చబడుచున్నది. కాన దేశీయకళలు వృద్ధినొందుటకు, రక్షణ పన్ననెడి వేరొకపన్నును గవర్నమెంటువారు విధించినచో నేమిహానియున్నది? మనమీవిధముగ నాలోచిం

చినయెడల, వినియోజకులకు కష్టముగా తోచుననియెడిసంగతి కంత ప్రాముఖ్యతనీయవలసిన యగత్యముండదు. ఏలయన దేశీయకళలు వృద్ధిగాంచుటకును, ప్రభుత్వమువారి వచ్చుబడి హెచ్చయి మనకు క్షేమకరములగుపనుల నెన్నిటినో వారవలంబించుటకు వీలలవడుటకును, రక్షణ పన్నులను గూడ నొకపన్నుగనేభావించి మనమువహించుట యవశ్యకర్తవ్యమై యున్నది.

వాణిజ్య వ్యాపారములయం దెవ్విధమైన నిర్బంధము లేకుండ, స్వేచ్ఛయేయుండి తీరవలయునని నిష్కర్షగావాదించు, స్వేచ్ఛానురక్తులుసైతము, శైశవ దశలయందున్న కళలకు రక్షణ నీయుట యవసరమని అంగీకరించి యున్నారు. వీరిలో జాన్‌స్టూఆర్టు మిల్లు అనునొక ఆంగ్లేయరాజ్యతంత్రశాస్త్రజ్ఞుడు విస్తారము మెప్పువడసినవాడు. రక్షణలేనిచో, అన్యదేశకళల పోటీలవలన అభివృద్ధిగాంచుటకునై పెనగులాడుచున్న కళలు నశించునను సంగతి నిర్వివాదాంశము. మనదేశమందలి కళలన్నియు ప్రస్తుతము శైశవదశయందే యున్నవి. కాన రక్షణ ఆవశ్యకము.

దీనికి స్వేచ్ఛావాదులొక యాక్షేపణను జేయుచున్నారు. ఒకప్పుడు శైశవదశయందున్నదని యెంచి మనము రక్షణ నిచ్చుచో ఆకళ ఎల్లప్పుడు శైశవదశయందే యుండుననియును, ఆకళ బాగుగా వృద్ధిజెందిన తరువాత నైనను మనము రక్షణ తీసివేయుదమన్న అందువలన ధనికులైనవారు అడ్డుపెట్టుచుందురనియును, ఒక కళకు రక్షణ నొసంగుచో దేశము



నందలి సర్వకళలకు రక్షణ నీయవలసి వచ్చుననియును, అటుల జేయుటవలన వినియోజకులకును దేశమునకును గూడ నష్టము గలుగుట తప్ప వేరులాభము లేదని వీరి మతము. ఈవాదమున కొంతవరకు సత్యములేక పోలేదు. రక్షణవలన నష్టములును గలవు. ఏమార్గము నవలంబించుట వలన మనదేశము సర్వకళాపరిపూర్తిజెంది ఐశ్వర్యోన్నతి గాంచుననుసంగతి మన మాలోచించ వలసియున్నది. ప్రస్తుత నష్టములెన్నియున్నను, రక్షణ లేనిచో మనకళలు వృద్ధినొందవనుసంగతి ఎల్లరు నెరింగిన విషయమే!

మనకళాభివృద్ధికి రక్షణయొక్క అవసరము లేకుండ వేరొండుమార్గమును, స్వేచ్ఛానురక్తులు చూపిరేని ఆమోదించుటకు మాకెవ్విధమైన యభ్యంతరమును లేదు. అదిమాకుపరమ సమ్మతము. వారితరమార్గమును సూచించగలుగుదురా? అటుల జేయనినాడు వృధాయాక్షేపణల వలననేమి ప్రయోజనము. ఏదైనకార్యమును నిర్వహించుట కష్టముగాని ఆక్షేపణలను జేయుట చాలసులువు. మన మేదేశచరిత్రలను జదివినను రక్షణలేక ఒక్కకళయును వృద్ధిజెందినట్లెచ్చటను గానరాదు. స్వేచ్ఛావాదమునకు జన్మభూమియగు ఇంగ్లండు దేశముసైతము అనుల్లంఘ్యమైన రక్షణనూనియే ఇంతఘనత వహించెననుసంగతి అందరెరింగినదే! అయినరక్షణ నాచంద్రార్కముగా మనదేశము కలిగియుండవలయునని మామతముకాదు. కళాపరిపూర్తియగు నంతవరకుమాత్రమే రక్షణను దాల్చవలెనని వెనుక చెప్పియేయుంటిమి. అటుపిమ్మట మేమును ప్రబలమైన స్వేచ్ఛావాదమును చేయుటకు సర్వసద్ధముగా

నున్నాము. కాబట్టి ఆర్థిక విషయముల నాలోచించినను, జాతీయ గౌరవము నాలోచించినను, రక్షణలేనిది మనదేశమభివృద్ధి జెందజాలదు.

అన్యదేశీయులయొక్క పోటీలేనినాడు మనప్రజలు సోమరిపోతులై, రక్షణయున్నదిగదా మనకళలకేమిభయమని విఱ్ఱవీగి చెడిపోదురనియును, ఆకారణమువలన క్రమక్రమముగా కళలుసైతము క్షీణించుననియును మరియొకయాక్షేపణ. ఇది కేవల పరిహాసాస్పదముగాని వేరొండుగాదు.

ఏమన, మనకళలయందు కళయున్నగదా ఆకళక్షీణించునని మనము భయపడవలెను. అట్టికళయే లేనప్పుడు మనమేల జడియవలెను? ఇంతియగాక రక్షణనుగలిగియున్న జపాను, జర్మనీ, ఆస్ట్రేలియా, కెనడా దేశస్థులు సోమరి పోతులుగా నుండిరో, శౌర్యధైర్యములను కలిగియున్నారో మనముచూచుచునేయున్నాము. కాననిదియొక పిచ్చియాక్షేపణ. దీనిని ఖండించుటకునై మనమంతగా శ్రమపడ నగత్యములేదు.

మనకళలు రక్షణయున్నగాని వృద్ధిజెందనేరవనియును, కేవలఆర్థిక సంపదకేగాక జాతీయగౌరవమునకు సైతము కళాప్రపంచమున పరరాష్ట్రములనుండి స్వాతంత్ర్యమున్నగాని వలనుపడదనియును మనమింతదనుక చర్చించితిమి.

రక్షణనొసంగునెడల అన్నికళలును వృద్ధిజెందును. అయిన ఏకళకు రక్షణనిచ్చునెడల మనకునష్టములేకుండ వృద్ధియై దేశమునకు క్షేమకరముగనుండునో వాటినిగూర్చి విమర్శింతము.



ఏఁటేట మనమింగ్లండు దేశమునుండి సుమారు ముప్పది కోట్లరూపాయలు విలువగల నూలుసరకులను గ్రహించుచున్నాము. యక్సైజుపన్నులను త్రోపుదుచేసి నూటికయిదు రూపాయలచొప్పున ఇంగ్లండునుండివచ్చెడి బట్టలపై శుల్కముల • విధించితిమేని, మనదేశమునందు ఖర్చుకు గావలసిన బట్టలనెల్ల మననూలుయంత్రములే తయారుచేయుటకు వీలలవడును. ఇందువలనప్రజకును దేశమునకునుగూడ చాలలాభమున్నది. యక్సైజుపన్నులను త్రోపుదుచేయుటవలన, చీనాజపాను దేశములయందు మనకుగల నూలువర్తకము సైతము హెచ్చగును.

మనఖర్చుకు కావలసినంత ప్రత్తిమనదేశమున పైరగుచున్నది. రక్షణనుకంవారమై అన్యదేశీయులపోటీని లేకుండజేసితిమేని మనము వస్త్రములకొరకు గ్లాస్గోనుగాని, మ్యాంచెష్టరునుగాని, ప్రార్థించవలసిన యవసరముండదు. తొలుదొల్తమనకు నాణ్యమైన వస్త్రములు లభించక పోవచ్చును. మాన రక్షణార్థముగదా వస్త్రధారణ! దేశక్షేమము కొరకు కొంతకాలము మోటైన వస్త్రముల ధరించవలసి వచ్చినను మనము సహించుట యవశ్యకర్తవ్యము.

ప్రతి సంవత్సరమును కోట్లకొలది రూప్యములవిలువ గలచర్మములను మన మన్యదేశములకు నెగుమతి చేయుచున్నాము. రక్షణనిచ్చిన మనతోళ్ళవర్తకము వృద్ధికాకపోదు. పట్టుపనులకును ఉన్నిపనులకును కాగితపు పనులకునుగూడ

సాధనసంపత్తి మనదేశమునగలదు. ప్రభుత్వమువారు రక్షణ నొసంగకుండుట, ఒకటియే వీటిపురోభివృద్ధి కాటంకము.

ఇంగ్లీషు మార్కెట్టునందు ఖర్చగుచున్న తేయాకు చాలవరకు చీనాదేశమునుండి ఎగుమతి చేయబడుచున్నది. కనుకదానిపై పన్నువిధింప బడెనేని మనదేశపు తేయాకు ఇంగ్లాండునందు హెచ్చుగాఖర్చగును.

చుట్టలును సిగరెట్లును పరరాష్ట్రములనుండి అపరిమితముగా మనదేశమునకు వచ్చుచున్నవి. రక్షణ నవలంబించితిమేని మనపొగాకువర్తకము విస్తారముగా అభివృద్ధియగును.

గాజుపనులను రంగులను అగ్గిపెట్టెలనుకూడ రక్షణను ధరించి మనదేశమున తయారుచేయ గలుగుదుము.

మనదేశీయ పురోభివృద్ధికి స్వేచ్ఛయేశరణ్యమని వాదించిన ప్రొఫెసర్ లీస్మిత్తుగారు సైతము ఇనుపపనులు రక్షణను దాల్చుటవలన హెచ్చుప్రాముఖ్యతను వడయుగలవని వక్కాణించిరి.

లోహప్రపంచమునందు మనదేశము రక్షణనుదాల్చి సంపూర్ణ స్వాతంత్ర్యమును గాంచగలుగునని బాల్ అనునొక ఆంగ్లేయశాస్త్రజ్ఞుని యభిప్రాయమును ఇదివరకే సూచించియున్నాము.

కర్జనుప్రభువు గవర్నరు జనరలుగానుండు కాలమున, విదేశములనుండి ప్రభుత్వసహాయమువడసి దిగుమతిచేయబడుచున్న చక్కెరపై ఆసహాయమునకు తుల్యమగు పన్నులు



విధించబడెను. ఏటేట పదికోట్లరూప్యముల విలువగల చక్కెరను మనము విదేశములనుండి గ్రహించుచున్నాము. దీనిపై శుల్కమును విధించితిమేని కొంతవరకు పోటీతగ్గి, మనదేశమున తయారగు చక్కెరకు రక్షణగలుగును. ఈచక్కెరపై పన్నువిధించుటవలన గవర్నమెంటువారి వచ్చుబడిసైతము అధికమగుటకు వీలున్నది. ఎన్నియో క్షేమకరములగు పనులను గవర్నమెంటువారు ద్రవ్యలోపముచే పూనుకొనుటకు వీలులేక యున్నది. ప్రారంభవిద్యావ్యాప్తియు, కృషికివలయు నీటిని సరఫరాచేయునిమిత్తము క్రొత్తక్రొత్త వాగులను గనిపెట్టుటయు, నదీప్రవాహములకు ఆనకట్టలనుగట్టి క్రొత్తక్రొత్త నీటికాలవలను త్రవ్వించుటయు మొదలగు పనులకు నపారమైన ధనముగావలసియున్నది. నేలపన్నునువృద్ధిచేయుద మనిన నది ఇదివరకే తలమునిగి, తాటిప్రమాణమై యున్నది.

గనుక దిగుమతిపన్నులను విధించుటయే ప్రభుత్వమువారికిని మనకునుగూడ చాలసౌకర్యము. గవర్నమెంటువారిరాబడినిమిత్తము విధింపబడెడు పన్నులనినచో స్వేచ్ఛావాదులేయభ్యంతరమును చెప్పజాలరు. ఈమార్గమును మనప్రభుత్వమువారవలంబించిరేని, తమవచ్చుబడి హెచ్చగుటకును మనకళలభివృద్ధి యగుటకునుగూడ వీలున్నది. ఈసంగతిని మనప్రభుత్వమువారు బడ్జెటును తయారుచేయునపుడు గమనించవలసియున్నది. పైదేశములనుండి వచ్చువస్తువులపై ఇదివరకున్న పన్నులుగాక నూటికియిదు రూపాయలవంతున హెచ్చింపబడవలెను.

బియ్యముపై ఇదివరకు మన గవర్నమెంటువారు ఎగుమతిపన్నును విధించియే యున్నారు. జనుము, గోగునారల (జ్యూటు) పై సైతము శుల్కమును విధించుటయవసరము. ఈజనుమునందేమి, ఇతర పచ్చిదినుసుల యందైననేమి, మన దేశమునకు గుత్తకలదు. మనమువిధించు పన్నులనుచెల్లించి తీరవలయును. లేదావారి వ్యాపారముల పూర్తిగగట్టి పెట్టుకొనవలెను. వారేమిచేసినను, మనకుసుకరమే.

ఆహారపదార్థములను మనమపారముగా దేశమునందు కలిగి యుండుటచే, మనమేదేశీయులకును జడియనగత్యము లేదు. వారేమనల నాశ్రయించవలసియున్నది. కాన కళాభివృద్ధికిని దేశక్షేమమునకును రక్షణయావశ్యకము. ఇంతకు దక్క వేరొండుప్రాపులేదు. మనదేశముకూడ కళాపరిపూర్తి గాంచినగాని మనజాతీయగౌరవమునిలచుటకష్టము. బిస్మార్కు ప్రభువు నుడివి నట్లు, కొంతకాలమునకు నామమాత్రావశిష్టుల మగుదుమేమోయని భయము తోచుచున్నది. ప్రభుత్వము వారుమనకట్టిదుస్థితి కలుగకుండ రక్షణనవలంబించి సంరక్షించ వలసియున్నది.



## ఇండియా దేశము ; సామ్రాజ్య సపక్షభాగ సమస్య.

సామ్రాజ్య సపక్షభాగ సమస్యయననేమి? బ్రిటిషు సామ్రాజ్యమునకు జెందిన సకలరాష్ట్రములయొక్క వాణిజ్య పరిశ్రమలసమస్య. ఈసామ్రాజ్యమునందు కెనడా, ఆస్ట్రేలియా న్యూఫౌండుల్యాండు మొదలగు అధినివేశములును ఆశ్రయ దేశమగు మన ఇండియాదేశమును కలవు. సూర్యుడస్తమించని ఈమహాసామ్రాజ్యమున, రక్షణత్వమును అనుల్లంఘ్యముగపూనిన జర్మనీ అమెరికా రాష్ట్రములయొక్క సరకులు ఖర్చగుచుండుటయు ఇంగ్లాండు దేశమునందలి వ్యాపారములు సన్నగిలుచుండుటయును ఆంగ్లప్రజలు కొందరు గమనించి యున్నారు. పార్లమెంటునందలి రెండుకక్షులలోను లిబరలు కక్షువారు స్వేచ్ఛావర్తకము ఉండితీరవలయు ననెడివారు. రెండవకక్షువారు ఏదోఒకవిధమైన రక్షణయున్నగాని దేశమునందలి వాణిజ్యపరిశ్రమలు ఉచ్ఛదశయందుండుటకు బదులు జీర్ణదశకు వచ్చుననెడి అభిప్రాయమును కలవారు. ఈరెండు కక్షులవారును తమతమ ప్రత్యేకమతములు ఇంగ్లాండు దేశీయౌన్నత్యమునకు దావలములని సంపూర్ణమైన నమ్మకమును కలవారు. ఎవరిమతమును వారు జనరంజకముచేసి దేశమునుద్ధరించవలయునని ఆతురతతో నుందురు. స్వేచ్ఛావర్తకమును గురించియు, రక్షణనుగూర్చియు మాచదువరులీవరకు పూర్తిగ గ్రహించి యుందురు.

## సామ్రాజ్య సపక్షభాగ సమస్య యననేమి?

ఇక సామ్రాజ్యసపక్షభాగ సమస్యయనిన నూతన విషయముకాదు. రక్షణపద్ధతియందు ఇదియొక సాంప్రదాయము. దీని ముఖ్యోద్దేశమేమనిన, బ్రిటిషు సామ్రాజ్యమునందలి ఎల్లరాష్ట్రములును ఆయాదేశములయందు తయారైన, అపక్వపదార్థ సంచయమునకేగాక యంత్రకళలు, హస్తకళలు మొదలగు సర్వకళలకును అన్యదేశములనుండి వచ్చెడి సరకులకంటె ప్రాముఖ్యతనీయుట. ప్రాముఖ్యతనీయుటయనగా, ఎగుమతిపన్నులను దిగుమతిపన్నులను విధించుటలో, ఇతర దేశముల దినసులకంటె బ్రిటిషు సామ్రాజ్యమునందలి సరకులయెడల సాదరభావమును గనబరచుట. ఇందులకొక యుదాహరణము:—విదేశవస్తువులపై నూటికి 10 వంతున పన్నువిధించినయెడల, సామ్రాజ్య రాష్ట్రములయందలి అదేసరకుపైని నూటికి మూడవవంతో నాల్గవవంతో, పన్నునువిధించుట. ఇటుల జేయుటవలని లాభమేమనగా, విదేశవస్తువులు ఖర్చగుటకుబదులు, సామ్రాజ్యమునందలి సరకులే హెచ్చుగఖర్చగును. అందువలన విదేశములకుపోవు లాభమంతయు, సామ్రాజ్యమునందే నిలిచియుండుట కవకాశము కలుగుచున్నది.

విదేశవస్తువులపై విధించబడినపన్ను అధికమగుటచే, చౌకధరలకు అమ్ముటకు వారికి వీలు అలవడదు. అందువలన సామ్రాజ్యమునందలి వస్తువులతో పోటీకి ఆగలేకపోవుట తటస్థించును. ఆపద్ధతిని అవలంబించుట వలన సామ్రాజ్యము యొక్క ఆర్థికసంపద ఇంకను విరివియగునని ఈమతముయొక్క అభిప్రాయము.



## యుద్ధ ఆంతరంగికసభ.

ఈసమస్యనుగూర్చి ఇపుడుచర్చించవలసిన అగత్యమేమి కలిగెనని కొందరు ప్రశ్నించవచ్చును. 1917 సం॥ ఏప్రియలు నెలలో ఇంగ్లాండుదేశమున సామ్రాజ్యయుద్ధ ఆంతరంగిక సభ సమావేశమయ్యెను. ఈసభకు అధినివేశనములనుండి ప్రతినిధులు విచ్చేసిరి. మన ఇండియాదేశమునకు ఇండియా కార్యదర్శియగు ఛేంబర్లేనుగారే ప్రతినిధి. అధినివేశములనుండి ఆరాష్ట్రప్రతినిధులు సభకువిచ్చేయగా, ఇండియాదేశమునకు మాత్రము అట్టి ప్రజాప్రతినిధులను పంపుగౌరవ మబ్బలేదు. మనకార్యదర్శిగారికి సలహానిచ్చుటకుగాను ఇండియా దొరతనమువారు సర్ జేమ్సుమెష్టను, (సంయుక్త రాష్ట్రముల గవర్నరు) సర్ సత్యేంద్ర ప్రసన్నసింహా, బికనీరు మహారాజా గార్లనుపంపిరి. ఈసభ యుద్ధానంతర వాణిజ్యవ్యాపార సమస్యలను చర్చించుటకుగాను ముఖ్యముగా సమావేశమైనది. ఈసమావేశమునందు చర్చించబడిన ఇతర విషయములనుగూర్చి మేమిచట వ్రాయబనిలేదు. మనదేశమునకు సంబంధించు ఒకగొప్పతీర్మానము నొకదానిని ఇచ్చటపొందుపరచవలసి యున్నది. ప్రజాప్రతినిధి సభయందు బోనరులాగారిట్లు ప్రకటించిరి:—సామ్రాజ్యమునందలి ప్రతిరాష్ట్రమును, మిత్రమండలివారి వృద్ధినికూడ గమనించుచు, సామ్రాజ్యమునందలి ఇతర భాగములయందు ఉత్పత్తికాబడు అపక్వపదార్థ సంచయమునకును, యంత్రకళలకును హస్తకళలకును, అనుకూలములగు షరతులను ఏర్పరచి సౌకర్యమును కలుగజేయుట పాడియనెడి ముఖ్యసూత్రమును

సామ్రాజ్యయుద్ధ ఆంతరంగికసభవారు ఏకగ్రీవముగా ఆమోదించి యున్నారు.

మన దొరతనమువారు పంపినమెస్టను, సింహా, బికనీరుమహారాజు, ప్రజాప్రతినిధులుకారు. ఆసభయందు మనపక్షమున అంగీకారమును తెల్పినది, అప్పటి ఇండియాకార్యదర్శియగు ఛేంబర్లేనుగారే కాని భారతీయులు ఎవ్వరును లేరు. మన దేశమునకు సంబంధించిన వాణిజ్యవ్యాపార సమస్యయందు, ప్రజాప్రతినిధులు ఎవ్వరును లేకయుండ తీర్మానములు గావింపబడెను. ప్రజాప్రతినిధులు లేకపోయినను సింహా, బికనీరు మహారాజవార్లనైన వారి అభిప్రాయములను అడిగినట్టు తెలియరాదు. వీరు ఇంగ్లాండునందుచేసిన ప్రసంగములలో ఈవిషయమునుగురించి ఎచ్చటనుకానరాదు. ప్రతినిధులనురావించి వారిసలహాను గైకొనకుండ, దేశపురోభివృద్ధికి సంబంధించిన సమస్యలనుచర్చించి తీర్మానములను చేయుటమాత్రము న్యాయముకాదు.

ఈ మహాసంగ్రామము ఇంగ్లాండునందలి ఎన్నియో ఆర్థికన్యాయములను, పరిపాలనా తంత్రములను చెల్లాచెదరు చేసినది. ఈసభవారు తీర్మానించిన మాత్రముననే, ఇంగ్లాండునందలి ప్రజలు తమసానుభూతిని ఈసమస్యకు నొసంగుదురాయనుసంగతి ముందు తేలవలసియున్నది.

## సామ్రాజ్యసపక్షభాగ సమస్యయొక్క చరిత్రము.

1902 సం॥ న ఛాంబర్లేనుగారు తలపెట్టిన మహోద్యమము నేటికి ఫలోన్ముఖమునకు వచ్చినట్లున్నది. బ్రిటిషు ప్రజల



యందు పూర్వముకంటె ఇపుడు ఈసమస్యయందు సాదరభావము హెచ్చగుచున్నట్లు తోచెడిని. ఇండియాదేశముయొక్క విదేశ వ్యాపార బాహుళ్యమును, ప్రాముఖ్యతను కొన్ని సమయములయందు బాగుగ కనిపెట్టినట్లు తోచుటలేదని అధికారవర్గమునకు జేరిన వాణిజ్యపార విమర్శకుడు వ్రాయుచున్నాడు. ఇండియా దేశముయొక్క అన్యదేశీయవర్తక సంబంధమందు ఇండియాదేశముయొక్క ఆశయములను గమనించుట బహు అరుదు. వర్తకవ్యాపార విషయములయందు ఆంగ్లేయ రాజ్యతంత్రజ్ఞులచే ఇండియాదేశము యొక్క ప్రత్యేక వ్యక్తిత్వము ఎన్నడును గుర్తించబడినటుల కానరాదు. యుద్ధానంతర వ్యాపార సమస్యలంగూర్చి, ఇంగ్లాండు దేశమున నెన్నియో సంఘములును సభలును చర్చించుచుండ, ఇండియావర్తక సమస్య విడిచి పెట్టబడుట కడుంగడు శోచనీయము. హాలెండు కమీషనువారు ఈసమస్యనుగూర్చి అభిప్రాయము నొసంగరాదని తీర్మానించబడెను. వాణిజ్యసంఘములకును, వర్తక సమితులకును ఇండియాదొరతనమువారు జారీ చేయించిన ఉత్తరములలో ఇండియావర్తక సమస్య విషయమై తామేమియు అభిప్రాయము నీయ పనిలేదనియును, ఆసమస్య సామ్రాజ్య ప్రభుత్వమువారే నిర్ణయించెదరనియును స్పష్టముగా తెలియపరచిరి. ఈదేశసమస్యలు, పరోక్షమునందు, దేశప్రజల ఎరుకలేకయే చర్చించబడి సామ్రాజ్యప్రభుత్వమువారేమార్గము నవలంబించెదరో, ఈదేశముకూడ దానిని చేతులు మోడ్చుకొని ఆమోదించవలసినదిగా నున్నది. ఇట్టి నీతి న్యాయము కాదని చెప్పక తీరదు.

ప్రథమమున 1903 సం॥ న సపక్షకరమైన పన్నులను గూర్చి ఇండియాదొరతనమువారు, ఇండియాదేశమునకు ఏ మాత్రము లాభకరముగ నుండునో చర్చించవలసిన అగత్యము కలిగెను. అప్పటి ఇండియా కార్యదర్శియగు హామిల్టను ప్రభువు, అధినివేశముల సభయందు సపక్షకరమైన పన్నులను గూర్చి ఆమోదించినట్లును, ఆతీర్మానమును ఆచరణములోనికి గొని వచ్చుటవలన ఇండియాదేశమునకు ఆనీతి ఎటుల పరిణమించునో మీ అభిప్రాయముల నీయవలసినదనియు ఇండియాదొరతనము వారి కొక తంతినంపిరి. స్పష్టముగా ఈసరణిని మేము ఆచరణములోనికి గొని రావలయునని మాయుద్దేశ్యముకాన, మీఅభిప్రాయమేమని, మన దొరతనమువారు కోరబడలేదు.

తమ కొసంగబడిన సమాచారము చాల అస్పష్టముగ నున్నను, ఈన్యాయమును పాటించుటవలన ఇండియాదేశమునకు లాభకరమా నష్టదాయకమా అనుసంగతిని విపులముగ చర్చించిరి. ఇండియాదేశము అధినివేశములతో పాటు ఈనీతిని పాటించుట యుక్తమా అయుక్తమా అను సందర్భమున ఇండియాగవర్నమెంటువారు రెండువిషయములను చర్చించిరి. అందు మొదటిది—స్వతంత్రపరిపాలనమును గలిగిన అధినివేశములతో పాటు సమానహక్కులతో ఇండియా, ఈసమస్యను పాలించుట. ఒకప్పు డవసరమగుచో ఇంగ్లాండునుండియు బ్రిటిషు సామ్రాజ్యమునుండియు దిగుమతి కాబడు వస్తుజాలముపై, స్వదేశమునందలి సరకులకు కొంతవరకు రక్షణ నిచ్చునట్లుగా పన్నులను విధించుచు, సాధ్యమైనంతవరకు తన పరిస్థితులను బట్టి వీలుకలుగునపుడెల్ల సామ్రాజ్య వ్యాపారమునకు అన్యదేశ దినుసులకన్న ప్రాముఖ్యత నిచ్చుటకు ఇష్టపడుట. ఈగత్యంతరమును సామ్రాజ్య ప్రభుత్వము వారామోదించినచో చాల శ్రేయోదాయకమని చెప్ప నక్కరలేదు. బ్రిటిషు దొరతనము వారు ఈస్వతంత్రమును ఈయరని ఆలోచించినవారై, ఇండియాకు లాభకరమయ్యెను, దీనిని గురించి యోచించుటమానిరి. ఈపద్ధతిని త్యజించుచు ఇండియాదొరతనమువారు తమ భావమును ఇటుల వెలిపుచ్చిరి. "పూర్వపు అనుభవమును బట్టి చూడగా, ఇండియాదేశముయొక్క వాణిజ్యవ్యాపార సమస్యల నెపుడు జర్చించినను హిందూదేశముయొక్క హితమునే, ఎన్నడును ఆలోచన చేయుటలేదు. ఇంగ్లాండునందలి కొందరు వ్యాపారస్తుల లాభమునే పరమావధిగ గ్రహించుచున్నారు. హిందూదేశమునందలి కళలకు రక్షణ ఆవశ్యకమైయున్నను, లేదా ఇప్పుడు కోరబడినను, ఆరక్షణ విధానములు ఇంగ్లాండు దేశమునుండి ఈదేశమునకు వచ్చు దిగుమతులను విస్తారముగా బాధించును. కాని అన్యదేశములనుండి వచ్చుదిగుమతులను అంతగా బాధించజాలవు. అన్యదేశ దిగుమతులపై ఇంగ్లాండు నుండి వచ్చెడి దిగుమతులకంటె ఎక్కువ పన్నులను విధించినను, ఇండియాదొరతనమువారు పైని పేర్కొనబడిన రక్షణ పద్ధతిని అవలంబించినయెడల లంకషైరు వ్యాపారస్తులును డండీ వ్యాపారస్తులును అట్టి ఏర్పాటును అంగీకరింతురని గాని లేక బ్రిటిషు ప్రభుత్వమువారీ న్యాయమును ఆమోదించెదరని గాని మేమూహించ జాలము. కావున ఈగత్యంతరమును విడిచిపెట్టవలసి వచ్చినది.

ప్రస్తుతము అమలులోనున్న వానితో సమముగ గాని అంతకన్న తక్కువగాగాని ఇంగ్లాండునుండియు అధినివేశములనుండియు వచ్చెడి సరకులపై రెవిన్యూకుగాను దిగుమతి పన్నులను విధించి, అన్యదేశసరకులపై నూటికి 25 వంతున ఇప్పుడున్న పన్నును హెచ్చుచేయుట రెండప గత్యంతరముగా యోచించబడినది. ఈవిధానమును ఆమోదించినచో ఇంగ్లాండునకు విశేషలాభము కలదుగాని ఇండియాదేశమునకు చూడ లాభమునకు బదులు విస్తారము నష్టము సంభవించునని గవర్నమెంటు వారభిప్రాయపడిరి. బ్రిటిషు వస్తువులయెడల సాదరభావమును గనబరచి సపక్షకరమైన పన్నులను విధించుటవలన, అన్యదేశములు తమ కోపమును దీర్చుకొనుటకునై ఇండియాదేశమునుండి ఎగుమతికాబడు పదార్థసంచయముపై అమితముగ పన్నులను విధించెదరను సంగతిని అప్పటిరాజస్వమంత్రియగు సర్ ఎడ్వర్డు లాగారు గ్రహించి ఈపద్ధతి లాభకరము గాదని ఖండితముగా వాక్రుచ్చిరి.

సపక్షకరమైన పన్నులను మనము విధించుటవలన వాటికి పోటిగా ఎగుమతిపన్నులు అన్యదేశములచే విధింపబడును. అందువలన ఇండియాయొక్క ఎగుమతివర్తకము విశేషముగా హానిజెందకమానదు. అటుల జరగినచో రాజస్వమునకు చాలనష్టము. పూర్వము వెండి కారు చౌకగానుండుటచేత మనరూప్యముయొక్క విలువ స్థిరముగానుండక గడియకొకరీతిని పరిణమించుచుండెడిది. రూప్యమునకు 16 అణాలు విలువగాక 10 అణాలు, 8 అణాలుకూడ అగుచుండెడిది. సవరనులయొక్క విలువ అందువలన అపరిమితముగ హెచ్చుచుండెడిది. అందువలన, సీమఖర్చులకునై ఏటేట ఇండియా సుమారు 20 మిలియన్ల పౌనులు పంపవలసి వచ్చుటవలన, ఇంగ్లాండునకు సవరనులంపుటకు ఎన్నియోరూప్యములు నష్టమువచ్చుచుండెడిది. కర్జన్ప్రభువు సవరనుకు 15 రూప్యములు మూల్యమని నిర్ణయించెదు దనుక, ఇండియా రాజస్వము చాల విప్లవస్థితియందుండుచు వచ్చినది. తిరిగి, అట్టిసందిగ్ధావస్థ తటస్థించునేమోయని, ఇండియా దొరతనమువారు భయపడిరి.



సమస్యనంతయు చక్కగ చర్చించినవారై తమ అభిప్రాయములను ఈవిధముగా వ్యక్తీకరించిరి :—

(1) సామ్రాజ్యసపక్షభాగమతముయొక్క అవలంబన అవసరము లేకుండగనే, ఇండియాదేశము ఎగుమతులయందును దిగుమతులయందును, విశేషవ్యాపారమును చేయుచున్నది. కాన దీని యావశ్యకత అంతగా కానరాదు. (2) ఒకవేళ ఈ సమస్య ఆర్థికన్యాయములనుబట్టి ఆలోచించుటవలన అవసరమైనచో, సామ్రాజ్యమునకు ఇండియాదేశ మొసంగు సహాయము బహుస్వల్పముగాని అధికమేమియు లేదు. ఇందుకు ప్రతిఫలముగా ఇండియాదేశమునకుగలిగెడి లాభము చాలతక్కువ. లాభముమాట అటుండ విశేషనష్టమును పొందగలదు. (3) అన్యదేశములవారు మనసరకులపై విధించెడు పన్నులవలన, మనరాజస్వమంతయు చాలవరకు నష్టమును జెందకమానదు. ఈపద్ధతిని అవలంబించుటవలన ఈ నష్టము లన్నిటికిని ఓర్చి రాజ్యతంత్రమును నిర్వహింతమన్నను, ఇకముందైనను లాభ

కారిగానుండునని మాకు పొడగట్టుటలేదు. కాన నూతనమార్గమునవలంబించుట మాకు సహేతుకరముగ కానరాదు.

ఈ జవాబుతో అప్పటికి ఈ సమస్య విరమించినది. 1913-వ సం॥ వరకు ఈసంగతిని ఇండియా గవర్నమెంటువారు తలపెట్టనవసరము కానరాలేదు. నల్లమందునుండివచ్చెడి ఆదాయము, బ్రిటిషుదొరతనమువారు చీనా ప్రభుత్వమువారితో చేసికొన్న ఒడంబడికవలన తగ్గిపోవునని గ్రహించినవారై, సపక్షకరమైన పన్నులను విధించినచో అధినివేశనములకును, ఇంగ్లాండునకును, హిందూదేశమునకునుగూడ లాభకరముగనుండునుగాన, ఆపద్ధతిని అవలంబింపుడని సామ్రాజ్యశాసన నిర్మాణసభయందు మధ్యపరగణాల ప్రతినిధియగు సర్ గంగాధర చిట్నవీసుగారు ఒకతీర్మానమును ఉపపాదించిరి. అప్పటి కోశాగారమంత్రియగు సర్ గైఫ్లీటువుడ్ విల్సనుగారు ఈతీర్మానమునవలంబించుటయందలి నష్టములను స్పష్టముగా శాసననిర్మాణసభయందు నొక్కివక్కాణించిరి. అంతటితో నేటివరకు ఈ ప్రశ్న తిరిగి ప్రజలమనముల నాకర్షించలేదు. సామ్రాజ్య యుద్ధ ఆంతరంగిక సభవారివలన, ఈసమస్య, భిన్నాభిప్రాయములు ఏమియులేకుండ అంగీకరింపబడినందున మనమీవిషయమునుగూర్చి వివరముగా విమర్శించవలసియున్నది.

## ప్రస్తుతస్థితి.

ఇండియాయందలి అన్యదేశవర్తకముయొక్క విస్తీర్ణతను బట్టి ఈసమస్యను ముందు చర్చింతము. ముందుగా దిగుమతులనుబట్టి యోచింపనగును. ఇండియాకు వచ్చెడి దిగు



మతులు చాలవరకు యంత్రకళలును హస్తకళలును అయియున్నవి. ఎగుమతులన్ననో మూడువంతులకుపైగా అపక్వపదార్థసంచయము. 1906-వ సంవత్సరము మొదలుకొని 1911 వరకు అంతమైన అయిదు సంవత్సరములలోను నూటికి 64-వ వంతు సుమారుగా ఇంగ్లాండునుండియే సరకులు దిగుమతికాబడినవి. ఇతరవిదేశముల సరకులు చాలతక్కువ. జర్మనీ నూటికి నాల్గవవంతును, బెల్జియము నాలుగవవంతును ఆస్ట్రియా, హంగేరీ, అమెరికా సంయుక్తరాష్ట్రములు ప్రత్యేకముగ చెరి మూడవవంతును, ఇతరరాష్ట్రములు అంతకన్న తక్కువగను మనదేశమునకు సరకులనంపినవి. ఈ దేశమునకు దిగుమతి అయిన పరిశ్రమలలో చాలభాగము నూలుసరకులే. 1908-9 సం॥ ముతో అంతమైన మూడు సంవత్సరములలోను సాలునకు సుమారు 67-వ వంతు నూలుసరకులే దిగుమతి అయినవి. స్వదేశమునకు వచ్చెడి నూలునందును, నూలుసరకులయందును ఇంగ్లాండుదేశము గుత్తనుకలిగి యున్నది. విశేషించి ఎల్లకళలయందును నేతకళయే ఈదేశమున రక్షణను కోరుచున్నది. నూలుసరకులయందు, గ్రేటుబ్రిటనునకు పోటీదారులు లేకపోవుటవలన సపక్షకరమైన పన్నులు ఈ సరకులకు అగత్యములేదు. కోట్లకొలది ఆదాయము నల్లమందు ఇజారావలన ఈదేశమునకు వచ్చుచుండెడిది. చీనాదేశముతో జేసికొనిన ఒడంబడికవలన ఆ రివిన్యూ అంతయు గగనకుసుమమైనది. ఎన్నియో దేశక్షేమకరములగు ఉద్యమములను సర్కారువారు ద్రవ్యలోపముచే ఉపేక్షచేయుచున్న సంగతి

తెలిసియేయున్నది. ఇండియా రాజస్వము (ఆదాయము) యొక్కస్థితి యుద్ధ ఋణమునకై ఇండియా దొరతనమువారు ఇటీవల నొసంగిన నూటయేబదికోట్ల రూప్యములవలనను మరింత చీకాకుపడినది. ఏటేట ఆరుకోట్లరూప్యములు ఈఋణమునకు వడ్డీక్రింద ఇండియా చెల్లించవలసియున్నది. ఇట్టి స్థితియందు నూలుసరకులపై సర్కారువారు విధించిన దిగుమతి పన్నులను తీసివేయుటకు వీలుచిక్కదు. ఇంగ్లాండునుండి దిగుమతికాబడు నూలుసరకుల సంగతి నిర్ధారణచేయబడినది. విదేశములనుండి దిగుమతి అగుచున్న నూలుసరకులసంఖ్య చాల తక్కువ కాన వానిపైని అమితములగు పన్నులను విధించినను ఇంగ్లండు దేశపు సరకులకు ఏవిధమైన లాభమును కలుగదు.

దేశీయ మహాజనసభ 1885 సం॥ న ఆరంభమయినది మొదలుగా ఇండియా నూలుసరకులపై విధించబడిన యక్సైజు పన్నులను తీసివేయవలసినదని మననాయకులును ప్రతినిధులును ఏటేట మొరలిడుచునే యున్నారు. బ్రిటిషుప్రజలు ఈమొరలను గమనించి సామ్రాజ్యసపక్షభాగ సమస్యను ఆమోదించినపుడైన ఆపన్నులను తీసివేసి ఇండియా నూలు సరకులయెడల సానుభూతిని చూపుదురా? గ్రేటుబ్రిటనుదేశమున తయారై ఎగుమతికాబడుచున్న నూలుసరకులపై అన్యదేశములు ఎంతయో అధికములగు పన్నులనువిధించుచున్నవి. నూటిముప్పదియవ వంతు మొదలు 250-వ వంతు వరకుకూడ దిగుమతిపన్నులు విధింపబడుచునే యున్నవి. ఆంగ్లేయవర్తక వ్యాపారసరణియందు సంస్కరణములను చేయవలసియున్నదని



ప్రకటించు ఒకటారిఫ్ సంస్కరణ పత్రిక ఇటుల వ్రాయుచున్నది.

'రక్షణను వహించినదేశములప్పుడే మన నూలుసరకులను వారి పణ్యాచక్రములనుండి వెడలగొట్టినవి. మననూలుసరకులకు ముఖ్య పణ్యాచక్రము రక్షణనుపూనిన ఫ్రాన్సు, జర్మనీ, సంయుక్తరాష్ట్రములు కావు. ప్రాగ్దేశములుమాత్రమే. ఆప్రాగ్దేశములయందలి పణ్యాచక్రములు స్వేచ్ఛావ్యాపారమును కలిగి యున్నవి. ఒక్కొక్కచోట కొన్ని నిర్బంధనలుండియున్నను మనసరకులు ఆపణ్యాచక్రములలో స్వేచ్ఛగా ప్రవేశించవచ్చును. మరియు ఇండియాదేశమునందు స్వేచ్ఛావర్తకమును ఎట్టి అభ్యంతరములులేని బాహాటమైన పోటీయును కలదు. అనగా లంకషైరు వ్యాపారస్థులకు ప్రస్తుతము అమెరికాదేశముతోను చైనా, జపానుదేశములతోను పోటీయున్నది.'

ఈవ్రాతయందలి ముఖ్యోద్దేశము, ఇండియాదేశపు పణ్యాచక్రముల నుండి జపాను అమెరికా దేశములయొక్క నూలుసరకులను పారదోలుటయే. ఈయన్యదేశ వస్తువులపై ఇంగ్లాండునుండి దిగుమతికాబడెడి లంకషైరు సరకులకు పక్షపాతమును చూపించవలసినదని టారిఫ్‌రిఫార్మర్ల అభిప్రాయము. టారిఫ్‌రిఫార్మర్లనగా ఇంగ్లీషువర్తక నీతియందు సంస్కరణములు కావించుట అవసరమనివాదించువారు. లంకషైరు వర్తక సంఘము, ఇండియాదేశమున ఇప్పుడే విజృంభించుచున్న నూలుకళయెడలగూడ ఇట్టి అభిప్రాయమునే కలిగియుండవచ్చును. అపక్వపదార్థసంచయము మనఇండియాదేశమున అపరిమితము.

కర్మకరుల వేతనములు కాఱుచౌక. ఈరెండు విషయములయందును లంకషైరుకన్న ఇండియాకు ఆధిక్యత యుండుటవలన దానికి ప్రతిహతముగా యక్సైజుపన్నులను విధించి తీరవలయునని లంకషైరు వాదించగలదు. ఈపన్నులు ప్రస్తుతము అమలులోనేయున్నవి. స్వదేశమునందు నాయకులును ప్రజలును కూడ ఈపాడుపన్నులను తొలగించి మాకు న్యాయమును ప్రసాదింపుడని పెట్టుచున్న మొఱలకు లంకషైరు ఇయ్యకొనునని తోచదు.

## ఇండియాకు ఈ సమస్యలాభమా?

యక్సైజు పన్నులు తొలగింపబడినవని యూహింతము. అటులయినచో, టారిఫ్ రిఫార్మరులు ప్రస్తుతము ఉండియున్న స్వల్ప దిగుమతి పన్నులను చెల్లించుదురా? ఇండియా దేశముయొక్క హితమునే గమనించినప్పుడు, ఈ దేశమునకు దిగుమతి కాబడు, బ్రిటిషు సామ్రాజ్యము సహా అన్యదేశ పరిశ్రమలమీదను (యక్సైజు పన్నులు లేక యుండ) నూటికి అయిదవవంతు పన్ను విధించినచో లాభకరముగ నుండును. బ్రిటిషు సరకులతో పోటికి వచ్చెడి అన్యదేశ వస్తువులపై, నూటికి పదవంతున దిగుమతిపన్ను అదనముగా విధించి బ్రిటిషు సరకులకు సౌకర్యము కలిగించవలసి వచ్చును. హిందూదేశము ఈ పద్ధతికి సమ్మతించునని యోచింతము. ఇంగ్లాండు దీని నంగీకరించుట సందేహాస్పదము. అన్యదేశములు తమ పరిశ్రమలపై అధికముగా దిగుమతి పన్నులను విధించినను సమ్మతించి ఇండియా అట్టి కార్యమునకు పూనుకొనినపుడు



ఇంగ్లండు ఏల సమ్మతించుటలేదు? ఇందలి రహస్యము మరేమియుకాదు. ఇండియా వర్తక నీతి తమ ఆజ్ఞాబద్ధమై యుండునుగాని, విదేశములు అట్లొడంబడవు. దేశీయ పారిశ్రామికాభివృద్ధికినై ఇతర రాష్ట్రములన్నియు అనుల్లంఘ్యమైన రక్షణత్వమును పూని ఇంగ్లీషు సరకులను తమ పణ్యాచక్రముల నుండి పారదోలినవి. ఇండియాదేశము అటుల చేయజాలదని లంకషైరు వర్తకుల ధైర్యము. కనుకనే అమెరికా, జపానుదేశముల సరకులనుకూడ మన పణ్యాచక్రములనుండి పారదోలి భరతఖండము నందంతటను తమ వ్యాపారమును నిరభ్యంతరముగా సాగించ నిచ్చగించినవారై ఈ సామ్రాజ్య సపక్షభాగ సమస్యకు నిపుడు గడంగిరి. ఈ ఇండియాదేశముయొక్క ఆశయములు, బలీయములగు ఆంగ్లేయవర్తక సంఘములయొక్క ఆశయముల ముందు తృణీకరింప బడుచువచ్చుచున్నవని ఖండితముగా ఇండియా దొరతనమువారు తమ నివేదనాపత్రమునందు వక్కాణించిరి. ఇంగ్లాండునుండి ఈదేశమునకు కొల్లలుగా వచ్చుచున్న పదార్థసంచయమునకు ఇండియా ఎట్టి పక్షపాతమును చూపించజాలదు. అట్టిపనికి పూనుకొనుటవలన దేశీయ కళలకును, దేశీయ ఆదాయమునకు గూడ చాల ముప్పు వాటిల్లక మానదు.

కరాచి వర్తక సంఘమునకు ముఖ్యుడుగనున్న వెబ్బు దొరగారుకూడ ఇండియా దొరతనమువారి ఉద్దేశ్యముతో నేకీభవించెను. ఈయన సామాన్యుడుకాడు. టారిఫ్ రిఫారము నందు విస్తారముగా సాదరభావమును కలవాడే. (1) సామ్రా

జ్యసపక్షభాగ సమస్యయొక్క సహాయమును లేనప్పుడు ఇంగ్లాండు అన్యదేశముల కలవడని పక్షపాతమును కలిగినదియై, ఇండియా దేశపు దిగుమతులలో చాలభాగమును తనయధీనము నందుంచుకొనగలిగినది. (2) అన్యదేశ సరకులపై కొంత అధికముగా పన్నును విధించినను, ఇండియాకు వచ్చుచున్న ఎల్లదిగుమతుల పైని పన్నుల నధికముచేయుటకు బ్రిటిషు వర్తక వ్యాపారస్తులు అంగీకరించరు. (3) ఏటేట విరివిని గాంచుచున్న ఇండియాదేశ వ్యయమునకు దిగుమతి పన్నులను అధికముచేసి ఆదాయమును హెచ్చించవలసిన అవశ్యకత విశేషముగాకలదు. (4) బ్రిటిషు కళలకు వలెనే ఈదేశమునందలి కళలకుగూడ రక్షణత్వము ఆవశ్యకము. ఈనీతిని పాలించుటవలన బ్రిటిషు వ్యాపారస్తుల ఆశయములకు భంగకరమగుటచే, వారి అంగీకారమును బడయజాలదు. ఈకారణమువలన ఇంగ్లాండునుండియు బ్రిటిషు సామ్రాజ్యమునుండియు దిగుమతి కాబడుచున్న వస్తుజాలముపై ఇండియాయందలి కళలకు రక్షణనొసంగునట్లుగా దిగుమతిపన్నులను విధించిన యెడల ఈదేశమునకుచాల సౌకర్యము కలుగుటకు వీలలవడినను అట్టిరాజ్యనీతిని ఇంగ్లాండు అంగీకరించజాలదు. ఇండియా దొరతనము వారును వెబ్బుగారునుకూడ ఈవిషయమున ఏకాభిప్రాయులై యున్నవారు.

ఇతరదేశ దిగుమతులపై బ్రిటిషు సామ్రాజ్య దిగుమతులకంటె నూటికి 25 వంతున దిగుమతి పన్ను అధికము చేయుటను గూర్చి చర్చింతము. నూటికి అరువదికంటె హెచ్చుగా ఇండియాకు ఇంగ్లాండునుండియే దిగుమతి యగుచున్నవని



ముందుసూచించి యుంటిమి. ఈపద్ధతి నవలంబించుట వలన ఇంగ్లాండునుండి వచ్చెడి సరకులు చాల తక్కువ పన్నులను కలిగియుండును. ఇండియాకు వచ్చెడి ఇతరదేశ పరిశ్రమలు చాల తక్కువ యగుటచే, దిగుమతిపన్నులను విస్తారముగా విధించినను ఇండియాకు అంతగా లాభించదు. ఈదేశమునందు వసూలు చేయబడుచున్న దిగుమతిపన్నులు ముఖ్యముగా రెవిన్యూకు చెందినవై యున్నవి. కావున ఆపన్నులను తగ్గించుటకు సాధ్యపడదు. ఒకవేళ అన్యదేశ సరకులపై విశేష దిగుమతి పన్నులను విధించినను, అందువలన ఇంగ్లాండునకు వచ్చెడి లాభమేమి? సపక్షకరములైన పన్నులను ఇండియాదొరతనము వారు విధించుటవలన గ్రేటు బ్రిటనునకు కలిగెడి లాభము అణుమాత్రమును లేదు. 1906-07 సం॥ న ఇండియాదేశము గ్రహించిన అన్యదేశ వస్తుసముదాయమును ప్రొఫెసరు లీస్మిత్తుగారిటుల విభాగించిరి:—

| | సవరనులు |
|---|---|
| బ్రిటిషు ఇండియాలోనికి దిగుమతి కాబడిన సరకుల మొత్తపు విలువ | 72,205,000 |
| అందు ఇంగ్లాండునుండి వచ్చిన దిగుమతులు | 48,199,000 |
| ,, బ్రిటిషు అధి నివేశనములు ,, | 5,558,000 |
| ఇతర విదేశములనుండి గ్రహింపబడినవి | 18,448,000 |

## సామ్రాజ్య పక్షపాతమతము సాధ్యముకాదు.

సామ్రాజ్య సపక్షభాగ మతము నవలంబించి విదేశవ్యాపారమునంతటిను ఇంగ్లాండునకు మరల్చవలెనని టారిఫ్ రిఫార్మర్ల ముఖ్యోద్దేశము. అటుల జేయుట ఎన్నటికిని సాధ్యము కానేరదు. బ్రిటిషు సామ్రాజ్యమునందలి వస్తు జాలమునకు మనమెంత

పక్షపాతమును చూపించదలచినను ఇతరదేశములనుండి వచ్చెడి దిగుమతి సరకులను గ్రేటుబ్రిటను సరఫరాచేయ జాలదు. అట్టి స్థితిలో పక్షపాతమును చూపిన లాభములేదు. ఇంగ్లాండునకు లాభించకున్నను కిరోసిన్‌నూనెయందును, చక్కెరవ్యాపారమునందును బ్రిటిషు సామ్రాజ్యమునందలి ఇతరభాగములకు అన్యదేశ దినుసులకంటె పక్షపాతమును చూపించనగునని, ఒక యోచన.

### కిరోసిన్‌నూనె స్థితి.

సర్ గైఫ్లీటువుడ్ విల్సను మనరాజస్వ మంత్రిగనుండు కాలముననే కిరోసిన్‌నూనెపై పన్ను అధికము చేయబడినది. అట్లు జేయుటయందు పక్షపాతమును కనబరచు ఉద్దేశ్యము కానరాదు. సపక్షకరమైన పన్నులు విధించనెంచినను దిగుమతిపన్నులను హెచ్చుచేయవలసియే యున్నది. కిరోసిన్‌నూనె అనుదినమును వాడుకలోనున్న ముఖ్యవస్తువు అయియున్నది. అట్టి దానిపై పన్నును వృద్ధిచేయుటచే చాలకష్టముగా నున్నదని దేశీయ నాయకులును, వార్తాపత్రికలును, తమయసమ్మతమును వెల్లడిచేసెను. ప్రస్తుతము విస్తారముగా కిరోసిన్‌నూనెను సరఫరాచేయుచున్న దేశములు రష్యా, అమెరికా సంయుక్తరాష్ట్రములు. బ్రిటిషు సామ్రాజ్యమునందలి ఇతరభాగములలో, కిరోసిన్‌నూనెను ఉత్పత్తిచేయు సాధనముల స్థితి ఎటులనున్నదో ఇచట నిర్ణయించ జాలముగాని, సామ్రాజ్యమునుండి మాత్రము ప్రస్తుతము ఈసరకు దిగుమతి యగుట లేదు. బర్మాదేశమున ఈవ్యాపారము ఇటీవల చక్కగా వృద్ధియగుచున్నది. కిరోసిన్ నూనెపైని విధించబడిన



క్రొత్తపన్ను బర్మాదేశముయొక్క వ్యాపారమునకు లాభకారియయ్యెను. ఇట్టినీతిని పురస్కరించుకొని సామ్రాజ్యమునందు ఉత్పన్నమగు నూనెయెడల పక్షపాతమును చూపించనెంచుచో, సామ్రాజ్యమున కంతగా లాభకారి గాకపోవుటయటుండగా, పన్నుల యొక్కయు ఋణదాతల యొక్కయు భారముచే క్రుంగుచున్న హిందూదేశపు బీదరైతులయొక్క బాధ నినుమడింప జేయుటయేకాని వేరొండు ప్రయోజనకారి కాజాలదు. పైదేశములనుండి మనము గ్రహించుచున్నంత కాలము కిరసనాయిలు పైని విధించబడెడి అధికపు పన్ను ప్రజలే చెల్లించవలసి వచ్చును.

### చక్కెర స్థితి.

ఇక చక్కెరనుగూర్చి యోచింతము. ఈదేశమునకు విదేశములనుండి చక్కెర అమితముగ వచ్చుచున్న సంగతి ఎల్లరెరింగినదే. దిగుమతులలో ముప్పాతిక అన్యదేశములే సరఫరాచేయుచున్నవి. ఈసందర్భమున మాత్రము, అధినివేశములకును ఆశ్రయ దేశములకును సపక్షకరమైన పన్నులను విధించుట కొంత ప్రయోజనకారి కాగలదు. ఆయాదొరతనములచే అమితమగు ధన సహాయమును వడసి, మన పణ్యాచక్రములను ఆవరించుచున్న అన్యదేశసరకులపై మామూలుకంటె హెచ్చుగు పన్నులు ఇదివరకే విధింపబడినవి. కాని, ఈ చక్కెర వ్యాపారమునందుకూడ సామ్రాజ్యసపక్ష భాగమతమునకు వీలంతగా యున్నదని తోచదు. ''కిరసనాయిలు నూనెకు వలెనే చక్కెరసైతము ఇండియాదేశమునకు వలయునంత బీటునుండిగాని చెఱకునుండిగాని బ్రిటిషు సామ్రాజ్యమున ప్రస్తుతము తయారారు

చేయుటకు వీలులేదనియును, కొంతకాలము దనుక అన్యదేశముల నాశ్రయించుచుండవలయు" ననియు వెబ్బుగారు సూచించిరి. రెవిన్యూ నధికముచేయునట్టియు, రక్షణత్వమును కలిగించునట్టియు పన్నులను విధించుటకు, హిందూదేశస్థులు తమ సమ్మతిని నాయకుల మూలముగను, వార్తాపత్రికల మూలమునను, అనేక సందర్భములయందు వెల్లడి చేయుచునే యున్నారు. ఇంగ్లాండునకును అధి నివేశములకును గూడ లాభకరముగనుండు సూత్రములను ఆమోదించుట ఇష్టమని సూచించుచున్నారు. అయినను పాఠక మహాశయులు పైచర్చవలన గ్రహించవలసిన ముఖ్యాంశము—ఇంగ్లాండునకు లాభము అత్యల్పమని నిశ్చయముగా తెలిసికొనవలసి యున్నది. అధినివేశనములు కొంతవరకు లాభమును పొందవచ్చును. కాని అధినివేశనములు దీనికి ప్రతిఫలముగా మనకుచేయు ఉపకారమేది? ఈదేశమునుండి పోవు కూలివాండ్రను పెట్టుచున్న బాధలటుండ, సుప్రసిద్ధ విద్యార్థులు సైతము తమదేశమును తొక్కరాదని ఆస్ట్రేలియా దేశవాసు లనుచున్నారు. ఇట్టి వ్యక్తిత్వమును గలిగిన వారికి భారతీయులయెడ సోదర ప్రేమ జనించుననుట యోచనీయము. సామ్రాజ్యమునందలి ఎల్ల రాష్ట్రములును కలిసియుండిన బాగుండుననెడి నీతి మంచిదే కాని సామ్రాజ్యములోని అన్ని దేశములును సమానగౌరవ ప్రతిపత్తుల నొకరికొకరు కలుగజేసినగాని అట్టి నియమము లాభకారి కాజాలదు.

పరస్పర వినిమయమునకు బ్రిటిషు అధినివేశనముల ప్రజలు అంగీకరించునెడల వర్తక వ్యాపారములయందు వారి



సరకులపైని ఇండియా సానుభూతిని కనబరచనగునని మేము సూచించియేయున్నాము. కావున సామ్రాజ్య సపక్షభాగ మతమును బ్రిటిషు దొరతనమువారు ఆచరణములోనికి గొనిరాదలంచినపుడు హిందూదేశమునకు తగిన గౌరవ ప్రపత్తులను ఒసఁగెదమని తక్కిన రాష్ట్రములు అభయహస్త మొసంగినగాని దొరతనమువారు ఈసమస్యను చర్చించుటకునైన వీలుపడదు. సామ్రాజ్యము యొక్క అభివృద్ధిని కాంక్షించుటలో ఇండియా ఏ యితర భాగములవారికిని తీసిపోదు. సామ్రాజ్యము యొక్క ఐశ్వర్యమును బలమును పెంపుగాంచుటకు, అందలి ప్రతిభాగమునుకూడ ఐశ్వర్యవంతమై బలీయతను గాంచినగాని, వీలలవడదు. కళావాణిజ్యముల నభివృద్ధిజేసి, హిందూదేశము యొక్క ఆర్థికసంపదను విరివిచేసినగాని సామ్రాజ్యమునకు చేకూరవలసిన ఆధిక్యత లభించదు.

## ఎగుమతుల స్థితి.

ఎగుమతులయొక్క పరిస్థితులనుకూడ తర్కించి సపక్షకరమైన పన్నుల నామోదించుటవలని లాభనష్టములను నిర్ణయించవలసియున్నది. పరదేశయాత్ర వెడలు వస్తుజాలములో చాలవరకు అపక్వపదార్థ సంచయమును ఆహారపదార్థములునై యున్నవి. ఈదేశమునుండి గ్రహించినఅపక్వపదార్థ సంచయమునే తిరిగి వారు యంత్రకళలుగమార్చి, ఈదేశమునకంపి ఐశ్వర్యవంతులగుచున్నారు.

హిందూదేశము నందలి ద్రవ్యసాధనములు బ్రిటిషు సామ్రాజ్యమును ఐశ్వర్యవంతముగ జేయవలయునేకాని అన్య రాష్ట్రములను బాగుచేయుట పాడిగాదు. కాన రక్షణత్వము

నవలంబించియున్న, బ్రిటిషు సామ్రాజ్యమునకు చెందని, ఇతర
రాష్ట్రములకు పంపబడుచున్న పదార్థసంచయముపై ఎగుమతి
పన్నులను విశేషముగా వసూలు చేయవలసినదని ఒకఆశయము.
ఇటులగావించుటచే బ్రిటిషు కర్మకరులకును, మూలధనము
నకును లాభము కలుగుననియును, బ్రిటిషు సరకులపై దిగు
మతిపన్నులను విధించుచున్న అన్యదేశములు అట్టి పన్నులను
నిలుపుచేయుననియును కొందరు చెప్పుచున్నారు. బోనరులా
గారి ముఖ్యోద్దేశ్యముకూడ ఇదియేయని తోచెడిని. శత్రు
దేశములను తిరిగి ఇండియా పణ్యచక్రముదరికి రానీయకుండ
పారదోలవలయునని బ్రిటిషు రాజ్యతంత్రజ్ఞులు ఎన్నియోప్రయ
త్నములు సల్పుచున్నారు. సామ్రాజ్యసపక్షభాగ మతము
నవలంబించుట లెస్సయని యుద్ధ ఆంతరంగిక సభవారుకూడ
అభిప్రాయపడుటకు ఇదియే కారణము.

ఇంగ్లాండుదేశము మనదేశమునందలి ఎగుమతులలో
నూటికి 25 వ వంతుమాత్రమే గ్రహించుచున్నది. మిగిలిన
భాగమంతయు రక్షణనుదాల్చిన ఇతరదేశములకు పోవుచున్నది.
రక్షణనుగూర్చి మేము చర్చించినప్పుడు ఎన్నియో అపక్వ
పదార్థములపై ఎగుమతిపన్నులను విధించుట అవసరమనియు,
అటుల చేయుటవలన మనకళకు అపరిమిత సహాయము నొసం
గిన వారమగుటయేగాక, రివిన్యూకూడ చాలవరకు వృద్ధి
యగుననియు, సూచించియేయున్నాము. అపక్వపదార్థ సంచ
యమునకేగాక ఆహారపదార్థముల (ధాన్యములు) కు గూడ
ఎగుమతిపన్నులువిధించుట కర్తవ్యమని చెప్పియుంటిమి. గోగు
నారపై అదనమైనపన్ను విధించవలసినదని సామ్రాజ్య



శాసన నిర్మాణసభలో దేశీయ ప్రతినిధులు తీర్మానముల నుప
పాదించియున్నారు. 1916-17 సం॥ ఆదాయవ్యయ పట్టికలో
గోగునారపైని అదనమైనపన్ను విధించబడెను. 50,000 సవ
రనులవరకు ఈపన్నువలన ఆదాయమురావచ్చునని కోశాగార
మంత్రి శాసననిర్మాణ సభయందు నివేదించెను. ఇది ఇంకను
చాలవరకు హెచ్చుచేయవలసిన ఆవశ్యకత కలదు. జపాను
దేశమునకు ఎగుమతి కాబడుచున్న ప్రత్తిపైనికూడ, ఎగుమతి
పన్నును విధించవలసినదని దేశీయులు కోరిరి. నూలుకళయందు
ఈదేశమునకన్న రక్షణను వహించుటవలన జపాను చాల
ప్రాముఖ్యతను గాంచుచున్నదని ఎల్లరు నెరింగిన విషయమే.
ఇతర వస్తువులయందు, జర్మనీ అమెరికా దేశములు ఇంగ్లీషు
సరకులను సన్నగిలునట్లు చేయగలుగుచున్నవని మాత్రము
అందరును అంగీకరించక తప్పదు. నూలు వర్తకమునందు
జపానుదేశము ప్రస్తుతము మ్యాంచెష్టరు సరకులకు చాల
యొత్తిడిని గలిగించుటయేగాక కొన్ని రకముల బట్టలయందు
ఇంగ్లాండుస్థానమునుతానే ఆక్రమించుచున్నటుల వర్తకలెక్కలు
చూచినవారికి తెల్లమగును. అన్యదేశముల సరకులపై ఇండి
యాదేశముయొక్క ఆశయములను మనసునందిడుకొని పన్ను
లను విధించవలయునని అనేక సభలమూలమునను వార్తాపత్రి
కల మూలమునను మననాయకులును ప్రజలును చాలకాలము
నుండి ఘోషించుచున్నారు. కాబట్టి మన వాణిజ్యవ్యాపారము
ను ఎట్టిరీతిగ సంస్కరించిన ఇంగ్లాండునకును, అధినివేశనముల
కును, అన్యరాష్ట్రముల సరకులకంటె పక్షపాతమును చూపించ
వీలగునో, ఆసంగతిని మనమిపుడు తర్కించవలసి యున్నది;

పక్షపాతమును చూపించగలుగు సరణిని మనము కనిపెట్టగలిగినయెడల, అట్టి పద్ధతి నవలంబించుటవలన ఇండియాదేశమునకు లాభకారియా యను సంగతికూడ విమర్శనీయము.

## గోగునార ఎగుమతి.

పరదేశ యాత్రవెడలు ఈ దేశ పదార్థసంచయములో చాలభాగము గోగునార అయియున్నది. సంవత్సరమునకు సుమారు 20 కోట్ల రూప్యముల మూల్యముగల గోగునారయును, 15 కోట్ల రూప్యముల విలువగల గోనెసంచులును, పట్టాలును, విదేశములకు నేగుచున్నవి. వంగరాష్ట్రమునందు ఈ వ్యాపారము ఇటీవల కొద్ది సంవత్సరములలో విశేష వృద్ధిని గాంచినది. ఇండియాదేశమును, అన్యదేశములును పోటీగాగానే ఇంగ్లాండునందు ఈ కళక్షీణదశకు వచ్చెను. ఇంగ్లాండుదేశము స్వేచ్ఛావర్తక న్యాయమును పాలించుచుండుటవలన, విదేశములు తమ దేశమునందే గోగునార యంత్రములు నిర్మించగలిగినవి. ఒకప్పుడు విదేశములన్నియు బ్రిటిషు యంత్రకళలనే ఆశించుకొని యుండెడివి. ఇపుడన్ననో తమదేశముననే యంత్రశాలలను నిర్మించుకొనగలుగుటవలన, గోగునార విషయమున ఆర్థిక స్వాతంత్ర్యమును గాంచగల్గినవి. ఇంగ్లాండుదేశముయొక్క గుత్త ఈ విషయమున పూర్తిగ నశించుటయు డండీ పట్టణము ఈ పరిశ్రమయందు చాలబీదస్థితియందుండుటయు చూచుచేయున్నాము. గోగునారను చాల దేశములవారు ఎవ్విధమైన పన్నులను విధించకయే తమ దేశమున జొరనిచ్చుచున్నారు; తయారైన సరకుల పైనిమాత్రము నూటికి 5 మొదలు 30 వరకు శుల్కములు వసూలు చేయబడుచున్నవి. ఇండియాలో ఎగుమతి పన్నులను విధించినయెడల రెవిన్యూవిషయమున చాల లాభకరమగుటయేగాక, ఈకళ ఇంకను విజృంభించగలదు. ప్రపంచము నందంతటను గోగునార పైరునందు మన ఇండియాదేశము గుత్తను కలిగియున్నది. ఎంతపన్నును విధించినను భరించవలెనే గాని మరియొక గత్యంతర మేమియును లేదు. కాని, సామ్రాజ్యసపక్షభాగ మతావలంబకులమై ఇంగ్లాండు దేశమునకు పక్షపాతమును కనబరచితిమేని డండిపట్టణముయొక్క గోగునార పరిశ్రమ విశేషముగ వృద్ధియగును. అందుచే హిందూదేశ వ్యాపారము క్షీణించకమానదు. ఎగుమతిపన్నుల నధికము చేయుటవలన అన్యదేశములు గోగునారను ప్రియముగా కొని తీరవలసిన అవస్థకలుగగా, డండీ పట్టణమునకు చౌకగా లభించుచుండును. చౌకగా లభించుటచేత డండీ ఇండియాతో కూడ పోటీకిరాగలదు. అది ఎంత ప్రమాదమో విస్తరించి వ్రాయ నగత్యములేను. అట్టిమతము నవలంబించుటవలన దేశమున కెవ్విధమైన లాభమును కలుగదు. ఈ నష్టమును, ఇంగ్లాండు దేశము మరి ఏ విధముననైన పూర్తిచేయగలదా యనిన, నదియును లేదు. గోగునారను ఎగుమతి చేయునపుడు ఇంగ్లండునకు పక్షపాతమును చూపుటకు పరరాష్ట్రమునందలి వర్తకులు తమకు నష్టదాయకమని అంగీకరించజాలరు. విశేసించి ఈకళ ప్రస్తుతము. బ్రిటిషువర్తకుల యాధీనముననే యుండుటవలన, అందలి లాభము బ్రిటిషువర్తకులే అనుభవించుచుండ తిరిగి పక్షపాతమును చూపమని కోరుట సరికాదు.

## ప్రత్తి ఎగుమతి.

మనదేశమునుండి పరదేశ యాత్రవెడలు అపక్వ పదార్థసంచయమునందు ప్రత్తి ద్వితీయస్థానమును అలంకరించుచున్నది. ప్రత్తిపైని ఎగుమతి పన్ను విధింపబడినయెడల **ఈ**దేశమునందలి నేతకళకు కొంత సహకారిగా **నుండును.** ఇండియాయందలి ప్రత్తి సగమునకు సుమారుగా అన్యదేశముల కేగుచున్నది. కొంతకాలమువరకును జపానుదేశము ఈ దేశమునుండి నూలును గ్రహించుచుండెడిది. ఇపుడన్ననో రక్షణను దాల్చిన దగుటచే, నేతకళను చక్కగా విజృంభింప గలిగి వడకిన నూలును గొనుటకు బదులుగా ప్రత్తి నే గ్రహించి, వారిదేశమున నూలు తయారుచేసి ప్రాగ్దేశములందలి పణ్యాచక్రములయందు ఇండియాకు పోటిగా వచ్చెను. ఎగుమతి కాబడుచున్న ప్రత్తిలో, ఇంగ్లాండుకంటె అన్యరాష్ట్రములే విశేషముగ గ్రహించుచున్నవి. అన్యరాష్ట్రములపై అదనముగా పన్ను విధించినయెడల, ఇంగ్లాండునకును ఇండియాకును కూడ లాభకారి కావచ్చును. అమెరికాదేశపు ప్రత్తి పంటమీదనే, లంకషైరు నూలు యంత్రశాలలు ఆధారపడి యున్నవి. కాబట్టి ప్రత్తిశుల్కము, ఇంగ్లాండునకు ఎవ్విధమైన బాధను కలిగించజాలదు. విశేషించి అన్యరాష్ట్రముల ఒత్తిడిని గూడ తగ్గించగలదు. ప్రత్తిపన్నులను విధించుటవలన విదేశ**ములు** తమ అసమ్మతిని **జూపుటకై ఈ**దేశ**సరకులకు** కలుగజేసెడి నిర్బంధములటుండగా ప్రస్తుత స్థితిగతులను బట్టిచూడ లాభమును పొందునది లంకషైరుగాని ఇండియా కానేరదు.



వాణిజ్య వ్యాపారములయందు నూతన పద్ధతుల నెలకొల్ప దలంచినచో ఏ సరణిని అవలంబించినయెడల ఇండియా దేశముయొక్క అభ్యుదయమునకు తోడ్పడునో, అట్టి రాజ్యనీతినే పాలించుట ధర్మమని పెక్కుసారులు ముచ్చటించి యున్నాము. సామ్రాజ్య సపక్షభాగ మతావలంబనము ఇండియా దేశమునకు లాభకారియగుననుట చాల సందేహాస్పదమని నిర్ణయించి యుంటిమి. ఇండియా దేశమునందు ఉత్పత్తియైన పదార్థములకు, ఇంగ్లాండుదేశమే, పక్షపాతమును కనబరచవలసి యున్నది. ఈ దేశముయొక్క ప్రస్తుతస్థితియందు రాజస్వమును అభివృద్ధి చేయవలసి యున్నదనియు, రక్షణను ఇంగ్లాండునుండికూడ హిందూదేశ క్షేమార్థమై మనము సంపాదించవలసి యున్నదనియు ఇదివరకు సూచించి యున్నాము.

## గోధుమల స్థితి.

ఇండియాదేశము యొక్క గోధుమ పంటను గూర్చి ఆలోచింతము. ఇంగ్లాండు, ఒక్క ఇండియా నుండియే గాక, కెనడానుండికూడ గోధుమలను గ్రహించుచున్నది. ప్రస్తుతము పక్షపాతమును కాంక్షించుటలేదుగాని కొద్దికాలములో ఇండియాదేశ వస్తువులకంటె తన సామగ్రికే హెచ్చు పక్షపాతమును కనబరచమని కెనడా కోరవచ్చును. అపుడు ఇండియా గోధుమలసంగతి ఏమి కావలయును? ఇంగ్లాండునకు వలయు తేయాకునంతయు చైనా, ఇండియా, సింహళ ద్వీపములు సరఫరా చేయుచున్నవి. అందు ఇండియా సింహళ ద్వీపములు అమితముగా సరఫరా చేయుచున్నవి. సపక్ష

భాగమతము నవలంబించుటచేత సామ్రాజ్యమునుండి దిగుమతి కాబడు తేయాకు మీాది పన్ను తగ్గింపబడును. అపుడు చైనాదేశపు తేయాకు మన పోటీకి తాళజాలక ఇంగ్లండునుండి వెడలిపోవును. అయినను, ఇండియా తేయాకునకును, సింహళమునకును తరువాత పోటీరాకమానదు. ఈ సంగతులనన్నిటిని ఊహించినవారలై, 1903 సం॥ న ఇండియాదొరతనమువారు ఆర్థికవిషయములపట్ల సామ్రాజ్యమునకు ఇండియాదేశము సమర్పించునదేదియు లేదనియు, తానే చాలవరకు నష్టపోవుననియు ఇండియాకార్యదర్శిగారికి నివేదనా పత్రమునంపిరి. పక్షపాత మతము నాచరించుటవలన సామ్రాజ్యమునందలి గోధుమ వర్తకమునకు విశేషలాభము కలుగునను కొందము. ఆలాభమును మనము కెనడా, ఆస్ట్రేలియా దేశములతోను మరి యితర వలసరాష్ట్రములతోను సమముగ పాల్గొనవలసి యుండును. గ్రేటుబ్రిటను మనదేశమునుండి విస్తారముగా అపక్వపదార్థ సంచయమును ఆహారపదార్థములను గ్రహించుచున్నది. గనుక దిగుమతులపై సపక్షకరమైన పన్నులను విధించి వీనివెలలను హెచ్చుచేయుటకు నిచ్చగించదు. అన్యదేశములనుండి దిగుమతి కాబడుచున్న వస్తుజాలముపై హెచ్చుపన్నులను విధించి, ఇండియా దేశమునుండి ఎగుమతికాబడు యంత్రకళలకును, హస్తకళలకును పక్షపాతమును కనబరచుననుకొందము. కాని, ఇండియానుండి ఎగుమతి కాబడు పరిశ్రమలు చాలతక్కువ. కాన ఇండియాకు ఎంత పక్షపాతము కనబరచినను నష్టముకూడిరాదు. అధినివేశములకును ఇండియాకును వర్తకమంతగాలేదు. ఇండి



యాదేశమునుండి స్వలాభమును కాంక్షించుటదక్క, ఇంగ్లాండుగాని అధినివేశములుగాని ఈదేశమునకు చేయుమేలు ఏమియు కానరాదు.

## ఇంగ్లాండు ఇండియాకు రక్షణ నిచ్చునా ?

వర్తకసంస్కరణ వాదులు, ఇంగ్లాండునకు ప్రసాదించు రక్షణత్వమును ఇండియాదేశమునకు గూడ ప్రసాదించెదరా యని స్వేచ్ఛావర్తక వాదుల ప్రశ్న. దీనికి తగిన ప్రత్యుత్తరమును సంస్కరణ వాదులు ఈయజాల కున్నారు. తమ సరకులపై శుల్కములను వసూలు చేయుటకు లంకషైరు వ్యాపారస్థు లెన్నటికిని అంగీకరించరు. శుల్కముల నీయుట కుద్యుక్తులైనచో, యక్సైజుపన్నులను మన నూలు సరకులపై వసూలు చేసినగాని వారొప్పరు. యక్సైజుపన్నులను త్రోసివేసినగాని మన నేతకళ విజృంభించజాలదు. ఇండియా యొక్క నేతకళకు కలిగెడి లాభము లంకషైరునకు నష్టదాయకము. వారికి కలిగెడి నష్టము మనకళకు లాభకరము. ఇటులుండ ఈరెండు దేశములకును లాభదాయకమగు వర్తకసంస్కరణమును ఆచరణములోనికి దెచ్చుట కష్టసాధ్యము. ఐశ్వర్యవంతమై యున్న ఇంగ్లాండుదేశము కొంత నష్టమునకైన ఓర్చుట సమంజసముగాని, కఱవులతోను కాటకములతోను పీడింపబడుచు సంవత్సరమునకు ముప్పది రూపాయల ఆదాయముగల భారతీయులతో నిండియున్న ఈదేశమునకు ఇంకను నష్టమును కలుగజేయుట ధర్మముకాదు. సామ్రాజ్యముయొక్క బలాతిశయములు సర్వాంగపూర్తిని గాంచుటవలన గాని యలవడజాలవు.

### సామ్రాజ్య పక్షపాత మతము నష్టము.

సామ్రాజ్య పక్షపాత మతము నష్టదాయకముగ నున్న దేకాని లాభకారి గాజాలదు. ప్రస్తుతము నూటికి 64వ వంతు దిగుమతులును, నూటికి 25వ వంతు ఎగుమతులును ఇంగ్లాండునకు చెందియున్నవి. దిగుమతికాబడుచున్న శేషించిన 36వ వంతు సరకులును, ఇంగ్లాండునకు మనమెంత పక్షపాతము చూపినను, అచ్చట తయారగుటకు వీలులేదు. అట్టి స్థితిలో పక్షపాతమును కనబరచవలసిన అవసరమేమి? కనపరచిన ప్రయోజనమేమి? ఎగుమతుల స్థితి నాలోచించినను అంత ప్రయోజనకారిగా నున్నటులతోచదు. నూటికి 25వంతునకు పైగా ఇంగ్లండు గ్రహించుటలేదు. మిగిలిన 75 వంతులును అన్యరాష్ట్రములే గ్రహించుచున్నవి. కాబట్టి ఎగుమతులయందు గాని, దిగుమతులయందుగాని పక్షపాతమును చూపించుట ఇండియాకు లాభకరముగాదు.

స్వేచ్ఛావర్తకముకంటె, పక్షపాతమతము ఈదేశమునకు మిక్కిలి విప్లవకారియగును. ప్రొఫెసరు కాళేగారు సూచించినటుల స్వేచ్ఛావర్తకము క్రొత్తకళలను స్థాపించి వృద్ధిలోనికి గొనివచ్చుటకు ఆటంకకరముగా నుండును గాని, పక్షపాత మతము, ఉన్న వానిని కూడ నశింపజేయును. ఈమతము నవలంబించుటవలన ఈదేశమెన్నటికిని వ్యవసాయదశయందుండి తీరవలసియే వచ్చును. అపక్వపదార్థ సంచయోత్పత్తి దక్క కళాస్థాపనమును కళా విజృంభణమును మనకు గగన కుసుమము లగును. ఆర్థిక స్వాతంత్ర్యమున్న గాని దేశీయ ఔన్నత్యమలవడదు.

# పరిశ్రమాభివృద్ధికి మార్గములు.

---

## వ్య వ సా య ము.

భారత భూమియందు కృషికళయే ఎల్లకళలయందును అగ్ర స్థానము నలంకరించుచున్న దన్న సంగతి నిర్వివాదాంశము. ఎల్ల దేశములకువలె గాక స్వదేశమున కర్మకరులకు సేద్యవృత్తియే, చాలవరకు జీవయాత్ర గడపుటకు నాస్పదమైయున్నది. ఇతర కళలు విరివిగా విజృంభింపని హేతువువలన కృషికళయే జీవనాధారమగుచున్నది. రక్షణను దాల్చి సర్వకళా పరిపూర్తి గాంచినను, సంయుక్త రాష్ట్రములకు వలె భరతవర్షమునందు పెక్కుప్రజలకు వ్యవసాయవృత్తియే జీవనాధారము కాకమానదు. ఏలయన యంత్రకళలు చాలవరకు కృషినే ఆధారభూతముగ కలిగియున్నవి. గనుక కృషికళయొక్క ప్రాముఖ్యత ఇంతయని నిర్ణయించుటకు వీలుచిక్కదు.

ప్రస్తుతము కృషికళ ఈదేశమున మిక్కిలి శోచనీయమైన అవస్థయందున్నది. ఆర్యులు భరతవర్షమును విక్రమోపార్జితులై స్వాధీనము చేసికొనిన కాలమున అపరిమిత సస్యాఢ్యమై బరగుచున్న స్వదేశమున నేడు పంటలకు మాఱు కఱవులే తఱచుగ తటస్థించుచున్నవి. క్షేత్రమును ఎరువు వేయక ఏమాత్రము దున్ని సేద్యపరచినను అద్భుతముగ సస్య

ములు ఫలించి దేశము సుభిక్షముగ దనరారు చుండెడిది. ఇపుడన్ననో కృషికుడు సంవత్సరము పొడుగునను శ్రమపడి నను, శ్రమకు తగిన లబ్ధి దొరుకక బీదవడి ఏషాహుకారునకో దాసుడై యుండవలసి వచ్చుచున్న సంగతి మనము కండ్లార గాంచుచున్నాము. ఇట్టి దుస్థితికి సుక్షేత్రయగు భరతవర్షము ఏల రావలసివచ్చెనో విచారించుట ఎల్లరకును అవశ్యకర్తవ్యము. శ్రీరామ చంద్రునికాలమున 'నెలకు మూడువానలు' కురి యుచుండెడి వన్నసంగతి పురాణ ప్రసిద్ధమేకదా ! నేటి స్థితి ఎటులనున్నది ? మూడేడులకొక వర్షమైనను లభించని తావులు కూడ గలవు. ప్రజలును పాలకులును భారత భూమి యందలి కృషికళను సముద్ధరించ నెంచినచో వారలకు అవశ్యమగు కర్తవ్యము——సస్యములను సాధ్యమైనంతవరకు వర్షాధారములుగ జేయక నదీనదంబుల నుండి జలమును కాలువల ద్వారా సరఫరా చేయుచుండుటయో లేక ప్రతిప్రత్యేక క్షేత్రమునందును నూతులను ద్రవ్వి పాతాళగంగను పైకి ఉబుకునట్లు చేయుటయో గావించవలసి యున్నది. అపుడుగాని వర్షముల వెలుపులేక సస్యములు సుభిక్షముగ పండుటకు వీలలనడదు.

నాగరికతను విశేషముగా కలిగియున్న రాష్ట్రముల యందు ఎడతెగని పరిశోధనలవలన కృషికళను పెంపు చేయుటకునై ఎన్నియో నూతన మార్గములు కనుగొన బడినవి. ఈదేశమునందలి కృషికళకు తాతముత్తాతలనాటనుండియు ఆచారముగ వచ్చుచున్న మార్గముదక్క ఇతర పథంబులం ద్రొక్క మనంబు జనదు. పూర్వాచార పరాయణ ప్రియత్వ



మునకు దోడు దరిద్ర దేవత సర్వదా ఆశ్రయించియే యుండును. విద్యావిశేషమువలన అద్భుత ప్రజ్ఞను కలిగినవారై పాశ్చాత్య దేశముల వారెల్లరును తమదేశములనుండి తరిమివైచుటవలన గాబోలు ఆదరిద్రదేవత మనలను బాయక యున్నది. ప్రారంభవిద్యను సర్వప్రజలకును గరపి అజ్ఞానాంధకారమును బాపి, జ్ఞానచక్షువును తెరచినగాని అభివృద్ధిగాంచుటకు దారిలేదు. నూతన సంస్కరణములను విరివిగ స్వదేశమునందు కూడ ఆచరణములోనికి గొనివచ్చినగాని కృషికళ పెంపుగాంచదు. పాశ్చాత్యదేశములకు వలెనే భరతవర్షము సైతము నిలువనీడ నొసంగక దరిద్రదేవతను తరిమివేయవలెనన్న సహకార ప్రవృత్తియే సాధనాంతరంబు. ఈవిషయములు మున్ముందు విపులముగా జర్చించబడును.

## జలాధారముల ప్రాముఖ్యత.

సర్కారు రాజస్వమునుగూర్చి ముచ్చటించుతరి, ఇనుపదారులకన్న జలాధారనిర్మాణమే హిందూదేశమునకు అత్యంతావశ్యకమని నిరూపించి యుంటిమి. ఐనను, ఒకటి రెండుసంగతులను ఇచ్చోటున నిర్వచించుట యుక్తమని తోచెడిని. కావేరీ, గోదావరీ మహానదులకు ఆనకట్టలనుగట్టి విఖ్యాతయశమువడసిన కాటనుమహాశయుడు, నీటికాలువలయొక్క ప్రాముఖ్యతను చక్కగ గ్రహించినవాడై, భరత వర్షముయొక్క భావిస్థితి జలాశయములను విరివిచేయుటయందే ఆధారపడి

యున్నదని నమ్మి, సర్కారు రాజస్వమును ఇందులకై వెచ్చించుట అవసరమని ప్రభుత్వమువారికి నివేదించెను. కాని మన దురదృష్టమువలన పాలకులకు అట్టిబుద్ధి స్ఫురించెదయ్యో!

ఇకనైనను రైల్వేలకునై కోట్లకొలదిధనమును వెచ్చించక, సర్కారువారు నీటిపారుదల పనులకునై విశేషధనమును వెచ్చించుట అవసరము. నీటిపారుదల విషయమున సాలునకు రెండుకోట్ల రూప్యములు వెచ్చించుట కష్టమగుచున్నది. ఇట్టి రాజ్యనీతి క్రమమైనదికాదు. సర్కారువారు విశాలదృష్టితో తిలకించినయెడల అందలి లాభనష్టములు వారికి గోచరించ గలవు.

వర్షమునే ఆధారభూతముగనమ్మి సేద్యముగావించెడి కృషికులకు సంవత్సరము పొడుగునను పనికలిగి యుండదు. డెల్టాభూములయందు మాత్రము మూడుపంటలు పండును గనుక ఎల్లప్పుడును పనికలిగియేయుండును. ఇతరప్రదేశముల యందు ఎనిమిదిమాసములుదక్క, కృషికులు పాటుపడుచుండుటలేదు. వర్షములు ఎటామటియగుచో చాలదినములవరకు పనికలుగదు. మిగిలిననాలుగు మాసములును నిర్వ్యాపారులై యిన్నక గృహాంగణంబుల నిద్రపోవలసిన వారగుచున్నారు. ఎంతశ్రమ నిరర్థక మగుచున్నదో, వేరుగ వ్రాయబనిలేదు. ఒక్క వరిపంటనే నమ్ముకొని, పండినను ఎండినను ఇతర దినసులపైరులను ప్రయత్నించక సోమరులై కాలము వృథ పరచుచున్నారు. కృషికులు ఒక్క సంగతిని గమనించ వలసియున్నది. కేవలమువర్షమునే ఆధారముగ నమ్ముకొనక, క్షేత్రములయందు బావులనుత్రవ్వి ఏతముల మూలకముగనో, మోటల ఆధారమువలననో, సేద్యమునందున్న భూమివిస్తారము పరిమాణము కలిగియున్నయడల పాతాళగంగను పైకి ఉబుకునట్లుచేసి నూనె-యంత్రముల (Oil engines) సహాయమువలన భూమికి నీటిని సరఫరాచేసి సస్యాఢ్యగజేయుట అవశ్యకర్తవ్యము. ఈయుద్యమమునకు సర్కారువారు సైతముకొంతవరకు సహకారులు కావలసియున్నది. నూతులను త్రవ్వుటకు కావలసిన పనిముట్లను జతపర్చి ఒక్కొక్క ఉద్యోగియుని ప్రతి తాలూకాయందును నియమించి, ఏరైతు దరఖాస్తుచేయునో ఆరైతు భూమియందు నూతులను త్రవ్వుఏర్పాటులను గావించ వలసియున్నది. సర్కారువారు నీరుపడువరకునుత్రవ్వి, అందుల ఖర్చును తామేవహించి మిగిలిన భాగమును త్రవ్వి ఉపయోగ పరచు కొనుటకగుఖర్చును రైతునుండి రాబట్టుట సుగమము. ప్రతితాలూకా యందును ఒక్కొక్క ఉద్యోగియుని ఈపని నిమిత్తమై నియోగించి తీరవలయును. కొంతవరకు సర్కారు వారికి ధనవ్యయ మగునని యెడిమాట సత్యమే! ప్రజాక్షేమము నిమిత్తమేకదా, ప్రభుత్వమువారు పాటుపడవలసి యున్నది.

## తకావీ ఋణములు.

క్షామములు పట్టినపుడు సర్కారువారు రైతులకు తకావీ ఋణములనుపేర ధనమునొసంగుచున్నారు. ఈఋణము లంతగా రైతులకు ఉపచరించుటలేదని నిస్సంశయముగా చెప్పవచ్చును. రైతుయొక్క దరఖాస్తు అనేకమంది ఉద్యోగస్తుల ద్వారా తహసీల్దారుగారికి చేరవలసీ యున్నది. దరఖాస్తుప్రకారము ఋణమువడయుట కష్టసాధ్యము. ఇందలి

లోపము ప్రత్యేక ఉద్యోగీయులయందు లేదు. ఆశాఖానిర్మాణమే కారణము. రైతులకుసులువుగా పైఅధికారులతో మనవి చేసికొనుటకు తగిన ఏర్పాటులు గావించుట అవసరము. ఋణముతీయబడిన ధనమునందు కొంతవరకు రుసుములక్రింద వినియోగించవలసి వచ్చుచున్నది! ఇదిఎంతయు శోచనీయము. ఇంతవ్యయ ప్రయాసములకు నోర్చి తెచ్చిన ఋణమును రైతు వెంటనే తీర్చివేయవలసి యున్నది. అందలిలాభమును గ్రహించి తాను సుఖించుచున్నపుడుగదా, ప్రయాసము లేకుండ రైతునకు ఋణముతీర్చుటకు అవకాశముండును. ఋణము తీర్మానము చేయవలసినదని సర్కారు రివిన్యూ ఇనస్పెక్టరులు తొందర చేయుటవలన ఏషాహుకారులవద్దనో అధికవడ్డీకి తిరిగిఋణము తెచ్చి తీర్చవలసి వచ్చుచున్నది.

ఈపద్ధతి తృప్తికరముగ లేదు. రైతుయొక్క క్షేమమును విచారించి తగునేర్పాటులు చేయుట కర్తవ్యము. సర్కారువారు రైతునకు సహాయము చేయనెంచినను ప్రస్తుతపద్ధతులు నిరోధకములగు చున్నవి. కృషికళను పెంపుచేయుటకు అవసరములగు ఉపకరణములను, రైతు సేకరించుటకు అనువగునట్లు ఋణము నొసంగుటకును, తిరుగ తీర్మానము చేయకోరినపుడు రైతునకు శ్రమలేకుండ గ్రహించుటకును తగిన ఏర్పాటులను సర్కారువారు చేయవలసియున్నది. రాబడిని చక్కగా వసూలుచేయుటయందే సర్కారు ఉద్యోగీయులు తమబుద్ధికుశలతను వినియోగించక, రైతుయొక్క క్షేమమునుకూడ ఒకకంట జూచుచుండవలెను.



## మెరకభూములకు నీటి సరఫరా.

బావులనుత్రవ్వి, క్షేత్రమును ససాఫ్యగ జేయవలసి యున్నదని రైతును హెచ్చరించి యుంటిమి. పూర్వకాలపు ఏతములతోను, మోటలతోను తనివిజెందక నూతన యుపకరణములను వాడుకలోనికిదెచ్చి కృషికులు అభివృద్ధికిరావలసి యున్నది. ప్రస్తుతము మన ఆంధ్రమండలమున వాడుకలోనున్న మోటలు పశువులకు విశేషశ్రమను కలుగజేయుచున్నవి. ముందునకును వెనుకకును నడువవలసి వచ్చుటచేతస్వల్పకాలములోనే పశువులు సిరసించి ఉపయోగా నర్హములగుచున్నవి. అట్టి ఇక్కట్టులకు ఆస్పదము గాకుండ క్రొత్తపద్ధతుల పైని మోటలు నిర్మించబడినవి. ఈపద్ధతివలన పశువులు వెనుకకును, ముందుకును నడవవలసిన అవసరము లేదు. విశేషశ్రమలేకనే జలమును గ్రహించుటకు వీలలవడుచున్నది.*

## కృషికులకు విద్యాజ్ఞాన మవసరము.

కృషికులయొక్క పూర్వాచార పరాయణ ప్రియత్వమును తొలగించి నూతన సంస్కారణములపట్ల కుతూహాలురగునట్లు చేయుటకు నిర్బంధోచిత ప్రాథమిక విద్యయే ఆధారము. వ్రాయను, చదువను నేర్పినంతనే తృప్తిజెందక కృషి

* విషయమునుగూర్చి విపులముగ దెలియగోరువారు "రామచంద్ర ఏతంవర్క్సు" మైలపూరు, మద్రాసు అని వ్రాయవలెను. వీరు చక్కని ఉపకరణములను నిర్మించిరి. మ-శ్రీ వేమవరపు రామదాసుపంతులుగారు మొదలగు మననాయకులు వీరి కర్మాగారమును పరీక్షించి శ్లాఘనీయములగు యోగ్యతాపత్రముల నొసంగిరి.

విషయకమగు విద్యావ్యాప్తిని చేయుట చాల అవసరము. వ్యవసాయశాఖను ఇంకను బలపరచి ప్రతితాలూకాయందును ఒక్కొక్క నిపుణుని యాజమాన్యముక్రింద మాదిరి వ్యవసాయక్షేత్రములు (Model demonstration farms) నెలకొల్పబడవలయును. నూతన యుపకరణములయొక్క ప్రాశస్త్యమును రైతులకు ప్రత్యక్షప్రమాణముగా బోధించవలసి యున్నది. ప్రతి గ్రామమునకును వ్యవసాయ విద్యయందు గడతేరిన వారు సంచార బోధకులుగ నియమితులు కావలెను. ప్రస్తుతము చెన్నరాజధాని కంతకును వ్యవసాయ కళాశాల ఒక్క కోయంబత్తూరు నగరమునందే నెలకొల్పబడి యున్నది. కళాశాలలు ఇంకను విరివి చేయబడవలెను. ఆంధ్రమండలమున ఒక్కవ్యవసాయకళాశాల ఉండితీరవలయును. కళాశాలయందు ప్రస్తుతము విద్యగరపుపద్ధతి సంతృప్తికరముగ లేదు. వ్యవసాయకళాశాలలయొక్క ముఖ్యోద్దేశ్యము రైతులను ఆకర్షించి నూతన విధానముల వారిని బరిచితులుగ జేయుటయే. ప్రస్తుతపుకళాశాలలు కృషికులను ఆకర్షించుటలేదు సరిగదా, చాల వరకు భూములు లేనివారినే విద్యార్థులుగ సేకరించి కొందరు ఉద్యోగియులను తయారు చేయుటయందే శ్రమ వృథపరచబడుచున్నది. ఇందులకుగల ముఖ్యకారణము, వ్యవసాయ విద్యను స్వభాషయందు గరపుటకు మారుగ ఆంగ్లభాషయందు అభ్యసింపవలసి వచ్చుచున్నది. మన కృషికులకు ప్రారంభవిద్యయే కఱవగుచుండగా, హూణ భాష నభ్యసించి వ్యసాయ కళాశాలలయందు విద్య గరచుటెట్లు? స్వభాషయందు ఎంత జడుడైనను, సులువుగ విద్యను గ్రహించనగు



నని ఎల్లరెరింగియే యున్నారు. ఆంగ్లభాషయందు న్యాయశాస్త్రపఠనము గావించవలెనన్న కొంతవరకు సమంజసముగ నున్నది. ఇతరములగు వైద్య, వ్యవసాయ శాస్త్రములు మున్నగునవి దేశభాషలయందు గరపుట లెస్స. పంజాబు దేశమున వైద్యకళాశాలను తెరచుసమయమున శ్రీహార్డింజి ప్రభువరేణ్యుడు దేశభాషలయందు విద్య గరపుటవలన గలుగు లాభములను విపులముగా జర్చించెను. విద్య జనసామాన్యోపయుక్తమగుటకు దేశభాషలయందు గరపుటయే అవశ్యకర్తవ్యము. అటులజేసిననాడు, మనకృషికులు విద్యాభ్యాసమువలన జ్ఞానమును బడసి తాము తరించుటయేగాక దేశమునకు గూడ వన్నె తెచ్చిన వారలగుదురు. దేశభాషలయందు విద్యగరపుటకు తగిన పఠనీయగ్రంథములు లేవని కొందరు ఆక్షేపణలు చేయవచ్చును. పంజాబునందు హార్డింజి ప్రభువువలన తెరువబడిన వైద్యకళాశాలయందు విద్యయంతయు దేశభాషామూలముననె గరపబడుచున్నది. పఠనీయ గ్రంథములు తయారగు వరకునువిద్య దేశభాషలయందు గరపకూడదనుట హాస్యాస్పదము. ఆదరించెడువారున్న గ్రంథకర్తలకును గ్రంథములకును లోటుండదు. సరఫరా, అవసరమును బట్టియుండునన్న ఆర్థిక న్యాయము ఇప్పట్టున సైతము వర్తించును. ఇండియా దొరతనమువారు హార్డింజి ప్రభువరేణ్యుని వాక్యములను పాలించి దేశభాషామూలమున విద్యగరపుటకు ప్రారంభించవలయును. ముఖ్యముగా పారిశ్రామిక, వ్యవసాయక, వైద్య, శిల్ప (ఎంజనీరింగు) కళాశాలలయందు, దేశభాషలనే ఉపయోగింపవలయును. అందువలన వాఙ్మయమునకును దేశమునకును గూడ

వికాసము హెచ్చును. ఆంగ్లవిద్యను పూర్తిగా పరిత్యజించవలెనని మామతముకాదు. పట్ట పరీక్షవరకును దేశభాషలయందే విద్యగరపి, విషయమును ఇంకను తరచిపరిశ్రమచేయ నెంచినవారు ఆంగ్లభాషయందలి ఉద్గ్రంథముల పఠనమునకు గడంగవచ్చును. జనసామాన్యమునకు మాత్రము దేశభాషలయందే విద్యగరపబడవలెను. ముఖ్యముగా కృషివిషయికమగు విద్య దేశభాషలయందు గరపబడినగాని వ్యవసాయదారులు లాభమును జెందజాలరు.

## రైతుయొక్క దారిద్ర్యము.

కృషికళయందు ఈదేశము బీదవడియుండుటకు గల రెండు ముఖ్యకారణములలోను, అజ్ఞానమును గూర్చి ముచ్చటించితిమి. ఇక రెండవదియగు దారిద్ర్యమునుగూర్చి ఒకించుక నుడువవలసియున్నది. ఇతరదేశములయందలి కృషికులవలెగాక మనవ్యవసాయదారులు మూలధనప్రాబల్యములేనివారలై నూతనవిధానములను ఆచరణములోనికి గొనితెచ్చుటకు శక్తిలేనివారగుచున్నారు. అమెరికాసంయుక్తరాష్ట్రములయందు, వ్యవసాయదారులన్న ఎంతయో గౌరవముకలదు. విశేషధనవంతులుకూడగలరు. ప్రభుసన్మానమునుకూడ వడయుచుందురు. ఈదేశమున అంతహేయమైనవృత్తి లేదనిపించుచుండును. ఏలనన మూలధనప్రాబల్యము లేకయుండుటయే. కృషికళను పెంపుచేయవలెనన్న, వ్యవసాయదారులకు తక్కువ వడ్డికి పెట్టుబడి లభించునట్లు చేయుటకర్తవ్యము. ఏపనిచేయుటకును మూలధనముఅవసరము. కేవలము వరుణదేవునిమీదనే భారముంచక



స్వయంసహాయమున ఏనూతులనో గోతులనో త్రవ్వి అందలి జలముతో క్షేత్రములు సేద్యము చేయుదమన్న, మూలధనము ఆవశ్యకము. దుక్కిపశువులను చక్కగా పనిచేయువానిని సంపాదించవలెనన్న ధనము వెచ్చించినగాని లభించవు. శ్రమను తగ్గించెడి నూతన యుపకరణములనుకొని వాడవలయునన్న ధనప్రాబల్యముఅవసరము. ప్రశస్థమైన విత్తనములను జాగ్రతపరచుటకును రసాయనశాస్త్రిప్రయుక్తమగు ఎరువులను వాడుటకును, కర్మకరులకు కూలినొసంగుటకును, క్షేత్రముయొక్క శిస్తునకును, పంటలు తేలువఱకు తనకును తనకుటుంబమునకును గ్రాసము నిమిత్తమును మూలధనము ఆవశ్యకము. పూర్వపుసస్యములనే పైరు చేయక నూతనముగ ఏగోధుమపైరునో, చెరకు తోటనో లేక ఏ బంగాళాదుంపలనో పండించవలయునన్న, మూలధనము లేకున్న సాగదు. తమక్షేత్రములు ఇతర పంటలకు యోగ్యము లయ్యును, మూలధనప్రాబల్యము లేమిచే ఎందరో వ్యవసాయదారులు మిన్నక యుండవలసి వచ్చుచున్నది. భూమిని అభివృద్ధిలోనికిగొనివచ్చి తగిన లబ్ధివడయుదమన్న కొంతధనము ఖర్చుచేసినగాని వీలలవడదు. అట్టి ధనసంచయము కృషికులకు అలవడనంతకాలము స్వదేశమునందలి కృషికళ పెంపుగాంచునని యెడిమాట కలలోనివార్త. మన వ్యవసాయదారులను ఋణదాతలబారినుండి విముక్తులంజేసినగాని ఉత్సాహముతో పనిచేయజాలరు.

## సహకారప్రవృత్తి.

కర్షకులయొక్క దారిద్ర్యమును బాపుట యెట్లు? సహకారప్రవృత్తివలన మూలధనము చౌకగా లభింపజేయుటయే

సాధనాంతరము. వంగదేశమున రాయ పార్వతి శంకరఛౌదరీ యను ఒక జమీందారుగారు ధర్మగోలా యను పేర ధాన్యపు బ్యాంకులు తన జమీను గ్రామములయందు నెలకొల్పెను. ఆ బ్యాంకులు జయప్రదముగ పనిచేయుచున్నవి. కర్షకులకు వలయు ధాన్యమును సరఫరాచేసి పంటలు పండిన వెనుక కొంత వడ్డీతో వసూలుచేసి అదియంతయును చేర్చి కర్షకుల ఉపయోముగ నిమిత్తము ఒక నిధిగా ఏర్పరచబడెను. ఆతీరుగనే ధాన్యపు బ్యాంకులను నెలకొల్పుట సమంజసమని డి. యమ్. హామిల్టను గారు ప్రథమ ఇండియా కళాసభయందు వాకృచ్చెను. కొందరు జమిందారులును, నేలఖామందులును ధనికులును కలసి ప్రతిజిల్లాకును ఒక సెంట్రలు బ్యాంకిగ నేర్పడి, గ్రామసంఘములకు సాలునకు నూటికి ఆరు ఏడు రూప్యముల వడ్డీ చొప్పున ధాన్యమును సరఫరాజేసి పంటలు తేలిన తరువాత క్రమముగా వసూలు చేయుట సమంజసము. సెంట్రలు బ్యాంకి యందు చేర్చిన మూలధనమునకు సర్కారువారు నూటికి మూడురూప్యములు వడ్డీ నొసంగునట్లు పూచీపడవలెను. అటుల సర్కారువారు పూచీపడుటవలన నష్టమేమియును లేదు. సర్కారు గారంటీయున్నది కదా యని ధనికులు ఇట్టి యుద్యమములకు పూనుకొనుటకు వీలేర్పడును. వ్యవసాయదారులకు పెట్టిన పెట్టుబడి తీరకపోదు. ఆసాలున తీర్మానింపబడక పోయినను, పై సంవత్సరముననైన తీర్మానము చేయబడకపోదు. ప్రభుత్వమువారు కోట్లకొలది రూప్యముల రాబడిని మాపుచేయ నుంకించుటకంటె కొంత ధనమును గారంటీ చేసిన యడల సర్కారు



రాజస్వము చక్కగ వసూలగుటయేగాక వ్యవసాయదారుల క్షేమము నారసినవారలు కూడ నగుదురు.

సహకారప్రవృత్తి పలుతెఱంగుల మూర్తీభవించవలసి యున్నది. ప్రశస్తమైనవిత్తులను సరఫరాచేయుటకు కొన్ని సంఘములు తలయెత్తవలసి యున్నది. పంటలు తేలువరకు కర్షకులకు వలయు ధనమును సరఫరాచేయుటకును, క్షేత్రమును అభివృద్ధిలోనికి గొనివచ్చుటకు సాధనములగు నూతనయుపకరణములను సులువుగా రైతులు గ్రహించుటకు వీలేర్పడుటకును కొన్ని సంఘములు బయలువెడలవలసి యున్నది. తయారైన దినుసులను తక్కువ ధరలకు వ్యాపారస్థులకు సమర్పించక తగిన ధరవచ్చినప్పుడు విక్రయించి రైతులకే ఆలాభమంతయును చెందుటకు అనువగునట్లుగ కొన్ని సహకారసంఘములు స్థాపించబడవలెను.

## మంచివిత్తనముల ఆవశ్యకత.

కృషికి సంబంధించు విషయములను కొన్నిటిని ఇట పొందుపరచుట సమంజసము. వ్యవసాయమునకు ముఖ్యమైనది ప్రశస్తమైన విత్తనము. "విత్తు సహకారిగాకున్న రిత్తనేల, వంధ్యయగుగాక తాఫలవంతమగునె" యనియెడి నీతి వాక్యముననుసరించి, విత్తనము పరిశుభ్రమైనది కానిచో, పంటయంతయును ధ్వంసమగుచున్నది. అమెరికా సంయుక్తరాష్ట్రములయందు పరిశుభ్రమైన విత్తనములు సేకరించుటకు విపులముగ ప్రయత్నములు గావింతురు. హిందూదేశమునందలి కర్షకులు ఈవిషయమునందు జాగరూకులై యుండుటలేదు. తగిన విత్తన

ములను జాగ్రత పరచుకొనుటకై వ్యవసాయదారులు విశేష శ్రమను తీసికొనుట అగత్యము. ధాన్యపు విత్తనములయందు కేళీధాన్యము చేరకుండ, ఏకతీరుగ నున్నవానినే సేకరించవలసి యున్నది. అమెరికాయందలి వ్యవసారులు తమ క్షేత్రముల యందు కొంతభాగమును విత్తనములను పైరుచేయుటకునై ప్రత్యేకముగా ఏర్పాటు చేసెదరు. విత్తనములు శుభ్రమైనవి కాని యెడల పంట తక్కువకాకమానదు. పండినధాన్యమునకు క్రమమైన ధరలు లభించుట దుర్లభము. కొన్ని విత్తనములను పైరుచేసినయెడల విశేషముగా ధాన్యము పండుట కలదు. కనుక కర్షకులు విత్తనములను సేకరించుటయందు ప్రమత్తులుగాక జాగరూకులై యుండవలెను. మంచిరకముల విత్తనములను ఉపయోగించుట వలన చెన్నరాజధానియందు ధాన్యపు పంటను విరివిచేయుటకు వీలేర్పడును. ఇటీవల వ్యవసాయశాఖకు జెందిన మధురాసర్కిలు డిప్యూటీ డిరెక్టరుగారు తమవద్ద ఆరుతరహాల విత్తనములు రైతులకు సరఫరా చేయునిమిత్తమై జాగ్రతపరచబడి యున్నవని ప్రచురించిరి. ఈవిత్తనములు విశేషముగా పంట నొసంగుననియు, కృషికులకు లాభకారులుగ నుండుననియును వెల్లడిచేసిరి. ఈవిత్తనములయందలి విశేషమేమనిన—(1) కోయంబత్తూరునందు పైరు చేయగా విశేష ధాన్యము నొసంగినవి. (2) ధాన్యము వెన్నువేసిన తరువాత, గింజలన్నియు ఏకకాలమున పాలుపోసికొనును. అందువలన కొన్నిగింజలు కోత తరుణమునకు వచ్చుటయును, మరికొన్ని ఇంకను పాలుపోసికొను అవస్థయందే యుండుటయును తటస్థించదు. (3) క్షేత్రము సారవంతమైనదై, విశేషముగా ఎరువు



వగైరాలనువేసి సత్తువచేసినయెడల, కోయంబత్తూరు నందు పండినపంటకన్న అమితముగ పండ వచ్చును.

ఇట్టి విత్తనములను వ్యవసాయశాఖవారు పెక్కుతావుల యందు వ్యవసాయదారులకు సరఫరాచేసియు, ఏప్రదేశమునకు ఏరకము విత్తనములు విశేషలాభదాయకములో కనుగొనుటకునై మాదిరిక్షేత్రములయందు పైరుచేయుట సుగమము. మాదిరిక్షేత్రములు జిల్లామొత్తమునకు ఒక్కొక్కటి చొప్పున గాక విస్తారముగా నెలకొల్పబడవలెను. అచ్చటి కర్షకులు విత్తనములయొక్క ప్రాశస్త్యమును గమనించినవెంటనే మాదిరి క్షేత్రములు మూసివేయబడవచ్చును. ప్రత్యక్షముగా తనకండ్ల యెదుట లాభమును గాంచుచు, తానుకూడ బాగుపడగోరని కుమతియుండడు. వ్యవసాయశాఖవారు ఈవిషయమును చక్కగ గమనించి ఆచరణములోనికి గొనిరావలసి యున్నది.

## క్షేత్రమును సారవంతముగ జేయుట.

కృషికులు గమనించవలసినవిషయము వేరొండుగలదు. క్షేత్రమును సస్యాఢ్యగజేసి ఫలము ననుభవించవలెననెడు ఆతురతయేగాని సారవంతముగ జేయవలెనన్న సంగతిని పూర్తిగ గమనించినట్లుతోచదు. భారతభూమి ఎంత సుక్షేత్రమయ్యును అనాదిగ సేవ్య పరచబడుచు వచ్చుచుండుటచేత కాలక్రమమున నిస్సారమగుచుండెనన్న సంగతి గ్రహించవలసియున్నది. వర్షములు కురిసినవెంటనే విత్తనములుచల్లి పంటలు పండించుకొనుటతోడనే తమ పని పూర్తియైనదని కర్షకులు భ్రమియరాదు. పంటలకు ఆధారభూతమగు బొగ్గుపులుసు గాలి,

పొటాసియము, ఫాస్ఫరసు మొదలగు పదార్థములు ప్రతిపంటతోను భూమినుండి వెడలుచున్నవి. తిరుగా వానిని క్షేత్రమున ప్రవేశపెట్టినగదా సస్యములు చక్కగ ఫలించుట. చవిటిపఱ్ఱయందు ఎంత పంటపండుచున్నదియును, ఇతర ప్రదేశములయందలి సస్యములు ఎంత శోభాయమానమగుచున్నదియును మనము కండ్లారగాంచుచునే యున్నాము. పైన పేర్కొనబడిన పదార్థములు క్షేత్రమును సారవంతముగ జేసి సస్యములను విరాజిల్లునట్లుచేయుటకు ఆవశ్యకంబులు. అందు బొగ్గుపులుసుగాలి ముఖ్యము. కోట్లకొలది ధనసంచయమును ఒకతావున కుప్పబోసినను శెలవుచేయ నారంభించినచో కొఱతవడి సన్నగిల్లకపోదు. ఖర్చునకు తగినట్లుగా తిరుగా ధనమునార్జించి కొఠీయందు జేర్చినగదా ఎడతెగకుండ ధనరాశి ఖర్చునకు లభించుచుండును. ఎంతటి సారవంతమైనదయ్యును, క్షేత్రము ఎరువువేసి బలపరచుచుండనియడల నిస్సారము కాకమానదు.

సస్యములకు ఎరువుయొక్క ఉపయోగము ఇంతయని చెప్పతరముకాదు. పాశ్చాత్యదేశములలో వ్యవసాయదారులు విశేషద్రవ్యమును వెచ్చించి రసాయనశాస్త్రప్రయుక్తములగు ఎరువులను కొని క్షేత్రమును సారముచేయుచుందురు. మన దేశమునందు మూలధనప్రాబల్యము తక్కువయగుటచేత మనము వేరొండు విధమున ఎరువును జాగ్రతపరచుకొనవలసి యున్నది. రసాయనశాస్త్ర ప్రయుక్తమగు ఎరువులను విశేషధనము నొసంగి బొగ్గుపులుసు గాలిని క్షేత్రమున ప్రవేశపెట్టనెంచుటకంటె, సులువైనమార్గము మరొకటికలదు. బొగ్గుపులుసు గాలి, గాలియందు విస్తారముగా ఇమిడియున్నది. గుత్తులు



గుత్తులుగ వ్రేళ్లుగలిగిన పైరులను కొన్నిటిని నాటినచో, ఆ చెట్లు గాలినుండి బొగ్గుపులుసుగాలిని ఆకర్షించి వ్రేళ్లద్వారా క్షేత్రమున ప్రవేశపెట్టుచుండును. అట్టి పైరులలో మనవారు ఎఱిగినది ఒక్కజనుము మాత్రమే. అట్టి జనుమును సైతము విస్తారముగా ఉపయోగించుటలేదు. జనుముగాక మఱికొన్ని ఇతరపైరులు కలవు.

వీనిని ప్రతికర్షకుడును ప్రతిసాలునను క్షేత్రమునందలి కొంతభాగమున నాటితీరవలయును. నాటినచోటునతిరిగి మరుచటి వత్సరముననే పైరుచేయక క్షేత్రమునందంతటను క్రమముగా పైరుచేయుచు రావలసియున్నది. నదీ ప్రవాహములు మిక్కుటమైనప్పుడు ప్రవాహవేగమున గొనితెచ్చిన వండ్రుమట్టియొక్క ప్రాశస్థ్యమును వ్యవసాయదారులు చక్కగ నెరింగియేయున్నారు. అట్టి సారముకంటె పదిరెట్లు అదనముగా ఈపైరులను నాటినందువలన క్షేత్రము సారవంతమగును. కర్షకులు ఈవిషయమును చక్కగ గ్రహించి ఆచరణములోనికి గొనితేవలయును. ఈపద్ధతిని అమలులోనికి తెచ్చుటవలన వ్యవసాయదారులకు విశేషవ్యయప్రయాసములు తటస్థించవు.

పశువులగత్తముయొక్క ప్రయోజనత్వమును వ్యవసాయదారులెఱింగియేయున్నారు. పశువులకు తెలకపిండి వగైరాలను మేతవేయవలసియున్నది. తెలకపిండి యనగా నువ్వులనూనె తెలకపిండియేయని భ్రమజెందరాదు. ఏనూనెయొక్క తెలకపిండియైనను సరియే. తెలకపిండిని ఆహారపదార్థముగా నొసంగుటవలన పశువులు మంచిబలిష్టము లగునవియగుటయే

గాక చక్కని గెత్తముకూడ లభించును. అందులకై వెచ్చించిన ధనము నిష్ప్రయోజనమని తలచరాదు. డాక్టరు వ్రాయెల్కరుగారు నూనె గింజలను ఎగుమతి చేయుటవలన దేశముయొక్క సారవంతమును పోగొట్టుకొనుచున్నారని నొక్కివక్కాణించిరి. స్వదేశమును సారవంతముగ జేయవలసిన తెలకపిండి అన్యదేశములవారిని ఐశ్వర్యయుతులుగ జేయుట ఎంతయు శోచనీయము. ఈసందర్భమున ఛాటరుటనుగారి అభిప్రాయమును కొంతవరకు విమర్శించవలసి యున్నది. ఇండస్ట్రియలు ఇవల్యూషన్" అను ఇంగ్లీషు గ్రంథమున నూనె గింజలను పచ్చిపదార్థములుగనే ఎగుమతిచేసిన లాభకారియగును కాని నూనెలను తీసి ఎగుమతిచేయ ప్రయత్నించరాదని వీ రభిప్రాయపడిరి. ఇందులకుగల కారణము అపక్వపదార్థములను ఎగుమతిచేయుటకు ఓడఖర్చు తక్కువయగుననియును నూనెను రవాణాచేయుటకు పీపాలలో జాగ్రతగా నింపవలసి వచ్చుట వలన ఎగుమతి ఖర్చు విశేషమగుననియును వ్రాసిరి. ఛాటరుటనుగారి అభిప్రాయము యుక్తియుక్తముగ లేదని చెప్పక తప్పదు. ఆహెచ్చుకూలికంటె శతగుణంబులు తెలకపిండితో క్షేత్రముయొక్క సారమును పెంపుచేయుటవలన లభించితీరును. పశువులను పొలమునందే ఒకతావునుండి ఒక తావునకు మార్చుచు గోష్ఠముల నేర్పరచవలయును. క్షేత్రమునకు సారము చేయవలసినపేడను, పిడకలుగాచేసి వంటకట్టియలకు బదులుగా వాడుక చేయుచున్నారు. ఇది వివేకశూన్యమైనపద్ధతి యని నిరూపించకతీరదు. స్వల్పలాభముకొరకు విశేషలాభమును వదలుకొననెంచుట బొగ్గులకునై కల్పతరువును ఛేదించి



నటులగును.

ఎముకలపొడుము విశేష సారవంతమైనది. దీనిని విదేశముల యందలి క్షేత్రములను పెంపుచేయుటకునై స్వదేశమును వీడిపోనీయరాదు.

పెంటను ఉపయోగపరచుటయందు కర్షకులు ఒకవిషయమును గమనించవలసి యున్నది. కుప్పలుకుప్పలుగా పొలములో పెంట వేయుచుండుట ఆచారమైయున్నది. ఇటుల జేయుట నష్టదాయకము. ఒకతావున చాలలోతువరకు భూమి సారవంతమైనదియగుటను, వేరొకచోట పెంటయొక్క సారము కొంచమైనను ప్రవేశించకపోవుటయును జరగుచున్నది. అందువలన సస్యములు ఏకరీతిగా విజృంభించక కొంత ప్రదేశమున విస్తారము పెరుగుటయును, కొంతప్రదేశమున చాల నీరసస్థితి యందుండుటయును సంభవించుచున్నది. ఇదిపంటకు చాలనష్టమును కలుగజేయును. నిస్సారముగానున్న ప్రదేశములో పంట తక్కువగుట యటుండ సారముచేరిన ప్రదేశమున సైతము చేనువిస్తారముగా పెరుగుటవలన, వెన్ను వేయుసరికి పీలవెన్ను వేయుటయో లేక గింజలలో చాలభాగము పొల్లుగింజ లుండుటయో తటస్థించుచున్నది. కుప్పలుగా పెట్టి వర్షములు కురియువరకును విడిచిపెట్టుటవలన, పెంటయందలి కొన్ని పదార్థములు ఉపయోగమునకు రాకుండ నశించిపోవుచున్నవి. అటులగాకుండ గెత్తమునందలి, సారమును కొంచెమైనను వృథాపరచక పొలమునకంతకును సమముగా ఉపయోగించునటుల చేయుట కర్తవ్యము. అందువలన తక్కువగెత్తమే హెచ్చుప్రదేశమున కుపయోగించ ననువగును. అమెరికా సంయుక్త రాష్ట్రముల

యందు జయప్రదముగ వాడుక చేయుచున్న ఎరువును వెదజల్లుయంత్రములను (Manure spreaders) స్వదేశమునందు ఉపయోగించుటయే ఇందులకుగల సాధనము. ఈయంత్రము యొక్క ఉపయోగము విశేషము. పెంటనంతయు చూర్ణముగా చేసి భూమియందెల్లెడల సమముగా వ్యాపింపజేయును. ఈయంత్రమును గోష్టములదరిని ఉంచి, ప్రతిదినమును బయల్వెడలిన గత్తమును యంత్రములో నిండునంతవరకు చేర్చి పూర్తికాగానే పొలములకు గొనిపోవచ్చును. వెంట వెంటనే పొలమునందంతటను ఎరువును చక్కగా ఈయంత్రము వ్యాపించ జేయును. తరువాత తిరుగా గత్తమును చేర్చుటకై గోష్టములవద్దకు గొనిరావచ్చును. యంత్రము యొక్క ఉపయోగము అమూల్యముగాన వ్యవసాయదారులు వాడుక చేయుట శ్రేయస్కరము. యంత్రములకు వలయుధనమును పరపతి సంఘములనుండిగాని, సర్కారువారి నుండిగాని తీయవచ్చును.

## యంత్రకళలు, హస్తకళలు.

పారిశ్రామిక కళలను గూర్చి కొంతవరకు రెండవ ప్రకరణమున ముచ్చటించియే యుంటిమి. ఐనను రెండు మూడు కళలను గూర్చి విపులముగా తెలియజేయుట సంభావ్యమని తోచెడిని.

## అరటినార వ్యాపారము.

ప్రస్తుతము ఉపయోగములోనికి తేబడనిదియు ముందు ముందు విశేష అభివృద్ధిలోనికి గొని తేదగినదియు నగు అరటినార వ్యాపారమును గూర్చి యోచింతము.



అరటినారను తయారు చేసినయడల పణ్యాచక్రము లేదని దిగులు చెంద నవసరములేదు. ఇంగ్లాండునందు ఎన్ని వేల టన్నులనార ఎగుమతిచేసినను టన్నుకు మూడువందల రూప్యముల ధరచొప్పున విక్రయమగును. నీట బుట్టి పెరిగిన దగుటచే అరటిచెట్టుయొక్క నార విస్తారము కాలము చివికి పోకుండ నీటియందు వాడుక చేయుటకు వీలలవడును. అందువలన ఓడత్రాళ్లకు ఈనార విస్తారముగా ఉపయోగించబడును. ఇంతియగాక బొందలయొక్క లోపలి భాగమునందలి నారను (అనగా దూటయొక్క దగ్గరభాగము) వేరుగా తీసినయడల ప్రశస్థమైన వస్త్రములను నేయుటకు ఉపయోగించవచ్చును. పట్టుతో సమముగ నుండును. నారకు రంగులువేసి తివాసులు మొదలైనవికూడ తయారు చేయనగును. ప్రయోజనమునందు అమూల్యమైన వస్తువని తేలుచున్నది.

ఇక దీనిని తయారు చేయుట ఎట్లు అనుసంగతిని గూర్చి విచారించవలసి యున్నది. యంత్రముల సాహాయ్యమున అరటినారను తీయనెంచుట దుస్సాధ్యము. చిత్రముగా వస్తుప్రదర్శన శాలలయందు ప్రదర్శించుటకు మాత్రమే యంత్రముల మూలముగ తయారు చేయవచ్చును కాని పెద్దపెద్ద ఆవేశములను (ఫ్యాక్టరీ) నెలకొల్పి విస్తారముగా తయారు చేసి వ్యాపారముచేసి లాభమును గ్రహింతమన్న యంత్రములు సహకారులు గానేరవు. గణపతి అయ్యరుగారిచే తిరునల్వేలియందు తయారు చేయబడిన యంత్రములును, కన్ననూరు (Cannanore) జెయిలులో వాడుక చేయబడుచున్న యంత్రములును పరీక్షచేయబడినవి. ఈయంత్రములవలన తయారు

కాబడునార బహుస్వల్పము. పెద్ద వ్యాపారము చేయుదమన్న కూలిగిట్టదు. విదేశయంత్రములు (Decorticators) ఉపయోగించునా యని తర్కించి చూడ నయ్యవినైతము ప్రయోజనశూన్యములయ్యెను. కిత్త నారను తీయుటకు ఉపచరించునే కాని మృదువగు అరటినారను తయారు చేయుటకు పనికిరావు. మెత్తనిదగుటచే తెగిపోవుచుండుట తటస్థించుచున్నది. కావున యంత్రముల సాహాయ్యము నపేక్షించకయే ఈనారను తీయుటకు ప్రయత్నములు సల్పవలసి యున్నవి.

వేరుసాధనము లేదని దిగులుజెంద నగత్యము లేదు. రసాయన శాస్త్రప్రకారము ప్రశస్థమైననారను తయారుచేయ నగును. అరటి బొందలను చీల్చి డిప్పలను మూడుతరగతులుగా విభజించవలయును. మొదటి తరగతివి ఉపరిభాగమున నుండును. అవిమోటుగా నుండుటచేత వస్త్రముల నేతకు పనికిరావుగాన ఓడత్రాళ్ళ నిమిత్తము ఉపయోగించ వలసి యున్నది. దూటను చుట్టియున్న డిప్పలు బహుమృదువుగ నుండునుగాన వానిని ప్రత్యేకముగా ఏర్చిన యడల నేతకు పనికివచ్చును. మధ్యరకముగ నున్నవి తివాసులు వగైరాలు నేయుటకు ఉపయోగపరచవచ్చును. మూడు తెగలుగ డిప్పలను విభజించి, సీలికుండీలవలె కుండీలను తయారుచేసి నీటియందు కొంత కాలము ఊరవేయవలెను. ఆనీటియందు కొన్ని రసాయన ద్రవ్యములు కలపవలసి యున్నది. రసాయనద్రవ్యముల ప్రభావము వలన డిప్ప యందలి గుజ్జంతయు చక్కగా చివికిపోవును. తరువాత నదీప్రవాహముననో లేక తటాకముననో కడిగి వేయవలెను. కడిగి వేయుటవలన పైగుజ్జంతయు పోవును.



శేషించినది గంధక - వాయువుయొక్క (Sulphur di-oxide) పొగవలన శుభ్రపడును. ఈవాయువును గాజు ఇండ్లను కట్టి (Glass chamebrs) ప్రయోగించవచ్చును. అనంతరము వెండికట్టవలె తయారైననారను, నీడను దండములపై ఆరవేయవలెను. ఆరిన తరువాత ఉపయోగమునకు సిద్ధమగును. దినమునకు నాలుగువందల బొందలు సరఫరా యగుప్రదేశమున ఇట్టి ఆవేశము నొకదానిని నెలకొల్పిన యెడల అయిదారువేల రూప్యముల మూలధనము అవసరము. తొలి సంవత్సరముననే ఖర్చులు పోను పెట్టుబడి పెట్టిన ద్రవ్యము లభించును. తరువాత ప్రతిసాలునను 4, 5 వేల రూప్యముల లబ్ధికలుగుచుండును. తొలుత గన్నవరం, ఆమలాపురం వగైరా కోనసీమ గ్రామములయందు ఇట్టి ఆవేశమును నెలకొల్పుటకు వీలున్నయది. విద్యాధికులు కొందరు ఈవిషయమును గూర్చి చక్కగా ఆలోచించి, ఒక ఆవేశమును స్థాపింప దలచిరేని తాము ధనికులగుటయే గాక దేశమునకు కూడ సేవచేసిన వారలగుదురు. గంజాంమండలము నందలి ఉద్దానమునకూడ అరటితోటలు మెండుగ నుండుటచే ఈవ్యాపారమును సులువుగా నెలకొల్పుటకు వీలున్నయది. మలబారు ప్రాంతమున కూడ ఇట్టి ఆవేశములకు చోటున్నయది. ఈవ్యాపారమును సాగించనెంచిన వారు ప్రస్తుతమున అరటితోటలను వేయుటకు ఆరంభించ నగత్యము లేకుండ, . తోటలు మెండుగా నున్న తావులనే ఫ్యాక్టరీలను స్థాపించవచ్చును. ఆంధ్రమండలమున ఇట్టి ఆవేశములు నెలకొల్పబడి, హిందూదేశమున కంతకును మార్గదర్శకము కావలసియున్నది.

## చేతిమగ్గముల నేత.

ఈదేశమునందలి నేతపనివాండ్రు ఫ్యాక్టరీలలో పని చేయుటకు ఇచ్ఛగించరు. విద్యావిహీనత్వమును, పూర్వాచార పరాయణత్వమును ఇందులకు గారణము. నూలుబట్టలను తయారుచేయుటకు బొంబాయి అహమ్మదునగరము మొదలగు ప్రదేశముల యందువలె యంత్రశాలలు నెలకొల్పినగాని వీలు లేదని ఎంచరాదు. చేతిమగ్గములవలన సైతము విస్తారముగా దుస్తులను తయారు చేయవచ్చును. చాటరుటను, హావెలు మొదలగు ప్రముఖులు చేతిమగ్గములనేతను విరివిచేయుటవలన నూలు వర్తకముయొక్క భావిదశ జయప్రదముగ నుండునని వ్యక్తీకరించిరి.

అనాదిగా తాతతండ్రులనుండి వాడుచువచ్చిన మగ్గములమీదనే బట్టలునేయుచు వచ్చుటవలన, రానురాను నేతపని హీనదశకు వచ్చుచున్నది. విదేశములనుండి వచ్చెడిసరకులతో పోటీకి ఆగలేక పోవుచున్నది. చాలమంది వృత్తులను త్యజించి కర్మకరులుగ కృషికళను ఆశ్రయించుటయో లేక వీరంగూను మోల్మేను, ఆస్సాము ప్రాంతములకు కూలికి బోవుచుండుటయో తటస్థించుచున్నది.

అట్టి దుస్థితినిబాపి నేతకళను విరివిచేయనెంచుచో ఈ క్రిందివిధానములను ఆచరణములోనికి గొనివచ్చుటసమంజసము. అటులగావించనిచో అలతికాలముననే .భరత వర్షమునందు నేతపనివాండ్రసంఖ్య క్షీణించి నామమాత్రావశిష్టము కావలసి వచ్చునేమోయని భయముతోచెడిని. (i) నేతపనివాండ్రు విస్తారముగానున్న ప్రతి ప్రదేశమునను నేతవిద్యాలయములు



నెలకొల్పబడవలెను. విద్యవారలకు ఉచితముగా గరపవలసియున్నది. ఈ విద్యాలయములయొక్క ముఖ్యోద్దేశ్యము నూతన యుపకరణములయొక్క ప్రాశస్త్యమును ప్రత్యక్షముగా బోధించుటయును, నూతన విధానములను ఆచరణములోనికి దెచ్చుటకు నేతపనివాండ్రకు సమర్థత కలుగజేయుటయునై యుండవలెను. (2) నూతన పద్ధతులపై నిర్మింపబడిన చేతిమగ్గములను, సింగరుకుట్టు యంత్రములవలె, నెలకు కొంత ద్రవ్యము చెల్లించెడి పద్ధతిపైని నేతపనివాండ్రకు సరఫరా చేయవలెను. మగ్గములను అరువుగా నిచ్చుటవలన, పనివాండ్రందరును కొని ఉపయోగించుటకు వీలుకలుగును. (3) నేతకువలయు నూలును (Yarn) సరఫరాజేయుటకు సంఘములు స్థాపింపబడవలెను. సహకారప్రవృత్తియే ఇందులకు మూలాధారము. అట్టిసంఘములు నెలకొల్పబడని ప్రదేశములయందు షాహుకారులవద్ద నూలును విషమషరతులపై తీయవలసి వచ్చుచున్నది. నేసినబట్టల నన్నిటిని బజారుధరలకు చాలతక్కువగా, షాహుకారునకు విక్రయించెడి పద్ధతిమీద, నేతవాండ్రు నూలును గొనుచున్నవారలు. నూలును సరఫరాజేసెడి సంఘములు స్థాపితములైన లాభమంతయును నేతవాండ్రకే జెందును.

(4) తయారైన వస్త్రములను తగినధరలకు విక్రయించుటకుకూడ సంఘములు ఏర్పరచబడవలెను. ఎక్కడధరలు ప్రియముగనున్నవో, ఎచ్చట మందముగా నున్నవో, నేతపనివాండ్రకు గమనించుటకు శక్తిచాలదు. స్వల్పలాభమును గ్రహించి అనుకూలమగు బజారులలో బట్టలను విక్రయించుటకు సంఘములు స్థాపితములు కావలెను. ఈసంఘ

ములు మరొక కార్యమును చేయగలవు. దేశమునందలి బజారులసంగతి యాపత్తునుకనుగొని ఏమాదిరి వస్త్రములు నేసిన ఏప్రాంతములయందు విరివిగా ఖర్చగునో నేతగాండ్రకు తెలియపరచి వ్యాపారమును వృద్ధిచేయగలవు.

### క్రోముపద్ధతివలన తోళ్ళను పదునుచేయుట.

ప్రతి సంవత్సరమునను సుమారు పదికోట్లరూప్యముల విలువగల చర్మములు పరదేశయాత్ర వెడలుచున్నవి. మదరాసు, కలకత్తా, బొంబాయి రేవుపట్టణములయందు ఈవ్యాపారము విశేషముగ జరుగుచున్నది. అనేకలక్షల రూప్యములు విలువగలజోళ్ళు ఈదేశమునకు దిగుమతియగుచున్నవి. జోళ్ళ వర్తకముయొక్క విలువయటుండ ఏటేట ఇరువదియైదు మొదలు ముప్పదిలక్షల రూప్యముల విలువగల తోలుసామానులను విదేశములనుండి గ్రహించుచున్నాము. కావున క్రోము పద్ధతిపైని తోళ్ళను పదునుచేయుట వలన చాలలాభమున్నది.

సాధారణముగ వాడుకలోనున్న పద్ధతికిని క్రోముపద్ధతికిని విశేషభేదము లేదు. క్రోముపద్ధతియందలి విశేషమేమనిన తోళ్ళను పదునుచేయుటకు పూర్వము అనుసరించవలసిన విధానములో సున్నపు పాలును పూర్తిగ వేరుపరచుటయే. ఈయొక్కవిషయమునుదక్క మిగిలినపద్ధతి రెండింటికిని సమానమే. ఈవిధానమును అవలంబించుటకు విశేష ఖరీదుగల యంత్రములు అగత్యములేదు. అత్యద్భుతమైన నిపుణతగల కర్మకరుల యావశ్యకత సైతముగానరాదు. కావున ఈకళను చక్కగా పెంపుచేయుట సుగమము. దేశీయ పద్ధతియందు



సైతము కొన్ని మార్పులు గావించవలసి యున్నది. ఎందువలననగా పదునుచేయని చర్మముయొక్క వెల రు 1—12—0 అగుచుండగా, దేశీయపద్ధతిని పదునుచేయబడిన చర్మమునకు రు 1—3—0 మాత్రమే లభించుచున్నది.

అసంఖ్యాకములుగ చర్మములను, పదునుచేయుటకు అగత్యమగుకరక్కాయలు మొదలగుపదార్థములుపుష్కలముగ ఈదేశమున దొరకును. గనుక ఎన్నియోచర్మ కర్మాగారములు స్థాపించుటకు వీలున్నయది. ఆంధ్రమండలమున విజయనగరము బరంపురము పట్టణములయందు కర్మాగారములు స్థాపించనగును. గంజాము విశాఖపట్టణ మండలములయందలి (ఏజన్సీ) మన్య ప్రదేశముల నుండివచ్చెడి చర్మములు పైపట్టణముల నుండియే చాలవరకు ఎగుమతియగుచున్నవి. విద్యాధికులును, ధనాధీశులును త్వరపడవలయును.

### పాల చూర్ణము.

పాలడబ్బాలు అసంఖ్యాకములుగ ఈదేశమునకు దిగుమతియగుచున్న వన్నసంగతి ఎల్లరకును విశదమే. 1909-10 సం॥ వర్తకపు లెక్కల ప్రకారము 25,61,722 రూప్యములు విలువగల గడ్డపాలు ఈదేశమునకు దిగుమతియైనవి. ఇన్ని లక్షల రూప్యముల విలువగల పాలడబ్బాలను, పాడిపంటలకు వాసిగాంచిన హిందూదేశము విదేశములనుండి గ్రహించుచుండుట సంతాపకరము. ఇంగ్లాండులో ఛెషైరునందు స్థాపించబడిన ఒక ఫ్యాక్టరీనిగూర్చి ఛాటరుటనుగారు వ్రాయుచు ఇండియాయందుకూడ అట్టి ఆవేశనములను స్థాపించుటకు వీలున్నదని వక్కాణించిరి. ఆకర్మాగారమున దినమునకు

మూడువేల గేలనుల పాలు ఖర్చగుచున్నవి, వెన్నను వేరు చేయు యంత్రసాహాయ్యమున తొలుత వెన్నను వేరు చేసి ప్రతిదినమును లండను నగరమునకు పంపుచుందురు. తరువాత ఆపాలనుకాచి చూర్ణముగా మార్చెదరు.

### కర్రలను కాల్చి బొగ్గుచేయుట.

బళ్లారి జిల్లాయందలి సాండూరు సంస్థానమునను, సేలము జిల్లాయందును ఇనుపగనులు విశేషముగా నున్నట్లు రెండవ ప్రకరణమున సూచించి యుంటిమి. అచ్చట బొగ్గుగనులు సమీపమున లేని హేతువువలన ఇనుపగనులు వాడుకచేయ బడు చుండుటలేదు. బొగ్గులేని కారణమున మిన్నకుండవలసిన అగత్యము లేదు. కర్రలను కాల్చి బొగ్గు తయారుచేసి, ఆబొగ్గు వలన ఇనుపగనులను ఉపయోగములోనికి తీసికొని రావచ్చును. మైసూరునందలి కెమ్మనగిండి కనుమలయందలి ఇనుపగనులను, తాతాఅండు సన్సువారి అయః కర్మాగారమునందు పనిచేయు చున్న సి. యఫ్. పెరిన్‌గారి సలహాపైని తాతాకంపెనీ వారి యాజమాన్యము క్రిందనే పని ప్రారంభించబడెను. జయప్రదముగ ఈయుద్యమము నెరవేరుననుటకు సందియము ఇసుమంతయైనను లేదు. ఛాటరుటనుగారు ఒక బొగ్గు ఫ్యాక్టరీని చెన్ననగరమున స్థాపించుటకు మదింపువేసిరి. కర్రలను కాల్చుట వలన ఒక్క బొగ్గేగాక తారు, మెథిల్ ఆల్కహాలు, ఎసిటేటు ఆఫ్ లైము అను పదార్థములు బయల్వెడలును. ఈపదార్థముల కంతికిని మార్కెట్టు బహుళముగానున్నది. ఛాటరుటనుగారి లెక్క ప్రకారము ఆరువేల టన్నుల కర్రను (సరగుడు కర్రను) సాలునకు ఉపయోగించుటకునై ఒక ఆవేశనమును స్థాపించుటకు రెండులక్షల రూప్యముల మూలధనము అవసరము. ఈమూలధనముపై వచ్చెడి లబ్ధి, 'ఖర్చులుపోను సాలునకు రు. 35,900. ధనాధికులు ఈవిషయమును గమనించవలసి యున్నది.



### యానసౌకర్యములు.

ఎగుమతి దిగుమతులు ఇండియాయందు ఏటేటసుమారు 250 కోట్ల రూప్యములవిలువగలవి జరుగుచున్నవి. దీనినిబట్టి యానసౌకర్యములను పెంపుచేయుటవలన స్వదేశమునందలి వాణిజ్యసంపద చక్కగా విరివియగునని వేరవ్రాయబనిలేదు. యానసౌకర్యములు ఎచ్చోట నలవడకుండునో, ఆప్రదేశమునందలి వ్యాపారము అభివృద్ధిజెందనేరదు. సరకులను తయారుచేయుటతోడనే తగిన లబ్ధికలుగదు. ఏపణ్యాచక్రములయందు ఆసరకునకు గిరాకి యున్నదో, ఆప్రదేశములకు సరకులను గొనిపోయినగాని ప్రయోజనము లేదు. యానసౌకర్యములు అలవడనిచో ఉత్పత్తిచేయబడిన పదార్థసంచయము, చలనము లేక అచ్చటనే స్థావరము కావలసియున్నది. అందువలన సరకులకు తగినధరలు లభించవు. జయపురపు ఏజన్సీయందు ధాన్యము ఎంతచౌకగా చిక్కుచున్నదో చదువరులు ఎరింగియేయుందురు. అచ్చటిధరలతో పార్వతీపురమునందలి ధరలను సరిపోల్చిచూచిన విశేష వ్యత్యాసముండును. యానసౌకర్యములులేని హేతువువలన అచ్చటి సరకును ఇతర ప్రదేశములకు గొనితెచ్చుటకు వీలలవడుటలేదు. విజయనగరమునుండి పార్వతీపురమునకు బోవుచున్న అయోమార్గమును మధ్యపరగణాలయందలి రాయపురముతో కలిపినయడల జయ

పురమునందలి ధరలుకూడ ఇతరప్రదేశముల ధరలతో సమముగనే యుండును. కావున వాణిజ్యసంపదను విస్తరింపజేయుటకు యానసౌకర్యములను విరివిచేయుట అవశ్యకర్తవ్యము.

(1) ప్రభుత్వమువారు నీటిపారుదల పనులను విశేషముగా నిర్మించుటవలన కృషికళ నుద్ధరించుటయేగాక యానసౌకర్యములను పెంపుచేసిన వారగుదురు. ఇనుపదారులకంటె తక్కువ కూలికి నీటికాలువలపైని సరకును రవానాచేయవచ్చును.

(2) యానసౌకర్యములను వృద్ధిచేయుటకునై సర్కారువారు ఇండియాయందలి రైల్వేలనెల్ల తమఆధీనమునందుంచుకొనవలసియున్నది. కంపెనీల యాజమాన్యముక్రింద నుండుటవలన, స్వదేశవర్తకము వృద్ధియగుటలేదు. ఇంగ్లాండునుండి దిగుమతికాబడిన సరకులకు బొంబాయినుండి కలకత్తాకుగొనిపోవుటకు విధించినకూలి, అలహాబాదు నుండి కలకత్తాకు గొనిపోవు స్వదేశవస్తువులపై విధించిన కూలికంటె తక్కువ. సామ్రాజ్యశాసన నిర్మాణసభయందుసర్ విఠల్ దాసు థేకర్సే, ఆర్. యన్. మధోల్కరు మొదలగు ప్రముఖులు, ఇనుపదారులను కంపెనీల యాజమాన్యము క్రిందనుంచుకొనుటవలన ఎన్నియో స్వదేశకళలు రూపుమాయుచున్నవని గంభీరముగా వాకృచ్చిరి.

స్వదేశమునందు తయారగు వస్తువులకు విదేశవస్తువులతో పోటీయనునదియే అసంగతముగ నుండగా, కంపెనీ యాజమాన్యముక్రింద నుండిన ఇనుపదారులుకూడ స్వదేశకళలను క్షీణింపజేయుటకు సహకారులగుచున్నవి. ఒక ప్రదేశమునుండి మరొకప్రదేశమునకు జరుగు వ్యాపారమునకు సైతముకంపెనీలు ఆటంకములు కలుగజేయుచున్నవి. బ్లాకు రేట్లను (Block rates) విధించుటవలన అసలుకన్న కూలి జాస్తియై, సరకులు ఖర్చగుటకు ఆటంకమగుచున్నది. బ్లాకు-రేట్లనగా కంపెనీలవలన విధించబడు పూరా రేట్లు. ఇందులకు ఒక ఉదాహరణము.

ఒక ప్రదేశమునుండి వేరొక ప్రదేశమునకు సరకులను రవానా చేయునపుడు, రెండుమూడు కంపెనీల ఇనుపదారులగుండా గమ్యస్థానమును చేరగలుగునపుడు, ప్రతి కంపెనీయును వ్యాపారమును తమ అయోమార్గమునకే మరలించదలచి, తమ మార్గముగుండా పోవలసిన కొద్ది దూరమునకు పూరా రేట్లను విధించుచుందురు. అందువలన సరకులకు రవానా కూలి హెచ్చగుచుండును. అట్టి రేట్లను బ్లాకురేట్లందురు. ఈ రేట్లు వ్యావారమునంతను 'బ్లాకు' చేయును అనగా అడ్డగించును.

యానసౌకర్యములను పెంపుచేయుటకు మరొకప్రయత్నముకూడ సల్పుట అగత్యము. మానమోహనదాసు రామజీగారు వాకృచ్చినటుల, స్వదేశనావలను నిర్మించుట ఆవశ్యకము. ఓడలు ఇండియాకు స్వంతముగా లేనిలోటును, ప్రస్తుత మహాసంగ్రామము వ్యక్తీకరించినది. మననూలుసరకులకు చైనాదేశము ఒకపెద్దమార్కెట్టు. ఆంగ్లేయ కంపెనీల యొక్క ఓడలను యుద్ధపరిస్థితులవలన చాలవరకు నౌకాదళమున చేర్చవలసివచ్చెను. ఓడలు లేనందువలన విదేశ వ్యాపారము చాలవరకు కట్టువడెను. యుద్ధానంతరమున ఇండియా యందు నావికా నిర్మాణమునకు పూనుకొనవలసి యున్నది.

మనపూర్వులకు నావికా నిర్మాణమునందుగల కౌశలమును శ్రీ రాధాకుముదముఖర్జీగారు 'ఇండియను షిప్పింగు' అను తమగ్రంథమున విపులముగ జర్చించిరి. * కాలహరణము నొనర్చక భారతీయులు నావికానిర్మాణమునకు గడంగవలసి యున్నది. చిదంబరం పిళ్లెగారివలన స్థాపింపబడిన స్టీము నావిగేషన్ కంపెనీయొక్క ఉదంతమును గమనించినవారలై విదేశవ్యాపారుల ఓడలకు ఇండియాయందలి ధనమును సమర్పించక, మనవ్యాపారమునంతయును ఇండియా స్టీమరులవలననే సాగించి దేశమునకును ప్రజలకును కీర్తి తేవలసియున్నది. స్వయంసహాయమునకు మించిన పరమావధి వేరొండుగానరాదు. కాని ఆంగ్లేయనౌకలపై ఆధారపడియుండక వాణిజ్యవ్యాపారములను స్వదేశ ఓడలయందే జరుపుటవలన దేశముయొక్క ప్రతిభ హెచ్చుటయేగాక సంపదకూడ వృద్ధియగును.

## వాణిజ్యము.

వాణిజ్యమును అభివృద్ధిచేయుటకు ముఖ్యములగు రక్షణనుగూర్చియు, యానసౌకర్యములను గూర్చియు ఇదివరకు చర్చించియే యుంటిమి. ఇక జాయంటుస్టాకు కంపెనీలనుగూర్చి కొంతవరకు ముచ్చటించవలసి యున్నది.

జాయంటు స్టాకుకంపెనీలు వాణిజ్యాభివృద్ధికి మూలాధారము. జాయంటు స్టాకుకంపెనీలు ఒకరియందు మరొకరికి నమ్మక ముండినయడల సులువుగా స్థాపించనగును. దేశము

* ఈ గ్రంథముయొక్క తెలుగు భాషాంతరీకరణము శారదాపబ్లిషింగు కంపెనీవారు ప్రకటించుచున్నారు.



ఋజుమార్గవర్తనులకు కఱవుపడి యుండలేదు. తగినవారిని డైరక్టరులుగ నియమించి, వ్యవహారములయం దారితేరిన నిపుణులను యజమానులుగ ఏర్పరచినయెడల వ్యాపారము జయప్రదముగా సాగగలదు.

బ్యాంకులనుకూడ విశేషముగ నెలకొల్పవలసియున్నది. బ్యాంకులయొక్క ఉపయోగము ఎల్లప్రజలకును కావలసియే యున్నది. చిల్లరవ్యాపారము చేయువారికిని లక్షులకొలది వ్యాపారము చేయువారికినిగూడ ఉపచరించును. నిలవయున్నధనమును బ్యాంకులలో దాచుచుండుటవలన అడిగినవెంటనే తిరిగి ద్రవ్యము ఈయచేయబడుటయేకాక కొంతవరకు వడ్డీగూడ లభించును. స్వదేశకళలను వృద్ధిచేయుటకు విస్తారముగా మూలధనము అవసరము. బ్యాంకులు విస్తారముగా స్థాపించబడినయెడల వలయు మూలధనమును సేకరించుటకు వీలగును.

మరొకపద్ధతినిగూడ అవలంబించ వలసియున్నది. ఇన్సురెన్సు భీమా కంపెనీలు విస్తారముగా తలలెత్తవలసియున్నది. ఒక్క లైఫు ఇన్సురెన్సు కంపెనీలేగాక అగ్ని, జలప్రమాదములవలని, నష్టమును తొలగించుటకుగూడ భీమాకంపెనీలు ఏర్పడవలసియున్నది. ఇంగ్లాండునందు కిటికీలకు ఉపయోగించిన గాజుతలుపుల నష్టమునకుకూడ భీమాకంపెనీలుకలవని ప్రతీతి. అట్టివిషయములో ఇండియాయందు సైతము సకలప్రమాదములవలని నష్టములను తొలగించుటకు భీమా కంపెనీలు స్థాపించవలసి యున్నది.

వర్తకులు గమనించవలసిన విషయము వేరొండు కలదు. విశేషశ్రమపడి వ్యవసాయదారులవద్దను, ఇతర ఉత్పా

దకులనుండియును, సరకులను సేకరించి బస్తాకు ఒక కానిలాభము వచ్చిన, ఆ స్వల్పలాభముతోడనే సంతుష్టాంతరంగులై విదేశ వర్తకసంఘములకు సరకులను విక్రయించుచున్నారు. ఇందువలన లాభమంతయు అన్యదేశీయుల నోటబడుచున్నది. సరకులను గిరాకి అతిశయముగానుండు మార్కెట్టులకు ఎగుమతిచేసి అన్యదేశీయులు పూర్తిగాలాభమును గ్రహించుచున్నారు. మన వర్తకులు ధైర్యమునుగలవారలై తాము శ్రమపడి సంపాదించిన లాభమునంతయును ఇతరులకు సమర్పించక, తామే అన్య దేశములకుఎగుమతిచేసి లాభమును సంపాదించవలసి యున్నది. ఈవిషయమునుగూర్చి శ్రీయుత లాలాలజపతిరాయిగారు విపులముగ జర్చించి భారతీయులు అన్యదేశీయులచే కొల్లగొనబడుచున్న ధనరాశిని తామే గ్రహించవలసి యున్నదని వ్యక్తీకరించిరి.




PRINTED AT THE INDIA PRINTING WORKS, MADRAS.

